# సాక్షి

## నాల్గవ సంపుటము

కవిశేఖర పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిచే

రచియింపఁబడినది.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము

 [*Price Rs. 3*

# సాక్షి

## నాల్గవ సంపుటము

రచన:

కవిశేఖర పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు



(ఐదవ కూర్పు)

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము

# విషయసూచిక

# సావిత్రి

## 1. ధనుర్దాసుని స్వార్థపరిత్యాగము

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! మా సత్యపుర గ్రామమున కెక్కడనుండియో కాని యొక హరిభక్తుఁడు వచ్చినాఁడు. ఆతఁడు శూద్రకులసంభవుఁడు. దాదాపుగా నేఁబదిసంవత్సరముల వయస్సున్నవాఁడు. హరినామస్మరణ పరాయణుఁడు. శంఖచక్రాంకధారి. తులసీమాలావక్షస్కుఁడు. ద్వాదశోర్ధ్వపుండ్రాలంకృతుఁడు. ఏకవారాశనవ్రతుఁడు. దీర్ఘశ్మశ్రుజటామండితుఁడు. అసితవర్ణుఁడు. రోమశశరీరుఁడు. కౌపీనమాత్రధారి. అట్టి భాగవతవర్యుఁడు మాపద్మనాభస్వామియాలయములో నాలుగుదినముల నుండి వాసముచేయుచున్నాఁడు. వైదేశికుల కేర్పాటయిన కట్టడిప్రసాదముతోఁ గాలక్షేపము చేయుచున్నాఁడు. తులసిపూసల గణించుచు రంగనామ ముచ్చరించుచు నభయహస్తములు తలపయిఁ బెట్టుకొనుచు శ్రీపాదరేణువుఁ గన్నుల కంటించుకొనుచు దినము లీడ్చుచున్నాఁడు. పద్మనాభమూర్తిని సేవింపవచ్చిన స్త్రీలు పురుషులు నీ హరిభక్తుని జూడకుండఁ బోవుటలేదు. మాకాలాచార్యులుగా రాయనను జూచుటకు మూడునాల్గుమాఱులు వేంచేసి తనకు శ్రీభాష్యాదులయందును, స్వరూపగ్రంథములందును గలపాండిత్య మాయనయొద్ద వెల్లడించెను. విశేషగ్రంథావలోకన మాయనకున్నట్లు కనఁబడదని కాలాచార్యుల యభిప్రాయము. కాలాచార్యుఁడు వట్టి ప్రపంచజ్ఞానశూన్యుఁడని యాహరిభక్తుని యభిప్రాయమేమో మనకుఁ దెలియదు. ఏదీ? లోపలియభిప్రాయము మోముపైనే విలక్షణవైఖరిగనో కనఁబడుట కవకాశము

లేకుండ ఫాలమంతయు నూర్ధ్వపుండ్రమయ్యెను. పెద్ద జుంజులు కను బొమ్మలయ్యెను. లోతుకన్నులయ్యెను. బొద్దుమీసము లయ్యెను. దుబ్బ గడ్డమయ్యెను. కాలాచార్యులు తిరుగ నీయుదయమున హరిభక్తుని వీక్షించి "మాసాక్షిసంఘములో నొక్కయుపన్యాస మిచ్చెదరా?" యని యడిగెను. ఆయన యట్లొనర్చుట కంగీకరించెను. ఇదిగో యిప్పుడే రానై యున్నారు. ఆయనవచ్చునేమో యని నేనింక నేదియు నారంభింపకుండ నున్నాను. అదిగో వచ్చుచునే యున్నారు. లేచి హరిభక్తున కాతిథ్య మిండు. (సభ్యు లట్లొనర్తురు) స్వామీ దయచేయుఁడు. మాసభ్యులతో మిమ్ముఁగూర్చి నాకుఁ దెలిసినయంశములేవో చెప్పియుంటిని. తాము తమకుఁ దోఁచినవిషయమునుగూర్చి యుపన్యసింపవచ్చును.

హరిదాసుని యుపన్యాసము:—

శ్రీమతే రామానుజాయ నమః భాగవతోత్తములయిన దేవరవా రంద ఱిక్కడ వేంచేసియుండుటచే నడియేనికి దేవరలతోఁ గొంత భగవ ద్గుణానుసంధానము—భాగవతగుణానుసంధానము చేయఁదగిన యవ కాశము సిద్ధించినదని యీదీనుఁడు—దాసుఁడు—ఈనిర్భాగ్యుఁడు మనవిచేసికొనుచున్నాఁడు. అడియేని యవకతవకసంభాషణ మంతయు దేవరవారల తిరువుళ్ళములోనికిఁ దెచ్చి యీయధమాధముని క్షమింతు రని నమ్ముచున్నాను. ఈదాసుఁడంతటి పాపాత్ముఁడు ప్రపంచమున మఱి యొక్కఁడున్నాఁడని దేవరవార లెంచఁదగదు. దక్షిణహిందూదేశమున నున్న సమస్తదివ్యదేశములను బాదచారినై సేవించితిని. ఒక్కొక్కదివ్య స్థలమునఁ గొన్నిమాసములుండి యచ్చటి విష్ణుభగవాను నారాధించి యచ్చటి భాగవతోత్తముల తిరువడిగళ్ళను గొలిచి యచ్చటి పన్నిద్ద రాళ్వారులను బూజించి పెరియతిరువడి చిరియతిరువడి తిరువడిగళ్ళకు మ్రొక్కి యచ్చటిదేవతాప్రసాదము కన్నుల కద్దుకొని స్వీకరించి యాహా రించి గాలక్షేపమును జేయుచుంటిని. ఇట్లు శ్రీజగన్నాథము మొదలు కొని శ్రీసారనారాయణముపఱకుఁ దిరిగి భగవద్భాగవతోత్తములసేవఁ జేయుచుంటిని. ఇట్టిసేవవలన నడియేను తరించునని నమ్మియున్నాఁడు. అడియేని కక్షరాభ్యాసమయినలేదు. అడియేని యన్నప్రాశనమేదో యా రంగని యధీనమైయున్నది. ప్రపంచములో నెందరో దుర్మార్గులున్నారని

కొందఱు మహానుభావు లానతిచ్చిరి కాని నాకొక్క దుర్మార్గుఁడైనఁ గానఁబడలేదు. అందఱు భాగవతోత్తములే! వారందఱడియేనికి గురువులే. వారికడియేను శిష్యప్రశిష్యకోటిలోనివాఁడే. నేను జూచినవారందఱు నాకుఁ బ్రభువులే. వారందఱ కడియేను దాసానుదాసుఁడే! ప్రపంచము దుఃఖభూయిష్ఠ మని కొందఱు పండితు లానతిచ్చిరని వినియున్నాను. ప్రపంచమున నేనొక్కదుఃఖమయిన ననుభవింపలేదు. ఒక్కదుఃఖమైనను నేను జూచియుండలేదు. (ఆహాహా! ఎంతయుత్తముఁడవయ్యా! అని సభలో గేకలు) దేవరవారట్లు దీనుని మన్నింపఁదగదు. నేనధముఁడను. అధమాధమాధముఁడను. కాలమెంతకు జరుగకుండ నున్నదయ్యా యని కొందఱు పలుకుదురని నేను వినుచున్నాను. స్వామిసేవకై పూలఁగోసికొనుటలోఁ—దులసీదళములు త్రుంపుటలోఁ—జందన మరుగఁదీయుటలో-నారాధనసమయమున జేగంట వాయించుటలో- శంఖమూఁదుటలోఁ-గర్పూరపుటారతులు గన్నుల కద్దుకొనుటలో—అహాహా—అన్నిటికంటెను గజేంద్రాళ్వారుని రక్షించిన యాశోన్నవణ్ణంశైద పెరుమాళ్లు వారి తిరుముఖమండలమును దెరపిలేకుండఁ దనివిలేకుండఁ ఱెప్పపాటైన లేకుండ వీక్షించుటలో నాతండ్రియుఁ దల్లియునైనఁ బెరుమాళ్లను బిరాట్టియు గర్భాలయములో శయనించియుండ, నీవల నిలువఁబడి పవళింపుసేవపదములను బాడుకొనుటలో—దేవాలయమును వెంచేసిన భాగవతోత్తముల తిరువడిగళ్ళ నొక్కొక్కరివి తరువాత నొక్కరివి మెత్తగ నొత్తి కన్నులకద్దుకొని నడుముకట్టుకొని ముందునడచుచు వారి నిండ్లయొద్ద దిగఁబెట్టుటలోఁ దిరిగి యాలయములోనికి వచ్చి ధ్వజస్తంభము నొద్ద భాగవతుల పాదధూళిచేఁ బవిత్రములగు ఱాలపై నాచ్ఛాదనము లేకుండ రంగ రంగ రంగా రంగ రంగ రంగా యని ప్రాకారములదరున ట్లుచ్చైస్స్వరమున నరచుటలో నోభాగవతోత్తములారా! నా కీకాల మెంతమాత్రమును జాలకుండ నున్నదని మనవిచేసికొనుచున్నాను. అందువలన నసంతుష్టి నొందుచున్నానని యనుకొనకుఁడు. భక్తాగ్రగణ్యులారా! మన తండ్రియగు రంగఁడు చేసినదంతయు మనకు మేలే! చేయుచున్నదంతయు మనకు మేలే! చేయఁబోవున దంతయు మేలే! ఇచ్చినదంతయు సుఖమే ఇచ్చుచున్నదంతయు సుఖమే.

ఈయఁబోవున దంతయు సుఖమే. భాగవతోత్తము లందఱిలోఁ బ్రపంచమున నున్న వస్తువులన్నిటిలో నారంగదేవుఁడు దివ్యమంగళ విగ్రహుఁడై మందహాససుందరవదనారవిందుఁడై మనకు దర్శనము కటాక్షించుచుండఁగాఁ బ్రపంచమునఁ గష్టమేది? నాకున్నవారు భక్తవరదుఁడైన యారంగఁడు భాగవతోత్తములగు మీవంటివారు. వీరికంటె మఱి యెవ్వరు లేరు. తల్లి లేదు. తండ్రి లేఁడు. సోదరుఁడు లేఁడు. పెండ్లి లేదు. ఇల్లు లేదు. యోగ్యత లేదు. ఏమియు లేదు. ఎక్కడఁ బుట్టితినో యెప్పుడు పుట్టితినో నే నెఱుఁగను. జరిగిపోయినదానిని గూర్చి చింత రాఁదగినదానినిగూర్చి యోజన లేదు. అడియేని కాలయములో దొరకిన ప్రసాదము ముందుగా నతివృద్ధులగు రిక్తులకు గ్రుడ్డివాండ్రకుఁ గొంత బెట్టి—పుట్టలయొద్ద చీమలకుఁ గొంత విదిర్చి శిష్టాన్న మేమైననున్న యెడలఁ దిందును. లేనినాఁ డదియును లేదు. భక్తులారా! రంగనామముతోఁ గడుపు నిండించుకొన్న మనకు—రంగదర్శనమునఁ గన్నులు నిండించుకొన్న మనకు రంగసేవచే మనస్సు నిండించుకొన్నప్పు డాఁకలి యగుట కేమి యవకాశ మున్నది? భాగవతోత్తములారా! ఏమియు నక్కఱలేదు. ఒక్కభాగవతోత్తముని జూచినయెడలఁ బంచభక్ష్య పరమాన్నములతోవలెఁ గడుపు గిఱ్ఱుననిండును. భాగవతోత్తములు చేరిన చోటులందెల్ల రంగఁ డుండితీఱినాఁడు. రంగఁడున్న చోటులందెల్ల భాగవతోత్తము లుండితీఱినారు. మీ యీ సంఘమున రంగదేవుఁ డుండుటఁ బట్టియే యిందఱు నాతల్లులు—ఇందఱు నాసోదరు లిచ్చట చేరినారు. ఇప్పుడు పెద్దపెద్దసంత లున్నవా! అక్కడ రంగఁ డుంటఁబట్టియే యందఱుభక్తు లచ్చటికిఁ జేరుచున్నారు. పెద్దపెద్ద కోర్టులున్నవా? అందఱు భాగవతోత్తము లట కేల వెంచేయుచున్నారు? అక్కడ రంగడుండుటఁబట్టియే! అంతకంటె వేఱుకారణము చెప్పుటకు సాధ్యమగునా? రంగనామస్మరణ మొనర్చుకొనుచు నెందఱో భక్తశిఖామణు లిప్పుడు కారాగృహములకుఁ బోవుచున్నారు—కాదా? వారూరక పోవుచున్నారా! రంగఁడచ్చట నుంటచేతనే? అతనిని దర్శించుటకే పోవుచున్నారు. రంగ రంగ రంగా రంగ! ఇప్పుడు కొందఱు—కొందఱు భాగవతోత్తములు—చేరి స్వార్థపరిత్యాగమునుగూర్చి శాంతినిగూర్చి

యుపన్యాసము లిచ్చుచుండగా నచ్చటచ్చటఁ జూచితిని. అవియేని కాయుపన్యాసము లానందమిచ్చినవి. ఈస్వార్థపరిత్యాగమును గూర్చియే శ్రీమద్రామానుజయోగిచరిత్రమున — శ్రీమతేరామానుజాయనమః— ఒక్కచిన్నకథయున్నది. అతఁడాస్యుఁడనుగాని కారణమున దానిని బెద్దల వలన వింటిని. ఎట్లువింటినో యట్లు మనవిచేసికొందును. మనవిచేసికొందు మని భక్తులయాజ్ఞయేనా ? (అభ్యంతరమేమి యని సభలోఁగేకలు.)

భక్తవర్యులారా! అదిగో శేషాంశసంభవుఁడైన శ్రీమద్రామానుజ యోగిపుంగవుఁడు. ఆహాహా! ఎట్లున్నాఁడో చూడుఁడు!

ముద్దుమొగంబు కెంజిగురుమోవి దయారసమొల్కు పల్కులున్
నిద్దపుఁజూపులున్ బసిఁడినిగ్గులుదేరెడు మేనుతీరుగా
దిద్దినయూర్ధ్వపుండ్రమును దెల్లనిజన్నిదముల్ త్రిదండముల్
దద్దయు నొప్ప చిన్నశిఖదాల్చిన మాయతిరాజు గొల్చెదన్.

శ్రీమతే రామానుజాయ నమః. భాగవతోత్తములారా! భాష్య కారులవారిని దర్శించితిరా! ఆహా! ఆహా! కావేరీపుణ్యనదీతీర్థమున స్నానమాడి యాయన వేంచేయుచున్నారు! కూడ నెందఱో శిష్యులు ద్రావిడవేదమును బఠించుచున్నారు. చూడుఁడు శిష్యులనఁగా సామాన్య శిష్యులా ? దిగ్దంతులవంటి పండితులు శేషగుణసంపన్నులు దేవ తాంతర మంత్రాంతర సాధనాంతర రోపాయాంతరరహితులు అర్థపంచక జ్ఞాననిధులు మహాభాగవతోత్తములు యోగాభ్యాసపరులు. అట్టిశిష్యుల నడుమ సూటిగ గోపురమువలెనున్న యోగిశిఖామణి ఆహా! యెందు లకో యాఁగిపోయినారు. ఆఁగి యాసందువంకఁ జూచుచున్నారేమి ? అదిగో ఆసందునుండి పెద్దవీధికి వచ్చువారెవరో యెఱుఁగుదురా? ఆయ నయే ధనుర్దాసుఁడు బహుబలాఢ్యుఁడు కొలఁది గొప్పధనముకలవాఁడు సంసారసుఖాభిలోలుఁడు. భార్యదాసుఁడు. అదిగో చూడుఁడు. బారెడు కంటె నెక్కువ పై కెక్కనిబాలార్కునికాంతిచే భార్యమోము వాడి పోవునేమో యని యామెకు ఛత్రసేవ యొనర్చుచు, గాలిలోని పరాగ రేణువు లామెయాకర్ణాంత దీర్ఘనేత్రములలోఁ బడునేమో యని యామెకు వింజామర సేవసేయుచుఁ బదచలనమువలన బడలి తూలి పోవునేమోయని యామెకుఁ జేయూత సేవఁజేయుచు నామెను విహా

రాత్రి ముద్యానవనమున కెట్లు తీసికొనిపోవుచున్నాఁడో! ఆమె పద్మినీ జాతిస్త్రీలలోనిదఁట. నాకాగొడవయేమియుఁ దెలియదు. మనుష్యులలో నాకు హరిదాసజాతితప్ప నింకేయొక్కజాతి గోచరింపలేదు. ఆమె మహా సుందరియఁట. నామట్టునకుఁ దిరుచూర్ణపుబొట్టునున్న సౌందర్య మామె మోములోఁ గానఁబడదు. నిర్భాగ్యుఁడైన యతఁడేని యభిప్రాయ మెందులకు? భాష్యకారులవా రాధనుర్దాసునివంక నెంతకరుణముగఁ జూచుచున్నారో! మోహపాశాబద్ధుఁడై రాగలంపటుఁడై గ్రామ్య సుఖేచ్ఛారతుఁడై తరుణీదాసానుదాసుఁడై, యామెభర్త యెట్లు భ్రష్టుఁ డైపోవుచున్నాఁడో యను హృదయఖేద మారామానుజయోగినేత్ర కమలములం దెట్లు విస్పష్ట మగుచున్నదో? ఛత్రసేవచేయవలసినది పర మేశ్వరునకా భార్యకా? చామరకైంకర్య మొనర్పవలసినది చక్ర పాణికా? సతీమణికా? తరించుటకై దర్శన మొనర్పవలసినది దైవముఖ మా తరుణీపృష్ఠమా? ఉదారపురుషుఁడు నిష్కళంకచిత్తుఁడు నైన ధను ర్దాసుఁ డీదారసౌందర్యకారణమునఁ దత్త్వజ్ఞానాభావుఁడై దర్శనీయమైన వస్తువును దర్శింపక సేవింపఁదగినమూర్తిని సేవింపక పతితుఁడై పాడై పోవుచున్నాఁడే యనుదుఃఖము కరుణాసముద్రుఁడైన యాలక్ష్మణయోగి శిఖామణి కనుగొలుకుల మౌక్తికమణిస్వరూపమున నూరు కోహి నూరుల కాంతితో నెట్లు మెఱసిపోవుచున్నదో చూడుఁడు. ఆహాహా! లలితలలితమై సుకుమార సుకుమారమై కోమల కోమలమైన యాదయా స్వరూపుని చిత్తముముందు శిరీషకుసుమము శిలాప్రాయమనఁదగినది కదా! పరకష్ట లేశచ్ఛాయనైన నామహాత్ముఁ డోర్వలేఁడుకదా! ప్రపంచ కష్టము లన్నిఁటిలో భగవచ్చింతాశూన్యతకంటెఁ గష్టమున్నదా? తినుట కొక్కకబళమైన లేకుండుట కష్టముకాదు. కట్టుకొనుటకు కొక్క చింకిపేలికయైన లేకుండుట కష్టముకాదు. తలదాచుకొనుటకు రవంత తావైన లేకుండుట కష్టముగాదు. సతీసుతబలాత్కారమృతి యైనఁ గష్టముకాదు. అన్నికష్టములలో మహాకష్టము ప్రపంచలాంపట్యము. స్వకీయోత్తరగతి భ్రష్టతకు సంపూర్ణముగ సిద్ధపడి పరతారణము నకై పాటుపడిన స్వార్థపరిత్యాగి సార్వభౌముఁడగు రామానుజులహృద యములోని దయారస మెంతలోఁతుగలదియో చెప్ప సాధ్యమగునా?

మూఁడు 'ఎవరెస్టు' పర్వతములైన దానిలో సూక్ష్మముగ సునాయాసముగఁ గబురైన లేకుండ మునిఁగిపోవునే! ఆహాహా! భాగవతవర్యులారా! అటు చూచుచున్నారా! రామానుజులు తనదారివదలి ప్రక్కబారుగ ధనుర్దాసున కెదురుగఁ బోవుచున్నాఁడే! ఆహాహా! కాంచినుండి తిరుపతినుండి శ్రీపెరంబుదూరునుండి కాశీక్షేత్రమునుండి కుండలాలపండితులు శిష్యరికమునకై, సేవకై రామానుజసన్నిధికిఁ, గృతాంజలులై వచ్చుచుండఁగ, నామహనీయుఁడు పాదచారియై పరితాపపరివృతవదనపద్ముఁడై బాష్పపరిచ్ఛన్ననేత్రపుండరీకుఁడై యొక్క భవపంకనిర్మగ్నమలీమసమానసునియొద్దకు—భార్యాకింకరాధమునియొద్దకు—అతనినిఁ దరింపఁజేయుటకుఁ బోవుచున్నాఁడే! సముద్రమునఁబడి మునిఁగిపోవుచున్న మానిసిని బ్రతికించుటకై యబ్ధి కడ్డుపడిన యాఁతకాఁడు దయాళుఁడు కాఁడు. కాలి దిగఁగూలిపోవుచున్న యింటిలో నేమూలనో మ్రగ్గిపోవుచున్న ముసలియాఁడుదానిని బ్రతికించుటకై మంటలలోదుమికిన సాహసికుఁడు దయాళుఁడు కాఁడు. తుచ్ఛసుఖపరంపరాభిరతుఁడై, కాంతాకనకా దేవతావిగ్రహారాధనతత్పరుఁడై యింద్రియలోలుఁడై, శుద్ధచపలుఁడై, నాస్తికమార్గావలంబుఁడై పాడైపోవుచున్న మనుజుని మతములోని కాకర్షించి ప్రపంచసుఖవిరక్తి కలుగఁజేసి దైవపాదపద్మములఁబడవైచి యధఃపతనమగుచున్న యాత్మకూర్ధ్వగతినిచ్చి తరింపఁజేయునాతఁడాహాయెంతదయాళుఁడో చెప్పనలవియగునా? ఆహా! రామానుజులాధనుర్దాసుని బుజముపైఁ జేయివైచినారే! పద్మనేత్రపూజాభాగధేయమైన తనహస్తమును సంతత సతీపరిరంభసంరంభసముజ్జృంభమైన యాతని బాహువునందు—కాంతాకుచకుంకుమ కస్తూరీపరిమళభరితమైన యాతని బాహువునందు నిస్సంశయముగా నామహాత్ములుంచినారే! కొంకొక్కకము మీఁద రామకోటిపత్ర ముంచినయెడలఁ గళాశాస్త్రమునకే కాంతికాని తారకనామమున కేమయిన డాగున్నదా? సాలగ్రామము రూపాయల గోతములోఁ బడినయెడల రూపాయలసంచి విలువయే హెచ్చినదికాని సాలగ్రామపువిలువ తగ్గలేదే. "నాయనా ధనుర్దాసా! పరమసుకుమారయై పద్మినీజాతిసంభవయై బహుసుందరస్వరూపిణియైననీభార్య నీకు మహానందమిచ్చుటచేతనేకదా నీ వామెకింతవశుఁడవై ప్రపంచసుఖైకతత్పరుఁడవై

పాపకర్త్వముగ బ్రాకులాడుచున్నావు?" అని రామానుజు లాతనినిఁ బ్రశ్నించిరి. "ఔను! మహాత్మా! ఆమెస్వరూపసౌందర్యము—ఆమె ఛాయాసౌందర్యము ఆమెవదన సౌందర్యము — అన్నిటినిమించిన యామెనేత్రసౌందర్యము—న న్నామెకుఁ బాదాక్రాంతునిగఁ జేసినవి. నా బ్రదుకు నాసుఖము నాసర్వస్వమామె యాకర్ణాంతవిశాలనేత్రాంచల మున నున్నవి" యని ధనుర్దాసుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. "నాయనా! ధనుర్దాసా! నీయిల్లాలియక్షిసౌందర్యముకంటె, సహస్రగుణాధికసౌందర్య సమనిత్వములగు కన్నులను నేను నీకుఁ గానఁబఱచినయెడల నీవు వీని యందుఁ గొంతపై ముఖ్యమును వహించియుండఁగలవా?" యని సన్యాసి సంసారిని సతియెదుట సందేహశూన్యముగఁ బ్రశ్నించెను. "స్వామీ! అభ్యంతరమేమి?" యని ధనుర్దాసుఁడు పలికెను. అటుపైని నావెంట రమ్మని యాతనిభుజముమీఁదఁ దనచేయి నుంచియే శ్రీరంగేశ్వరునియాల యములోని కాతనిఁ గొనిపోయెను. శిష్యులు రామానుజమఠమున కేగిరి. భాగవతోత్తములారా! అదిగోరంగఁడు మనకావేరిరంగఁడు. కస్తూరి రంగఁడు. తలపై దులసి, యధరమున నలౌకికతేజస్వంతమైన మంద హాసము, మెడను గౌస్తుభము, వక్షమున శ్రీదేవి, పిరాట్టి కటిని బీతాం బరము, పాదసన్నిధిని భూనీళాదేవులు, ఆహా! ఒత్తిగిలి శేషశయనమునఁ బండుకొనిన యాజగదాధారుని-యాసౌందర్యరాశిని, భాగవతోత్తము లారా! కన్నులారఁ జూచితిరా!

"కుడదిశై ముడియై వైత్తు క్కుణదిశై పాదంనీట్టి
వడదిశై పిన్బుకాట్టి తెన్దిశై యిలంగై నోక్కి
క్కడల్ నిఱక్కడవుళెంద్రై యరవణై త్తుయిలుమాకం
డుడలెన క్కురుకుమాలో వెన్ శెయ్ గే నులగత్తీరే"

అని తొండరడిప్పొడియాళ్వారు పాయించిరిగదా! శ్రీరంగేశ్వర తిరువడిగళే శరణం. ఎంబెరుమానార్ తిరువడిగళే శరణం. అళగియ మనవాళ్ నయనార్ తిరువడిగళే శరణం. (అని లెంపలు వైచుకొను చున్నాఁడు) అదిగో లక్ష్మణయోగిశిఖామణి! ధనుర్దాసునికన్నులు కడుగు కొమ్మని తన కమండలువులోని పవిత్రోదకము నాతనిచేతిలోఁ బోసినాఁడు. కన్నులఁ గడిగికొని ధనుర్దాసుఁడు శ్రీరంగమూర్తికన్నులవంకఁ జూచు

చున్నాఁడు. ఒక్కత్రుటికాలము చూచి శరీర ముప్పొంగఁ బులకలెత్తఁ గంపింపఁ బంచప్రాణములు గొంతుముడిలో స్తంభింప రంగ రంగ రంగా. యని గర్భాలయ మదలునట్లు గట్టిగఁ గేకవైచి యాధనుర్దాసుఁడు రామానుజులబాహువులందు నిశ్చేతనుఁడయి పడిపోయెను. కమండలూదకమును గొంత యాతనిపైఁజల్లి రామానుజు లాతని నీవలికి మెల్లఁగ దెచ్చినారు. ధనుర్దాసుఁడు కన్నులఁ దెఱచి చూడఁగా రామానుజులు రవంతదూరములో నున్నారు. పైఁటచెఱఁగుచే భార్య యాతనికి విసరుచుఁ బ్రక్కనే యుండెను. "పో! ఆవలికిబో! నీవు నాకక్కఱలేదు" అని భార్యను గద్దించి "గురూత్తమా! యోగిశిఖామణీ! నాకిప్పుడే సన్న్యాస మిప్పింపుఁడు. నేనికఁ బ్రపంచసౌఖ్యలంపటుఁడనయి యుండఁ జాలను." అని వలవల నాభాగవతోత్తముఁ డేడ్చుచున్నాఁడు. చూచితిరా! భాగవతోత్తములారా! దేవుని కళాలేశమయినఁ గాంచినవానికి దిక్కుమాలిన ప్రపంచసంబంధము కావలయునా? రామానుజుఁ డాయన కాశ్రమ మిప్పించుట కిష్టపడక వారి [illegible]పైచి తాము తమమఠమునకు వేంచేసిరి. ఇట్లనుదినము రామానుజులు కావేరీస్నాన మొనర్చి పండితశిష్యులను వెంటబెట్టుకొని ధనుర్దాసుని యింటిప్రక్కనుండి పోవుచు నాతని బిలిచి యాతనిభుజముపైఁ జేయివైచి శ్రీరంగేశ్వరుని యాలయములోనికిఁ దీసికొని పోవుచుండెడివారు. యతిరాజ శేఖరులగు రామానుజులు స్నానానంతరముగూడ నిట్టుల బ్రాహ్మణుఁడగుధనుర్దాసుని స్పృశించుట రామానుజశిష్యులలోని బ్రాహ్మణపండితుల కందఱకుఁ గడుదుస్సహాముగానుండెను. పండితులలో గుసగుసలారంభములయినవి. వెక్కిరింపులు విజృంభించినవి. సూడుమాటలు తలసూపినవి! పలుచపలుచగఁ దిట్లు బ్రబలినవి. ఇతఁడు బ్రాహ్మణాచారశూన్యుఁడని కొందఱు కాషాయదండముల గౌరవమయిన నిలువఁబెట్టనక్కఱలేదా యని కొందఱు లోకమర్యాదనుగూడఁ దగులఁబెట్టుచున్నాఁడని కొందఱు— ఇతఁడు వర్ణసాంకర్యమునకు మతధ్వంసమున కవతరించిన కలిపురుషుఁడని కొందఱు— మొదట గోడచాటున-తరువాత రామానుజులు మొగముచాటున ననుకొని యనుకొని తుదకుఁ దెగించి రామానుజులసన్నిధినే విసుగుఁదల మాటలతో విధేయతారహితప్రవర్తనములతో నధిక్షేపణ

ములతో, బహిరంగనిందలతో నందలుకూడఁ దమయంతరంగములందలి యసహ్యతను వెల్లడించిరి. ఆహాహా! ఎట్టియుత్తమునికైనను సమకాలికుల వలన నిందలు తప్పవు కదా! రామానుజులు వారి నిందావాక్యములను మందహాసవదనముతో విని యూరకుండెను గాని మామూలుచర్య మాత్రము మానలేదు. శిష్యులందఱు స్నానార్థమై పోయినప్పుడు గడచినరాత్రి మఠములో నాఱవైచిన వారి మడిబట్టల నన్నిఁటికొసలుచింపుమని రామానుజులవా రొకనమ్మకమైనవాని కాజ్ఞాపింపఁగా వాఁ డట్లు చేసెను. స్నానముచేసివచ్చి శిష్యులు తమతమ మడివస్త్రములనుదీసికొనఁ బోవుచు "అడడా! అడడా! ఇదెన్న! ఇదెన్న! అద్భుతమాయిరికె. ఇంగె తస్కరవన్ యారు? నల్లతుణ్ణియెల్లభ్రష్టయిపోచి" యని కేకలువైచుచుఁ గిరుగారనుచుఁగీసరకాసరమనుచు, ఘూకరించుచుఁ, జీకొట్టుచు-ఉన్ ముర్థాడ్! ఉన్ చోర్ అని యొకరినొకరు తిట్టుకొనుచుఁ గలియఁబడి కొట్టుకొనిరి. రామానుజు లాసందడి యేమని యడుగ వారంద ఱార్ద్ర వస్త్రధరులై గురుసన్నిధికి వచ్చి మఠమునజరిగినచౌర్యమునుగూర్చి మనవి జేసికొనిరి. రామానుజులు మందహాసమొనర్చి యూరకుండెను. పదిదినములు దాఁటినపిమ్మట నొకరాత్రి తనకు విశ్వాసపాత్రము లగు నిద్దఱు శిష్యులను బిలిచి ధనుర్దాసు నింటికిఁబోయి యాతనిభార్య యొడలి మీఁద యాభరణములఁ దెండని రామానుజులు వారి కాజ్ఞాపించిరి. వారట్లాహరిభక్తు నింటికిఁ బోయిరి. భార్యాభర్తలు వేఱువేఱుశయ్యలపైఁ బండుకొని యుండిరి. దొంగలురాఁగానే ధనుర్దాసునకు మెలఁకువ కలిగెను. కాని కన్ను లఱమూసికొని లోలోన రంగనామస్మరణ మొనర్చుకొనుచుండెను. దొంగలు ధనుర్దాసుని భార్యయొద్దకు వచ్చి నిలువఁబడిరి. ఆమె యొత్తిగిలి పండుకొనియుండెను. ఒకచెవి దుద్దును ఒకచేతితట్టువంకియు నొకముంజేతి గాజులును నొకకాలి నూపురమును దస్కరించిరి. ఇవితీసికొనుచుండఁగనే యామెకు మెలఁకువ వచ్చెను గాని కదలకుండ యామె పండుకొనియుండెను. ఒకపార్శ్వమున నున్న వస్తువులన్నియు వారు తీసికొనినపిమ్మట నామె రెండవ వైపున కొత్తిగిల్లెను. ఆమెకు మెలఁకువకలిగినది కదాయని జడసి శిష్యులు పాఱిపోయిరి. తెల్లవారుచుండఁగనే ధనుర్దాసుఁడు భార్యనువెంటఁబెట్టు

కొని రామానుజమఠమునకు వచ్చి స్వామీ "ఈమెవలన మహాభాగవ తాపచారము కలిగినది. ఈమెను మీరు శిక్షింపవలయును. నాకు సన్న్యాస మును కటాక్షింపుమని యెంత ప్రార్థించినను మీకు దయరాలేదు. ఇప్పు డైన దయయుంచి దాని ననుగ్రహింపవలయును." అని తాను రామాను జుల కాళులకు మ్రొక్కి భార్యచే మ్రొక్కించెను. ఈయల్లరి యేమియో యని శిష్యులంద అచట వేంచేసిరి. అంత రామానుజులు 'సతీమణీ మా అమ్మా! నీవలనఁ గలిగిన మహాపచారమే' దని యామె నడిగెను. "మహాత్మా! తాము పరిశీలింపఁ గర్తలు. తమ రేశిక్షవిధించినను మహా భాగ్యముగ - మహావిష్ణుప్రసాదముగ—— స్వీకరింతును. నిన్నరాత్రి మాయింటి కెవ్వరో దొంగలు వచ్చిరి. నే నొత్తిగిల్లి పండుకొంటిని. వారొకపార్శ్వమునన్ను యాభరణములను మాత్రమే దీసికొని యొక్క తెప్పపాటుకాలము నిలువఁబడియుండిరి. ఇదివఱకుఁ దీసికొనినవస్తువులతో వారికి సంతుష్టిగా లేనట్లున్నది? పాపము వారికి ధన మెంతయావశ్యక ముగనున్నదో రెండవవైపువస్తువులు గూడ వారు తీసికొనుట కవకాశ మిచ్చి పుణ్యము కట్టుకొనవలయునని, రెండవవైపున కొత్తిగిల్లితిని. నే నొత్తిగిల్లితిని గావున మేలుకొంటినని దొంగలు పాఱిపోయిరి. మహాత్మా నేనింతకంటె నేమియుఁ జేయలే"దని యామె మనవిచేసుకొనెను. "అదిగో తిరుగ నదియేమాటయా? రెండవవైపున నున్నవస్తువులు తీసి కొనుట కవకాశమిచ్చుటకై యొత్తిగిల్లితినని చెప్పుచున్నావు. అవకాశ మిచ్చుదానవు నీవా? నీవిచ్చుటయు నీనగలు భాగవతోత్తములు పుచ్చు కొనుటయునా? ఇచ్చుటకు నీవా కర్త్రివి. నీ కాస్వాతంత్ర్యమేల? నీకా యహంభావ మెందులకు? నీవొత్తిగిల్లుటచేతనే కదా యాపరమ భాగవతులు —— అసంపూర్ణమనోరథులై —— పోవలసివచ్చినది! నీరెండవ వైపువస్తువులు వారికిఁ గావలసియేయుండునెడల నిన్ను రెండవవైపున కొత్తిగించి యాపుణ్యాత్ములు వానిని దీసికొనియే పోవుదురే! శేషగుణ సంపన్నురాలవై పడియుండకుండ నీవొత్తిగిల్లుటవలననే భాగవతాప చారము సిద్ధించినది." అని ధనుర్దాసుఁడు భార్యను మందలించి యామెను శిక్షింపఁదగునని రామానుజులఁ బ్రార్థించెను. ఆహాహా! ఱాలు గరఁగిపోవలసినమాటలే, మోళ్లు చిగిరింపవలసినమాటలే! పశువులకుఁ

బాంధిత్యమీయఁదగినమాటలే. ఆహా! అట్టిసమయమున రామానుజు లేమి సాయించుచున్నారు! వినుఁడు. నాయనలారా! అమ్మా - స్వార్థపరిత్యాగము సంపూర్ణముగా గలదానవు నీవు—స్వార్థపరిత్యాగస్వరూపమే నీవు త్త. శిష్యులారా! పండితులారా! స్నానమొనర్చి యీయబ్రాహ్మణుని నేను స్పృశించినందులకు మీరు నన్ననేకవిధముల నిందించితిరే. ఈయన యెట్టిమహనీయుఁడో మీకిప్పుడు తెలిసినదా? బట్టలు మెడలకుఁ జుట్టుకొని యీయన కాళులకు సాష్టాంగదండప్రణామ మేల యాచరింపఁదగదు? ప్రాతగుడ్డలకొసలు—బెత్తెడో జేనెడో పోయినవని [illegible]. కస్సుబుస్సని యొకరి నొకరు తిట్టుకొంటిరే—నీవే దొంగవు. నీవే దొంగవని యొకరి నొకరు కొట్టుకొంటిరె? ఇదియేనా మీస్వార్థపరిత్యాగమహిమ! ఇదియేనా మీవైరాగ్యసంపత్తి! ఇదియేనా మీ తృష్ణానిర్మూలనశక్తి! నమ్మాళ్వారి తిరువాయిమొళిని సేవించితిరే. ఇతరములగు స్వరూపగ్రంథములన్నియు సేవించితిరే. రంగదేవస్మరణ సాంగత్యమునఁ బ్రకాశించుచుంటిరే. అక్షరజ్ఞానమైన లేని ధనుర్దాసుని కాలిగోటికొననైనఁ బోలలేకుంటిరే! పండితులారా? మీరు ముక్తినొందఁగోరితిరేని పైపై వేషములతోఁ బనిలేదు. పైపై మాటలతోఁ బనిలేదు. ధనుర్దాసుని యంతరంగశుద్ధివంటి యంతరంగశుద్ధిని గాంచుఁడు. అతని స్వార్థపరిత్యాగమువంటి స్వార్థపరిత్యాగమును గాంచుఁడు. అతని నిర్లిప్తతవంటి నిర్లిప్తతను బొందుఁడు. అతని నిశ్చల దైవభక్తిని గుదురుపఱచుకొనుఁడు. అవి రానంతవఱకు మీకీబంధము లుండక మానవు.” ఇట్లు రామానుజు లానతిచ్చి స్నానమునకై పోయిరి.

భాగవతోత్తములారా! నేను రామానుజచరిత్రమునుండి చెప్పఁదలఁచిన కథను చెప్పితిని. ఉపన్యసించుట చేతఁగానివాఁడనగుటచేఁ గథలోసంగతి కొంత, నాసంగతి కొంత కలిపి కలగపులగము క్రిందఁ జేసి చెప్పితిని. క్షమియింపవలయును. శ్రీమతే రామానుజాయ నమః.

నాయనలారా! హరిదాసుని యుపన్యాసము నానందమునవింటిమి. ఈయన హృదయపరిపక్వత దైవభక్తి కలవారు. వీరు శ్రమచేసి యిచ్చటకు వచ్చి యీసంఘమున నుపన్యసించుటచే వారికి మనముఁ గృతజ్ఞులము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 2. తాండవకృష్ణుఁడు—తాండవశంకరుఁడు



జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! రాత్రి యొకవింతయైనస్వప్నము వచ్చినది అది యేదో చెప్పెదను. అది యెట్లారంభమయ్యెనో జ్ఞప్తిలేదు. రాత్రి భోజనమైనపిమ్మటఁ గొంతసేపుఁ బ్రత్తిరాట్నము త్రిప్పుచుఁ గూరుచుంటిని. ఏకులువడుకుకొనినట్లా మగనియొద్దఁ బండుకొనినట్లా? యను సామెత మనకున్నది. ఆహారపచనార్భకపోషణాశన భక్షణాది కార్యములైన పిమ్మట స్త్రీలకుఁ జేయఁదగిన పనులు రెండే—ప్రత్తిరాట్నమునొద్దనైనఁ గూరుచుండవలయును. లేదేని భర్తయొద్దనైనఁ బండుకొనవలయును. సువాసినులగు సుందరుల కందఱకు భర్తలకొలువుకంటెఁ బ్రత్తిరాట్నపుఁగొలువు ముఖ్యమైనది. కావుననే దానికీసామెతయందుఁ బ్రథమస్థాన మీయఁబడినది. మగువలకు విధ్యుక్తమయిన యీ యేకులు వడుకుకొనుట మగలకుఁగూడ నిప్పుడు విధ్యుక్తమైనది. మృదులతరమైన వ్రేళ్లుగలవారగుటచేఁ గాంతలుతీసినదార మెక్కువసన్నముగ నాణెముగ నుండునని మొదట రాట్నము రమణీమణుల యధీనము జేయఁబడినమాట నిజమేకాని యీకాలములోఁ గట్టుగుడ్డకు సన్నమేమి ముదుకయేమి? ఏదియో యొకటి యున్నఁజాలును. రొట్టకట్టు లేకుండినఁ జాలు. అట్లు రాట్నమును ద్రిప్పుచు తేపటిసాక్ష్యుపన్యాసము దేనినిగూర్చి చెప్పుదునా యని యోచించుకొనుచుంటిని. ఇంతలో నొకపెద్దయీఁగ రాట్నపుటాకుపై వ్రాలినది. రాట్నము నాఁపి యీఁగను దోలివైచి తిరుగఁ ద్రిప్పుట నారంభించితిని. ఈఁగ తిరుగవచ్చి యాకుపై వ్రాలినది. మఱల దానిని దోలివైచితిని. రాట్నము పాడుచున్నపాట వినుటకే యది వచ్చియున్నదో రాట్నముతోఁబాటు గిరగిరతిరుగుట అంకుల రాట్నములోని బాలకునికివలె, దానికి ముచ్చటగనుండుటచే వచ్చియున్నదో, యెవరు చెప్పఁగలరు? మనలోనున్న మనమనస్సే మనకుఁ దెలియదే? ఇఁకఁ బరమనఃపరీక్ష మనకెట్లు సాధ్యము? ఎందులకో యొకందులకు రాట్నముపై నది వ్రాలినది. పోనీ! దానిజోలి మనకేల

యని యనుకొని కొంతసేపు దారముతీసి, తీసినదారమును భద్రపఱచి పండుకొంటిని. కాని దృష్టిమాత్ర మీఁగమీఁదనే యున్నది. ఆహాహా! స్థూలముగఁజూడ సృష్టిలో నీఁగ యెంత సూక్ష్మమగు వస్తువో? కాని సూక్ష్మముగఁ జూడ నది యెంత స్థూలమగువస్తువో చెప్పశక్యమగునా? యంత్రసాహాయ్యమున దానికంటిని బరీక్షించి చూడుఁడు దానిలోని చిత్రములన్నియు సవిస్తరముగ గ్రహించుటకు మనుజునియాయువు చాలదు. తలత్రిప్పకుండ నన్నివైపులఁగూడ నీఁగ చూడఁగలిగినప్పుడు తచ్ఛక్తిలేని మనుజుఁడు దానికంటె ఘనుఁడని చెప్పుట కేమి యవకాశ మున్నదో యోజించుకొనుఁడు. ఆ! అదేమిమాట? మనుజునకు మనస్సున్నదికాదా? అందుచే నాతఁడు సర్వోత్కృష్టుఁ డేల యనరాదందు రామేమి? అబ్బ! మనస్సా! అది యీఁగకు లేనట్లు మీకెట్లు తెలియును? మీమనస్సులకుఁ గొన్నిశక్తులున్నవి. దానిమనస్సునకు మఱికొన్ని శక్తు లున్నవి. దానికున్న మనశ్శక్తులు మీకు లేకపోవచ్చును. మీకున్న మనశ్శక్తులు దానికి లేకపోవచ్చును. మీకున్న మనశ్శక్తులు దానికి లేక పోవుటచేత మీరు దానికంటె గొప్పవారని యనుకొనుట యెంతన్యా యమో దానికున్న మనశ్శక్తులు మీకు లేకపోవుటవలన తాను మీకంటె నెక్కువయని యది యనుకొనుటయు నంతేన్యాయముకాదా! సర్వ శక్తులే ప్రాణిమనస్సునకును గూడ లేదనుమాట స్పష్టమే గద! అట్టిచో మనుజుని ఘనతయేదో మఱిక నీచతయేదో నాకు గోచరించుటలేదు. ఈఁగఱెక్కలోని యింద్రధనువులసౌందర్యమును—వెల్లడించుటమాట యటుంచుము—సమగ్రముగ గ్రహించి యానందించుటకైన మనుజు నకు మనస్సున్నదా? అని యిట్లేదో మనస్సులో నిమ్మళముగ యోజించు కొనుచుఁ బండుకొంటిని. తరువాత నేమియోజించుకొంటినో, నాకు జ్ఞప్తిలేదు. వెనుకటి తేఁగసాగుడేదో యిచ్చటఁ దెగిపోయినట్లున్నది. ఈనడిమి పెలితెగ్గైనతరువాత స్వప్న మారంభమయ్యెను గాఁబోలు. నాకు మహాయుద్ధనావల కున్నంత తెరచాపలంతటి ఱెక్కలువచ్చిన ట్లయ్యెను. ఆఱెక్కలమీఁది సౌదామనీలతలు శక్రచాపములు, శతసహస్రసంఖ్యాకములై వెలిఁగిపోవుచున్నవి. ముందున కుబికిన నానేత్రములు 'తాజ్‌మహాలు' పైనున్న పెద్దగుమ్మాచ యంతంతలని నే

ననుకొంటిని. ఆంజనేయు లాకాశముననెగిరినట్లు తెక్కలసాహాయ్యము ననే నెగురుచుంటిని. ఇట్లగిరియెగిరి యొకగోళములోనికిఁ బోయితిని. బృహస్పతిభగవానునకు జయా! తారాభగవతికి జయా! యని మగకంఠములతోఁ గలసిన యాఁడుకంఠములతో హెచ్చరికలు వినఁబడుచున్నవి. ఆహా! ఇది గురుగోళముకాఁబోలు నని నే ననుకొంటిని.ఇక్కడివారందఱు చార్వాకమతస్థులే. వీరికి దైవచింత యనుమాటయే లేదు. దేహమే యాత్మ. భోగమే పుణ్యము. రోగమే పాపము. మృతియే మోక్షము. అంతకంటె మఱేదియు లేదు. చందనాదిచర్చలు, పుష్పకందుకక్రీడలు, చుంబనాదివిలాసములు, పరిరంభసంరంభములు, నర్మాలాపకలాపములు, మద్యపానవిజృంభణములు, నెచ్చటఁ జూచిన స్త్రీపురుషులలో నెడము లేకుండ జరుగుచున్నవి. బిడియములేకుండ నలపులేకుండ సొలపు లేకుండ విసుగులేకుండ విరతిలేకుండ వారు జరిగించుచున్నప్పు డవి జరుగుటకేమి? ఆహాహా! ఆస్త్రీలసౌందర్య మేమని చెప్పవచ్చును? మన భూలోకమునందలి మనుజులలో మహాసుందరి యామగువలముందు 'బలాదూ'రున్నకైనఁ బనికిరాదు. వారి యొయ్యారపునడకలలో వారి కుప్పిగంతులలో వారి దాఁగుడుమూఁతలలో వారి జెట్టిపట్టులలో వారి చెడిగుడులలోఁ గొందఱి పైఁటకొంగులు కొందఱి గాగరాకొసలు కొందఱి జడకుచ్చులు నాకుఁ దగిలినవి. ఒడలు జలదరించినమాట సత్యము. తప్పొప్పుకొన్న తగవు లేదుకాదా ? ఈఁగనైయుండి నీకీ హావభావవిలాసము లెందుల కందురేమో? ఈఁగనైయున్నను గాడిదనై యున్నను మగవాఁడనైయున్నను నాఁడుదాననై యున్నను పైవేషమే వచ్చినది కాని లోపలనున్న నేను అను తత్త్వము చచ్చినదా ? నన్నుఁ జంపినను జావని యాతత్త్వము నాలోన నున్నంతకాలము తలపైఁ గత్తిరింపున్ననేమి కచమున్ననేమి ? ప్రక్కల తెక్కలున్ననేమి ? పృష్ఠమునఁ దోఁకయున్ననేమి ? అచ్చటివారు వారివారి సౌఖ్యసంధాన ప్రయత్నసంరంభములలో నన్నుఁ జూచినట్లు నే ననుకొనలేదు. కాని యాహా ! అదియేమి ! వారిలోఁ గొందఱు కొందఱు మాత్రమే— స్త్రీలయినట్లా ? పురుషులయినట్లా ?—స్త్రీలగుదురు పురుషులు నగుదురు. కాని వారు వేఱువేఱుగాఁ గానఁబడక శాశ్వతముగాఁ గలిసి

కొనిపోయినారేమి ? కుడిప్రక్కను మగవాఁడు, ఎడమప్రక్కను మగువ—నడుమ స్థిరమైన యతుకు. స్త్రీపురుషుల కేకశరీరమే యయిపోయినదే ! ఆహా ! వారు మరతలుపులవలె నట్టె కలసికొనుచున్నారు. అట్టె విడిపోవుచున్నారు. ఏమిచమత్కారముగ నున్నది ! వీ రెవ్వరైయుందు రని నే ననుకొనుచుండఁగా నింతలో వేలువేలుస్వరూపములతో నున్న స్త్రీపురుషు లచ్చటికి వచ్చి లెంపలువైచుకొని చేతులు జోడించుకొని మహాత్ములారా ! నిత్యసంగులారా ! ప్రపంచసౌఖ్యపరమావధిపట్టభద్రులారా ! నమోనమః నమోనమః యని మ్రొక్కిరి. వీరు చార్వాకమత మహావేదాంతులు కాఁబోలు ! బృహస్పతిమత మహాయోగీంద్రులు కాఁబోలు! కానియెడల సామాన్యజనులు వీరి నిట్లు గౌరవింపనేల ? మనలో యతిశేఖరు లెట్లో మతగురువు లెట్లో సర్వసంగపరిత్యాగు లెట్లో సంఘసంస్కర్త లెట్లో వీరిలో నీమహామూర్తు లట్లుకాఁబోలునని నే ననుకుంటిని. మన భూలోకమే భామాలంపటత్వమునఁ బ్రపంచసుఖ పరంపరానుభవప్రాబల్యమున భ్రష్టమైపోయినదే యని మన మేడ్చుచుండఁగా నీలోకము దాని నీడ్చి చెంపకాయ కొట్టఁదగియున్నట్లున్నదే ! పైలోకము పైలోకమన్న పే రిందులకా దీనికి వచ్చినది ? పాపములోఁ బైలోకమా ? భ్రష్టతలోఁ బైలోకమా ? వ్యక్తులలోనేమి జాతులలోనేమి నాగరకత హెచ్చినకొలఁది ధనము హెచ్చినకొలఁది హెచ్చిపోవునది స్వార్థలోలతగాని స్వార్థపరిత్యాగము కాదు. తరుణీచింతకాని దైవచింతకాదు. తృష్ణకాని విరాగముకాదు. రక్తికాని భక్తికాదు. ఈవిషయమున మనుష్యలోకమే పరమాసహ్యముగ నుండఁగా గురులోకమని పేరొందిన యీలోకము మనలోకముకంటె సహస్రగుణము లధమమై యేడ్చుచున్నదేల యని యేమేమో యోజించుకొనుచు మన భూలోకమునకు శీఘ్రముగఁ బోవునెడల మిగుల బాగుగా నుండునేమోయని యనుకొంటిని. ముండ్లలో నివసింపవచ్చును. మంటలో నుండవచ్చును. కత్తులబోనులోఁ గాపురమొనర్పవచ్చునుగాని దైవచింత లేనిచోట మాత్ర మొక్కనిముసముండఁదగదు. అందులోఁ గేవల నాస్తికమతదుర్నయభూయిష్ఠమైన యీలోకమున నుండు టెట్లు? ఎట్లు వచ్చితినో యట్లెగిరిపోవలయునని

భూలోకమువంకఁ జూచితిని. ఆహా! అదిగో కుజగోళము! ఎఱ్ఱయెఱ్ఱగ నున్నది. అదిగో శనిగోళము! నల్లనల్లగ నున్నది. ఆహాహా! గ్రహము లన్నియు సూర్యునిచు ట్టెట్లు తిరుగుచున్నవో! ఒకరిచుట్టొకరు తిరుగ వలసిన ప్రారబ్ధ మేలోకమునకుఁ బోయినను దప్పదు గదా? బానిసవాఁడు నాయకుని చుట్టుచుట్టు తిరుగుచున్నాఁడు నాయకుఁడు సముద్దారుని చుట్టుచుట్టు తిరుగుచున్నాఁడు. సముద్దారుఁ డమీను చుట్టుచుట్టు తిరుగుచున్నాఁడు. అమీను ప్రధానుని చుట్టుచుట్టు తిరుగుచున్నాఁడు. ప్రధానుఁడు ప్రభువుగారి చుట్టుచుట్టు తిరుగుచున్నాఁడు. ప్రభువు తా నుంచుకొన్న ముండపృష్ఠము చుట్టుచుట్టు తిరుగుచున్నాఁడు. అన తన ముద్దుల మగఁడైన గుఱ్ఱపుఁ గాసావాని చుట్టుచుట్టు తిరుగుచున్నది. ఆపంద తనకు త్రాగుడు మిత్రుఁడైనబానిస చుట్టుచుట్టు తిరుగుచున్నాఁడు. బానిసయొద్దనుండి యారంభమైన యాశ్రయచక్రము తిరుగ బానిస యొద్దనే పూర్తియైనది. ఈ చక్రగమన సంప్రదాయ మన్ని దేశములలో నున్నది. అన్ని జాతులలో నున్నది. అన్ని గోళములలోఁగూడ నున్నది. ఎందులకో యీ గ్రహములన్నియు సూర్యుని చుట్టెట్లు తిరుగుట? సూర్యునకు మాత్ర మేమి స్వాతంత్ర్య మేడ్చినదా! ఈ సూర్యమండలమువంటి మండలములు లెక్కలేకుండ నున్నవి. ఇవి యొకదాని చుట్టొక్కటి తిరుగు చున్నవే! నిలుకడ యెవరికున్నది? స్థిమితత యెవరికున్నది. స్వాతంత్ర్య మెవరి కున్నది? గిరగిర గిరగిర నోరుమూసికొని చచ్చినట్లు తిరుగుచున్నవారే కాని యెందులకుఁ దిరుగవలయునో యని రవంత నిలువఁబడి యోజించు కొనువారొక్కరును లేరే. నిలువఁబడుసరికి పుంఖానుపుంఖముగ నుద్దండ వేగముతో వెనుకనుండి తఱుముకొని వచ్చు లక్షోపలక్షసంఖ్యలుకల వస్తువులుమీఁదఁ బడి త్రొక్కి దుమ్ముచేసి పోవనుండఁగా నిలువఁబడుట కవకాశ మేమున్నది! ఉన్న కొంసంతబుద్ధియైన నుపయోగపఱచుకొనుట కవకాశ మేమున్నది? ఉపయోగపఱచిన ఫలముమాత్ర మేమున్నది?

ఇతని నతఁ డీడ్చు వేఱొక్కఁ డతని నీడ్చు
నంద అందఱ నీడ్చు కయ్యొంబె జగతి
అందఱు స్వతంత్రరాజు లూహములయందు
బానిసలకంటె బానిసల్ పనులయందు.

అని యొకఁడు చెప్పినమాట యసత్యముగాదు. అందఱు బానిసలు. అందఱు బానిసలు ఒక్కపరాత్పరుఁడు తక్క స్వతంత్రుఁ డెవఁడు లేఁడు. ఆతఁ డెక్కడ నున్నాఁడో! ఏలాగున నున్నాఁడో! ప్రజాపన్నివారకుఁ డగునో కాఁడో యని యాస్వప్నములోనే శుద్ధబుద్ధిహీనుఁడ నగు నేను మహావిద్వాంసునివలె బూర్వపక్షరాద్ధాంతము లొనర్చుచు మనభూలోకమువంక కొరకొండమెట్టయంతలేసి గ్రుడ్లతోఁ జూచితిని. అదిగో! సముద్రమధ్యమునఁ గొండ! ఆహా! సముద్రమథనమాయేమి? కాకేమి? దేవత లొకవంక రాక్షసు లొకవంక నదిగో? మందరపర్వతమునకు శేషాహిని జుట్టిబెట్టి తరచుచున్నారు. ఒక్కయాఁడుది జైఁ జైఁ యని పెరుగు తరచుచున్నప్పుడే మనోహరముగా నుండునుగదా? మహాంభోధి మథన మెంతమనోహరముగా నుండునో చెప్పఁదరమా! కాని యాహాహా? అది యేమి! సముద్రమునుండి బయలుదేఱున దదియేమి? పొగయా? కాదే! పొగకంత వేఁడిమియుండునా! మంటలా? కానట్లున్నదే? మంటలు నల్లగా నుండునా! రోదసీకుహరమంతయు వ్యాపించుచున్నవే అయ్యయో! నక్షత్రములు నల్లనైపోయినవి. గ్రహము లన్నియు నల్లబడిపోయినవి. పాలసముద్రమంతయు నల్లబడిపోయినది. హాహా! జగతి తపించిపోవుచున్నది. సురాసురులు మహాభీతచిత్తులై మథనమును మానివైచినారు. మందరము కదలకుండ నిల్చియున్నది. శేషుఁ డూపిరితీసుకొనుచున్నాఁడు. ఎంతతాపమైన భరింపవచ్చునేమో కాని యీతాపములో నీగాలేమి? ఈకోత్తేమి? ఈగొట్టేమి? ఈవాసనదగిలిన ప్రతిజీవము కూడ మత్తుచే సొమ్మసిల్లి పడిపోవుచున్నదే! దేవతలు రాక్షసులు కూడ జైతన్యములు దక్కియున్నారే. బ్రహ్మయు విష్ణువు నటకు వేంచేసి శంకరా! ఈలోకాపదను బాపుమని మొఱ్ఱలిడుచున్నారు. అదిగో! శంకరభగవానుఁడు శాంకరీసహితుఁడై విచ్చేసినాఁడు! స్వామీ! అకాలజగత్ప్రళయమును నిరోధించి రక్షింపవా యని స్మృతినొందిన జీవు లన్నియుఁ గేకలువైచుచున్నవి. అప్రతిహత ప్రాబల్యముతో, అవాఙ్మానసగోచరధాటీపటిమతో, హాలాహలము విజృంభించుచున్నది. దాని భయానకత కోర్వలేక బ్రహ్మ విష్ణువులు పరమేశ్వరుని జగదవన మొనర్పుమని తిరుగఁ బ్రార్థించుచున్నారు. శంకరుఁ డాజగత్ప్రళయప్రతీకాశమగు సన్నివేశమును

గాంచి శాంభవివంకఁ జూచుచున్నాఁడు. శాంభవీదేవి "ప్రాణనాథా! సందేహింపకుము. మన కెంత బాధయయిన నగునుగాక! లోకమును రక్షింపుము. ఆహాలాహలమును మ్రింగుము. ఆలస్యమొనరింపకు" మని భర్తతోఁ బలికెను. హాహా! త్రిలోకజననీ! కరుణాలవాలా! వీరపత్నీమణీ! యని యచ్చటివారెల్ల రామెను గొనియాడుచున్నారు. అదిగో! అయ్యయో! ఇఁక ముందరిచర్య యేదియుఁ గనఁబడకుండ భూమి రెండవ వైపునకుఁ దిరిగిపోయినదే! కాని యీ రెండవపార్శ్వమున నేమున్నది?

అదిగో పెద్దమడుగు, దానిలో నొక్క కాలాహి! మడుగులోదిగిన పశువులనెల్ల జంపుచున్నది. ఎందఱపిల్లలనో మ్రింగివైచినది. ఎందఱి కాంతలనో యది నోటఁ బెట్టుకొనినది. ఊరంద ఱేడ్చుచున్నారు. యశోదాదేవియొద్దకు వచ్చుచున్నారు. తల్లీ! లోకనాథుఁడైన కొడుకును గంటివి. చనుబాలతోఁ బూతనపంచప్రాణములను గ్రోలినబిడ్డఁడు. మహావిష్ణువు కాని మనుజుఁడు కాఁడు. కాళియనాగేంద్రుని బాధ సహింపలేకుండ నున్నాము. నీకొమరు నటకుఁ బంపి యాపామును జంపించి వ్రేపల్లె నుద్ధరింపుమమ్మా యని యాక్రోశించుచున్నారు. అదిగో శ్రీకృష్ణుఁడు!

మెరుఁగుగుండలముల మిసమిసల్ గండభా
గములపై నట్టిట్టు గంతులిడగ
రంగారఁగట్టిన బంగారుపుట్టంబు
చిరుబొజ్జనుండి కొంచెముగ జాఱఁ
బవనపూరణమున జవుజవ్వమని లేఁతఁ
బుగ్గలు బూరలై పూరటిల్ల
నిగనిగల్గలగుజ్జు సిగనున్న శిఖిపింఛ
మొయ్యారమునఁ దల యూపుచుండ
నుత్తమోత్తమజన్మమై యొప్పుమురళి!
నధరమునఁ బూని జల్లల్లు మనఁగ జగతి
గానమును జేయు కల్యాణ కాంతు లొలుకు
తేజములకెల్ల తేజమా తేజ మదిగో!
అదిగో! యీమహానుభావునకు జన్మిచ్చినపుణ్యరాశి! ఆమె

చేయిపట్టుకొని నిమ్మళముగ మడుగునొద్దకు వచ్చుచున్నాఁడు. అచ్చటి యాబాలగోపాలమంతయు మహారోదనరావములతోఁ దమకుఁ గలిగిన మహాసంక్షోభమును వెల్లడించుచుఁ దల్లీ ! మమ్ము రక్షింపుము. అని దీనాలాపములఁ బ్రార్థించుచున్నారు. మడుగులోని కాలాహి యాకలకలమంతయు నాలకించి తీవ్రకోపోద్రేకమున విషవహ్నులను గ్రక్కుచున్నది. వ్రేపల్లెలోని స్త్రీపురుషులు భయకంపితులై యేడ్చుచున్నారు. అంత యశోద "నాయనా! కృష్ణా! నీవేమో మహిమములు గనఁబఱచితివని వీరు చెప్పుచున్నారు. నేనుగూడ వానిని జూచియే యుందును. చూచిన రవంతసే పెట్లో యుండును. ఆస్థితి యేదో నేను జెప్పఁజాలను. కాని యుత్తరక్షణమునుండియే యదియెల్ల మఱపు. కాని నాకా యనుభవముకంటె నాయనా! నిన్నొడిలోఁగూరుచుండఁ బెట్టుకొని తలదువ్వి పూలుదూరిమి శిఖిపింఛమును సవరించి బొట్టుపెట్టి నీమోమునకు దృష్టి తగులునేమో యనుభయమునఁ గన్ను లరవ్రాల్చి నిన్ను ముద్దుపెట్టుకొనుటవలనఁ గలుగుచున్న యీయనుభవమే యనేకగుణము లధికముగాఁ గానిపించుచున్నది. నాయనా! ఆర్ద్రహృదయనగుటచే వీరందఱుపడుబాధ చూడలేకుండనున్నాను. నీవేమో వారిని రక్షింపఁగలవని వారంద అనుచున్నారు. నేను నీతోఁగూడ వత్తును. నాతండ్రీ! వారిని రక్షింపఁగలిగినయెడల రక్షింపుము. పరోపకారముకంటె బ్రదుకున కేమి వినియోగము" అని శ్రీకృష్ణభగవానునితోఁ బలికెను. "ఆహా! పరకష్టనివారణమునకై కొడుకును బామునోటఁ బడుమని చెప్పుచున్న యీకాంతాలలామ ప్రపంచమున కలంకారముకాదా! ఆహాహా!" యని యాకాశవాణి పలికిన ట్లయ్యెను. అయ్యయ్యో! అదియేమి ? భూవలయము తిరిగిపోయినదే! తిరుగ మొదటిపార్శ్వ మెదుట గనఁబడుచున్నదే!

ఆహా! అదిగో శంకరభగవానుఁడు! "నాథా! నాథా! హాలాహాలమును మ్రింగుము మ్రింగు" మని శాంకరి భర్తను ప్రోత్సహించుచున్నది. శంకరుఁడు భయంకరస్వరూపుఁడై 'హా' యని నోరు తెఱచి హాలాహలమును కబళించినాఁడు. హాహా! అద్భుతము! అద్భుతము! మహాద్భుతమని యచటివారంద ఱుచ్చైస్స్వరమున నుచ్చరించుచు

మహాదేవశంభూ! మహాదేవశంభూ! యని ప్రార్థించిరి. హాలాహలభక్షణమున భగవానుఁ డెంత తపించుచున్నాఁడో యని వాయుదేవుఁడు పూలసురటిచే నాయనకు వీచుచుండెను. పారిజాతపరిమళభరితమైన చల్లనివర్షముచే నింద్రుఁ డాలోకేశు నభిషేకించుచుండెను. శాంకరీదేవి చల్లనిచూపులచే—బాష్పోదయముచే మఱెంత చల్లఁబడిన చూపులచేఁ గాంతునికిఁ దాపశాంతి చేయుచుండెను. భవుఁ డేమో బాధ నొందుచున్నాఁడని పైవారందఱు భ్రమపడుచున్నారు. కాని యాయనకు హాలాహలకీలాజాలబాధ యేమున్నది? ప్రపంచమునంతను గాల్పఁదగిన మహాగ్నిఫాలమున నడఁచిపెట్టిన మహాదేవునకు గొంతుక దిగిదిగని హాలాహలాగ్ని యెంత? ఆహా! శంకరదేవుఁడేమి మహాద్భుతదర్శనమిచ్చుచున్నాఁడు! తెలిచుగాఁ జూచుచున్న సురాసురలు సైతము డిల్లపడి కొయ్యలై నోళ్లుతెఱచి నిల్వుగుడ్లతో పులకీకృతాంగములతో ముకుళీకృతకరయుగ్మములతో భయవిభ్రాంతచేతస్కులయి యామహామూర్తిని దర్శించుచున్నారే. ఏమి చూచుచున్నారో తెలియకుండఁ జూచుచున్నారే. ఎంతసేపటినుండి చూచుచున్నారో యెఱుఁగకుండఁ జూచుచున్నారే. ఎవరు చూచుచున్నారో కూడ నెఱుఁగకుండఁ జూచుచున్నారే. అయ్యయ్యో! ఇంక రవంతసేపు చూచుభాగ్యము లేకుండ నయ్యయ్యో! భూచక్ర మట్టె తిరిగిపోయినదే. ఈసారి శీఘ్రముగాఁ దిరిగిపోయినదేమి చెప్పుమా!

ఆహాహా! రెండవపార్శ్వమున నదిగో మురళీకృష్ణుఁడు! అదిగో రాధాకృష్ణుఁడు! అదిగో గోపాలకృష్ణుఁడు. ఆహా! మడుగునొడ్డున నున్న కదంబవృక్షముమీఁదికిఁ జెంగుచెంగున నెక్కి గుభాలున మడుగులోనికి దుమికినాఁడు! అయ్యయ్యో! అయ్యయ్యో! కాళియనాగేంద్ర మానవనీతకోమలుని — శిఖిపింఛశిరోభూషణుని — ఆమందస్మితవదనుని — ఆతమాలపల్లవశ్యామలసుందరాంగుని — ఆయుపనిషద్వల్లరిప్రసవమంజరుని గఱచినది. అంతటితో సంతుష్టిపడక యాబాలకు నొడలిచుట్టు దాను గట్టిగ జుట్టుకొనినది. తటాకతీరమునుండి హాహాకారములు మిన్నుముట్టుచున్నవి. యశోదాదేవి కొయ్యయై పడిపోయినది. గుండెలు కొట్టుకొనువారు, తలవెంద్రుకల నూడలాగికొను

వారు, తలలు నేలఁగొట్టువారు, కృష్ణాకృష్ణా యని యఱచువారునై యచ్చటిజనమంతయు నొకకలవరమయినఁ బొందినది. ఎంత సంక్షోభమైనఁ జెందినది! ఎంత గగ్గోలైనఁ బడినది. ఆహా! గోవు లంబా యని యఱచుచుఁ గన్నీరు విడుచుచున్నవే. ఆహా! నల్లగనున్న బాలుఁ డాసమయమున నొక్కత్రుటికాలము సహస్రార్కసంకాశుఁ డయ్యె నేమి చెప్పుమా? అంత చిన్నపిల్లవాఁడు కదా! అట్టి మేనుపెంచి యంతలో విజృంభించి యిట్టి పొడుగై యొక్క తెప్పపాటు కాల మెంత పెద్దవాఁడై నాఁడో! కాని పామేమైనది? అతనికి విధేయమై శిరసొగ్గి నమస్కరించి యాతని కాళులయొద్ద దీనమై భగవత్కరుణకై వేచియున్నది. తెప్పపాటింకఁ బడుచుండగనే కృష్ణభగవానుఁడు పెంచినదేహమును సంకుచించి తిరుగ బాలకృష్ణుఁడైపోయినాఁడే! ఆహా! ఎంత దివ్యసందర్శనసేవ యెల్లవారికిఁ గటాక్షించుచున్నాఁడో! కృష్ణా! కృష్ణా!

"నీ వడవిం బగ ల్దిరుగ నీకుటిలాలకలాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడనట్టినిముసంబులు మాకు యుగంబులై చనుఁ
గావున రాత్రులైన నినుఁ గన్నుల నెప్పుడు చూడకుండ ల
క్ష్మీవర తెప్ప లడ్డముగఁ జేసె విధాత యిదేల క్రూరుఁడై."

యని పోతరాజుగారు సెలవిచ్చినారు. స్వామి సందర్శనసేవలో తెప్పపాటే ప్రతిబంధమై పోయెనని భక్తులు విలపించుచుండఁగా నయ్యయ్యో! తిరుగ భూవలయము తిరిగిపోయినదే! రెండవపార్శ్వము కన్నుల కెదుటఁబడినదే!

ఆహా! హాలాహలభక్షకుఁడైన శంకరుండు మహోత్సాహముల నాట్యమొనర్చుచున్నాఁడు. ఆహాహా! నేత్రపర్వముగ నున్నది. జటాజూటమందలి గంగలోని తరంగము లుబ్బెత్తుగ లేచుచుండ, తలపైనున్న బాలచంద్రుఁ డదటున కాఁగలేక యెగిరియెగిరిపడుచుండ, మహావేగసంరంభమున జాఱి దూరముగఁబడిపోవుదుమేమో యని సర్పహారములు సంకుచించి సంకుచించి మెడను రవంత గట్టిగఁబట్టుకొనియుండ, చేతనున్న లేడిపిల్ల తూలి పడిపోవుదునేమో యనుభయముచే నుత్తరీయమైన గజచర్మపుముడుతలలో నిఱికి దాఁగియుండ, మహావిష్ణువు పాంచజన్యధ్వానమున నుపాంగముపట్ట, బ్రహ్మ మృదంగవాదన సేవ యొన

రించుచుండ, శృంగిభృంగులు వింజామరలు వైచుచుండ, దేవేంద్రుఁడు తాళము వేయుచుండ, నంతరిక్షమున నప్సరసలు గీతములతోఁ బుష్పాంజలు లిచ్చుచుండ, "ఓమ్ఓమ్ఓమ్" అని నాదబ్రహ్మమగునట్లు మహతిపై నారదుఁడు శ్రుతిమీటుచుండ, లక్ష్మీపార్వతీసరస్వతులు మంగళపు టారతు లిచ్చుచుండ, జగదేకనటుఁడు—ఆహాహా! ధరణీచక్ర మదరుచుండ, తరణ్యాదిగ్రహములు చలనములు మాని యవలోకించుచుండ, తాండవించుచున్నాఁడే! ఆహా! ఆనాట్యవైభవమును గాంచుట కొడలి నిండ నింద్రునికివలెఁ బ్రాణులకుఁ గన్నులుండినయెడల—అయ్యయ్యో! అప్పుడే భూవలయము తిరిగిపోవుచున్నదే! ఈసారి మఱెంతశీఘ్రముగఁ దిరిగిపోయిన దేమి చెప్పుమా?

అదిగో రెండవప్రక్క కన్నులకెదుటఁ గనఁబడుచున్నది. వహవ్వా బాలకృష్ణుఁడు కాళియఫణీంద్రుని ఫణాగ్రమునం దెక్కి తాండవించుచున్నాఁడే! లోకైకసుందరా! ఆభీరవధూప్రియా! బృందావనవిహారా! నందనందనా! యశోదకిశోరా! వాసుదేవా! నమస్తే నమస్తే యనుధ్వను లెల్లయెడల వ్యాపించినవి. అవతంసభూషణమైన మయూరపింఛ మిట్టటుజోగుచుండ, గర్ణములందలి మద్దికాయలు గంపించుచుండ, మురళి యధరమును జేరి మ్రోఁగుచుండ, బంగారుగజ్జెలు గల్లుగల్లు మనుచుండ, సవ్యాపసవ్యపదఘట్టమును సహింపలేక నాగేంద్రుఁడు బుస్సుబుస్సు మనుచుండఁ దటాకతీరమందలి స్త్రీపురుషులచేతులతోఁ దాళములు వైచుచుండ, నావులు వత్సములు కన్నులు పూర్ణముగాఁ దెరచి చెవుల నిగుడఁబెట్టి తోఁకలెత్తి యొడళ్లుప్పొంగ రెప్పపాటైన లేకుండఁ జూచుచుండఁ దీరస్థవృక్షములందలి గరుడపక్షులు కృష్ణా యని కూయుచుండ, దృష్టిదోషము తగిలిపోవునేమో యని భయమొందుచున్న యశోద "నాయనా! ఇఁకఁజాలు, రావోయి నాతండ్రీ! ఎంతసేపు తాండవింతువు? కాళులు నొప్పులుపెట్టునయ్యా" యని పిలుచుచుండ, దేవతలు పుష్పవృష్టి గురియుచుండ, నాహాహా! శ్రీకృష్ణభగవానుఁడు తాండవక్రీడ సలుపుచున్నాఁడే! ఆహాహా! ఆహాహా! కాని అయ్యయ్యో! భూచక్ర మప్పుడే తిరిగిపోయినదే!

రెండవవైపున నాహా! ఆహా! శంకరదేవుఁ డింకను నాట్య

మొనర్చుచున్నాఁడే! మహాదేవశంభూ! మహానటకశిఖామణీ! నమో నమః నమోనమః"—అయ్యో! అయ్యో! అదియేమి? అప్పుడే భూమి తిరిగిపోయినదాయేమి? అప్పుడేతాండవ కృష్ణుఁడగపడినాఁడేమి! ఆహాహా! భూవలయ మతివేగముగాఁ దిరుగుచున్నది. ఎందుచేతనో! అదిగో తాండవకృష్ణుఁడు నమోనమః అదిగో తాండవశంకరుఁడు నమోనమః. అదిగో తాండవకృష్ణుఁడు అదిగో తాండవశంకరుఁడు. మహావేగాతిశయమున మహీచక్రము దిరుగుచున్నదే. ఆకృతి యస్పష్టమైనది నీలవర్ణము శ్వేతవర్ణము కలిసి గిరగిరతిరుగుచున్నవే! ఆహాహా! కన్నులు తిరుగుచున్నవి. తల గిఱ్ఱుమనుచున్నది. తిరుగఁ గన్నులు తెఱచుసరికి శంకరుఁడు లేఁడు కృష్ణుఁడు లేఁడు. ఒక్కటే వెలుఁగు కానఁబడుచున్నది! అదియెట్లున్నదో తెలియదు. వాని మొదలేదో తుదియేదో తెలియదు. ఆవెలుఁగును జూడలేకున్నాను. కన్నులు నేమోకాని యది పొడుచుచున్నట్లున్నది దానిని సహింపలేక కాఁబోలు కన్నులు తెఱచి చూడఁగ దాదాపుగాఁ గంట క్రింద నుదయించి వెలుఁగుచున్న సూర్యునికాంతి యద్దపుకిటికీగుండ గడిలో ప్రవేశించి వ్యాపించియున్నది. నాయనలారా! చాలసేపు నిద్రించితిని. ఆమాటయెందులకుఁ గాని యిప్పుడు చాలసేపు చెప్పితిని. క్షమింపవలయును.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# 3. శ్రీయాజ్ఞవల్క్యనాటకము

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! ఈలేఖ అనకాపల్లినుండి వచ్చినది:—

"సాక్షికి—అయ్యా నమస్కారములు. నేను దున్నపోతును విక్రయించుటకై తుమ్మపాలసంత కీనడుమను బోవుచుంటిని. ఉలాయశేఖరునిఁ బదునైదుదినములనుండి బాగుగా మేపుటచే నది బలిష్ఠమై యున్నది. దానిని బాగుగాఁ గడిగి యాఱఁబెట్టి నిగనిగలాడుటకై యొడలినిండ

నాముదమును రాచి, మెడను బలుపుంచి యాపలుపు చేతితోఁ బట్టుకొని బలాత్కారమున నిన్న తెల్లవారుజామున సంతకు లాగికొనిపోవుచుంటిని. ఎ ఏ యని యది యఱచుచు వెనుకడుగువైచుచుండ ముందున కీడ్చుకొనిపోవుచుంటిని. ఎ ఏ అనఁగా నేమైన నర్థముండునా యని మనసులో ననుకొంటిని. "ఎక్కడికి తన్నుఁ దీసికొనిపోవుచున్నావు ? ఎందులకుఁ దీసికొనిపోవుచుంటివి ? ఏమాత్రపు సొమ్ము నావలన సంపాదింతువు ? ఏమంత పెద్దమనుష్యుఁడవయ్యా ! ఏడువలేకపోయినావు వెనుకకు నడువు" మని దాని ఎ ఏల కర్థమేమో యని నేననుకొనుచు నడచుచుండఁగాఁ బ్రక్కనుండి వీచుచున్న గాలిచే నేదియో యొక తెల్లని రవంత పొడుగైన వస్తు వెగిరి దాని కాళులసందునఁ బడెను. అది బెదరి యెగిరిపడి నాచేతిలోని పలుపు గుంజుకొని పరుగెత్తికొనిపోయెను. దానితో నేను గనుచీఁకటిలోఁ బరుగెత్తఁగలనా ? పైసంతనాఁ డమ్ము వచ్చునని యెంచి దాని కాళులనడుమ నెగిరిపడినవస్తు వేదో పరిశీలించితిని. దాదాపుగా నొక్క యడుగు పొడుగున్నది. మూఁడంగుళముల వెడల్పున్నది. పైన నెఱ్ఱని త్రాడున్నది, అదియేదో కాగితపుఁగట్ట యని యనుకొంటిని. "దానిలోనివి నాయదృష్టవశమున ననేకసహస్రములు విలువగలసర్కారునోట్లు కాఁగూడదా? ఏమో నాయదృష్టమెటులున్నదో ఇరువదివేల రూపాయల నోట్లు దొరకఁగూడదా ? ఈదున్నపోతు నిఁక సంతలో నమ్ముట యెందులకు ? మనకుఁ గావలసినంత సొమ్మున్నప్పుడు విశాఖపట్టణపు పీరిసాని నుంచుకొనవచ్చును. కర్నాటకపు పేపరుమిల్లులో నూరువాటాలు పుచ్చుకొనవచ్చును. పశువులసంతపాట మనమే పాడవచ్చును. ఇంకను గొంతసొమ్ము మిగిలినయెడల మోటారుబండి కొనవచ్చును. అయినను నిరువదివేలే దొరకునన్న మాట యేమి ? లక్షరూపాయలనోట్లు దొరకఁగూడదా" యను నిన్నియూహములు ఇంకను మీకు వ్రాయుటకు లజ్జపడుచున్న మఱికొన్నియూహములు - తళుకు తళుకు మని మనస్సులో నొక్క తెప్పపాటుకాలములో___ ననఁగ___వంగి కాగిదపు బొత్తిని బైకిఁ దీసుకొనునంతకాలములోఁ గలిగినవి. ఆహా! మనస్సువేగ మేమనిచెప్పవచ్చును. ఆహాహా! కాగిదములు చూచుకొనినపిమ్మట నాఖేద మేమని చెప్పవచ్చును? ఎందులకో

యంతయేడుపు ! నాకిప్పుడు క్రొత్తగాఁ బోయిన దేమియు లేదే. పోయిన దొక్కఁడున్న పోతు. అదియైన నింటికే పోయినది. ఇఁక నేఁడు వెందులకో ? తగని యాశలు పెట్టుకొని యాయాశలు తీఱలేదనియా యిప్పు డేడ్చుట ? దున్నపోతునకు నాకు బారెఁ డెడమైన లేకుండ వీథిలో నేను బోవుచుండఁగా లక్షలకొలఁది విలువగల సర్కారునోట్లు నాకాళ్ల యొద్దకు గాలిచేఁ గొట్టుకొనివచ్చునని నే నడియాస లందవలసినదా ? నేనింత మూఢుఁడనై యున్నప్పుడు మాయిద్దఱిలో నిజమైనదున్నపోతు వెనుకనున్న జంతువా ? ముందున్న జంతువా ? యని నన్ను నేను కొంతసేపు మందలించుకొని యాకాగిదములలో నేమిసంగతు లున్నవో యని యప్పుడే యుదయించుచున్న సూర్యకాంతిసాహాయమునఁ జూచితిని. అవి వ్రాఁతకాగిదములుకాని యచ్చుకాగిదములు కావు. నాలుగైదుకంటె నెక్కువ లేవు. మొదటి పత్రములో మొదటి పంక్తిలో "శ్రీయాజ్ఞవల్క్యనాటకము" అని యున్నది. రెండవ పంక్తిలో రెండవ యంకమని యున్నది. మూఁడవ పంక్తిలో ప్రదేశము సుప్రియుని మందిరము—నాలుగవపంక్తిలో ప్రదేశము సుప్రియుఁడు యాజ్ఞవల్క్యుఁడు అని యున్నది. కడపటి పత్రమందు కడపటి పంక్తిలో ద్వితీయాంకము సంపూర్ణము. శ్రీ శ్రీ శ్రీ అని యున్నది. పాపము ! ఎవఁడో కవి పట్టణములలోఁ దినుటకుఁ బట్టెడన్నమైన దొరకక మాడుగుల ప్రాంతమందలి మన్నెపు జ్వరముచేఁ జచ్చిన బాగుగానుండునని యావైపులకుఁ బోవుచు దారిలో నీయంకమును బాఱవైచుకొనెనో! కాదేని యేమన్నెపు గవియో ఋణబాధ పడలేకయో కుటుంబపోషణ మొనర్చుకొనలేకయో, అనకాపల్లిస్టేషను సమీపమున రైలుచక్రముల క్రిందఁ బడి చచ్చినయెడల లోకమునకుఁ దనకుఁ దెఱపిగా నుండునని యీదారిని బోవుచు నీయంకమును బ్రమాదముననో బుద్ధిపూర్వకముగనో విడనాడి పోయెనో ? యేమియుఁ దెలియదు. అయినను నా కీగొడవ యెందులకు ? ఈకాగిదములుమాత్రము నాకెందులకు ? కాలుదున్నపోతుకొఱ కేడ్వవలసిన నేను గవికై యేడ్చుట యెందులకని తిరిగి మనస్సునకు బుద్ధిచెప్పుకొని వెనుకకు మరలి అనకాపల్లికి పోయితిని. ఎంతసేపును మనస్సునకు బుద్ధిచెప్పుకొనుటతోడనే మనుజుని బ్రతుకు కడతేఱిపోవుచున్నది గదా ! ఒక్కతప్పటడుగు—ఒక లెంపకాయ—తనదో పైవారిదో—

అంతే. బ్రతుకులో నంతకంటె సౌభాగ్య మేమియు నాకగపడుటలేదు. ఇంటికిపోయి "బావా ! దున్నపో తింటికి వచ్చినదటోయి" యని యడిగితిని. "నీవు వచ్చితివికాదా ? సంతోషమే" యని యాతఁడు నన్నుఁ బరిహసించెను. బందెలదొడ్డిలోఁ బడియుండెనేమోయని యొక పిల్లవాని నటకుఁ బంపి నాకు దొరకిన కాగిదములను మాబావ కగపఱచితిని. అతఁ డెగాదిగఁ జూచి సరే అత్తగారి యౌషధపుబొట్లములకై పనికివచ్చునులే యని పలికెను. "బాబయ్యా ! నా గాలిపడగకో" యని మాయన్నగారికుమారుఁ డాకాగితములు లాగగ వానిలో రెండు కాగిదములు చినిగిపోయినవి. అయ్యయ్యో ! ఇప్పుడు జరిగిన ఈయసందర్భ మాకవియే చూచియుండునెడల నాతఁ డెంతబాధపడియుండునో!" అప్పుడు నాభార్య యీవలికివచ్చి యాకాగిదములను జూచి—పాపము ఏభాషాసేవకుఁ డీగ్రంథము వ్రాసెనో ? ఈయంకము పోయినందుల కాతఁ డెంతఖేద మొందుచున్నాఁడో—నామాట విని యాకాగిదములను సాక్షి సంఘములకు భద్రముగఁ బంపుఁడు. సాక్షిలో నీసంగతి జంఘాలశాస్త్రి వెల్లడిచేయునెడలఁ దత్కవి సాక్షికి లేఖవ్రాసి పోయిన యీయంకమును దెప్పించుకొని సంతసించును." అని మాకు బుద్ధివచ్చునట్లు పలికెను. అందువలన మీకీ కాగిదములను బంపితిని. మీయిష్టానుసారము వాని నుపయోగపఱుపవచ్చును. చిత్తగింపవలయు. విధేయుఁడు. సాక్షి సంఘాభిమాని—

నాయనలారా ! ఈయుత్తరమును వింటిరా ! ఇదిగో యాజ్ఞవల్క్యనాటకమున ద్వితీయాంకము. ఈయంకములోని గాథకుఁ బూర్వమందలి గాథను మీకుఁ గొంతచెప్పినఁగాని యిది బోధముకాదు. కావున సంగ్రహముగ వెనుకటికథను జెప్పెదను. యాజ్ఞవల్క్యుఁడు బ్రాహ్మణవంశసంభవుఁడు. ఇతనితండ్రి బ్రహ్మరాతి ; తల్లి సునంద. ఈతఁడు మహాబుద్ధిశాలి, ఈతఁడు శాకల్యునియొద్దఁ గృష్ణయజుస్సును నేర్చుకొనుచుండెను. శాకల్యుఁడను మహాపండితుఁడు సుప్రియుఁడను రాజునకుఁ బురోహితుఁడు. రాజున కసాధారణమైనవ్యాధి యేదియో యుండెను. ఔషధసేవచే నది శాంతింపలేదు. అసాధ్యమగు నీవ్యాధిచేఁ దాను మరణింపక తప్పదని సుప్రియుఁడు ఖేదపడుచుండఁగా శాకల్యుఁ

డాతనియొద్దకేగి తాను జపహోమాదులవలన వ్యాధిని నిస్సంశయముగా నివారింపఁగలనని చెప్పెను. అట్టిశాంతిక్రియ లాచరింపుఁడని రాజు పురోహితుని బ్రార్థింపఁగ నాతఁ డట్లొనర్చుట కంగీకరించి, వాని నాచరించి మంత్రతీర్థమును దెచ్చి రాజున కిచ్చెను. దానివలన శాంతింప లేదు. కొంతకాల మిట్లు చేయఁగఁజేయఁగ శాంతించునని పురోహితుఁడు రాజును సమాధానపఱచెను. "మీరు పెద్దలుకావున మంత్రోదకమును దెచ్చియిచ్చుశ్రమము మీరు పొందవలదు. మీకు ముప్పదుగురు శిష్యులున్నారుగాఁబోలు. దినమున కొక్కశిష్యునిచే తీర్థమును బంపుఁ" డని రాజు పురోహితునితోఁ జెప్పెను. ఏదినమున నేశిష్యుఁడు తీర్థము కోటలోనికిఁ దీసికొనిరావలయునో ఆదినమున నాతఁడే హోమాది క్రియ లాచరించి తీర్థమును దీసికొనిపోవుచుండవలయునని పురోహితుఁడు శిష్యుల కాజ్ఞ యిచ్చెను. ఇట్లు కొందఱుశిష్యులు తీసికొనిపోయిరి. రాజున కెంతమాత్రమునువ్యాధితగ్గలేదు. ఒక్కదినమువయాజ్ఞవల్క్యుని వంతువచ్చినది. "గురూత్తమా! ఈదినమునఁ దీర్థము తీసికొని వెళ్లవలసినవాఁడను నేను. రాజొకవేళ నన్నుఁ బరాభవించునెడల నేనేమిచేయవలసినది ?" యని శాకల్యుని యాజ్ఞవల్క్యుఁ డడిగెను. "ఏమిచేయుట కేమున్నది ? నీవు తిరుగ రాజదర్శనమును చేయనక్కఱలేదు." అని గురుఁడు సెలవిచ్చెను. చిత్తమని సెలవుతీసికొని రాజునొద్దకు యాజ్ఞవల్క్యుఁడు తీర్థకలశము చేతఁబుచ్చుకొని పోయినాఁడు—ఆశిష్యునకు నా రాజునకు జరిగినసంభాషణ మీయంకములో నున్నది సావధానచిత్తులరై యీయంకమును వినుఁడు—చదివెను.

శ్రీ యాజ్ఞవల్క్యనాటకము—ద్వితీయాంకము.
ప్రదేశము—సుప్రియునిమందిరము.
ప్రవేశము—సుప్రియుఁడు—యాజ్ఞవల్క్యుఁడు.
సుప్రి—ఏమంటివయ్యా ?
యాజ్ఞ—నీవనినది సరిగా లేదంటిని.

సుప్రి—మంత్రతీర్థము నాయెడలఁబనిచేయకపోవుటచే మంత్రోదకమువలన వ్యాధికుదరనేరదని రోగపీడితుఁడనైన నేనునుట సహజమైయున్నదనుకొందును, పోనీ మంత్రశోధనము మాకెందులకు ? నేననినది

సరిగా లేదంటివి ? ఒప్పుకొంటిని. కాని నీవేషము సరిగానున్నదని నీవు చెప్పఁగలవా ! అదిసరిగా లేదని నేను జెప్పుచున్నాను. నీవేమిచెప్పుదువు ?

యాజ్ఞ—మంత్రశోధనము చేయఁదగదని యిప్పుడే చెప్పితిని కాదా ! అట్టి మంత్రశోధనమే తప్పయినప్పుడు మంత్రములు బ్రాహ్మణాధీనము లగుటచే బ్రాహ్మణశోధన మంతకంటె తప్పని యేల తెలిసికొనఁజాలవు ?

సుప్రి—మంత్రములు బ్రాహ్మణాధీనములే ! బ్రాహ్మణుని కధీనములుకాని నీకెట్లధీనములు! బ్రాహ్మణబాహ్యవేషమైన లేని నీవు బ్రాహ్మణుఁడ నని యెట్లు చెప్పుకొనఁగలవు ? చెప్పుకొని మమ్మెట్లు విశ్వసింపఁ జేయఁగలవు ?

యాజ్ఞ—రాజా ! నీవిశ్వాసముపైననే బ్రాహ్మణ్యము నిలిచి యుండలే దనుసంగతి నీవెఱుఁగనట్లున్నావు. బ్రాహ్మణ్యమున కంత దుర్గతి యింకఁ బట్టలేదు. ఈమాటలేల ? గురుసందేశమును నిర్వర్తింప వచ్చితిని. ఈతీర్థము దీసికొనుము. నేను బోయెదను.

సుప్రి—తీర్థకలశము దెచ్చినావా ? అబ్బ ! నీచేతిలోఁ బన్నీరుబుడ్డి యుండఁదగినది కాని తీర్థకలశ ముండఁదగినదికాదే ? నీవుచ్చరింపఁదగినది పద్మబాణమంత్రము కాని పంచాక్షరీమంత్రము కాదే ? బొట్టువైఖరి జుట్టువైఖరి కట్టువైఖరి చూడఁగ—ఓ—శృంగారపురుషశేఖరునివలెఁ గానఁబడుచున్నావే ? పరాకున మాయింటికి వచ్చితివి కాని బుద్ధిపూర్వకముగ వచ్చితివని నే ననుకొందునా !

యాజ్ఞ—బుద్ధిపూర్వకముగ రానిమాట సత్యమే. గురుబలాత్కృతిచే రావలసివచ్చినది. నిన్నుఁ జూడఁదగినపని నా కేమున్నది ? నావేస మెట్లున్న నీకేమి ? దాని నంతపరిశీలించుట నీకేల ? నీవు మూతిపైఁ వెంద్రుకలఁ జూచువాఁడవేనా ! కాలిపై జోడు చూచువాఁడవేనా ? పృష్ఠముపై గోఁచి చూచువాఁడవేనా? విద్యాబుద్ధులతో నీకుఁ బనిలేదా! ఆహా! ఏమి లలితుఁడవు? ఏమియింగితజ్ఞుఁడవు? ఏమిసరసుండవు ? నీవు ప్రభుఁడవై యుండుటచే నీదేశ మెంత యదృష్టవంతమైనది ! రాజా! పూర్వజన్మమున నే మహాపురుషనింద యొనర్చుటచేతనో నీవిప్పుడీ వ్యాధిచే బాధపడుచున్నావు—భద్రముగఁ బ్రవర్తింపుము.

సుప్రి—(వికటముగ నవ్వి) హే హే హే. మాయందకారణజాయమాన కటాక్షముచే దర్శన మిప్పించినవారు మహాపురుషులా పురుషోత్తములా! అవతారమూర్తులా! భక్తపాపవిచ్ఛేదకులా! లోకోద్ధారకులా? సెబాస్. నే నెంతధన్యుఁడ నైతిని. ఇది శివావతారమయినట్లా? విష్ణ్వవతారమైనట్లా? లేక రెండునా? ఏమహాకార్యము నాచరించుట కవతరించితిరి. మహాత్మా! మీభక్తమణు లందఱు మీకు నిత్యకైంకర్యాదులు సలుపుచున్నారా? సందర్శన సంభాషణ సంస్పర్శనాది సత్కారములచే వారిని సంభావించి సంతోషపెట్టుచున్నారా? వారు తమ యనురాగపూర్వకాదరణముచే నిత్యశోభనాదివైభవములతోఁ బుత్రపుత్రికాది సంపత్తితో......

నాయనలారా! ఇక్కడఁ గొంతకాగితము చినిఁగిపోయినది. తరువాతి గ్రంథమును జదువుటకు వీలులేదు. కావున యాజ్ఞవల్క్య చరిత్రమున నే నెఱిఁగిన తరువాతి ముఖ్యాంశములు మనవిచేసెదను—సుప్రియుఁడను రాజమహర్షి బాహ్యవేషమును దిలకించి యెంత యధిక్షేపించినను—యోగివర్యుఁడు సహించి యూరకుండెను. నీకుఁ దెచ్చిన తీర్థ మేమిచేయు మని నీయభిప్రాయమని ఋషి యాతని నడుగ, "అదిగో! అచ్చటఁ గనఁబడుచున్న కట్టుకొయ్యమీఁదఁ బోసి పొమ్మని రాజనెను — అంత మహర్షిశిఖామణి 'దివం మాలేఖీ' త్యాదిమంత్రము నుచ్చరించి, యాకట్టుకొయ్యపైఁ దీర్థమును బోసి చివాలునఁ బోయెను. రెండుఘడియ లగుసరికిఁ గట్టుకొయ్య కడిచెట్టై కొమ్మలతోఁ జిలువలతోఁ బలువలతో దివ్యపరిమళభరితములగు బహుసుందరపుష్పగుళుచ్ఛములతోఁ బుష్పములపై వ్రాలిన బంభరములతోఁ గలకలారవము లిచ్చుచున్న పక్షులతోఁ బ్రకాశించుచుండెను. దానిని రాజు గాంచి యత్యాశ్చర్యమగ్నమానసుఁడై కొంతసేపు నిశ్చేష్టుఁడై నిలువఁబడి యంత "అక్కటా! యాజ్ఞవల్క్య మంత్రోదకమున నీ కట్టుకొయ్య చిరకాలముక్రిందటఁ జచ్చి మోడైన యీకట్టుకొయ్య—యెట్లు బ్రదికి బాగుపడినదో! ఆతీర్థమువలన నేను వ్యాధిదూరుఁడనై యట్లు బాగుపడవలసినదేకద! నాబుద్ధిహీనతచే నట్లు కాలేకపోయితిని" అని యోగీంద్రపరాభవమునకై లెంపలు వైచు

కొని యాజ్ఞవల్క్యుని తిరుగ దనయింటికిఁ బంపుఁడని శాకల్యునకు వార్త నంపెను. యాజ్ఞవల్క్యుఁడు మొదటఁ దనకు గురువిచ్చిన బాస ననుసరించి నేను బోనని చెప్పెను. అంత రాజు శాకల్యు నింటికి వచ్చి యాజ్ఞవల్క్య ననేకభంగులఁ బ్రార్థించెను. శాకల్యుఁ డెన్నివిధముల నైనఁ దనశిష్యునకు రాజు ననుగ్రహింపుమని బోధించెను. ఆయన గుర్వాజ్ఞ వినలేదు. అంత శాకల్యుఁడు కోపోద్దీపితుఁడై "అవిధేయుఁడా! నేను నీ కిచ్చినవిద్యను నా కొసఁగి పో ఆవలికిఁ బో" మ్మని తీండ్రించెను. తీసికొనుమని యాజ్ఞవల్క్యమహర్షి యావిద్యను వాంతి యొనర్చెను. దానిని దిత్తిరిపక్షులు భక్షించిన హేతువున దానికిఁ దైత్తిరీయ మని పేరువచ్చెనని చెప్పెదరు.

యాజ్ఞవల్క్యయోగీంద్రుల చరిత్రములో నంశము లన్నియు నేను జెప్పఁదలఁచుకొనలేదు. ఆతఁడు పిమ్మట సూర్యోపాసన మొనర్చి విద్యను సంపాదించెను. ఆతఁడు శుక్లయజుర్వేదమునకు మూలపురుషుఁడు. శాకల్యుఁ డాతనికి మొదటనేర్చినవేదమును గృష్ణయజుర్వేద మనియందురు. కృష్ణయజుర్వేదమున మంత్రబ్రాహ్మణభాగము లొక క్రమము వరుస ననుసరించి కూర్పఁబడియుండక కలగపులగముగఁ గూర్పఁబడియుండి యస్పష్టార్థప్రయోజనములై యుండుటచే నీవేదము నకుఁ గృష్ణయజుస్సని పేరు వచ్చియుండుననియును, గ్రమమైనవరుస ననుసరించి మంత్రాదిభాగములు కూర్పఁబడి యుండుటచేతను నర్థప్రయోజనాది విషయక విస్పష్ట కాంతిచేతను యాజ్ఞవల్క్యవేదము నకు శుక్లయజుస్సని పేరు వచ్చియుండుననియుఁ గొందఱు చెప్పుచున్నారు. యాజ్ఞవల్క్యుఁడు జనకసభలో ననేక వైదికర్షులను. బ్రహ్మవాలములం దోడించి, బ్రహ్మిష్ఠుఁ డనుపేరు వడసెను. ఎందఱాళ్వారు లున్నను ఆళ్వారనఁగా నమ్మాళ్వారని యెట్లు రూఢ్యర్థమో యెందఱు యోగీశ్వరులున్నను యోగీశ్వరులనఁగా యాజ్ఞవల్క్యులనియే రూఢ్యర్థమున్నది ఈతఁడు మహాసంస్కర్త. అంతకుఁ బూర్వమున నున్న వేదక్రమాదులు సమంజసములుగ లేవని కనిపట్టి క్రొత్తపద్ధతితో పురాతనవస్తువుకంటె సమీచీనతరముగా నొకవేదమును రచియించు మహానుభావునివంటి మహాసంస్కర్త, మహాధీశాలి, మహాసాహసికుఁడు,

మఱియొక డేఁడి? తాను నూతనవేదమును రచియించుటయే కాక యధ్వరాదిక్రియలందు దాని నాచరణములోనికిఁ దెచ్చెను. శంకరభక్తు లీతనిని శంకరావతార మందురు. విష్ణుభక్తు లీతనిని విష్ణ్వవతార మందురు. సూర్యోపాసకు లీతనిని సూర్యావతార మని యందురు. యాజ్ఞవల్క్యశాఖలో ద్వైతు లున్నారు; విశిష్టాద్వైతు లున్నారు; అద్వైతు లున్నారు. ఈమహానుభావునికిఁ బదునేనుగురు శిష్యులని చెప్పుదురు. ఆశిష్యుల కందఱకు వారివారి యధికారము ననుసరించి తాను బ్రహ్మపదార్థబోధన మొనర్చెను. కాని యాశిష్యులలోఁ గాణ్వులు మాధ్యందిను లని రెండుతెగలవారే యిప్పుడు కానవచ్చుచున్నారు. కాణ్వులనే ప్రథమశాఖవారందురు. వీరి పూర్వుఁ డగు కణ్వుఁడు యాజ్ఞవల్క్యునకుఁ బ్రథమశిష్యుఁ డగుటచే నాతని తరువాతివా రందఱకుఁ గాణ్వులని ప్రథమశాఖవారని పేరు వచ్చియుండును. అదిగాక కణ్వుఁడు శిష్యసంఖ్యలో మొదటివాఁడే కాక యధికారములో నర్హతలో నాధిక్యములోఁ గూడ మొదటివాఁడని యెన్నవచ్చును. ఆతనికి యాజ్ఞవల్క్యుఁడు కటాక్షించినగ్రంథము లనేకము లున్నవి. మహామహిమగల మహోద్గ్రంథము లనేకము లున్నవి. వీనినామములు మాత్రమే యిప్పటికి నిల్చియున్నవి. అట్టి యుత్తమగ్రంథము లన్నియు నేమైనవో తెలియదు. ప్రథమశాఖాబ్రాహ్మణులని చెప్పుకొనువా రాగ్రంథము లేవియో ఎచ్చట నున్నవో యేమిప్రయత్నము లొనర్చినయెడల నన్నియుఁ గాకపోయినఁ గొన్నియైన లభించునో యనునంశము లేమియైన యోజించుచున్నారా? లేనట్లు కనంబడుచున్నది. ఏల! వారిలో బుద్ధిమంతులు తక్కువ సంఖ్యవా రున్నారా! లేరు. లేరు. వారిలోమహాబుద్ధిశాలు లనేకు లున్నారు. తగుమాత్రపు జమీందారీలు కలవారున్నారు. పెద్దపెద్ద న్యాయవాదు లున్నారు. గొప్పగొప్పవర్తకు లున్నారు. విద్యాధికు లున్నారు. విమర్శకు లున్నారు. దక్షిణహిందుస్థానమునం దనేక స్థలములందు ప్రథమశాఖవారు ప్రబలులైయున్నారు. ఉత్తర హిందుస్థానమున మాధ్యందిను లట్లేయున్నారు. మాధ్యందినులు తమకుఁ బూర్వులు కటాక్షించిన గ్రంథజాలమునంతయు భద్రపఱచియున్నారు. ప్రథమ

శాఖవా రేమిచేసినారు ? తమ గ్రంథములు తమవి కావని యూరకుండి నారు. అవి రామబాణముల కధీనములై యంతము నొందుచున్నపుడు మన కెందులకని మాటలాడక మిన్నకుండినారు. మీ గ్రంథము లేమైనవని యెవ్వరైన వారి నడిగినయెడల మాకెట్లు తెలియు నను చున్నారు. మా గ్రంథములు కొన్నియున్నవా యనుచున్నారు. ఆహా! ఏమి మతాభిమానము! ఎంత మతగ్రంథాభిమానము! సర్వభారతీయవిమర్శక మహాసభలలో యాజ్ఞవల్క్య గ్రంథప్రశంస వచ్చినప్పు డేగ్రంథములు ప్రదర్శింపఁబడి పరీక్షింపఁబడుచున్నవో యెఱుఁగుదురా? మాధ్యందిన గ్రంథములు మాత్రమే. కాణ్వగ్రంథము లేమైన నట్లు చేయఁబడు చున్నవా? లేవని చెప్పుట కితరశాఖీయులకే సిగ్గగుచుండఁగా ప్రథమ శాఖీయు లనిపించుకొనినవారు రవంత యులుకు నలుకైన లేకుండ నున్నా రేమిచెప్పుమా? వారిహృదయముల కొంచిత వారిమనస్సుల కాసంకోచము లేశమైన నున్నట్లగపడకపోవుటయేల! పోనిండు. పరశాఖీయులందఱు వారివారిమతగ్రంథములను సేకరించుకొని భద్ర పఱచుకొని వ్యాఖ్యానసమన్వితముగఁ జేసికొని మతసంబంధమైన కొంత పరిజ్ఞానమును సంపాదించుకొనుటకుఁ బ్రయత్నించుచుండఁగా సర్వ జనసామాన్యమైన గతానుగతికన్యాయమున నైన వీరేల ప్రవర్తింప కుండనున్నారో? మతగ్రంథసమీకరణము మతగ్రంథపూజ మతగ్రంథ భాష్యరచనము మొదలయిన పనులు దోషము లని యెంచి మన ప్రథమ శాఖీయు లింతయుపేక్ష యొనర్చుచున్నారా? ఇంతయనాదరణ మొనర్చు చున్నారా? ఇంతమతగ్రంథవైరాగ్యమును బూనియున్నారా? ప్రథమ శాఖీయసోదరులారా! అసాధారణమై దాదాపుగ నసహజమని చెప్పఁ దగిన మీయుపేక్షకుఁ గారణ మేదో నాకు దుర్జ్ఞేయమైయుండుటచేత గ్రుడ్డివాఁడు తడుముకొనునట్లు కారణములకై తడుముకొనుచున్నాను. క్షమింపవలయును. పాడుముడబ్బీబిరడ జాఱిపోయినయెడల దొరకిన దాఁకఁ దహతహలాడుదుమే. తులమెత్తు బంగారమునకు ముప్పది రూపాయలకంటె నెక్కువ విలువలేదుగాని తులమెత్తు మతగ్రంథస్థ పురాణతాళపత్రసమితికి మూఁడువేలు కావుకదా ముప్పదివేలు విలువ యుండునే! ఆహా! మనకాణ్వులు తమమతగ్రంథములు మసిబొగ్గు లను

కొనుచున్నారో? మునిసిపల్ తుక్కునుకొనుచున్నారో? తండ్రిగారిచ్చిన పట్టుభూమికయిన గాలానుసరణముగా కొట్టుసిస్తులఁగట్టి దానిరాబడి ననుభవించుచున్నామే. చిల్లిదైనసరే మెడయూడినదైనసరే తాతగారి యిత్తడిచెంబని దానిని భద్రపఱచుకొని బంధుకోటికి దాని నప్పుడప్పుడు గానఁబఱచి యానందించుచున్నామే. అయ్యో! కాణ్వులారా! మీకు మూలపురుషుఁడే! శ్వేతయజుఃకర్తయే! సార్థకయోగీంద్రనాముఁడే! మహా సంఘసంస్కర్తయే! ఆర్కావతారమే హార్యవతారమే. హారావతారమే! ఆహాహా! అట్టి లోకోత్తర ప్రతిభాశాలి దయాస్వరూపుఁడై జగదుద్ధారణార్థమయి లోకమునకు వెల్లడిచేసి తనభక్తులగు మీకుఁ గటాక్షించిన యమూల్యధనమును జ్ఞానభండారమును దేజోనిక్షేపమును. మీ రుపయోగించుకొననక్కఱలేదా? మీరు భద్రపఱచుకొననైన నక్కఱలేదా! పోనిండు. వానినామములైనఁ దెలిసికొనఁ బ్రయత్నింపరా? మాకక్కఱలేదని యడ్డముగఁ దలనూఁపుచున్నారా? అయ్యయ్యో! తప్పుకాదా. తప్పుమాట యటుంచుఁడు. ఆర్యస్వభావమునకుఁ గూడ విరుద్ధత కాదా? బట్ట తిన్నగ సవరించుకొమ్మని చెప్పిన కోడలిపై నత్తగా రాగ్రహించినట్లు మీరీమాటలకు నాపైఁ గోపపడక నన్ను క్షమించి నా ప్రార్థన నంగీకరించి మీ గ్రంథము లెచ్చటెచ్చటి దొరకునో తెలిసికొని యాతావులకుఁ దిరిగి తిరిగి యావశ్యకమగునెడల దేశమంతయు గాలించి యెంతధనమైన వ్యయమొనర్చి వానిని సంపాదించి కాణ్వమఠ మొక్కటి కట్టించి వాని నందు భద్రపఱుపవలయును. మీసంపాదనములలోఁ గొంతభాగ మీమహాకార్యమునకై వినియోగపఱుపఁదగును - పఱుపక తప్పదు. కాణ్వగ్రంథనిధి యనుపేరఁ గొంతసొమ్మును ముందుగాఁ జేర్చి దానిని గ్రంథసంపాదనకార్యమున వివియోగింపుఁడు. ఇదివఱకే యాలస్యమైనది. మాధ్యందిన గ్రంథముల మహాప్రచారమునుబట్టి కాణ్వగ్రంథములు లేనేలేవను నప్రతిష్ఠ మూలపురుషునివఱకు మీయుపేక్షమూలమున వ్యాపించినది. లేనివారు లేక యేడ్చుచుండఁగా నున్నప్పుడుకూడ మీకీదరిద్రతయేల? మీకీ క్షామబాధ యేల? "ఓహో! ఈగ్రంథములన్నియు సేకరించిన తరువాత నివియన్నియుఁ జదువవలసివచ్చునుగాఁబోలు. మాకుఁ దెఱపి యెక్కడ? సంచులమూఁతులకు తాళ్లుకట్టుటలోఁ దెఱపి లేకుండ మేము

దేవులాడుచుండఁగా తాటాకుపుస్తకముల త్రాళ్లువిప్పుటకు మాకుఁ దీటిక యేదీ? నెత్తికి విశ్వనాథతైలము మూఁతికి వాసిలైను దేహమునకు సబ్బు రాచికొనుటలోఁ గాలము కాసంతయు గడచిపోవుచుండఁగా మతగ్రంథములకు మసిపూయుటకుఁగాని మట్టితైలము రాయుటకుఁగాని మాకెక్కడ తెఱపి. మతగ్రంథములచదువా? మా కింతలో నంత తొందర యేమి గల్గినది? ఏమో కొంతకాలము బ్రదుకఁదలఁచియుండ మరణశాసనలేఖన మంతటి యోగాయిత్యపుపని మే మేల చేయవలయును? మాకీచదు వక్కఱలేదు." అని నన్ను గాఢముగ మందలింతురా యేమి? పోనిండు. మీయిష్టము చదువుకొనవలసినదని మీకు బోధించు నంతటి బుద్ధిహీనుఁడను గాను మీరు శ్రమపడి గ్రంథములనుమాత్రము సంపాదింపుఁడు. ముం దెప్పుడైన మీలో మతగ్రంథములు చదివి వానికి వ్యాఖ్యలు వ్రాసి వానిని విపులముగఁ జేయఁగల మహాధీమంతులు బయలుదేఱఁగలరు. వారి కక్కఱకువచ్చుటకే మీరీశ్రమ మొనర్పవలయును. మీరు బాగుగాఁ బరిశీలించునెడల నిప్పటికే మీలో మంచి బుద్ధిమంతులయిన విమర్శకులు బయలు వెడలియున్నారు. నాయనలారా! జన్మమాత్రముననే ప్రథమశాఖీయుల మనిపించుకొనక మతాభిమానమునఁ బాండిత్యమున మతగ్రంథసంపాదనమున యథార్థముగఁ బ్రథమశాఖీయు లనిపించుకొనుఁడు.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# 4. సభాస్వకీయవ్యాపారములు

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

"నాయనలారా! ఈదినమున నుపన్యాస మేదియు లేదు. మా సభావిషయకములగు నంశము లీనడుమ నెప్పుడు వెల్లడించియుండలేదు. సాక్షి కనేకలేఖలు సాక్ష్యుపన్యాస పఠకులయొద్దనుండి ప్రతిదినమును వచ్చుచుండును. వానిలోఁ గొన్ని యిప్పుడు చదివెదను. వానినిగూర్చి

నేను విమర్శింపను. విమర్శింపనక్కఱలేదు. వానిలోని నిజానిజములు గొంతకాలమునుండి మాయందలి దయవలన దీక్షతో—విమర్శన బుద్ధితో—నిష్పక్షపాతాంతఃకరణముతో మాయుపన్యాసములనుజదువు చున్న పఠకులకే తెలియఁగలవు. నేనంతకంటెఁ జెప్పవలసిన దేమియు లేదు. ఈలేఖ లేయూరనుండి వచ్చినవో యెవరు వ్రాసిరో మీకుఁ దెలుప నక్కఱలేదు. వానివిమర్శనమునందు మీకు సాహాయ్యము కాఁగలవను నమ్మికతో నాయుత్తరములతేదీలనుమాత్రము తెలియఁబఱచుచున్నాను."

"అభివాదములు. 10-3-22.

అయ్యా! మనస్త్రీల పూర్వాచారమును గురించి—ప్రస్తుతాచరణమును గూర్చియు—మీయభిప్రాయ మేమి? కొందరు జాకెట్లు కొందఱు గుండీరవికలు తొడుగుచున్నారు గదా! నేను ఒకటి రెండు ప్రశ్నించి సదుత్తరము (తృప్తికరముగా) బడయలేకపోయితిని. శరీరము ఇతరులకు కనుపించకుండా చేయుటకని వారివాదము. పూర్వులు మామూలురవికెలు తొడిగి కాసెబోసి చీరెకట్టినందున వారి పాతివ్రత్యమునకు భంగ మాపాదించెనా? ఇప్పటి నాగరికత ఆంగ్లేయులను బోలి యుండదా? కనుబొమలమధ్యను సూదిమొనలతోఁ బెట్టెడు (దృష్టిదోష నివారణార్థము బెట్టెడు) తిలకము ఏహ్యముగా నుండదా? అన్నివిషయములు విమర్శించు మీరలు ఈవిషయమున ఊరకుండుట సంతాపకరము. రాఁబోవు ఆంధ్రపత్రికలో ఈవిషయమై మీసాక్షిసంఘవిమర్శనోపన్యాసము చూచుట కుత్సహించుచున్నాను. మరియొక ప్రార్థన సాక్షి ప్రథమభాగమును పంపవలయునని ఎంతమంది పుస్తకవిక్రేతలకో వ్రాసితిని. చివరకు జబాబుగూడ లేదు. దయయుంచి వెంటనే ఈక్రింది చిరునామాకుఁ బంపఁ బ్రార్థితులు.

చిత్తగింపుఁడు.

ఈయంశములఁగూర్చి స్త్రీలనుగూర్చిన యుపన్యాసములలో శక్తివంచన లేకుండఁ జర్చించియుంటిని. కావునఁ దిరుగ విమర్శించుట యనావశ్యకముగఁ దోఁచుచున్నది. ఆజ్ఞోల్లంఘనమునకు మన్నింపవలయును. తరువాతి యుత్తరమును జదివెదను.

"విశ్వామిత్రుని నెత్తిగత్తిరించిన గత్తెర వసిష్ఠుని గడ్డముపై

నాడ వెనుకాడుచున్నది—లింగముపైఁ జుట్టపీక స్ఫురించినట్లు—పవన నందనుని తలపైఁ బెట్టఁబడుచున్న బావాజీగారి బంగిచిలిమిగొట్టము స్ఫురించుటలేదు. బోనము నెత్తికెత్తుకొని తాండవించురజకుఁడు తాండవ కృష్ణుని బోలక ప్రళయకాలరుద్రుని బోలుచున్నాఁడు. సాలగ్రామ మాలభక్తున కుండు................సౌష్ఠవము రుద్రాక్షమాల వానివక్షమున రూఢిగా గానిపించుటలేదు. మతాంతరులగు దేశభక్తులు సాక్షినోటఁ బడుటకు సద్వీరపాషాణప్రాయు లగుచున్నారు. భవిష ద్బ్రిహ్మావతారులైన కవులు మణిమంజరీ మధ్వవిజయాది గ్రంథములను మఱల సృష్టించుచున్నారు. మతసాంప్రదాయబోధక మహావాక్యములు పిచ్చిరాముని పిచ్చిరాతలైనవి. మహాత్మా! పాలలో పాపరకాయరస మును బిండుచున్నారు. పులి...మేక గఱచునా యని నిర్భయస్థితి నవలం బింపకుఁడు. విమర్శకులు మీజీవితకాలములో నూరకున్నను తర్వాత నైనను మీమతాభిమానదుష్పథమును వెలిబుచ్చకమానరు. జాగ్రత జాగ్రత!! మాఘ బ ౧౨ ౧౮౮౩"

నాయనలారా! మనవైషమ్యమును గూర్చియు సర్వమతసామ రస్యమును గూర్చియు ననేకపర్యాయములు కంఠము శోషిల్లున ట్లఱచిన నాపై నిట్టి కఠినవిమర్శనము తగునేమో మీరే యోజింపవలయును. ఇంతకంటె మీకుఁ జెప్పఁదగిన దేదియులేదు. తరువాతి యుత్తరము చదివెను.

అయ్యా! 24-2-12.

తమదర్శనం నేను యెన్నడూ చాయలేదు గాని నేటికి తమ యశశ్శరీరదర్శనం చేసి తమదర్శనలాభం యెప్పుడు తటస్థ మవునో అని భగవంతుని ప్రార్థిస్తున్నాను. నేను ఇదివరలో యీపేర్లు వగయిరాలు యెన్నడూ చూడడంలేదు. ఇప్పుడు అందరు చూస్తూవుంటే దీనిలో యేమివిశేషం వున్నదో అని నాకుకూడా కుతూహలంకల్గి గతానుగతికో లోకః అనేరీతిగా నెలరోజ్లనుంచి ఆంధ్రపత్రిక చూస్తూ వున్నాను. అత్యుత్సాహం—అతిప్రేమ—అతిభక్తి కల్గి మ్నమిచ్చుకున్న ద్రవ్యము- యెక్కువవిలువ యీవృత్తాంతమే చాలునని మిక్కిలి తృప్తినొందితిని. దీనిలో నీతి లోకవ్యవహారంలో ప్రతిఘానికి స్వానుభూతి దురాత్ములను

చల్లగా పండితరాయలువలెనే అన్యాపదేశంవున్నదిగాని లేనిదికాదు. స్వభావోక్తి నవరసభూయిష్టంగాను వుండుటచేత నాకు హృదయరంజకంగా వుండి యీమహాత్ములు యెవరు వీరివాసస్థలం యెక్కడ అని కొందరిని యిదివరలో పరిచయంకలవార్లను అడగగా భగవదనుగ్రహంచేత వీరికాపుర వాస్తవ్యులనిన్నీ తమది యెక్కువశక్తి అనిన్నీ మంచివాణి అనిన్నీ శ్రీరాజావార్కి తమయందు యెక్కువప్రేమ అనే మొదలయ్ని సంగతులు విని తమరు లోకోపకారార్థమయి నీతి నుపదేశించి సజ్జనరక్షణ దుర్జనశిక్షణ నిమిత్తం అవతరించినమహాపురుషునికళామయులని రూఢిగా నమ్మి యీదరఖాస్తు వ్రాసుకున్నాను. "స్వభావ మన్యథాకర్తుం కశ్శక్నోతి దైవనిర్మితం" అనులోకోక్తిని బుచ్చుకొని వ్నాం యేమిచాయగల మందురేమో. వాల్మీకిమహర్షికి మహాత్ముల దర్శనమాత్రంచేతనే ముక్తుండయినట్టు వింట్టున్నాము కదా! కాబట్టి తమరచనాసామర్థ్యంచేతనున్నా దైవకృపచేతనున్నా దుష్టబుద్ధి మంచిబుద్ధిలోకి రావచ్చును. బుద్ధులు రెండులేవు. ఒకటే అని తమరు మొన్న పేపరులో వ్రాయించినారు. గాన వ్రాసుకోవడమయినది. "అర్ని మిత్రం విషంపత్యం అధర్మోధర్మతాం వ్రజేత్, అనుకూలే జగన్నాథే విపరీతే విపర్యయః" అని వున్నది. తమశక్తి అమానుషశక్తి అని విన్నాను. చన్నపురిలో వైద్యంఆఫీసు పెట్టుకొని నడిపిస్తూవున్నవానిని గురించి తమయందు నిరాకరణభావం కనుపించగా అతనిమీద ప్రయోగించిన వాక్శరములచేత శబ్దవేదిబాణప్రయోగం చేత దుష్టశిక్ష చేశ్ని రామభూపాలునివలెనే యశస్సు తమకు అయినట్టు వింటున్నాను. కవర పంపించుకున్నాను. గాన వెంటనే జబాబు దయచేయింప్పకోరుతాను.

చిత్తగించవలెను.

మఱియొకలేఖ. 1-3-22

"మహారాజశ్రీ సాక్షిగారికి అనేకనమస్కారములు.

ఆంధ్రపత్రిక 1918 వ సంవత్సరాదిసంచికయందుండు 'ఆంధ్రకవుల యపరాధము' అను పద్యములను తాము చదివియుందురు. అందులో 28 వ పద్య మిట్లున్నది.

ఒకడు స్వప్నప్రకారము నుగ్గడింప
నెల్లవారలకు గలలె దెల్లవార్లు
నవ్వుదురను తలంపులే దెవ్వరికిని
వేరుకొన నేమిటికి నట్టి బీదకవుల.

మీసంఘసభ్యుఁడగు జంఘాలశాస్త్రిగారికి అనేకస్వప్నములు వచ్చు చుండఁగా ఆస్వప్నవర్ణనలవలన మమ్మందరిని సంతోషపరచుచుండిరి సంతోషపరచుచున్నారు. ఈపద్యము ఆయనకొరకే వ్రాసిన ట్లగపడు చున్నది. ఇట్లు వ్రాసినపిదపకూడ ఆయన స్వప్నములు తగ్గలేదు అధిక్షే పించిన వెనుకకూడ స్వప్నము తగ్గలేదు. అధిక్షేపించిన వెనుకకూడ స్వప్నములు వర్ణించుచునే యున్నారు. ఇందులకు కారణ ముండక తప్పదు. మేము మీసంఘమందు అభిలాషకలవార మగుటచే ఈపద్యము కేమిసమాధాన మిచ్చెదరో విన కుతూహలము గలవారై యున్నాము. 1918 వ సంవత్సరసంచిక ఈదిన మగపడినదా అని అధిక్షేపించెదరేమో. ఇదివరకే చూచితిమిగాని కొందరి ప్రోత్సాహమువలన ఈదినము వ్రాసి నాము. ఇందువెంబడిని ఇంకను కొన్నివిమర్శలు తెలుసుకొనవలెనని కుతూహలముగా యుండెను గాని దీనికే శ్రమ యిచ్చినందులకు చింతిల్లు చున్నాము. ఇంతే అనేక నమస్కారములు."

ఇందుకు వారు నన్నుఁగోరిన యంశమేదియో నాకు విస్పష్టముగఁ దెలియలేదు. తరువాతలేఖను జదువుచున్నాను.

అయ్యా, 8-3-23

పూర్వ మొకప్పుడు ఆయుష్కర్మ విషయమై కొంత తెలియపఱచ వలెనని మిమ్ముల నడిగినప్పుడు సవిస్తరముగా నాకేగాక యందఱకు తెలియు నట్లుగా సాక్షీమూలముగా తెలియపర్చిరి. చాల సంతోష మయినది. ఇప్పుడు మొన్నమహాశివరాత్రిని గుఱించి సారస్వతానుబంధములో వ్రాసిరి చదివి ఆనందించడమయినది. వచ్చేవారముకూడా యాశివరాత్రి గుఱించియే వ్రాయుచు యీ నేక్రింద వ్రాయబోవు దారుణపు నాత్మ హత్యనుగుఱించి విపులముగా వ్రాయ ప్రార్థితులు. మీపేర ఒకరు యీభోగట్టా వ్రాసినట్టుగా వ్రాయక మీరు చూచినట్టు—ఏకలలోనో చూచినట్లు—వ్రాయ ప్రార్థితులు..............................

ఇంక ననేకలేఖ లున్నవి. వాని నన్నియుఁ జదువుట కిప్పు డవ కాశములేదు. కావున మన్నింపవలయును.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# 5. శ్రీరామనవమి

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! రామా రాఘవా! రాజీవలోచనా! యని స్మరించుకొనుచు నిన్నరాత్రి నిద్రింపగ నొకమహావిచిత్రమైనస్వప్నము వచ్చినది. ఆస్వప్న మేదో మీకుఁ దెలియఁబఱుప నెంచితినిగాని యొక చిన్నయభ్యంతరము కలిగినది. ఖద్దరుటోపీని ధరించుటచేఁ గారాగృహ మునం దుండవలసివచ్చిన వాణీదాసుఁడు కారాగృహమునందే శ్రీరామ చంద్రునిపైఁ గొన్నిపద్యముల రచియించి యీలేఖతో నా కిప్పుడే పంపినాఁడు. లేఖను ముందుగాఁ జదివెదను.

"సాక్షికి—వాణీదాసుఁడు కారాగృహమునుండి యనేక నమ స్కారములు. ఇచ్చట ఖైదుకొట్టులో మిత్రబృందముతో సుఖముగా నున్నాను. అచ్చటి మీ క్షేమసమాచారములను దెలిసికొనఁ గోరు చున్నాను. ఎటులో సారస్వతానుబంధమును సంపాదించి జంగాలశాస్త్రి యుపన్యాసములన్నియు మామిత్రులకుఁ జదివి వినిపించుచున్నాను. వారందఱు సంతోషించుచున్నారు. నాగ్రంథములోని పద్యములు చదివి వినిపింపుమని వీరందఱు నన్నుఁ దఱచుగాఁ గోరుచున్నారు. కవి యన్న పేరేకాని రచియించినగ్రంథములు కనఁబడవు. కంకణబంధము చదివి వారికిఁ గొంతయర్థము చెప్పితిని. ఆవులించినవాఁ డొకఁడు— మూఁతిముడిచినవాఁ డొకఁడు—గోటిలో మట్టితీసుకొనువాఁ డొకఁడు- మూత్రపుగుండకై చూచువాఁడొకఁడేయైపోయెనుగాని యొక్కఁడైన శ్రద్ధగా వినలేదు. ఇదియేమికర్మమో, సరసమైన శ్లేషకవిత్వములోనున్న సొగ సొక్కఁడైన గ్రహింపలేకపోయెను. వారు విద్యాశూన్యులు

గారు. మందబుద్ధులుకారు. బియ్యేపరీక్షలో నుత్తీర్ణుఁడైన యుపాధ్యాయుఁ డొకఁడు, డిస్ట్రిక్టుమునసబుకోర్టు ప్లీడరొకఁడు ఏమియుఁ బని లేకుండ నన్ని పనులకుఁ దానే సిద్ధమై, యిల్లన్న మాటయైన లేకుండ నన్ని యిండ్లలోను దానే తిరుగుచు, ధనమన్న ప్రసక్తియైన లేకుండ నందఱి ధనమును దానే బదులురూపమునఁ దెచ్చి వాడుకొనుచు నన్నిరసజ్ఞతలు గలిగిన యొక జెంటిల్‌మ్యాను మాలో నున్నాఁడు ఆతనిని మేమందఱము 'జంటిల్ మన్' అని పిలుతుము. అతఁడు కొంత యాంగ్లేయ భాషాజ్ఞానము కలవాఁడగుటచేత నాంగ్లేయకవిత్వమునకు, నాంధ్ర కవిత్వమునకు భేదమేమియో తెలుచుగా నుపన్యసించుచుండును. అతని విశేషము లింక ననేకములున్నవి. అతనిసంగతి మీరు పూర్తిగా దెలిసికొనఁదగినదియే అది ముందెప్పుడైన వ్రాసెదను. అతఁడు మాసభలో నిట్లుపన్యసించినాఁడు. "ప్రియసోదరులారా! ఎల్లుండి శ్రీరామ జయంతి నేను చిత్రకార విద్యను బాగుగానెఱుఁగుదును. శ్రీరామ పట్టాభిషేకమును గోడపై గీచెదను. మీరందఱు నా పావిగ్రహమును బూజింపవలయును. వాణీదాసా! నీవు శ్లేషకవిత్వమును విడిచి శ్రీరామునిమీఁదఁ జమత్కారముగఁ గొన్ని పద్యములు వ్రాయుము ఆపద్యములు పూజానంతరమున నీవు శ్రీరామసన్నిధిని జదువవలయును. నేనుగూడఁ గొంత ప్రేయరు (prayer) ఆసమయమునఁ జేసెదను. ఈయుపన్యాసమును మేమందఱ మానందమున వింటిమి. అట్లుచేయుటకు సిద్ధపరచుకొంటిమి. నేను నిన్న రాత్రియంతయు మేలుకొని యీపద్యములను వ్రాసితిని. సాక్షిగారూ! మీరుచూచిన గాని యీపద్యములను నేను శ్రీరామసన్నధిని జదువను. మీరు చిత్తగించినపిమ్మట సాక్షి సభలో జంఘాలశాస్త్రిచే నొక్కమాటేపద్యము లన్నియుఁ జదివింపుఁడు. జదివినవెంటనే యీపద్యములను దిరుగ నాయొద్దకు బంపుఁడు. వ్యవధి తక్కువగా నున్నది. కావున వెంటనే చదివింపుఁడు ఈదినమున జంఘాలశాస్త్రియుపన్యాసపుగొడవ లేమియు జరిగింపకుఁడు" ఇక్కడకు వాణీదాసునిలేఖ పూర్తియైనది.

నాయనలారా! సంఘకవి యిట్లు వ్రాయుచున్నాఁడు—సంఘాధికారియగు **సాక్షి** యిట్లు సెలవిచ్చుచున్నారు. అనుసరించునది మిత్రుని

యిష్టము. జరుగునది సాక్షియాజ్ఞ చదువునవి శ్రీరామచంద్రునిమీఁది పద్యములు వినఁదలఁచినవారందఱు దైవభక్తులు. ఇంతకంటె గావలసిన దేమి. చదివెదను.

ఉ. శ్రీకరభూసురౌఘ సుర శేఖర శోకరసా కరోగ్ర బా
ధాకర భీకరాసుర మహారణదారణ మారణోగ్ర వి
ద్యాకఠినాశుగాశుగ ధరామలకోమల ధామలాల సత్
ప్రాకటహ స్తునంజన వి రాముని రాముని రాము నెంచెదన్.

సీ. హరువిల్లుతుత్తుము లౌనట్లు విఱిచియు
నీశుస్థాపించి పూజించినావు
ధారిణీపతివయ్యు ధారిణీసంజాతఁ
బరిణయంబునను జేపట్టినావు
ఇంద్రాదిసురరక్షకిలనుజన్మించియు
నింద్రజుతల నూడనేసినావు
తరుణికై రావణుఁ బరిమార్చియును సతి
వనవీధిఁ ద్యజియించి వైచినావు
ఏనరుండైన నిట్లాచరించునొక్క
యెటులొచేసినఁ గీర్తి దక్కించుకొనునె
దైవమవుకాన ధాటితో దాఁటిపోతి
వయ్య రామయ్య నిన్ను నేమందునయ్య!

చ. అసిత శుభాంగసుందరు, దరాభల సద్గళ ధారుధారుణీ
ప్రసవతనూసుతావదన పంకజ మంజుమరందసారు, సా
రససఖమానమాన పరిరక్షణ లాలసధీరు, ధీర రా
క్షసవిసర ప్రణాశకర కార్ముకరాముని రాముఁ గొల్చెదన్.

సీ. బొమ్మఱాబొమ్మను బుత్తడిబొమ్మయా
ఋషికొమ్మఁగాంగఁ జేయించినావు
పాదుకాద్వయముచేఁ బ్రబలరాష్ట్రం బవ
లీల మేలిమిగ నేలించినావు
పర్వతసంఘుంబు పాథోధిజలమున
జిల్లులాగునఁ దేలఁ జేసినావు

క్రోతులచే నెల్లుగోడ్లచే దానవా
హానాహావములఁ జేయించినావు
ప్రకృతినొంచితివని మోదపడునె? సీత
కొఱకు బారుమంటివని నేఁగూడ నేడ్వ
నే? భవత్తత్త్వము నెఱుంగ నెందుగొఱకొ
నమ్మితిని తండ్రి నీదుచిత్తమ్ము పిదప.

ఉ. ఎప్పుడు భూమిఁబుట్టితివొ యెప్పుడు జానకిఁ జెట్టఁబట్టితో
యెప్పుడు కానమెట్టితివొ, యెప్పుడు రావణుఁ గిట్టఁగొట్టితో
అప్పటి గాథలన్ని జనులందఱ చిత్తములందు గట్టిగా
ముప్పిరిపేట నల్లుకొనిపోయెనహా యెటువంటివాఁడవో?

సీ. హస్తలాఘవముచే హరునివిల్లొక్కటి
వింటిజోడుగను జూపించినావు
చరణలాఘవముచేఁ జాఁపఱాబండను
దాపసాంగనగాఁగ జూపినావు
కనుకట్టువిద్యచే మునుముట్ట రణసీమ
శ్రీరామశతకోటిఁ జేసినావు
మదికట్టువిద్యచే ముదిమ్రుచ్చు మునులకుఁ
జేడెలపోడము జేసినావు
ఐంద్రజాలికుఁ డగుదేమొ? యడిగినాఁడ
మాటవరుసకుఁ గాని నిర్మలజగద్వి
పులత మజ్ఞానుకంటె నీ మోసమునను
గట్టుపడువాఁడె ధన్యుఁడుగాఁ దలంతు.

ఉ. కూరిమి విప్రబాలకుని గోఁతిని బ్రోచితి నంచుఁ బైకిఁగా
దూరక లోన దీమసము నొందెదవేమొకొ? నన్నుఁ బ్రోవగా
నేరవు నిన్నుదాటి చనునేరము లే నొనరించినాఁడ నీ
గోరను బోవుమంచుఁ గనుగొందము ముందటి పొద్దులేమొకో?

సీ. వీథిపురాణంపు వేదికపై నీవు
పారాయణపుఁబీటపైన నీవు

దృశ్యప్రబంధంపుఁ దెరలసందున నీవు
మృతివార్త శ్రుతిఁబడ్డయెడను నీవు
గొల్లసుద్దుల రేకుడొల్లలందున నీవు
యక్షగానపుఁ జిందులందు నీవు
చండాలుచేనున్న మొండితంబుర నీవు
తోలుబొమ్మల సంతగోల నీవు
పడుకగదులగోడల నీవు భక్తహృదయ
రసనలను నీవు యాయావరతను నీవు
సృష్టి నీమయమో నీవు సృష్టిమయమొ
యెట్టులైనను నాకేమి? యేమినీకు?

సీ. తారకమంత్రంబు ధరకిచ్చి పఠియించి
యాదిత్యహృదయంబు నాలమందు
సత్యాచరణ ధైర్యశాలివై కల్లనే
రమునకై విడిచితి రమణినడవి

నాయనలారా! మూఁడవపాద మేదో తెలియకుండనున్నది. కావుఁ దరువాతి పాదమును జదివెదను.

పితృవాక్యపాలనవ్రత మిల బోధించి
కొడుకులచే వ్రేళ్లుపడితి వకట
రామ! నినుఁబోలె నీచరిత్రంబుగూడ
మొదలు తుదిలేనిదై యిలఁ బొదలనేల?
ఇంతకంటెను దిక్కు వేఱెదియు లేక
ప్రాఁకులాడుచు నీకాళ్లఁ బడితినయ్య.

సీ. సర్వరాష్ట్రములోష్ట సమముగా విడనాడి
బంగారులేడికై పఱచినావు
మృతిని జీవితుఁజేయు ప్రతిభచేఁ బ్రథితుఁడ
వనుజుమూర్ఛకు నల్లలాడినావు
ధర్మసంగర కళాదక్షుఁడవై యుండి
దొంగపోటున వాలి దోర్చినావు

అవనిజాచోరునినైనఁ దిట్టకయుండి
కట్టల్కఁ బిట్టలఁ దిట్టినావు
ఇంత సందర్భశూన్యమై యొసఁగనేమి ?
త్వచ్చరిత్రంబు నాకవిత్వంబుఁ బోలె ?
తెలియలేమి నాతప్పని పలుకుదేమొ ?
తెలియ నీకుంటమాత్రము దేవ ! యేదొ ?
సీ. బ్రహ్మోపదేశంబు వాల్మీకి కొంచినాఁ
డేనది కలనైన నెఱుఁగనయ్య
నీగురుండగుటచే నిన్నెఱుంగువసిష్ఠుఁ
డించుకైనను నాకు నెఱుకలేదు
తనవెంట గాధేయముని త్రిప్పుకొనె నిన్ను
నే నిన్ను మదిఁ జేరనీయలేదు
జయదేవముఖకవుల్ సాహితీసంపన్ను
లామాట మాయొద్ద ననఁగరాదు
ఇంతకంటె వేఱొకపని యెదియులేక
పాదయుగ్మంబు గట్టిగాఁ బట్టుకొంటి
చేతనగునెడ రక్షింపు చేతఁగాదొ ?
ఇదిగొ గొలుసు కాలికిఁ దగిలింతు రమ్ము.

నాయనలారా ! పద్యములన్నియు నైనవి బాగుగా నున్నవా (ఉన్నవి-కాని కడపటిపాదము సవరించినయెడల మంచిదనుకేక) సరే వీని నిప్పుడే వాణీదాసునకుఁ బంపుదును.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# 6. శ్రీరామనవమి—విచిత్రస్వప్నము

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

రామా రాజీవలోచనా యని స్మరించుకొనుచు నొకరాత్రి శయనింపఁగ నొక విచిత్రమైన స్వప్నము వచ్చినది. దానిని గ్రిందటిసారియే

మీకుఁ దెలుప నిశ్చయించితిని. వాణీదాసకవి రచియించి పంపినపద్యము లాదినముసఁ దప్పక చదువఁదగిన వగుటచే నాయుపన్యాస మింతవఱకు నిలుపఁబడినవి. ఆస్వప్న మేదియో యిప్పుడు చెప్పెదను—వినుఁడు.

నాయనలారా! తెల్లవాఱినపిమ్మట రానున్న శ్రీరామజయంతి నెట్లు జరుపుదునాయని మనసులో యోజించుకొనుచుఁ బండుకొంటిని. క్రిందటి శ్రీరామజయంతికి మదరాసులో నుంటిని. ఈసారి సత్యపురములో నుంటిని. మదరాసులో దొరకినపుష్పములు—ఫలములు—సత్యపురములో నెట్లు దొరకును? అచ్చట జరిగించుకొనిననాఁటి యుత్సవవైభవము రేపు సంభవించుట కవకాశము లేకపోయెనే! రామా రాజీవలోచనా! నీయుత్సవము నీవే జరిగించుకొనుము. నాచిత్తమున భక్తి లేదు. చేతఁ బైసలేదు. ఒడల శక్తిలేదు. వ్యర్థుఁడను బుద్ధిహీనుఁడను. చిలుకవలె నీనామము నప్పుడప్పుడు స్మరించుట తక్క నంతకంటె నాచేత నేమియుఁగాదు. రామా! రక్షింపు. రక్షింపు మని మనసులో వెఱ్ఱిమొఱ్ఱిగ ననుకొనుచుఁ బండుకొంటిని. అట్టియట్టె ఱెప్పలు దళసరి యెక్కినవి. తల తేలికయైన ట్లుండెను. మనసులో నేదియో యీఁదుచు నీఁదుచు దిగిపోవుచున్న ట్లుండెను..........................

మఱికొంతసేపటికిఁ గాబోలు నే నొక యిసుకతిప్పపైఁ గూరుచుంటిని. అష్టమీచంద్రుఁ డాకసమున వెలుఁగుచున్నాఁడు. ఎదుట వార్ధి ప్రబలతరంగపంక్తులచే ఘూర్ణిల్లుచున్నది. వెనుకవైపున నరుణపాషాణరచితమహాభవనపంక్తు లుత్తుంగగోపురములతోఁ బతాకములతోఁ బ్రకాశించుచున్నవి. గాలి యన్నివైపులనుండికూడ వీఁచుచున్నట్లున్నది. తొమ్మిదిగంటలరాత్రి యైయుండు నని యనుకొంటిని. మదరాసులో శ్రీరామజయంతిచేసికొనుట కలుగకపోయినదనిజాగ్రదవస్థలో విచారించిన హేతువుచేత మదరాసునకు వచ్చినట్లు కలగనుచున్నా నని కలలోనే నిశ్చయపఱచుకొంటిని. ఆహా! ఇంతవఱకు మంచిదే కాదా? కల కల యని తెలిసికొనుట ఘనత కాదా? కాని యాజ్ఞానము నిలువఁబడవలయును. అదియే నిలువఁబడినయెడల నీకఁ గావలసిన దేది? అట్లు నిలువఁబడదు. జగద్వ్యాపారముకంటె మహాస్వప్నము మఱియే మున్నది! అది వట్టిస్వప్నమను నిశ్చయనిర్నిద్ర నిరంతరజ్ఞానమున్న

వాఁడు లోకాతీతుఁడు కాఁడా? కొందఱి కట్టిజ్ఞానము స్వల్పపూర్వ పుణ్యవశముచే - సద్గురుబోధముచే - గష్టపరంపరానుభవముచేఁ గలుగును. కాని యది మెఱుపువలె నిలువఁబడదు. చెకుముకిఱాతిపై బలాత్కారమునఁ గలిగిన విస్ఫులింగమువలె వెంటనే మాయమగును. అది మాయమైన పిమ్మట మఱింత గాఢాంధకారమగును. అజ్ఞానము ద్విగుణీకృతసాంద్రత్వముతో నావరించును. భార్యాపుత్రాదులు కేవల స్వప్నగతపాత్రము లని పలుకువా రనేకు లున్నారు. అట్టివారికే యింటిలో నెనమండ్రు ప్రత్యక్షపుఁబిల్లలు. గూడెములోఁ దొమ్మండ్రు రహస్యపుఁబిల్లలు. కనకరత్నాదివైభవము లన్నియు నెండమావులనువా రనేకు లున్నారు. అట్టి వారికే యింటిలోనిడెల్ల పేళ్లుచెక్కిన కనకపాత్రములు పెట్టెలోని వెల్ల రూపాయకు రెండణాల ధర్మవృద్ధితోనున్న తనఖాపత్రములు. ప్రపంచ సుఖములన్నియు కేవల మాయాకల్పితములను మహానుభావు లనేకు లున్నారు. అట్టివారికే నిత్యసేవకై పంచబాణరసఘుటికలు. అనిష్ట గర్భవిచ్ఛిత్తికై గోసాయిచిటుకలు. సర్వప్రపంచచర్య స్వప్న మని నిశ్చయించుకొనువానికంటె నిజమైన జ్ఞానియేఁడీ? నిజమైన ముక్తుఁడేఁడీ? పిచ్చివాఁడు తాను పిచ్చివాఁడ నని గ్రహించినవెనుక జ్ఞానికంటె భిన్నుఁడా? భాగ్యవంతుఁడు తాను భాగ్యవంతుఁడ నని గ్రహించినపిమ్మట నానందస్వరూపుఁడనుట కేమైన సందేహమా? అజ్ఞుఁడు తా నజ్ఞుఁడ నని గ్రహించినపిమ్మట విజ్ఞానమూర్తియే కాఁడా? స్వస్వరూపగ్రహణమైన తరువాత రాగ మెక్కడిది? మోహ మెక్కడిది? బంధ మెక్కడిది? కాని యట్టిగ్రహణము నిలుచు మార్గమేది? మనస్సునకట్టి స్థైర్యమేది? బుద్ధి కట్టి బింక మేది? యేనుఁగుతొండమును జేతఁబట్టుకొని కదలకుండ నిలుపవచ్చును! గాజుపలకమీఁద పాదరసమును గదలకుండ నాఁపవచ్చును. మనస్సులోనిచాంచల్యమును స్థంభింప సాధ్యమగునా? సంసారములోనివంక సంవరింపవచ్చును. కుక్కతోఁకలోనివంక కుదుర్పవచ్చును. మనస్సులోనివంక మాప సాధ్యమగునా? పనికిమాలిన యన్నింటిలోను బనికిమాలినది మనస్సు—సిగ్గుమాలిన యన్నింటిలోను సిగ్గుమాలినది మనస్సు—నీతిమాలిన యన్నింటిలోను నీతిమాలినది మనస్సు—దానికదియే సాటి. కాని నాయనలారా! నా కీ కప్పదా యెందులకు? దేనిని

గూర్చి చెప్పదలంచితిని. ఏమి చెప్పుచుంటిని. మదరాసుతీరమునఁగలిగిన స్వప్నమును జెప్పవలసినవాఁడనైన నేను మన స్తత్త్వమున గలిగినసంకటములను జెప్పుచున్నానే ! మనస్సున కా కాకిచెమ్మలవైఖరి యున్నప్పుడు మనయిష్ట మేమున్నది ?

నాయనలారా ! మదరాసులో సముద్రతీరమునఁ గూర్చుంటిని. నిముసనిముసమునకు బడబడబడబడమను తరంగములధ్వనితప్ప మఱియేధ్వనియును విస్పష్టముగఁ గానరాకున్నది. ఇంత నిర్జనస్థలమున నే నొక్కఁడ నెందులకు ? పట్టణములోనికిఁ బోవుదునని నిశ్చయపఱచుకొని లేచితిని నాబుద్ధిహీనతకాని పట్టణములో నేమున్నది ? లేనివాఁడు లేదనియేడుపు ఉన్నవాఁ డంతకంటె నెక్కువ లేకపోయెనే యని మఱింతయేడుపు. బోదసౌభాగ్యాలచేతఁ గాలీడుపు, క్రుళ్లు వాసనచేత ముక్కు మోడుపు. మగవారిలో ననేకు లశక్తులగుటచే మగువలు మొగముమాడుపు. అంతకంటెఁ బట్టనములో నే మున్నది ? ప్రకృతి సౌందర్యసౌభాగ్య ప్రధానరంగమైన వారిధితీరమును విడిచి లెట్రీను పెట్రోలియపు దుర్గంధములతో నిండిన "మెట్రాపాలిస్" యని నేను దేవులాడుట యెందులకో ? నిజమైన కారణమేదియో చెప్పనా ? సృష్టిసౌందర్యమును గాంచి సంతసించుటకు నాకుఁ గవితాశక్తి లేదు. అన్నప్రాశనమే కాని యక్షరాభ్యాసము లేనియాతఁడు కాఫీ హోటలువంకఁ జూచునా ? గ్రంథాలయమువంకఁ జూచునా ? కవిత్వమున్నవాఁ డీతేజస్సు సౌరభము రుచి చలువగల యీప్రదేశమును విడిచి దుమ్ముధూళి ధూమము దుర్గంధముగల నగరములోనికిఁ బోవ యత్నించునా ? నాయనలారా ! అటుచూడుఁడు. ఇద్ద ఱెవరో ప్రకృతి సౌభాగ్యాస్వాదన తత్పరులు—జగత్సౌందర్య సాహితీసంపన్నులు—అష్టమిచంద్రసౌరభము నాఘ్రాణింపఁగ—శీతలవాతపోత సౌందర్యము నవలోకింప నుత్తుంగతరంగరంగత్సౌభాగ్యము నభిష్వంగ మొనర్ప—అఖిలజగదాధారుని యనంతశక్తి నానందగీతపుష్పాంజలులతో నారాధింపఁగాఁబోలు—నాహాహా ! ఆపుణ్యమూర్తులిద్దఱు పరమహేయమైన పట్టనమును వదలి పరమసుందరమైన యీప్రదేశమునకే వచ్చుచున్నారుకదా ? సెబాస్ ! ఇఁక నేను బట్టనములోనికిఁ బోవుట

కంటెఁ దెలివిలేమి యున్నదా యని మనసులో నూహించుకొని వారిద్ద ఱను సమీపింప యత్నించితిని గాని అదియేమి? నేను సూటిగ వారి కెదురుగఁ బోవఁగ వారు నన్నుఁ దప్పించుకొనుటకు గాఁబోలు ప్రక్క కేగుచున్నారే! సత్పురుషుల నేల వదలిపెట్టవలయునని నేను తిరిగి యటు పోవఁగ వారు గిరుక్కున నిటు మఱలుచున్నారు. ఇది యేమివింత? నాయం దామహాత్ముల కంత యలక్ష్య మేల? అల క్ష్యముకాక వారికి లక్ష్యమేల యుండవలయును? స్నానమొనర్చిన వారు మలీమసాంగుని సమీపింతురా? పవిత్రాంతఃకరణులు పాప చిత్తులఁ దఱియుదురా? సత్యాలాపులు మిథ్యావాదిని చేరుదురా? విద్యావంతులు శుంఠను జూతురా? కవులకు విమర్శకునియం దెంత యసహ్యమో చెప్పవలయునా? అటులే వారు నన్నుఁ జూచి యేవ పడుచుంటిరని నేనెంచితిని. అదేమికర్మమో కాని వారు నన్నుఁ దప్పించు కొనిపోఁదలఁచిన కొలఁదివారెవరో తెలిసికొనవలయునని పట్టుదల నా కెక్కువయగుచున్నదే! (Mere Fisherman) అనుమాటలు నాకు గాలివాటమున సులువుగా వినఁబడినవి. నేను జాలరి నని వా రనుకొను చున్నారని యెంచితిని. ఇంతలో No No అను మృదులాలాపములు వినఁబడినవి. ఆహా! తంబురతీఁగగాని యేకునారకాదే? గంటకాని లోడుగుకాదే! ఇద్దఱుకూడ మగవారనుకొంటిని. ఆయిద్దఱిలో నొకతె కాంతయాయని వితర్కించుకొని భార్యాభర్తలుగాఁబోలు వారిని సమీ పించుట యెందులకని చివాలున మొగ మావైపునుండి త్రిప్పుకొని నాదారిని నేను బట్టణములోనికిఁ బోవుచుంటిని. కాళిదాసుఁడు చెప్పినట్లు దేహమే ముందునకుఁ బోవుచున్నది కాని మనస్సు వెనుకచూపే చూచు చున్నదే! వారు నిజముగా భార్యాభర్తలై యుండినయెడల వారు నన్నుఁ దప్పించుకొనిపోవుట కంత యాత్రపడనేల? పవిత్రతకు భయ మునకుఁ జాలదూరమే. వాలుచూపులు నక్కుటక్కులు ప్రక్కకొత్తి గిల్లుటలు తప్పించుకొని తారుటలు నెదుటఁబడుటకు జంకుటలు మొద లగు లక్షణములు భార్యాభర్తల పవిత్రశృంగారమున కుండునా? 'ఇమి లేవను' దంపతులకే యిన్నిపోగాలము లని నిశ్చయపఱచుకొని గిఱు క్కున మఱలిచూచితిని. నేను బోయితి నని నిశ్చయపఱచుకొని కాఁబోలు

వారిద్దఱు కొంతదూరము నడచి దట్టమైన మొక్కలచాటునఁ గూరుచుండిరి. నేనటకుఁబోయి కొంత సమీపమునఁ గ్రీనీడను నిలువఁబడి వారిని జూచితిని. వారు నిజముగాఁ దస్కరదంపతులనియే నిశ్చయపఱిపుఁడు, వారికర్మమున వారు తిరుగుచున్నప్పుడు నేను వారి యొద్దకుఁబోయి యేల చూడవలయునని—వారిరహస్యములతో నాకేమి పనియున్నదని— నా కామాత్రపుబుద్ధి యప్పు డేల లేకపోవలయునో యని నాకిప్పుడు మిగుల ఖేదముగా నున్నది. కాని నాయనలారా! స్వప్నచర్యకు నేనెట్లు బాధ్యుఁడను? కేవలము బాధ్యతలేదని త్రోచివైచుటకుఁ గూడ వీలులేదేమో. అయ్యయ్యో! ఆపురుషుఁ డెవఁడో చెప్పుమా? యేఁబదియావకాయలు పట్టఁదగిన కుండయంత తలతోనున్నాఁడు. ఆతనితలపై నెత్తిగ నదియేమి? 'పిత్ టర్ బెన్' కాబోలు! వహవ్వా! 'హైకోర్టులో' సాక్ష్యమనుకొంటివా? 'లెజిస్లేటివ్ కౌన్సిలుమీటిం' గనుకొంటివా? నీమొగమీడ్వ? అర్ధరాత్రమున సముద్రతీరమునందుఁ దేఱయిల్లాలితోఁ జెట్లచాటున సరసమేడ్చుటకు జేరిన నీకు జీలుగుబెండు బుట్ట నెత్తిమీఁద నెందులకురా? ముద్దులకు రశీదు లీయవలయునేమో అణాబిళ్లలు Fountainpen కూడ జేబులోఁ బెట్టుకొనియే వచ్చితివా? ఆహా! స్ఫోటకపుమచ్చలచే నిండిన యాతని మోము క్రొత్తగ గంట్లువైచిన తిరుగలిని ధిక్కరించుచున్నదే! ఛీ! ఛీ! చూచుట కసహ్యముగా నున్నది. అదిగో రోలంత బోదకాలు—ఆతనికి వయస్సు దాదాపు ఏఁబది యుండును. కాని యాతని కుడిబుజముపై చేయివైచుకొని యాతని యెడమబుజముపై మొగము పెట్టుకొనియున్న యాబంగారుబొమ్మ — యామనుష్యరూపశంపాలత — యాలావణ్యమూర్తి-యెవ్వతెయో? కట్టు బొట్టు జుట్టువైఖరి చూడ నామె శ్రీవైష్ణవి యని తెలియుచున్నదే. ఆసోగకన్నుల మిలమిలలు—జిలజిలలు—ఓ—ఉత్తరపుగోసనున్న 'హైకోర్టుమీఁది' విద్యుద్దీపకాంతిని సాగతీసి దౌడపై కొట్టునట్లున్నవే? నాయనలారా! బ్రాహ్మణాబ్రాహ్మణవైరప్రధానరంగమైన యీపట్టనములో నీయబ్రాహ్మణున కాబ్రాహ్మణికంతమైత్రి యెందులకో యను స్వప్నసంబంధమైన సందర్భశూన్యతకే బ్రశ్నించుకొంటిని. 'పాలిటిక్సు' లోనేగాని 'యిరాటిక్సు' లో వారికట్టి

శషభిషలు లేవుకాఁబోలునని కలలో నాకు నేనే ప్రత్యుత్తర మిచ్చుకొంటిని. ఆహా! స్వప్నవైచిత్రికి సాటి మఱియొకటియేది? వారిట్లు సంభాషించుకొనుచున్నారు.

వైష్ణవి—పిళ్లగారు 'ఆర్ అందు సన్సు' లోని 'నెక్లెసు' మాటయేమి?

పిళ్ల—ఎంతసేపు నెక్లీసని — కమ్మర్ బందని — రిష్టువాచి యని వేపుకొని తిందువేకాని యొకముద్దీయవుకద.

వైష్ణవి—మాటలువదలకుండ ముద్దులు లభించు ననుకొంటివేమి? గెటప్ వేళ యగుచున్నది. మావారు వెలింగ్టనునుండి యింటికి వచ్చువేళ గావచ్చినది.

పిళ్ల—నీభర్త వట్టిబ్లాక్ హేడ్—ఆ Fool ను బాగుగా టోపీ వేయుచున్నావు.

వైష్ణవి-నేను నాభర్తను మోసముచేయుచున్నాననుచున్నావా!

నీభార్య నిన్ను మోసముచేయుట లేదనుచున్నావు కాఁబోలు. ఇచ్చటికి రెండుపర్లాంగులదూరముననున్న రేవులో నీయిల్లాలు Soldier తో చెట్టపట్టములు వైచుకొని తిరుగుచున్నది.

పిళ్ల—హాహాహా (నవ్వును) విట్టీ. వెరివిట్టి—వెల్‌రిటార్టెడ్ ఏదీ! ఒకముద్దు.

ఆసౌందర్యవతి మల్లెపూ వికసించినట్లు మందహాస మొనర్చుచున్నది. గడ్డ మినుమంత పైకెత్తి మూఁతి రవంత పొడుగు చేసినది. ఇఁక నాశృంగారవతి యీనిర్భాగ్యుని ముద్దిడుకొనును. చూడుము చూడుమని కాబోలు నొకనక్షత్రము మఱియొకనక్షత్రమునకుఁ గన్నుగీఁటుచున్నది. చంద్రుఁడు తారావార్త జ్ఞప్తికిరాగఁ జుంబనదర్శనోత్కంఠచే నాకస్మికముగ నడ్డువచ్చిన మేఘమునుండి యొక్కఁడుముకు దుమికినాఁడు. గాలి యేమోకాని రవంత స్తంభించినట్లున్నది. పిళ్లగారు—బంధమువైచినపిమ్మటఁ బొలుపిదుకుటకు సిద్ధముగనున్న గొడ్డిగేదెవలె కదలకుండ నిలువఁబడినాఁడు. ఈసన్నివేశమును జూచి నాకు నవ్వువచ్చినదేమో నేను జెప్పఁజాలను. కాని యాకాంత నన్నుఁ జూచి కెవ్వుమన్నది. పోనిండు. అప్పుడైన నే నక్కఁడినుండి యొక్కఁడ.

కైనఁ బోవచ్చునా? పోవుట కెందువలననో కాని కాళ్లాడినవికావు. దొంగ దొంగయని పిల్లగారు నన్నుఁగాంచి కేకవైచిరి. "పిల్లా! దొంగవు నీవా నేనా? ఈమె నీభార్యకాదుకదా! ఈమె నిచ్చటకుఁ దెచ్చిన దొంగవు నీవా నేనా? ఏల వెఱ్ఱిమాటలాడెదవు. పోపో! అమ్మా! నీభర్త వెల్లింగ్టనునుండి వచ్చువేళయైనది. శీఘ్రము మింటికిఁ బొమ్ము. ఇఁక నెప్పు డిట్టు లాచరింప నని యాసముద్రముతో నొట్టుపెట్టుకొనుము. మావాణీధాసుని కుక్కయైననీతని మూఁతిమీఁద మూత్రించుట కసహ్యపడునే. అట్టి వీనిని ముద్దుకొనుటకు సిద్ధపడుచున్నావు. నిన్నే మన వచ్చును." అని నేను వారిద్దఱితో నంటిని. అప్పుడు పిల్ల "నిన్ను 'ప్రాసిక్యూటు' చేయింతును నీపేరేమి?" యని నన్నడిగెను. నాపేరు జంఘాలశాస్త్రి యని చెప్పితిని. నాపేరు వినుటతోడనే వారిద్ద ఱదటి పడినట్లు నాకుఁ గానఁబడెను. ఎందులకో నాకప్పటికిఁ దెలియలేదు. 'సాక్షి' సంఘములోని జంఘాలశాస్త్రివేనా యని యాసుందరి నన్నడిగెను. ఔనౌనని ప్రత్యుత్తర మిచ్చితిని. దోషము లేనిచోటనైనను దోష మారోపణముచేసి నీవు చెడమడదిట్టు భావముకలవాఁడవే. నీవు మమ్ము వదలిపెట్టుదువా, మమ్ము బ్రదుకనిచ్చెదవా? మమ్ము రచ్చచావడి కెక్కింపకుందువా ? ఛీ ఛీ! నీవిఁకఁ జావకతప్పదు. అని యా పిల్ల నాతోఁబలికి అంతలో సీతారామ్ అని కేకవైచెను. ఆహా! రామనామ మిప్పటికైన వినఁబడినదా? జేపే శ్రీరామజయంతికదా. రామా రాజీవలోచన! అని కేకవైచితిని. కమింగ్ అని కేకవైచుచు నొకబొందిలి వచ్చెను. ఆతఁడు మహాబలాఢ్యుఁడు. వారి మోటారు బండిని తోలువాఁడని గ్రహించితిని. నీయొద్ద పిస్తోలున్నదా యని పిల్ల యాతని నడుగ నున్నదని చెప్పెను. ఆతనిపిస్తోలును దీసికొని 'ఈదెబ్బతో సాక్షిసంఘముపైస' లని పిల్ల నానుదుటిపైఁ జేల్చెను. ఆదెబ్బతో మేల్కాంచితిని. మేలుకొని చూడగ నింటికప్పునుండి పెంకు ముక్క నుదుటిపైఁ బడినదని గ్రహియించుకొని—దెబ్బకేమికాని— ఆహా! యెంతపనికిమాలిన స్వప్నమువచ్చినదో? శ్రీరామచంద్రమూర్తిని మనస్సున గాఢముగా స్మరించుకొని పండుకొంటినే! రామా రాజీవ లోచనా యని పదేపదే స్మరించుకొనుచుఁ బండుకొంటినే! రామచంద్ర

మూర్తిని గూర్చి స్వప్నము కలుగునేమో యని యెంత యాసరైన పడితినే. తుద కీదిక్కుమాలిన స్వప్నమా వచ్చినది! తుదకు శ్రీరామభగ వానుని గూర్చి కల కలుగలేదు. కాని వైష్ణవరామనుగూర్చి కల వచ్చినది. రాజీవలోచనుఁడగు రామప్రభునిగూర్చి స్వప్నము రాలేదు. కాని రాజీవలోచనయగు రామనుగూర్చి స్వప్నము వచ్చినది. కలల కేమి కొదవ యని యందురుకాని నాయనలారా! కలలుమాత్రము మంచివి కాంక్షించి నప్పుడెల్ల కలుగునా? రామా! రాజీవలోచనా! దుస్వప్ననాశనా! రక్షిం పుము. రక్షింపుము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# 7. రైలు ప్రమాదము హిమవన్నగరప్రాంతప్రదేశప్రభావము

---

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! పదునైదుదినముల క్రిందటి శనివారమునాఁడు సాయంకాలమున మదరాసులో బయలుదేఱి యేలూరు వచ్చుచుంటిని. బెజవాడకు రైలుబండి వచ్చుసరికే మామూలువేళకంటె నిరువది నిముసము లాలస్యమైనది. బెజవాడలో బండి యాఁగవలసినసేపటికంటె నెక్కువసేఁ పాఁగి బయలుదేఱినది. బండి బెజవాడ వదలుటయేమి? నేను -|తిరుగ కన్నులు మూసికొని పండుకొనుటయేమి? కన్నులు మూసికొన్నపిమ్మట నాల్గునిముసము లయిన కాకుండనే బండి యాఁగి పోయినది. బండి యాఁగుటయేమి? తిరుగ నేను గన్నులఁ దెఱచుట యేమి? 'గాడీ కాహీకు ఖడీగయీ' యని యొక లబ్బేసాహేబు సిగరెట్టు ముట్టించుకొని తనకు సమీపమున నున్న శకటద్వారము నొద్దకుఁ బోయి తొంగిచూచుచు నిలువఁబడెను. ఇంతలో నొక విశ్వబ్రాహ్మ ణుఁడు కాఁబోలు నావెనుకప్రక్కనున్న బల్లపైఁ బండుకొన్న యాతఁ డులికిపడిలేచి బెజవాడస్టేషను వచ్చినదికాదా యని కన్నులు తెఱచి

యున్న న న్నడిగెను. రాను వచ్చినది దాఁటను దాఁటినదని నేనంటిని! అయ్యో! అయ్యో! ఆమాత్రము రవంత చెప్పలేకపోయినావఁటయ్యా. యని యాతఁడు వృథగ నన్ను నిందించెను. ఆహా! జనుల నింద లకుఁ గారణలేశమైన నక్కఱలేదు కాఁబోలు. ఆతఁడు బెజవాడలో దిగునని నాకెట్లు తెలియును? తనకిష్టమయినపనియే పైవారు చేయ వలయునని తన కనిష్టమయినపని నెల్లరు మానవలయునని తన సదు పాయమే పైవారు చూడవలయునని తన యసదుపాయమే యెల్లరు నిరాకరింపవలయునని లోకము తనకొఱకే సృష్టింపఁబడినదనియు మనుజున కెంతగర్వము! ఎంతమౌఢ్యము! ఎంతయహంభావము! ఎంత పరనిరసనబుద్ధి! ఎంతతలతిక్క! ఎంతకొసవెఱ్ఱి! ఇట్లు నాపైఁ గోపపడి యాస్వర్ణకారకుఁడు మూట నెత్తిమీఁద బెట్టుకొని దిగఁబోవుటకు యత్నింపఁగ నాతని ప్రక్కనున్న యాతఁ డాతని నాఁపెను. ఇంతలో గార్డు, వానికి సహాయుఁడును జెటియొకదీపమును జేతఁబట్టుకొని బండి ప్రక్కనుండియే యింగ్లీషున మాటలాడుకొనుచు నడచుచుండిరి. వారి మాటలలో 'accident' అనుమాట నాచెవినిబడినది. యంత్రమేభాగము నందైనఁ జెడిపోవుటచే బండి యాఁగిపోయి యుండునని నే ననుకొంటిని. ఇంకను గదలలేదేమి యని మఱికొందఱు విసుగుఁదలతో లేచి తలుపుల యొద్దకుఁ బోయి తొంగిచూడఁబోయి టంగునదెబ్బలకొసయో యేమేకు కొసయో తలకు దగులఁ దలపై చేయిపెట్టుకొనియే వంగి వీక్షించు చుండిరి. ఎప్పు డీబండి లంఘునాలబండియేరా యని యొక్కవర్తకుఁడు కాఁబోలు నావులించుచు ఎమ్. ఎస్. ఎమ్. ఆర్. కంపెనీ, బి. ఎన్. ఆర్. కంపెనీవార లందఱ నొక్కటే కట్టకట్టి వారిపైఁ జిల్లరచిల్లరగాఁ గాక టోకుటోకుగాఁ గోపపడి వెంటనే ముసుఁగిడి గుఱుకపెట్టెను. ఇంతలో నెవఁడో బండిక్రిందఁబడి చచ్చినాఁడయ్యా యన్నవార్త కర్ణా కర్ణికగ వచ్చెను. బండి నడచుచుండఁగా బండిలో నున్నవాఁ డెవఁడో క్రిందఁబడి మరణించియుండునా?. యని కొంద ఱడిగిరి. బండినుండి పడినవాఁడు బండిక్రిందఁబడుట కవకాశము లేదని యెఱుఁగరు కాఁబోలు నని యొక ప్రకృతశాస్త్రవిద్యార్థి ప్రకృతిసూత్రపాండితీగర్వమునఁ గాఁబోలు ప్రత్యుత్తరమిచ్చెను. ఒకఁడు కాఁడు మృతిచెందినవా రిద్దఱు.

ఇద్దఱని మఱియొక కేక వినఁబడెను. ఇంతలో మాబండిలోని జను లందఱు నాతోఁగూడఁ గ్రిందికి దిగిరి. చచ్చినవారిద్దఱుకారు ముగ్గురు ముగ్గురని మఱికొందఱ కేకలు వినఁబడెను. చుట్టలు సిగరెట్లు కాల్పు నలవాటుకలవారు బండిచక్రముల క్రింద కళేబరఖండము లేవైన గనఁబడునేమో యని జేబులలోని యగ్గిపెట్టెలు వెలిగించిరి. ఇంతలో లాంతరుదీపముల సాహాయ్యముచే నాపనియే గార్డును వాని తరువాతి యుద్యోగియు మఱియొకవైపున నుండి చేయుచుండిరి. "మే మయిదు గుఱము బయలుదేరితిమి. నే నొక్కఁడనే మిగిలితిని. తక్కిననల్వురు చచ్చిపోయినా రయ్యో దేవుఁడా" యని యొకఁడు గట్టిగా నేడ్చెను. ముగ్గురుకాదు నల్వురు నల్వురని జనులంద ఱాకేకవైచినవానియొద్దకుఁ బరుగులిడిరి. మీ రెవరు ? ఎందులకు బయలుదేరితిరి ! మీలో స్త్రీ లెవరైననున్నారా ? నీకు మరణించినవారంద ఱేమి కావలయును ? ఎక్కడకుఁ బోవుచున్నారు? బోయినవా రేమాత్రపు వయసుగలవారు ? వారియొద్ద వెండి బంగారువస్తువు లేమైన నున్నవా ? రైలుబండి మీమీఁదఁ బడఁబోవుసరికి మీకది యెంతదూరమున నున్నది ? వంతెన కది యడ్డుగా వచ్చినప్పుడు వంతెనక్రిందికైన దుముకలేకపోయినారఁ టయ్యా ! యని యెవరికిదోఁచిన ప్రశ్నము నర్థానర్థావశ్యగత లేకుండ వా రాహతశేషు నడిగిరి. ఏడ్చుచున్నవాఁడు పాప మేమిచెప్పఁగలఁడు ? చెప్పిన వినియోగ మేమున్నది ? ఆప్రశ్నముల కుత్తరము లాతఁడు చెప్పినపిమ్మట వారందఱు మొదటిసారికంటె రెండవసారి యంతకన్న నెక్కువసంఖ్యగల ప్రశ్నములు వేయరని యేమినమ్మక మున్నది? ఏడ్చు చున్నయాతని జూచి కొంద ఱోదార్చిరి. పెద్దపొణకయంత లావుగ నున్నయతఁ డొక్కఁడు తాను గూర్చుండి బండిదిగక దిగిన నల్వురయి దుగురస్థలము తానే యాక్రమించుకొని బండిలో విశాలముగఁ జాఁచు కొని గూరుచుండియే "ఏమోయి ! అదేపనిగ నెందుల కేడ్చెదవయ్యా ! బుద్ధిలేనిపని చేసినందులకు నోరు మూసికొని యనుభవింపక యేడ్చెద వేమి? బండి కడ్డేల రావలయును ? ఆమాత్రము తెలియనక్కఱలేదా ? చాలుచాలు ఊరకుండు" మని తలవాచున ట్లామృతావశిష్టుని చీవాట్లు పెట్టి గద్దించెను. ఆహా ! నరులలో నెట్టి విచిత్రప్రకృతు లున్నవో

యని యనుకొని యాతఁ డెవఁడో యాతని మొగముకూడ బుద్ధి వలెనే యున్నదేమో కనుగొందమని యాతని మొగము పరిశీలించు చుంటిని. ఇంతలో నచ్చటిసంఘమున నున్నయొకఁడు శకటమార్గ పార్శ్వ మున నున్న కంకఱరాలలో నొకటి తీసి యాస్థలిష్టునిపై విసరెను. ఆతని ప్రేటు సూటిగఁ దగులలేదనికాఁబోలు సానుభూతితో వేఱొకఁడు మఱియొక ఱాతిని విసరెను. ఆ! ఆ! అని యాతఁ డఱచుచు లేవఁబోవు చుండ ముమ్మాఱు మర్యాదను నిలువఁబెట్టుటకుఁ గాఁబోలు మఱి యొకఁడు మఱియొకబెడ్డను విసరెను. అక్కడ బెడ్డలకేమికొదువకాని, యీబెడ్డమాత్రము మత్స్యయంత్రమును గొట్టిన యర్జునుని బాణము వలె నాతనికంటిపైఁ గొట్టగ నాతఁడు "అమ్మయ్యో! అమ్మయ్యో!" యని యేడ్చెను. ఆయేడ్పు నాలించి "ఏమోయి! అదేపనిగ నేడ్చెద వెందు లకు? తెలివితక్కువపని చేసినందులకు నోరుమూసికొని యనుభవింపక యేడ్చెదవేల? ఆడగూడనిమాట యేల యాడవలయును? చాలుచాలు ఊరకుండు" మని జనసంఘమునుండి యొకఁడాతని గట్టిగనదల్చి గాంభీర్యం చెను. ఇంతలో వేఱొకబండి ప్రక్కనుండి శివశివా! రామరామా! హా హా హా హా! అల్లా! అల్లా! యనునాలాపములు వినఁబడినవి. అచ్చటి కందఱు పోయిరి. గార్డుచేతిలోని దీపకాంతి సాహాయ్యమునఁ జూచిరి. తునుకలైన కాళులు చేతు లవిగో! అయ్యయ్యో! అచ్చటినేల రక్తముతో నెట్లుతడసియున్నదో! అబ్బ! అబ్బ! అదేమి? కడుపులోని కోశములు ప్రేవులు నీవలకు వచ్చి యచ్చట తట్టెడంత ప్రోగుగాఁ బడియున్న వే—ప్రోఁ గొక్కటియే కాదు. అచ్చట మఱియొక్కటి యున్నది. రామ రామ రామ రామా? ఎట్లుగ నల్లగ తెల్లగ నదియేదో మఱియొకరంగుగ—శ్రీహరి శ్రీహరి! ఒడలు జలదరించుచున్నది. గుండె నీరైపోవుచున్నది. అని యెవరికిఁ దోఁచినట్లు వారు విలపించి యాభీభత్సదర్శనమున కాఁగలేక యెవరిబండిని వారెక్కుటకుఁబోయిరి. ప్రాణమనఁగానెంత! యనియొకఁడు. నిముసమునకు వచ్చెడిసంగతి తెలి యదుగదాయని యొకఁడు, మృత్యుదేవత వారి నచ్చటి కట్టీడ్చుకొని వచ్చినదని యొకఁడు, ఆఘటములు కంతటితోనే సరియని యొకఁడు, అన్నియుఁ గనిపట్టిన యాసీమదొరలు చావులేకుండఁ గనిపట్టలేకపోయి

నారేమో యని యొకఁడు, ఈరైలు రాకముందు మనదేశములో నిట్టి దుర్మరణములు లేవని యొకఁడు, వింతసుఖములతోడనే వింతకష్టములు వృద్ధియగునని యొకఁడునై యిల్లైవరికిఁ దోఁచిట్లు వారు మనుష్యజీవనముపై లఘువ్యాఖ్యానములు రచియించుచుండిరి. నామేనమామ మూఁడులక్షలరూపాయలు పెట్టి పెద్దమేడ కట్టించినాఁడు. ఆయనకుఁ గొడుకులు కూఁతులు మనుమలు నల్గురు మొదలగు కావలసినంత బంధువర్గముండెను. ఇంటిలోఁ జల్దియన్నమునకు మూఁడుకుంచాల బియ్యము వారెడివి. ఆతఁ డొకనాఁ డూరివెలపలికి షికారుపోయి యాకస్మిక మూర్ఛచే విఱుచుకొని పడి పశువులు నడచుపుంతలో నీవు నేను మాటలాడునంతలోఁ బ్రాణములను విడిచినాఁడు. ఊరిలోమూఁడులక్షలరూపాయల మేడయేమి! ఊరివెలుపల బొమ్మచెముడుకంపల ప్రక్కను నేలపైఁ జావేమి?" యని యొక యబ్రాహ్మణవితంతువు తనమాతుల మరణగాథను సంక్షేపముగఁ జెప్పి కన్ను లొత్తుకొనెను. ఆమాటల కర్థము తెలిసికాఁబోలు లబ్బిసాహేబుగారు "అమ్మా! మట్టిమీఁద మర్ జానా ఒకటే తక్తుమీఁద మర్ జానా ఒకటే ఫరక్ లేదు. ఇందుకు ఫార్సీకవి ఇసీ మొవాఫిక్ సెలవిచ్చినాఁడు.

జహాఁ. అయిబిరాదర్ నమానద్ బకస్
దిల్ అందెరె జహాఁ ఆఫరీన్ బంద్ ఒ బస్
మకున్ తెక్య బర్ ములుకెదున్యావా పుష్త్
కె, బిస్యార్ కస్ చోఁతో పర్వర్ద్ వొకుష్త్
చో ఆహంగె ర ఫ్తన్ కునద్ జానెపాక్
చెబర్ తఖై ముర్దన్ చెంబర్ రూయెఖాక్.

పాపము లేకుండావుండే అనఁగా 'పాక్' యీ ప్రాణం వున్నదే ఇది 'తన్' కి విడిచిపెట్టి 'ఉడాయించే' టప్పుడు మట్టిమీఁద 'మర్జానా' కి 'లుక్సాన్' యేమి తక్తుమీఁద మర్జానాకీ నఫాయేమి రెండుకూడ ఏకీచ్" అని ప్రస్తుతవానఁ గావలసి కడపటి రెండుపాదములకు మాత్రమే తాత్పర్యము చెప్పి యూరకుండెను. ఉర్దూబాస పదియణాలు నాంధ్రభాష యాఱణాల కూడికతో నున్న యీ యసాధారణ వ్యాఖ్యాన మాబ్రాహ్మణేతరవితంతువునకుఁ దెలియక కాఁబోలు "సాహే

బుడు చెప్పుడు కాఁబోలు నే నొకటిచెప్పఁగఁ దా నొకటి చెప్పునేమి" యని యామె విసుఁగుకొనెను. ఇంతలో బండికూసి వెనుకకుఁ బోవ నారంభించెను. పంచాయతి మొదలగు నాచారములకొఱకుఁ గాఁబోలు బెజవాడస్టేషనుకుఁ బోవుచున్నదని యచ్చటివారు కొంద ఱనిరి! బెజవాడకుఁ బోయినపిమ్మట నచ్చట నేమిజరిగెనో నేమియుఁ దెలియదు. గతించిన రెండురాత్రులుగూడ నాకు నిద్ర లేకపోవుటచేఁ గాఁబోలు మనస్సు మహాందోళన మొందుచున్నను నాకు గునుకువచ్చినది.ఆకునుకులోనే స్వప్నము కలిగినది. దానిని జెప్పెదను. దయయుంచి వినవలయును.

నేనొక్క కొండపై నిద్రించుచుంటిని. వింటిరా. నాయనలారా! కలలోఁగూడ నిద్రించునట్లు కల! అట్లు నిద్రించుచుండఁగా నెవ్వఁడో వచ్చి నన్ను నిద్రనుండి లేపెను. నే నులికిపడి మేల్కాంచి కూరుచుంటిని. నాయనలారా! ఈమేల్కానుటకూడ నిద్రలోనే. ఈకలకూడఁ గలలోనే__కలలోనే కన్నులు తెఱచి యాపురుషునివంకఁ జూచితిని బొచ్చుతోనున్న గొఱ్ఱెచర్మముల నాతఁడు తొడుగుకొనియుండెను. తలకు గొఱ్ఱెచర్మపుటోపి పెట్టుకొనియుండెను. తనకంట దీర్ఘమగు నొక వేణుదండము నాతఁడు చేత ధరియించియుండెను. నే నాతనిఁ గాంచి యిట్టివేషధరుల నిదివఱకు నాయుత్తరదేశయాత్రలలోఁ జూచియుండుటచే విశేష మచ్చెరువుపడక నన్నేల లేపితివని యాతని నడిగితిని. నీవు నిద్రపోవుచుండుటచేత లేపవలసివచ్చినదని యాతఁడు నాకుఁ దెలుఁగుననే ప్రత్యుత్తర మిచ్చెను. ఈతఁ డాంధ్రమెటనభ్యసించినాఁడో యని నామనస్సునఁ గలిగిన యాశ్చర్యము నడఁచుకొని నిద్రనున్నవారినెల్ల లేపుటయే నీపనియా యని నే నాతని నడిగితిని. తెల్లవాఱవచ్చుచున్నను నిద్రించుటయే నీపనియా యని యాతఁడు నన్నధిక్షేపించి "లెమ్ము ఇఁక లెమ్ము! నాతోఁగూడ రమ్ము నీకుఁ జిత్రములఁ గానఁబఱతు" నని యాతఁడు నన్ను హెచ్చరించెను. "నీతోఁగూడ రాకపోయినయెడల నీవేమిచేయుదు" వని యాతని నే నడుగ, నిన్ను బుజముపైఁబెట్టుకొని తీసికొనిపోవుదునని యాతఁడు నాతోడ ననెను! అట్లేచేయరాదా ఈమాత్రపుభాగ్యమునకు వేఱ నన్నేలయడిగెదవని

నేనాతనితో ననఁగ, దండెముననున్న యంగవస్త్రమును స్నానమునకుఁ బోవుచు మనము బుజముమీఁద వైచికొనున ట్లాతఁడు నన్నుఁ దన స్కంధమునఁ బెట్టుకొని యతిశీఘ్రగమనమున నొక కొండమీఁదినుండి మఱియొక కొండమీఁదికిఁ బోవుచున్నాఁడు. ఆతఁ డిట్లు పరుగెత్తుటవలన గలిగిన కుదుపుచే నాకు మరలఁ గును కారంభమయ్యెను. నాయనలారా! వింటిరా! కలలోఁగలిగిన కలలోఁ దిరుగ నిద్ర—ఈనిద్రలోఁ దిరుగఁ గల వచ్చుచున్నది. చెప్పెదను వినుఁడు. ఇది కలలోని కలలోని కల—నేనును మఱికొందఱును గలసి యొక యాకాశవిమానములోఁ గూరుచుండి వినువీథుల గంటకు నూఱుమైళ్లకంటె హెచ్చువేగమునఁ గాఁబోలుఁ బోవుచుంటిమి. మాలో నేనుదక్క నంద ఱబ్రాహ్మణులే. వీఁడు బ్రాహ్మణుఁడువలె నున్నాఁడే! అందులో ఖద్దరు ధరించుటచే (Non-Co-operator)వలె నున్నాఁడే? చూచెదవేమి? త్రోచివేయుఁడు. క్రిందికిఁ ద్రోచివేయుఁ డని మనవారే—మనయాంధ్రులే—మన మిత్రులైన యబ్రాహ్మణులే— మనదేశ లాభనష్టములకు బాధ్యులైన మనవారే—యొక్క త్రోపుతో నన్నుఁ గ్రిందికిఁ దోచివైచిరి. ఈ త్రోపుతో మేల్కాంచితిని. ఇక్కడి కీకల సరి. కుదుపువలనఁ గలిగిన దరిమిలాకునుకు సరి. ఇంతకుఁ బూర్వమున్న కలలోనే మేల్కాంచి తిరుగ నిద్ర రాకుండ భద్రముగ బలవంతముగఁ గన్నులు తెఱచి జాగ్రత్తగ బింకముగఁ గూరుచుండి నరవాహనముపై నగములెక్కుచు నగములు దిగుచు నంతరిక్షమునఁ బోవుచుంటిని—"జంఘాలశాస్త్రీ! కునుకుచున్నావు కాఁబోలు ఖబర్‌దార్ అని హెచ్చరించి నేనుజెప్పుమాట లేవో వినుచు నేనుజూపు ప్రదేశములను జూచుచుండుము. ఇదిగో! యీయంజనమును గంటికి రాచికొనుము నిద్ర రాకుండఁ జేయును. అదిగాక దూరస్థపదార్థదర్శనశక్తి నిచ్చును" అని యాతఁడు పలికినాఁడు.

"ఇదిగో నాచేతివైపునఁ జూడుము. అదియే జ్యోతిష్మఠము. అదిగో! తపోవనము. జ్యోతిష్మఠమునకుఁ బ్రాగ్దక్షిణమధ్యదిశను భవిష్యద్బదరీనారాయణ మున్నది. నమస్కరింపుము" అని యాతఁడు చూపెను. నారాయణ నారాయణ నారాయణా యని స్మరించుకొంటిని. "అదిగో! అదిగో! భవిష్యద్బదరిచుట్టు కొంతదూరమున దక్షిణ

ముగాఁ బ్రవహించుచు ముత్యాలకోవవలె నున్న నదియేదో యెఱుఁగు దువా? అదియే ధవళనది. చూచితివా?" యని న న్నాతఁ డడిగెను. "అయ్యో? నాకేమోకాని కన్నులు తిరుగుచున్న" వని నే నంటిని. "అటులైనఁ గన్నులు మూసికొనుము. మఱికొంత పోయినతరువాత నీవులువు చూచుకొని తిరుగఁ జెప్పెద" నని యాపురుషుఁడు సెలవి చ్చెను. నేను గనుల మూసికొంటిని. కొంతసేపైనపిమ్మట నాతఁడు నన్నుఁ బిలిచి "ఈసారి కనులఁ దెఱువుము. అదిగో! దేవలఘట్టము. అక్కడనే రెండు చిన్ననదులు గలసినవి. దానిగట్టుననే యొకమహా రాజు మందిరము శిథిలమై యున్నది. చూచితివా! అదిగో! యాఘట్టము నకు మఱియొక పార్శ్వమున మహాదేవుని యాలయమున్నది. బాగుగాఁ జూడుము" అని యాతఁ డనెను. "చూచుచున్నాను నాయనా!" యనిపల్కి మహాదేవశంభూ! మహాదేవశంభూ! యని స్మరించు కొంటిని. "మహాదేవుని యీయాలయమునకు మహారాజవరుని యామంది రమునకు నొక్కముహూర్తమందే శంకుస్థాపనము జేయవలయు నని యచ్చటి మహారాజు మహంతుకూడఁ గలసి నిశ్చయించుకొనిరి. కాని యామర్యాదను మహారాజు పాటింపక మహంతునకు వార్తనైనఁ బంపక తనమందిరనిర్మాణము నారంభించెను. ఈయంశము మహంతు తెలిసికొని తీవ్రకోపుఁడై మహాదేవుని యాలయము నిలుచును. మహా రాజుమందిరము కూలు నని పలికెను. అందువలన మహారాజు మందిర మట్లు శిథిలమై యున్నది వింటివా?" అని యాతఁడు నన్ను హెచ్చ రించెను.

"వింటిని శ్రద్ధగా వింటిని గాని కన్నులు మఱలఁ దిరుగు చున్న" వని నే నంటిని. "నీకర్మము నేనేమిచేయగలను" అని యాతఁడు మాటలాడకుండఁ గొంతదూరము నన్ను మోసికొనిపోయెను. ఎటు లున్నదని కొంతసేపటికి కాతఁ డడుగ బాగుగనే యున్నదని యంటిని. "అదిగో నందికేసరి. ఇచ్చట రెండు దేవాలయము లున్నవి. చూడు! నందీశ్వరుని దొకటి—మహాదేవుని దొకటి. మహాదేవుని వాహనము నంది. పార్వతీదేవి వాహనము కేసరి—ఈ రెంటిచేఁ బవిత్రమగుటవలన నీస్థలమునకు నందికేసరి యనుపేరు కలిగినది" అని యాతఁడు పలికెను.

దుర్గా! భవానీ! మహాదేవశంభూ యని స్మరించుకొనుచుఁ గన్నులు తిరుగుటచేఁ దిరుగఁ గన్నులు మూసికొంటిని. కొంతసేపైన పిమ్మట, "నయ్యా! మఱియేమైనఁ జెప్పవా" యని యడుగ "అదిగో త్రిశూలపర్వతము దీని ప్రాక్శాఖయే హిమాలయములోఁ గలియును. అదిగో సూర్యుఁ డుదయించుచున్నాఁడు. త్రిశూలపర్వతముపైనఁ జూడుము. పొగ వచ్చుచున్నది. అచ్చటఁ బాండవుల మహాసనమున్నది. దానినుండి పొగ యల్లప్పుడు వచ్చుచుండును." అని యాతఁ డనఁగ, రావణునిశ్మశానప్రదేశమునుండి నిత్య మిట్లే పొగ వచ్చుచుండునని యున్న జనవాక్య మప్పుడు నాకు స్మృతికివచ్చినది. "తిరుగ నిద్ర యేనా" యని యాతఁడు నన్నుఁ బ్రశ్నింపఁగ 'లే' దని యంటిని. మన గమ్యస్థానము నింక బహుశీఘ్రముగఁ జేరనైయున్నాము. అదిగో అటు చూడుము మృణాళ యనుగ్రామము; ఇచ్చటినుండి ప్రాలేయాచలశిఖరము లెంతస్పష్టముగఁ గన్పట్టుచున్నవో! అవిగో దేవదారు కదంబ కపాలవృక్షములు. తక్కినచెట్లు పేళ్లు స్పష్టముగఁ దెలియవు. చూచితివా!"యని నన్నుఁ బ్రశ్నింప "మహాపురుషా! చూచుచుంటిని. హిమవన్నగరాజమా! నమస్కారము. లోకమాతయగు హైమవతీదేవి నీయందేకదా యుద్భవించినది! నీమహాదృష్ట మేమని చెప్పవచ్చును? జగత్కర్తయు జగద్భర్తయు జగద్ధర్తయునగుపరమేశ్వరుఁడు నీయింటి యల్లుఁడగునప్పుడు నీమహాభాగ్య మేమనిచెప్పవచ్చును? లోకపావన మూర్తులగు సింధు గంగా బ్రహ్మపుత్రాదినదుల కాధారభూతుఁడవు నీవేకావా? సర్వపర్వతరాజములకు సార్వభౌముఁడ వీవేకదా! సముద్రములు చవుటిపఱ్ఱలైనవి. చవుటిపఱ్ఱలు సముద్రములైనవి. మహాఖండములు చిన్నద్వీపములైనవి. చిన్నద్వీపములు మహాఖండములైనవి. పేరులేనిజాతులు పెద్దజాతులైనవి. పెద్దజాతులు పేరులేనివైనవి. గవ్వలు కనకరాసులైనవి. కనకరాసులు గవ్వలైనవి. మహానాగరకులు మృగప్రాయులైరి. మృగప్రాయులు మహానాగరకులైరి. పురాతనగోళములు కొన్ని తిరోధానమొందినవి. క్రొత్తగోళములు ప్రత్యక్షమైనవి. ఆదిత్యమండలమునకైనఁ బూర్వతీక్ష్ణత పూర్వచండత పూర్వశక్తి కానరాకున్నవి. కాని పశుపతీశ్వరా! ప్రాలేయాచలశేఖరా!

నీవాక్యరీతిగానేయున్నావే! ఆర్యావర్తవాసుల సత్యమువలెఁ, శౌచము వలె, దయవలె, దైవభక్తివలె, స్వార్థపరిత్యాగమువలె, శాంతివలె, యోగశక్తివలె, నార్యావర్తసుందరులయతిథిపూజవలెఁ బాతివ్రత్యము వలె నాపత్సహనమువలె నీవాక్యరీతిగనే యున్నావే! సెబాస్! నీకట్టిమహామహిమ మార్యావర్తసంబంధమునఁ గలిగినదో—ఆర్యావర్తమున కిట్టి యలౌకికయోగ్యత అన్యమతవిద్వేషశూన్యత, ఆత్మచింతాపరత నీవలనఁగలిగినదో ఎట్లైననేమి? తలనుబట్టియే హృదయమునకు ఘనత-హృదయమునుబట్టియే తలకుఘనత-భారతీదేవి హీరకిరీటమా! నమస్తేనమస్తే" యనినేనుచ్చైస్స్వరమునఁబలుకుచుండఁగా నన్ను మోయుచున్న నరసత్తముఁడు నన్నొక చిన్న మెట్టపైఁ గూరుచుండఁ బెట్టెను. ఇచ్చటివింతల నేమాపెదను చూడుమనియిట్లుచెప్పెను."అదిగో దేవీధరమను గ్రామము! అదిగో నాచేతివైపున సమీపముననే రెండు గొప్పబోడిఱాళ్లున్నవి. క్రిందిఱాతిమీఁదఁ బైఱాయి యమర్పఁబడినట్లున్నది! పైఱాతిపైని సమప్రదేశము మిగుల సుందరముగను విశాలముగను నున్నది దీనికి రణశిల యనిపేరు. దానిపైనుండి క్రిందివఱకొకబిల మున్నది. ఆబిలమును భీమసేనుఁడు తనగదతో నాపాషాణమున నిర్మించినాఁడు. ఆరణశిలపైని చతుశ్రమైన యొక్క పెద్దఫలకమున్నది. దానిపై గజాశ్వాదిరూపముల మలచినఱా లున్నవి. ఆఫలకమే భీమసేనుఁడు ద్రౌపదియు నాడుకొనిన చతురంగపాళి—మఱికొంత పైన మఱికొన్ని బోడిఱాలున్నవి. ఆఱాల కీరణశిలకును నడుమనున్న చరియలోనే వారాహిదేవియాలయము మహాదేవునియాలయము భీమసేనునియాలయము నున్నవి. వానిని నీకుఁ దరువాతఁ జూపుదును. ప్రస్తుత మిక్కడ నిపుడు జరుగఁబోవు చిత్రమును నీవు చూడుము. ఈదినము శ్రావణపూర్ణిమాసి. ఇక్కడ నొక తీర్థము జరుగును. నడుమ నడుమ నీ కేదియైనఁ దెలియకున్నయెడల నన్నడుగుము. అంతేకాని నీవు మఱియెవ్వరితోడను మాటాడఁదగదు" అని యాతఁ డనఁగ సరేయంటిని కన్నులు తెఱచి చూచుచుంటిని. ఎప్పుడు తెప్పపడినదో నేను జెప్పలేను గాని తిరుగ తెప్పలెత్తుసరికా పెద్దమైదానమంతయు జనులతో నిండియున్నది. చర్మవస్త్రధారులు, చర్మాంగరక్షధారులు, చర్మో

క్షీమధారులు, చండస్వరూపులు, గదాదండపాణులు, ఖడ్గాలంకృతావ లగ్నబంధులు వందలు వేలు మెఱపుమెఱసి మాయమగునంతకాలములో నటకుఁ జేరిరి. చేరి యేమిచేయఁదలఁచిరో యెవరికి దెలియును! కోవాపాలదుకాణములు లాడూ బర్ఫీ దూద్ పేడా దుకాణములు, పండ్లదుకాణములు, భంగుదుకాణములు, బీడీలదుకాణములు, చిత్ర చిత్రములగు చర్మవస్త్రముల దుకాణములు, సారాయిదుకాణములు నంబరుగుండ్లు అంకులరాట్నములు చిత్రవస్తుప్రదర్శనశాలలు పగటిభాగవతులమేళములు, లాటరీనివేశనములు, పుస్తకములయంగళ్లు నింక నేవియో మఱియొకనేవియో మైదానమందంతటట వర్తులముగ వ్యాపించి యున్నవి. దారాహీమాయీలారా! హిమాయీ యను మహారవములు చుట్టుపట్లనున్న పర్వతముల ఢీకొని మాఱుమ్రోగుచున్నవి. ఆహాహా! దాక్షాయణీభక్తు లెంద ఱచ్చటఁజేరి యొడలు లుప్పొంగ, మనసు పుష్పింప, నాత్మ తరింప నాలోకమాతను స్మరించుచున్నారో! ఆహా! ఎంత దివ్యదర్శన మగుచున్నది! అదేమి? అదేమి? వారంద ఱట్లు చేతులెత్తి యొకచేతి నటు వేఱొకచేతి నిటు విదుర్చుచున్నా రెందుచేతనో! జయా కాళికేశ్వరీ! జయా కాత్యాయినీ! జయా కాదంబినీ! యని యుత్తుంగస్వరముల వారాహీదేవికి హెచ్చరికలు పఠించి అట్టె చిటుక వ్రేసినంతలో నచ్చటిభక్తులెల్లరు రెండుపాయలుగా విడిపోయిరి. వారి యిద్దఱనడుమను దాదాపుగా రెండువందలగజము లెడమున్నది. అంతకు ముందుఁ గానఁబడలేదు కాని యాయవకాశపునడుమ పొలిమేరఁ దెలియఁజేయు చిన్నఱాల చాలున్నది. ఆప్రక్కవా రంద ఱావైపు గ్రామములవారు. ఈప్రక్కవా రంద ఱీవైపు గ్రామములవారు. అందఱు వారాహీభక్తులే—ఈపక్షమునుండి యొకపురోహితుఁ డా పక్షమునుండి యొక పురోహితుఁడు పసుపుతోఁ, గుంకుమతో, విభూతి పండ్లతోఁ వేపమండలతో, వేణుదండములతో, నుభయపక్ష జయజయ ధ్వానములతోఁ, బటహభేరీకాహళఢంకానినాదములతోఁ బొలిమేర యొద్దఁ దారసించిరి. జయా వారాహీదేవికి జయా జయా వారాహీదేవికి జయా యని కేకలువైచి కరాగ్రములందున్న కఱ్ఱలతో నొకరి నొకరు మోదుకొనిరి. వా రన్యోన్యతాడనపీడన సంరంభులై యుండ

నిట్లే జయజయధ్వానము లిచ్చుచు నీవైపునుండి కొంద అవైపున నుండి కొందఱు నడుమకువచ్చి, ముష్టిఘాతములచే, పాదతాడనములచే, దరవారిప్రేటులచే, గదాఘాతములచే నొండొరులఁదాఁకిరి. వీరికి వారి కేమైన శత్రుత్వమా ? లేదు. వీరికి వారికేమైన మతులుపోయినవా? లేదు. అమితసురాపానమున వీరికి వారికి విస్మృతి కలిగియున్నదా ? లేదు. ఒకరిపై నొకరికిఁ గోపముకాని మత్సరముకాని యీర్ష్యకాని యున్నదా ? లేదు. ఏమియు లేదు- సరేకదా ! వారందఱు మిత్రులు బంధువులు కాళీభక్తులు. అన్యోన్య క్షేమలాభాపేక్షచే వారట్లు కొట్టుకొనుచున్నారు. తన్నుకొనుచున్నారు. పొడుచుకొనుచున్నారు. నఱకుకొనుచున్నారు. దెబ్బలు కొట్టినవారిపై దెబ్బలు పడినవారిపై దేవీకటాక్ష మమోఘముగ వచ్చునని సంపూర్ణవిశ్వాసముతో సమంజస దీక్షతో సంతతభక్తితో వా రట్లాచరించుచున్నారు. దెబ్బలుకొట్టిన వారికి దెబ్బలు పడినవారికిఁగూడ నాసంవత్సరముమట్టునకు స్ఫోటకబాధ లేదు. మహామారిబాధ లేదు. విషూచీబాధ లేదు. క్షామబాధ లేదు. మృగబాధ లేదు. సర్పబాధ లేదనునమ్మకము వారియెముకలలోని మూలుగులలోని మూలుగులలోఁ దేజోమయాక్షరమువలె ముద్రింపఁ బడియున్నది. ఎటులో యొకట్లు భక్తుల యొడళ్లనుండి రక్తధారలు స్రవింపవలయును. స్రవించినఁగాని శ్యామలాంబాకటాక్షము వారిపై రానేరదు. అందుకొఱకు బాధయనునదియే యెఱుఁగక మహోత్సాహమున మహాసంతోషమున వా రొకరినొకరు మర్దించుకొనుచున్నారు. ఆహాహా ! బొంబొంబొమ్మని శంఖములు మ్రోగుచుండ ఘణఘణ మని జయఘంటలు శబ్దించుచుండ డమ్ డమ్ డమ్మని డంకాలు ధ్వనించుచుండ, పర్వతములనడుమనుండు సన్నిచరియనుండి ప్రభంజనుండు శతకోటి తురంగధాటితో ప్రబలరోనధ్వానములతో రైంరైమని వీచి దేవదారువృక్షములను దల్లివేళ్లతో నూఁగఁజేయుచుండ సంతోష సముజ్జ్వలదాస్యమండలులై వారు మఱల డీకొనుచున్నారే! ఢుఫ్ ఢఫ్, కఱక్క్, కసిక్, గభి గుభి, ఢామ్, ఢిమ్, టప్ టిప్ అను భయంకరధ్వనులు శతసహస్రగుణితములై శ్రవణాపుటములఁ బడుచున్నవే కాని యామహాసంచలనములో—— నామహాందోళనములో——నా

దొమ్మిలో—నాధూళిలో నాహాహా! మఱేమియుఁగనఁబడుటయే లేదే! మఱియొక్క నిముసమున కేకారణముననో యాగందరగోళము శాంతించి నది. భక్తుఁ డొకఁడు చచ్చినాఁడని యాప్రక్కనుండి వినఁబడినది. జయా వారాహీదేవికి జయా! ఈభక్తునకు మోక్ష మిప్పింపుము. మా యీ వారాహీమాయీ యను ప్రార్థనలు వినఁబడినవి. ఒకఁడు కాఁడు. ఇద్దరు చచ్చినారని యాప్రక్కనుండి మఱల నుద్గ్రీవమున నొక్క కేక వినఁబడినది. జయా వారాహిదేవికి జయా! ఈభక్తునకు మోక్ష మిప్పింపుము మాయీ వారాహీమాయీ యను ప్రార్థనలు వినఁబడినవి. ఆహాహా! మహాసంతోషము మహాసంతోషము. ఇద్దరు కారు. ముగ్గురు భక్తులు దేహముల చాలించి రను కేక యీప్రక్కనుండి మఱల వినఁ బడినది. జయా వారాహీదేవికీ జయా! ఈభక్తునకు మోక్షమిప్పింపుము. మాయీ వారాహీమాయీ యను ప్రార్థనలు వినబఁడినవి. ఆహాహా! ముగ్గురుకారు. నల్వురుభక్తులు మరణించిరని యాప్రక్కనుండి మఱి కొన్ని కేకలు వినఁబడినవి. జయా వారాహీదేవికి జయా! ఈభక్తునకు మోక్ష మిప్పింపుము. మాయీ వారాహీమాయీ యను ప్రార్థన లెల్లెడల వినఁబడినవి. ఇఁకచాలు! ఇఁకచాలు నని మొదట సరిహద్దు నొద్దఁ దారసిల్లి పురోహితులు కాఁబోలు కేకలు వైచిరి. మేము శాం తింపము. మాకింక దెబ్బలు తగులలేదు. మాయొడళ్లనుండి యింక రక్తము రాకున్నది. మీ రదృష్టవంతులై మమ్ము నిర్భాగ్యులఁ జేసె దరా? దేవీకటాక్షమునకు మీరేకాని మేము పాత్రులము కామా యను కేక లుభయపక్షములనుండియు వినఁబడినవి. అంత నాపురోహితు లిద్దఱు సరే మీభక్తికి సంతసించితిమి. కత్తులతో గఱ్ఱలతో గడలతో నిఁక బోరవలదు. చిన్నచిన్న ఱాలతోఁ గొట్టుకొనుఁడని దయాపూర్వక ముగ వారు సెలవీయఁగ గుడిప్రక్క వ్రేలాడుచున్న తోలుసంచుల లోని ఱాలు తీసికొని యొకరిపైనొకరు ఱువ్వుకొనిరి. ఱాలవర్షము ఓ తెఱపి తెంపులేకుండ గురియుచున్నది. దడదడ బడబడ చిటపట ధ్వనులతో సూటిగఁ బ్రక్కబాఱుగ నారోహణగతితో నవరోహణ గతితో సవ్యాపసవ్యధాటులతో ఱాలు పడుచున్నవి. హుస్సుహుస్సు గాని అమ్మ అబ్బయనికాని అయ్యో కట్టా యనికాని కుయ్యో మొఱ్ఱో

యనికాని యొకపిల్లవానినోటినుండియైన వినఁబడదుకదా! ఆహాహా! నీరంధ్రమైన నిశ్చలమైన నిరుపద్రవమైన భక్తికి యెట్టి యనాగరక భక్తికైన సరే యెంత మహాసహానశక్తియున్నదో! ఆహాహా! కత్తివ్రేటు పూవుపాటే. ఫిరంగిగుండు వీలాకందుకమే. మహాగ్నికీల మంచు గడ్డయే. ఆధ్యాత్మికశక్తి యున్నవానిని శతఘ్నులు హింసింపగలవా? బాంబులు ఛేదింపఁగలవా? ధరాకంపము లూపఁగలవా? అగ్నిపర్వతములు కాల్పఁగలవా యని నాలో నేననుకొనుచుండ "నింకఁ జాలు" అను కేక వినఁబడినది. ఆ కేకతో నందఱు విడిపోయిరి. తిరుగ నుభయ పక్షమధ్యమున రెండువందలగజముల యవకాశ మగపడినది. అంత నీపక్షముండి యయిదుగు రాపక్షమునుండి యయిదుగురు చిన్నచిన్న డాలతో విలాసముగఁ గొట్టుకొనుచు సరిహద్దునొద్దకు వచ్చి యక్కడఁ గొంత పూజచేసి యొక్కసారి పదిశంఖము లూఁదిరి. ఆధ్వనితో నీపక్షమువా రాపక్షమువారు బిలబిల కలసికొని మహానందమున వారాహీదేవి కోనలోనికిఁ బరుగెత్తిరి. నన్ను బుజమున వైచుకొని నామిత్రుఁడు వారివెంటఁ బరుగెత్తెను. వారాహీదేవిని నేను దర్శించి నమస్కరించి "మాతంగకన్యాం మనసాస్మరామి" యను మకుటమున్న శ్లోకములను బఠించి లెంపలు వైచుకొంటిని. అంతట నొక జాత్యంధుని దేవాలయపుబూజరి లోని కంపి తలుపు లీవలవైచెను. అమ్మవారి కలంకారాదులు జాత్యంధుఁడే చేయవలయు ననునాచార మున్నది. పైకి నిరర్థకముగఁ గానఁబడుచున్న యీయాచారములో నెంత గంభీరార్థ మిమిడియున్నదో యని నేను ముక్కుపై వ్రేలువైచికొంటిని. ఇంతలో తలుపుతీసి పూజారి లోనికిఁబోయి పైనున్న చర్మాంగరక్షయు చర్మోత్తరీయమును దీసివైచి చర్మపుదోవతిమాత్రమే మిగుల్చుకొని వారాహీదేవిని దలపైఁ బెట్టుకొని యీవలికి వచ్చెను. జనులందఱు జయజయధ్వానము లిచ్చుచు నమ్మవారియూరేగింపుతో బయలుదేఱిరి ఇంతలో నెటనుండివచ్చిరో కాని రెండుమూడు వేలకాంతలటకుఁ జేరిరి. కాంతలు పురుషులు కలసియే వారాహీదేవి ననుసరించి నడచుచుండిరి. మాయీ! గోత్రాలను రక్షింపు. పిల్లలందఱు పోయిన దానను. రక్షింపుమాయీ! మాయీ వారాహీమాయీ యని

యాయమ్మవారివెంట కొందఱు స్త్రీలు కేకలు వైచుచుఁ బరుగెత్తిరి. అమ్మవారిని ముట్టుకొనినయెడల నథవ మమ్మవారిని శిరముపై ధరించు వానిని స్పృశించినయెడల సంతానవతు లగుదురని యాకాంతల విశ్వాసము. ఏకాంతయైననరే యమ్మవారినిగాని తన్నుఁగాని స్పృశింపకుండు నట్లు తన్ను నమ్మవారినిగూడ భద్రముగఁ గాపాడుకొనుచుఁ బూజరి బహుచాకచక్యమునఁ బరుగెత్తుచున్నాఁడు. భర్తలు భార్యలను జేతులతోఁ బైకెత్తి యమ్మవారిని స్పృశింపఁజేయుచున్నారు. అమ్మవా రందనివా రర్చకునినైన స్పృశించుచున్నారు. అప్పుడే గర్భములు నిలిచిన ట్లానందపడుచున్నారు. ఇట్లు సమస్తవిధవాద్యములతో నమ్మవారు తిన్నగఁ దనచెల్లెలగు మాహేశ్వరీదేవిని జూడఁబోయినారు! ఆమె యాలయమునొద్ద జనులంద ఱాఁగి యచ్చటి మాహేశ్వరీదేవిని గానతాళములతోఁ గీర్తించుచున్నారు. ఒక పాషాణరచితసింహాముపై రెండు సింహశాబకవిగ్రహము లున్నవి. ఈమూర్తియే మాహేశ్వరీ మూర్తి. ఇచ్చట క్షీరము లమ్మవారికిఁ బూజరు లర్పించుచున్నారు. అక్కసెల్లెండ్రు సంవత్సరముకైన నొకసారి తప్పక కలసికొనవలయునని దీనియర్థము కాబోలునని నేననుకొంటిని. అందులో శ్రావణమాసమునఁ దప్పక కలసికొనవలయునని దీని యభిప్రాయమై యుండునేమో? కలలో నొకబాటయేమి యొకపద్ధతియేమి? కాని యిదియేమి! నన్నిటకు మోసికొని తెచ్చినపురుషుఁడు కనబడడేమి? నేనెటు లింటికిఁ బోవుదునా యని యనుకొనుచు నిటునటు తిరుగుచుంటిని. అంత "నయ్యా! ఏలూరు వచ్చితిమి లెండు లెం" డని నాకొఱకు స్టేషనుకు వచ్చిన నామిత్రులు నన్ను లేపిరి. ఒక్కనిముసమువఱకు దిగ్భ్రమము నొంది నాయాందోళనము పైవారికిఁ దెలియనీయకుండ నడఁచుకొని వారివెంట బోయితిని. ఇచ్చటికి స్వప్నము పూర్తియైనది.

ఓమ్ శాంతి శ్శాంతిః శ్శాంతిః.

---

# 8. జెంటిలుమాన్

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

“మదరాసునుండి యీలేఖ వచ్చినది. సాక్షిసంఘాభిమానులలో నొకఁడు వ్రాసినాఁడు. దానిని జదివెదను.”

సాక్షికి నమస్కారములు. ఇచ్చట మేము మదరాసులో క్షేమముగా నున్నాము. అచ్చటి మీ క్షేమాతిశయములు వ్రాయించి పంపఁగోరెదను. తరువాత—నేనొక్కదినమున మాప్రభుని సన్నిధానమునం గూరుచుండి మీసాక్ష్యుపన్యాసములలో శ్రీరామచంద్రమూర్తి మీఁది పద్యములున్న సాక్షిని జదువుచుంటిని. అంతలో భటుఁడొకఁడు వచ్చి ప్రభువుగారి కొక తెల్లనిచీటి నగపఱచెను. ఆచీటిపై నున్న పేరు వారు చూచుకొని యొక్కనిమేషముపాటు యోజించి యానామము నుచ్చరించి యీపేరిని మీ రెప్పుడైన వినియుంటిరా యని నన్ను బ్రశ్నించిరి. వినియుండలేదని నేను విన్నవించితిని. ఆచీటినిచ్చి ‘లోనికిఁ దీసికొనిపో’ మ్మని మాత్రమే యాతఁడు నీతోఁ జెప్పెనా మఱియే మైన నింకఁ జెప్పెనా యని ప్రభువుగా రాభటుని బ్రశ్నింప, “బాబూ! మఱికొన్నిమాటలు చెప్పినాఁడు” అని యాతఁడు సంశయించుచుఁ బ్రత్యుత్తర మిచ్చెను. ‘సందేహమేల? ఏమిచెప్పినాఁ’ డని రాజుగారు తిరుగ నడుగ “నేను మీరాజుగారిని జూచుటకు వచ్చినాను. పండ్రెండుమైళ్లదూరమునుండి గుఱ్ఱపుబండి యద్దెకుఁ దీసికొని యిచ్చటికి శ్రమపడి వచ్చినాను. నేను వెంటనే వారిని జూడవలయును. నాకింకఁ బను లెన్నియో యున్నవి. ఇచ్చట నాలసించుటకు నాకవకాశము లేదు. వెంటనే వారిని జూడవలయును.” అని తమతో మనవి చేయుమని యాతఁడు నాతోఁ జెప్పినాఁడని కొంత సందేహించుచు భటుఁడు బదులుచెప్పెను. మారాజుగారు మందహాసమొనర్చి “నాకిప్పుడు తీఱికగా లేదు. తొందరపను లెన్నియో యున్నవనియు నాలసింప నవకాశము లేదనియు నాయనయే చెప్పినారు. కావునఁ ద్వరలో వారు మఱియొకచోటికి దయచేయవచ్చునని చెప్పు” మని వారు భటుని కాన

తెచ్చిరి. చిత్తమని భటుఁడు రాజసన్నిధినుండి వెడలిపోయెను. రాజుగారు కొంచెము యోజనాపరులైరి. వారు యోజించుచున్నప్పుడు నేనుమాత్ర మూరక కూరుచుండుట యెందులకని నేనిట్లు యోజించుకొంటిని. "ఈమహానుభావుఁ డెవఁడో! పండ్రెండుమైళ్లదూరమునుండి వచ్చితి నని పరితపించుచున్నాఁడుకదా! ఈయన నవశ్యముగ దయచేయవలసినదని యాహ్వానించినవా రెవరో! అద్దెబండిపై వచ్చితినని యాందో శ్రమపడుచుండెనుగదా! జట్కాబండి ప్రారబ్ధమేమి? 'షె వ్రొలెట్'పై నారోహింపలేకపోయినాఁడా—ఆలసింప వీలులేదు. వెంటనే చూడవలయునని యంత యాతురపడుచుండెనుగదా — కొంప లేమైనఁ దగులఁబడుచుండె నని యింత కోలాహల మొనర్చుచుండెనా? అటులైన Fire Department వారియొద్ద కేగవలయును గాని ప్రభుసన్నిధి కేల రావలయును? ప్రాణమిత్రుని కెవనికైనఁ బ్రాణముమీఁదికి వచ్చుటచే నింత పరితాపపడుచుండెనా? అటులైన రాయవరపుటాసుపత్రి యుండగాఁ రాజభవనమున కేల రావలయును? ఈమహానుభావుఁ డెందుల కిచ్చుటికి వచ్చెను జెప్పుమా? తనలాభము నపేక్షించియో తన వలనఁ బరలాభము నపేక్షించియో వచ్చియుండును గాని రాజదర్శనమున కంతకన్నఁ గ్రొత్తవానికి వేఱుకారణ మేమియుండును? అట్టి లాభము నపేక్షించిన వాని యాలాపవైఖరి యిదియేనా? వెంటనే దర్శనమా? కార్డు పంపినవెంటనే దర్శనమా? రాజుల కిట్టివారికి దర్శన మిచ్చుటకన్న వేఱుపని యేదియు లేదని యాతని యభిప్రాయము కాఁబోలు! తానెవఁడో తెలియునా? ఎక్కడనుండి వచ్చెనో తెలియునా? ఎప్పుడు వచ్చెనో తెలియునా? ఎందులకువచ్చెనో తెలియునా? ఆతఁ డెట్టి వ్యక్తియో తెలియునా?ఏమియు దెలియకుండఁ జీటిముక్క చూచుకొనుటతోడనే ప్రభు వాతనిఁ బ్రత్యుత్థానముచేసి గౌరవించునని యీతని కీప్రత్యయమేమో? రాజులకు మఱేమియుఁ బనిలేదని యతని నమ్మకము కాఁబోలు! ఎవఁడైనసరే యెందులకైన సరే యెప్పుడైనసరే కార్డుచేతనైనసరే కాకిచేతనైనసరే కబురుపంపినవెంటనే 'సీమాజమా' దగుల్చుకొని నీకొఱకే సిద్ధముగాఁ గూరుచుంటిని రావయ్యా! ఇంతకంటె

గావలసినదేమి యని యాహ్వానించి యాదరించి బతిమాలి బహూకరించి పంపివేయవలసినదే ! రాజులనఁగ మహాకార్యభారములు మీఁదనున్న పురుషులుకాక యెవరికిఁదోచినపుడు వారు వెంటనే చూచుటకు గోడమీఁదిబొమ్మ లనుకొనినాఁడు కాఁబోలు ! వంటపూటింటికి బోయి "వెంటనే అన్నము కావలయును. ఆలస్య మొనర్చుటకు వీలు లేదు. నాకింక నెన్నో పనులున్నవి రిక్షావేసికొని దూరమునుండి వచ్చినానురా! వేగమురా!" అని కేకవేయు నతిథినిజూచి "గంటవాయించువఱకు నోరుచేసికొనక వీథియరుఁగుమీఁద గూరుచుండు" మని యా యన్నసత్త్రాధికారి యాతని నావలికిఁ బంపకుండునా ? పూఁటకూటివానికున్న స్వాతంత్ర్యమైన భూపతికిఁ దనకోటలోలేదా ? చుట్టల దుకాణమునొద్దకుఁ బోయి "తే! పాతికచుట్ట లిటుతే! శీఘ్రముగఁ బోవ వలయును. అదిగో ! వెంటనే తెమ్మన నింక నీయఁడు!" అని తొందర పడినబేరగానిఁ గాంచి చుట్టలవర్తకుఁడు "పోవయ్యా! నీనొక రిక్కడ లేఁడు. అల్లిగిరిపడెదవేల? ఇచ్చువఱకు వేచియుండు" మని బేరగానిపై వర్తకుఁడు తీవ్రపడకుండునా ? దర్బారుగౌరవము తంబాకుబేరముపాటిదైనఁ గాదని యీతని యభిప్రాయము కాఁబోలు ! సర్వకార్యములకుఁ గూడ సమయ మున్నదనుసంగతి యీతెల్లమొగమునకుఁ దెలియనే తెలియదుకాఁబోలు! ఆహా ! యెంతయసందర్భపు టలౌకికపు టవకతవక యల్లరిచిల్లరి యఘాయతపు టభాగ్యవ్యక్తియో యది" యని నాలోనే ననుకొనుచుండఁగ నింతలో భటుఁడు వచ్చెను. అతనిని గాంచి యేమైనదని రాజుగా రడిగిరి. "ఆయన మిగుల గొప్పవాఁడఁట— ఆయన యనేకులగు గొప్పవారిని జూచినాఁడట—బొంబాయినుండి యిక్కడకు వచ్చినాఁడట — బొంబాయి కమెరికా మొదలగు ప్రదేశములనుండి వచ్చినాఁడఁట. నేను మీరాజుగారిని జూడకుండఁ బోవుటకు వీలులేదు. నిమిషములమీఁద సమావేశము కావలయును" అని యాతఁడనుచున్నాఁడని భటుఁడు రాజుగారితో వినయభయసంశయాకుల చిత్తుఁడై విన్నవించెను. ఆమాటలు విని రాజుగారు నవ్వుచు "ఆయన గొప్పవాఁడై యుండవచ్చును. గొప్పవారి ననేకులను జూచి యుండ వచ్చును. నే నాయనను జూచుటకు వీలులేదు. కావున నెక్కడికైన

వారిని దయచేయుఁడని చెప్పు" మని యానతిచ్చెను. అప్పుడు నేను మనసులో "ఏమిది ? బొంబాయినుండివచ్చిన గొప్పవాఁడట! బొంబాయి నుండి మనవైపులకు మహామారివ్యాధి రాలేదా ? అమెరికానుండి వచ్చినఘనుఁడట—అమెరికానుండి మనవైపులకుఁ బొగాకు రాలేదా ! ఆయాస్థలములనుండి వచ్చితినని చెప్పుటలోఁ గలిగినయాధిక్యమేమో నాకవగాహనముకాలేదు. గొప్పవాఁడఁట ! గొప్పవాఁడగువాఁడు రావలసినక్రమ మిదియేనా ? గొప్పవాఁడు పంపవలసినసందేశమిదియేనా ? గొప్పవాఁడు పలుకవలసిన వచోవైఖరి యిదియేనా ? ఛీఛీ ! ఆవలకుఁ బొమ్మనినను గదలక మెదలక బిఱ్ఱబిగిసికొని లజ్జాశూన్యతతోఁ బెంకిపట్టుతోఁ బీటలుపెట్టుకొని తిష్ఠవేసికొనువానియెడల నేనా గొప్పవాఁడనుపేరు వర్తింపవలసినది ? పెళుసుదనము గొప్పయా ? పెంకితనము గొప్పయా ? మూర్ఖత గొప్పయా ? మూఢత గొప్పయా ? మొండితనము గొప్పయా ? తనస్థితిగతు లెఱుఁగకపోవుట గొప్పయా ? ఎదుటివానిస్థితిగతు లంతకంటె నెఱుఁగకపోవుట గొప్పయా ? దేశకాలపాత్రజ్ఞానశూన్యత గొప్ప యా? ఈతఁడు మతిలేనివాఁడేమో" యని సందేహించుచుఁ బ్రభువునొద్ద సెలవుదీసికొని యావిచిత్రవ్యక్తినిఁ జూడఁబోయితిని. ఆతఁ డింక బండిలోనేకూర్చుండియున్నాఁడు. ఆతనిబండిచుట్టు కొందఱు భటులు; కొందరు రాజోద్యోగులు, కొందఱు బాలురు మూఁగియున్నారు. ఆతఁడు పాశ్చాత్యవేషమున నున్నాఁడు. ఆతఁడు కూరుచున్నబండిలోఁ దనకెదురుగ నొక చిన్నకాగిదపుఁగట్టయు నొక చిన్నపెట్టియు నున్నవి. ఆతనిరంగు స్వర్ణచ్ఛాయకుఁ గ్రిందిది. చామనచాయకుఁ బైది. నేత్రములు మార్జాలనేత్రములు. వయస్సు దాదాపుగ ముప్పదియయిదుసంవత్సరములు. మొగము వెలవెలలాడుచుఁ గలాహీనమై యున్నది. కన్నులు మెఱుకకన్నులు. కాని యేకారణముననో యెఱ్ఱగ నున్నవి. కాని యాగంధమేమి ? తలకురాచికొనిన 'పామేటమ్' దాఁటె, బట్టలపై జిలుకరించుకొన్న సెంట్లను దాఁటి, కాలుచుఁ గరాగ్రమున నున్న సిగరెట్టును దాఁటి, మాటిమాటికి మాటుమాటుకు గుప్పుగుప్పు మనుచుఁ బైవ్యాపించు నాపరిమళమేమి ? ఆహాహా ! Exshaw దా? Three daggers దా? Old Tom దా? Arrack

దా? కాలానుసారమైన శుద్ధస్వదేశీయపు టేఁతచెట్టుదా ఏదియైనదేమి వస్తుతత్త్వమున నన్నియు నొక్కటేకద! ఈవాసనకు సహించి నే నాతనిబండియొద్దకుఁ బోయి యాంగ్లభాషలో "అయ్యా! మీ రెవ్వరు? మీకేమిపని" యని యడిగితిని. "నేను చేయనిపనియేమున్నది? నాకు సంబంధములేనిసంఘ మేమున్నది? పశ్చిమార్ధగోళములోనేమి ప్రాగర్ధగోళములోనేమి నాప్రచారములేని వ్యవహారమేదియు లేదు. New York లో నంతర్జాతీయసంఘమునకు కార్యదర్శిని; జపానులో సూది యగ్గిపుల్ల గడియారపుగర్మశాలలల్లోఁ గోశాధిపతిని: P. C. Ray గారి Science శాలలో 'సూపరింటెండెంటు' ను; France లో Fair Sex League లో Fashion pointer ను, The all European టెంపరున్సు సొసైటీలో అండర్ సెక్రటరీని. The all world physiological psychological agricultural, musical, pharmaceutical wirless telegraphical Erotical సంఘములో వైసుప్రెసిడెంటును" అని యాతఁ డాంగ్లేయభాషలోనే ప్రత్యుత్తర మిచ్చెను. "మీయు ద్యోగముసంగతి యేదోచెప్పినారు. మీరెవరో నాకు తెలియలే" దని నే నంటిని. "Well, Iam a Gentleman" అని యాతఁడు బదులు చెప్పెను. ఈమాటలతో నేను దెల్లబోయితిని. మీ రెవ్వరనఁగ నేను పరమహంస నని చెప్పుకొనువాఁ డున్నాఁడు. నేను భాగ్యవంతుఁడ నని చెప్పుకొనువాఁ డున్నాఁడు. నేను గవి నని చెప్పుకొనువాఁ డున్నాఁడు. నేను జమీందారుఁడనని చెప్పుకొనువాఁ డున్నాఁడు. నేను చంద్రముఖికిఁ గన్నెటికపుఁ బెండ్లికొడుకనని చెప్పుకొనువాఁ డున్నాఁడు. నేను సంధాన కర్త నని చెప్పుకొనువాఁ డున్నాఁడు. కాని నేను Gentleman అని చెప్పుకొనువారి నెవ్వరిని నిదివఱకుఁ జూడలేదు. అట్టివాఁ డిచ్చటఁ గనఁ బడినాఁడని నా కాశ్చర్యము కలిగినమాట నిజము. ఆంగ్లేయు లున్నారు. ఆఫ్రికావా రున్నారు. బ్రాహ్మణు లున్నారు. బ్రాహ్మణేతరు లున్నారు. విరాగు లున్నారు. వేదాంతు లున్నారు. యతు లున్నారు. గాయకు లున్నారు. వేదాధ్యశీలు రున్నారు. పండితు లున్నారు. ప్రభువు లున్నారు. దాత లున్నారు. కాని జంటిల్మేఁ యేఁడీ. జంటిల్మన్ అను నది యొకమతముకాదు. ఒక కులముకాదు. ఒక శాఖకాదు. ఒక విద్య

కాదు. ఒకవర్ణముకాదు. ఒకవృత్తికాదు. ఒకయాశ్రమముకాదు. ఒక పదవికాదు. అట్టి దేదియుగాదే! ఆ Gentleman తత్త్వ మందఱి లోను నుండవచ్చును. కొందఱిలో నుండవచ్చును. ఎవరిలోను లేకపో వచ్చును. తాను Gentleman యే! అబ్బ! జగత్తులో Gentleman యెంత చవుకయైపోయినారు. జట్కాబండి యెక్కినవాఁడెల్ల జంటిలు మనే. సిగరెట్లు నోటఁబెట్టినవాఁడెల్ల జంటిల్‌మనే. అమెరికానుండి వచ్చినవాఁడెల్ల జంటిల్‌మనే. ఆరక్కుత్రాగినవాఁడెల్ల జంటిల్‌మనే ఆవ లికిఁ బొమ్మన్నప్పటికి నక్కడనే యంటిపెట్టుకొన్నవాఁడు జంటిల్‌మనే. అటులైన నిఁకఁ బెద్దమనుష్యులకు బ్రపంచమున లోపమేమున్నది? పశువులసంతలలోఁ బెద్దమనుష్యులు—భోగమువీథులలోఁ బెద్దమను ష్యులు—కల్లుపాకలలోఁబెద్దమనుష్యులు— కన్నకాండ్రలోఁ బెద్దమను ష్యులు—నెత్తికోఁతలవాండ్రలోఁ బెద్దమనుష్యులు—ఇంక భూలో కమే వైకుంఠము! ఇంతకన్నఁ గావలసినదేమి" యని నాలో నే నను కొనుచు "అయ్యా! మీరు జంటిల్‌మన్ అని వేఱే చెప్పనక్కఱలేదు. మీస్వరూప మాసంగతి చెప్పుచున్నది. మీస్వభావ మాసంగతిచెప్పు చున్నది. మీసౌరభ మాసంగతి చెప్పుచున్నది" యని నే నంటిని. నామాటలను లక్ష్యపెట్టక యాతఁడు "మీరాజుగారి నిప్పుడే చూడవల యును. నీవుపోయి చెప్పుము నీవొక్కడవు రవంత Right senses లో నున్నట్లు నాకగపడుచున్నది. తత్క్షణమే తత్క్షణమే దర్శనము కావలసి యున్నది." అని నాతో తీవ్రముగ ననెను. అప్పుదీర్పుమని ఋణ ప్రదాత యింత తొందరపడఁజాలఁడే—'అత్తెస్టువారంటు' తెచ్చినయాతఁ డైన నింతతొందరపడఁజాలఁడేయని లోలోన ననుచుకొనుచు "అయ్యా మీకిక్కడిప్రభునితో నేమిపనియున్న" దని నేనడిగితిని. "పని యనఁగా నింతయంతయునా? ప్రపంచమంత పనియున్నది. నేను కొలఁదిపనిమీఁద వచ్చువాఁడనా?" యని యాతఁడు బదులుచెప్పెను. "ఆపని యెంతపని యైనను నాతోనైనఁ జెప్పరాదా" యని నేననగ "అటులైన విను. అడి యారులో రాజకీయసంఘమున్నది. మతసంఘమున్నది. సారస్వతసంఘ మున్నది. మైలాపురములోఁగూడ నటులేయున్నవి. అన్ని పేటలలో గూడ నటులేయున్నవి. ఈయన్నిసంఘములుకూడ జాతిభేదములేకుండఁ

ప్రయోజనభేదములేకుండ స్థలభేదములేకుండఁ గాలభేదములేకుండఁ దత్త్వభేదము లేకుండ సామరస్యముగా సమ్మేళనముచేసి సమానమైన మట్టములోనికిఁ దెచ్చి—సజాతీయమైన తత్త్వమిచ్చి" యని యాతఁడు పైమాట తోఁపక యూరకుండగ—సాజాత్యమైన తత్త్వమిచ్చి సముద్రములో గలుపఁదలఁచితివా యేమి యని నేను వాక్యసంపూర్తిచేసితిని. "అన్ని విధములైనసంఘములు కలగూరగంపక్రింద గ్రుచ్చియెత్తుటే—అట్లుత ద్దెపులుసు క్రిందఁగలిపి కాచుటే—నా కేమియుబోధపడలేదు. నిర్బంధ విధానపుగడబిడలోఁ దద్దినపుమంత్రపు లొడలొడ గలుపవలసినదనియా? ఈ రెంటికికూడికలో వితంతువివాహపు దడబడ మేళవింపవలసినదనియా? అయ్యయ్యో! ఇదియెట్లు? పారణపుఁబిండములలో బాంబులగోళయా? రాట్నపుఁగీచులో రైలుచార్జి యాధిక్యపు లేడుపా? ఈనానాసంఘుసమ్మేళనపుఁ గంగాళీయేమో నా కెంతమాత్రము మనస్సునకుఁ బట్టలేదు. అంత వఱ కెందులకు? మనకు సామాన్యాంశములలో సమ్మేళనములేదు. ఒక మతములోని రెండుశాఖలకు మేళనము లేదే. ఒక్కశాఖలోని రెండు పలువలకుఁ గూడికలేదే. ఒక్కపలవలోని రెండుచిలువలకుఁ బొత్తులేదే. ఒక్కచిలువలోని రెండుపత్రములకైన సఖ్యములేదే. అట్టిచో ఫిరంగి గుండునకు బ్రహ్మముడికి పొత్తెక్కడనుండివచ్చును? ప్రాచీనావీతిమంత్రమునకుఁ బంచమప్రశ్నమునకు సామరస్య మెక్కడనుండిరాగలదు. అని మనసులో నడ్డదిడ్డముగ ననుకొనుచు "అయ్యా! మీపనియేదో నాకుఁ దెలియలేదు. మీకుఁదెలిసినయెడల సంతోషమే. అయినను రాజుగారిని మీరు చూచుట కిప్పు డవకాశములేదు. కావున దయ్యయుంచి దయ చేయుఁ" డని నేనంటిని. "ఇప్పటికవకాశములేకపోయినయెడలఁ బోనిమ్ము. రేపు పండ్రెండుగంటలకు వత్తును. అప్పుడు నేను దప్పక యాయనను జూచెదను. నీవందులకుఁ బూచిపడినయెడల నేను బోవుదు" నని యాతఁడు చెప్పెను. నేనంతట లోనికిఁబోయి రాజుగారిని గాంచి యీసంగతి మనవిచేయఁగ, వారందుల కిష్టపడలేదు. వారియనిష్టత నీత నికిఁ దెలియఁబఱుపగ నీతఁడు సరే! ఎందుల కిష్టపడలేదో హేతువులు చెప్పినగాని నే నిచ్చటినుండి కదలను. అని పలికెను. హేతువులు చెప్పవలసినబాధ్యత వారికి లేదని నే నంటిని. నేను "జంటిల్‌మను"

నగుటచేత నాకు హేతువు లడుగుట కధికారమున్నదని యాతఁడు తీంర్మించెను. నీవట్లుకాకపోవుటచే నీ కట్టియధికారమున్నదని యను కొనుట ప్రమాదమని దగ్గఱ నున్నవా రెవ్వరో యనిరి. సరే మఱియొక జమీన్‌దారునొద్దకుఁబోయెదనని చెప్పి యాతఁడు పోయెను.

ఆతఁ డేవో చిన్నపిల్లలబొమ్మలు చిన్నపటము లమ్ముకొనుటకు వచ్చినవర్తకుఁడని తరువాతఁ దెలిసినది. అట్లు స్పష్టముగఁ జెప్పరాదా? ఆయాటవస్తువులేవో లోనికంపి వానిని విక్రయించుకొనరాదా? ఈమాత్రపు టత్యల్పవ్యాపారమున కమెరికాగోడ వెందులకు? పశ్చిమార్ధప్రపంచాంతర్జాతీయసంఘ సంభాషణ మెందులకు? అఖిలజగన్నానాసంఘుసమ్మేళనసాంకర్యసన్నాహ మెందులకు? లోపల తాడికాయ-పైకి తాటికాయయునా? లోపలఁ గొట్టుగింజ పైకి గుమ్మడికాయయునా? లోపల డొల్ల పైకి డాబునా? ఇంత పనికిమాలినవ్యాపార మెందులకు? ఉన్నయూఁపిరి యెంతయో యంతయే యుపయోగించుకొనరాదా? గొంతునకు మించినయేడు పెందులకు? కాలికిఁదగని పరుగెందులకు? మూఁతికిఁ దగని కూఁత యెందులకు? ఎవఁడు మెచ్చునని నీయభిప్రాయము? జగత్తులోనివారందఱు జాత్యంధులు, నీ వొక్కఁడవే నేత్రములుగలవాఁడవునా? నీవంటి నిర్భాగ్యునివలన, నీవంటి మందుని వలన, నీవంటి నోటియొట్టపువానివలన, నీవంటి తుచ్ఛస్వభావుని వలన, నీవంటి యసత్యప్రలాపునివలన—నీవున్న సంఘము కెంతయగౌరవము గలుగుచున్నదో నీ వెఱుఁగుదువా? సంఘమున దాదాపుగ నందఱు నీవంటివారే యని పైవా రనుకొనినయెడల వారితప్పా? నీకబురులు కాలిపోను! నీకోఁతలు కూలిపోను! ఎంతసేపుచెప్పినను గవర్నరుగారి గందరగోలములు, గవర్నరుజనరలుగారి గాథలు, స్టేటు శక్రటరీగారి చిత్రములు—అఖిల భారతీయసంఘపు టల్లరులు, సర్వప్రజాసంఘుసమ్మేళనములే కాని యంతకంటె నొక్క యంగుళమైనఁ గ్రిందికి దిగవే! నీయాకాశపు బలిటీల కంతమే కనఁబడదే—నేలవిడిచిన సాము నీయిల్లు బంగారముగాను—ఎన్నిసంవత్సరములనుండి చేయుచుంటివో! ఒక్కఁడైన నీకిది నీతిగాదని చెప్పియుండఁడేమి? ఈసంగతి సాక్షిసంఘమునకు వ్రాసినయెడల నిట్టి వ్యక్తులనుగూర్చి విమర్శింతు

రేమో యని వ్రాసితిని. మీజంఘాలశాస్త్రి యిట్టి వ్యక్తులనుగూర్చి యింక నేల యుపేక్షించినాఁడో తెలియకున్నది. ఇట్టి గుల్లరకపుసరకు, ఇట్టి కీచుపిట్టలు, ఇట్టి యోటికుండలు, ఇట్టి బుడబుక్కలవేసములు, అన్ని జాతులలో— నన్ని దేశములలో— నన్ని కాలములలో— నన్ని వ్యాపారములలో— నన్ని పదవులలో— నన్ని పరిస్థితులలో బహుళముగా నున్నవి. భక్తిలో నొకవ్యక్తిని, జ్ఞానములో నొకవ్యక్తిని, కర్మములో నొకవ్యక్తిని Co-operationలో నొకవ్యక్తిని Non Co-operation లో నొకవ్యక్తిని, మేళముగట్టి సాక్షి సభారంభమున నొక్కనాటకము మీజంఘాలశాస్త్రి యింక నేల యాడలేదో తెలియకున్నది. మీకును మీశాస్త్రిగారి కనేకనమస్కారములు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# 9. హరిభక్తురాలివైభవము

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా ! మన సాక్షిసభారంగమున నొక్క హరిదాసుఁడు నేఁ డుపన్యసించును. అదిగో—ఆ హరిభక్తుఁ డిటకుఁ వేంచేయుచున్నాఁడు. లేచి వారికి స్వాగత మీయవలయును. (అంద అట్లు చేయుదురు) స్వామీ! యిట్లు దయచేయుఁడు. భాగవతోత్తమా! మిమ్ముఁగూర్చి యిదివఱకే సభాసదులతో విన్నవించుకొంటిని. ఇఁక మీ రుపన్యాస మారంభింపవచ్చును.

హరిదాసుని యుపన్యాసము

"మేషార్ద్రాసంభవమ్ విష్ణో ర్దర్శనస్థాపనోత్సుకమ్,
తుండీరమండలే శేషమూర్తిం రామానుజం భజే."

శ్రీమతే రామానుజాయ నమః.

"శ్రీమద్భూతపురీశ కేశవనివేశీ భూతహృత్పద్మని
ష్కామావేశ పరాశరాదికమునీశశ్రేష్ఠవాగ్వంశని

స్సీమ ప్రాభవరంగరాజపదమస్థేమ ప్రకాశా యతీ
శా, మాణిక్యమయత్రిదండకరదేశా, కేశవార్యాత్మజా."

శ్రీమతే రామానుజాయ నమః—దేవరవారల తిరువడిగళ్లదర్శన మడియేనికి లభించుటచే నీదాసుఁడు—ఈదీనుఁడు—ధన్యాత్ముఁడు. మహాధన్యాత్ముఁడు. దేవరవారల సన్నిధానమునందు దేనినిగూర్చి యైన నుపన్యసింపవలసిన దని యీమందబుద్ధి కాజ్ఞయగుటచేత దేవరల యాజ్ఞయే మహాప్రసాద మని సాత్త్విసంఘరంగమం దడియేను భయ భక్తివినమ్రుఁడై నిలువఁబడినాఁడు. ఉపన్యాసములకు విషయములు ప్రపంచమున రెండే యున్నవి మూఁడవది లేనేలేదు. ఎంతసేపు చెప్పినను నెన్నియుపన్యాసములు చెప్పినను, నెవ్వరు చెప్పినను, నేదేశమునఁ జెప్పి నను తత్తునుగూర్చి చెప్పవలయును. తదీయులను గూర్చి చెప్పవల యును. అంతకన్న విషయము మఱియేమున్నది. 'తత్' అనఁగాఁ బరమ పదనాథుఁడైన పద్మదళాయతాక్షుఁడు. తదీయులనఁగా నామహామహుని పాదపద్మములను భక్తితో సేవించువారు. హరిభక్తులారా! నేఁటి దిన మొక్కహరిభక్తురాలి వైభవమునుగూర్చి యుపన్యసించి జిహ్వను జిత్తమును బవిత్రము చేసికొందును. దేవరవారందఱు శ్రద్ధాళువులై యాకర్ణింపవలయును.

"భక్తవర్యులారా! యతిరాజశేఖరులగు రామానుజాచార్యుల వారు—శ్రీమతే రామానుజాయ నమః—అదిగో—అదిగో—ఇద్దఱు శిష్యులతో నష్టసహస్రనామగ్రామమునకు వెలుపలనున్న యుద్యాన వనమునఁ బున్నాగవృక్షచ్ఛాయను వేంచేసియున్నారు. ఆహా! పున్నాగ వృక్షమా! నీజన్మ మెంత ధన్యమైనది! పూర్వయుగమునందు బాల గోపాలకృష్ణపరబ్రహ్మము నిన్నాశ్రయించియే కదా భక్తమణులను దరింపఁజేసినది! జగచ్చేతన తారణార్థ మవతరించిన శ్రీమల్లక్ష్మణయోగి వర్యులుకూడ నిన్నే యాశ్రయించియున్నారే. పురుషుఁడై పుట్టుట కంటెఁ బొన్నచెట్టై పుట్టుటయే పురుషార్థమేమో! అదిగో రామానుజా చార్యులవారి యిద్దఱుశిష్యులుకూడ శ్రీముఖములతోను మంత్రాక్షతల తోను గ్రామములోనికి వేంచేయుచున్నారు. వారు యజ్ఞేశుఁడను సంపన్నవైశ్యునియింటికిఁ బోయి యాగృహమేధికి జగద్గురుని శ్రీముఖ

మును జూపి మంత్రాక్షత లతనితలయందుంచి విశిష్టాద్వైతస్థాపనాచార్య వర్యులును త్రిదండిశేఖరులు నగు శ్రీమద్రామానుజులవారు శిష్య సంచారార్థమై బయలుదేఱి యీగ్రామ బహిఃపురోద్యానమున వేంచేసి యున్నారు. మీరు వారి శిష్యకోటిలోఁ జేరినవారగుటచే యతి రాజారాధన మొనర్చి కృతార్థులు కావలయునని విన్నవించుచున్నామని యతనితోఁ బలికిరి. శ్రీరామానుజులవా రంపిన శ్రీముఖము సెనగల బేరపుఁ జీటియో పెసలబేరపుఁ జీటియో యగునెడల నాశ్రీమంతుఁడు శ్రద్ధతోఁ బరిశీలించియుండును. ఉడయవరుల శ్రీముఖములో వడ్డి పడతున్నదా? వడ్డికి వడ్డిపడతున్నదా? భూమి తనఖాపడతున్నదా? ఏమున్నదని దాని నాసంపన్నుఁడు దీక్షతోఁ జూడవలయును? ఏమున్న దని సందేహమేల? మహాత్ముని మంగళాశాసన మున్నదికదా? మహా త్ముల కెక్కడికి? మంగళాశాసనముల కెక్కడికి? మాటల కేమి కొదవ? ఆశీర్వాదముతో నాయుష్యములా? తథాస్తులతో ధనాగమ ములా? ఎక్కడిమాటలు! వేదబుక్కులకు దిక్కులేకుండ నున్నది. ప్రాచీనమంత్రములఁ బలుకుబడి కనఁబడకున్నప్పు డిప్పటి మతగురువుల మంగళాశాసనములకా? అక్షతలతో నైశ్వర్యములు వచ్చుమాట యున్నయెడలఁ గోణిదెడుబియ్యపుగింజలతోఁ గుబేరులు కావలసినది కాదా? మాటలదారి వేఱు. మూఁటలదారి వేఱు. ఏదో గతాను గతికన్యాయముచేత, లోకమర్యాదకొఱకు, తప్తచక్రధారణకాలమందు తోఁచినదేదో గురువునకు ముట్టఁజెప్పనే చెప్పినాను. మూఁడుమూఁడు నాళ్లు కడియేపనియా? ఏదో యొకసారి యయిపోయినది. అంతేకాని యిదియేమి మాసికమా? తిర్వధ్యయనమా? జయంతియా? తిరు నక్షత్రమా? రాహుకాలములాగునఁ బ్రతిదినము వచ్చుచుండినయెడల శిష్యులకు వేఱ సన్న్యాస మక్కఱలేదు. సొగసుగనే యున్నది. సాగు చుండుటచే సరి”యని యాతఁడుమనస్సులో నేమేమి యూహించుకొనెనో కాని యాగురుశిష్యులతో నేమియుఁ బలుకక మొగము చిట్లించు కొని లోనికిఁ బోయెను. ఇట్లుపేక్షింపఁబడిన శిష్యులు తమ గురుపాద ములయొద్ద కేగి యెంతయు వినయవిభ్రాజితులై విన్నవించుకొనిరి. మహాత్ముఁడు మందహాసమొనర్చి నారాయణనామస్మరణ మొనర్చుచు

లేచి, కరాగ్రగతత్రిదండకమండలుఁడై, కాషాయాంచలాచ్ఛాదితమస్తక మండలుఁడై శిష్యులు కోశరాజములను దివ్యారాధనపుఁ బెట్టెను వహించి వెంటఁజనుదేర నాగ్రామమం దెవ్వరియింటికో కాని పోవు చున్నారు. ఆయదృష్టశాలి యెవఁడో! ఆపుణ్యరాశి యెవఁడో! ఆలౌకిక తపోనిధి యెవఁడో! పాదములపైఁబడి భిక్షావందన మొనర్చి నాగృహ మును బవిత్రమును జేయుమని నాజన్మమును గృతార్థమును జేయుమని నాచిత్తమును శేషగుణసంపన్నముగఁ జేయుమని నాయాత్మను దరింపఁజేయుమని మనఃపూర్వకముగఁ బ్రార్థించినఁగాని యథార్థ భక్తితో నాశ్రయించినఁగాని బయలుదేఱరాని యతిరాజశేఖరుల ప్రార్థనపూర్వకముగ, ననాయాసముగ, ననుగ్రహపూర్వకముగఁ దన యంతదానే యేమహాపురుషుని యింటికో పాదచారియై వేంచేయు చున్నారే! ఆహాహా! అదిగో మొండిగోడలేకాని పైన మదురైనలేని- కప్పున్న పేరేకాని పైనఁ బదిచేతులు తాటియాకులైనలేని, ద్వారమన్న పేరేకాని లోన గొండ్లమైనలేని-యాకుటీరమునొద్ద-ఆహాహా! భాగవ తోత్తములారా! చూచుచుంటిరా! అఖిలదారిద్ర్యలక్షణోపేతమైన యాకుటీరమునొద్ద మాణిక్యమయత్రిదండధారియు యతిసార్వభౌముఁడు నగుమహాత్ముఁడు నిలువఁబడినాడే! ద్వారమున కీవైపుననున్నఁ బెరియతిరు వడి యావైపుననున్నఁ జిఱియతిరువడి యావైపుననున్న శంఖము నావైపుననున్న చక్రమును వానినడుమను జిత్రింపఁబడిన శ్రీరంగనాథుని శ్రీపాదములను వానినడుమనున్న శ్రీచూర్ణరేఖ నామహాత్ముఁ డవ లోకించి యవనతశిరస్కుఁడై యానందబాష్పము లంభోజసన్నిభము లగు నక్షులనుండి విడుచుచున్నాఁడే! ఒక్కనిమేషకాల మట్లు నిలువఁ బడి వరదాచారీ యని పిలువుమని యొకశిష్యున కాజ్ఞాపించిరి. ఆహా! రామానుజశిష్యుఁడగు వరదాచార్యులవారి తిరుమాళిగ యదే! "వర దాచార్యవర్యా" యని యాశిష్యుఁ డాచార్యాజ్ఞ ననుసరించి పిలువఁగ ఆహాహా! వారెవరు? ఆగుమ్మమునొద్దకు లోపలినుండి యట్టెవచ్చి యట్టె లజ్జాసాధ్వసాక్రాంతయై తలుపులువైచికొని లోని కట్టెపోయిన వారెవరు? ఆమెయే తిరుప్పత్తికొల్లైనాచ్చియారు. వరదాచార్యుని ధర్మపత్ని—మహాసాధ్వీమణి—పూర్వజన్మ మహాపుణ్యమునఁగాని లభిం

పని యతిరాజశేఖరదర్శన మామె కయాచితముగ నిట్లు లభింపఁగ, గురువరేణ్యుని కెదుట నిలువఁబడి ప్రదక్షిణ మాచరించి నమస్కరించి యర్ఘ్యపాద్యములిచ్చి యాదరించి లోనికిఁ దీసికొనిరావలసినదా? దభాలునఁ దలుపులుమూసి గోడచాటునకుఁ బోయి దాగవలసినదా? ఆపతివ్రతాశిరోమణి యింత భాగవతాపచార మొనర్చినదేమి చెప్పుమా? ఆసాధ్వీరత్నము గురుదేవుని యెదుట నేల నిలువఁబడలేకపోయెనో చెప్పనా? చెప్పినయెడల మీమనస్సుల కిబ్బందిగనుండునేమో? నాయనలారా! చెప్పనా! ఆమెకుఁ గట్టుకొనుట కొడలునిండిన గుడ్డయే లేదు. మొలకుఁ జుట్టుకొంపమన్న—హరిహరీ! పైఁటకులేదు. పైటవేసికొంద మన్న—రామరామా! మొలకులేదు. నానోరు చచ్చిపోవఁగ నీమాట లాడితిని. ఇంతకన్న నేమిచెప్పఁగలను? రెండుమూళ్లగుడ్డతో నా యరుంధతీదేవి కాంతునితోఁ గాఁపురముచేయుచున్నది. నాయనలారా! యేపుట్టగోఁచి పెట్టుకొన్ననైనఁ బురుషునకు దినములు దొరలిపోవును గాని యయ్యయ్యో ఆఁడుదాని కట్లుజరుగుట సాధ్యమా? ఇట్టిమహారిక్తుల యింటిముందా యాశేషాంశసంభవుఁ డవతరించినాఁడు! తలుపట్టైచుకొని లోని కాయిల్లా లేలపోయెనో గురువరేణ్యుఁడు గ్రహించి కంటికొలుకులు గాసంతయరుణములుగాఁగ—నార్ద్రములుగాఁగ—దన తిరుమేనిపై గప్పుకొనిన కాషాయాంబరమును దీసి—మదురులేని గోడపైనుండి—యింటిలోనికి విసరివైచెను. మహాప్రసాదము మహాప్రసాదమని యామగువ లోనుండి కేకవైచెను. ఆహాహా! యతిరాజవర్యా! లోకోద్ధరణార్థ మవతరించిన నీపవిత్రమైన యొడలిస్పర్శమున మహాపవిత్రమైన కాషాయశాటిని, జగమంతయు నాక్రమింపఁగల దయారసముగల నీహృదయప్రదేశమునం దాచ్ఛాదనభాగ్య మవదరించిన కాషాయశాటిని—అన్నిదివ్యదేశములం దర్చావిగ్రహముగ నిప్పుడారాధింపఁబడుచున్న నీదివ్యమంగళమూర్తిపైఁ బ్రకాశించినకాషాయశాటిని—ప్రణవజపావసరమున నీతిరుముఖమండలముపై రవంత వ్రాలియుండుటచే తన్ముఖోద్ధి కాలంకార దివ్యసౌరభ సంవాసితాంచలమైన కాషాయశాటిని—రామానుజమునీంద్రా! అత్యంతరిక్తురాలగు నబలాశిరోమణి మానసంరక్షణార్థమై వినియోగించితివా? సెబాస్!

లోకోత్తరతపస్సంపన్నా ! భాగ్యవతులగు నా గ్రామమందలి కాంతలు— ఆమె యసాధారణయోగ్యత నాకర్ణించిన సన్నిహితగ్రామకాంతలు— ఎందఱో—యెన్నిపర్యాయములో—ఆమెకుఁ బీతాంబరములు స్వర్ణచేలములు కానుకలుగాఁ బంపియుండినను, వలదు వలదని వాని నన్నిటిని వినయపూర్వకముగఁ దిరుగ వారివారికిఁ బంపివైచిన స్వార్థపరిత్యాగిని—సాధ్వీశిరోమణి—సన్న్యాసియిచ్చిన శాటిని సంతోషపూర్వకముగ గ్రహించినదా ? అదిగో ! అదిగో ! పండుటాకులలోఁ గప్పఁబడిన పుష్పమువలె శాటీసంవృతయైయున్న సాధ్వీమణి యదిగో! తలుపులు తీసికొని పైకివచ్చి పరివ్రాజకోత్తమునకుఁ బ్రదక్షిణ మాచరించుచున్నదే! ఆహా! భాగవతతేజమునకుఁ బతివ్రతాతేజము ప్రదక్షిణ మొనర్చుచున్నదే! ఆతఁడు రామానుజులని యప్పటి కామెకుఁ దెలియదు. వరదాచారి యేఁడని యాయన ప్రశ్నింపఁగ భర్తవలన నిదివఱకు రామానుజయాత్రనుగూర్చి వినియుండుటచేత నాయన రామానుజు లని గ్రహించి "మహాత్మా! ఉంఛవృత్తికై వెడలినారు. వారిబదులుగ నేను భిక్షావందన మర్పించుచున్నాను. దయయుంచి నాయాతిథ్యమును గైకొని మాకుటీరమును బావనమొనర్ప వేఁడుచున్నాను" అని వినయపూర్వకముగ విన్నవించుకొనెను. రామానుజులు శిష్యసమేతులై లోనికి దయచేసిరి. అంత నామె చప్పునఁ జూరితాటియాకొకటి లాఁగి శుద్ధోదకముల గడిగి శాటి చెఱఁగుచే దుడిచి యాయతిపతి యాసీనుఁడగుట కాస్తరణముగ నమర్చెను. నారాయణస్మరణ మొనర్చుచు నామునిపుంగవుఁడు దానిపై సుఖాసీనుఁ డయ్యెను. ఆహా! యతిచక్రవర్తీ! పతివ్రతాతిలక మిచ్చిన వ్రాఁతతాటాకుపై నుపవసించినంత యుత్సాహముతో మహారాజార్పితమణిమయాసనములపై నుపవసించియుండవుగదా! మానినీతిలకమా ! నీమాహాత్మ్య మేమనవచ్చును? అనేకధరాకాంతకిరీట మణిఘృణీరంజితపాదపీఠుఁ డగు పరివ్రాజకోత్తముని వ్రాఁతతాటాకుపై నధివసింపఁజేసితివే. అమ్మా ! అమ్మా! నీవు యతిరాజసేవచేఁ దరింతువో లేదో కాని నిన్ను స్మరించినంతమాత్రమున మేము తరింతుమనుమాట నిశ్చయము. నాయనలారా ! మనకామె తల్లివంటిది. కావున నామెవంకఁ జూచినఁ దప్పులేదు అదిగో ! చూడుఁడు.

కాషాయాంబరాచ్ఛాదితయైన యామె యెట్లు వెలిఁగిపోవుచున్నదో! మొదలేస్త్రీతేజము. దానిపైఁబాతివ్రత్యాగ్నిజ్వాలాతేజము. మఱిదానిపై సర్వసంగపరిత్యాగ సంయుక్తప్రపంచాతీత సన్యాసినీతేజము ప్రసన్నమై, యప్రేక్ష్యమై, చల్లనై, యుష్ణమై, పరశాంతమై, భయంకరమై ప్రకాశించుచున్న యాతేజ మవర్ణ్యముకదా! అప్రతిహతముకదా! అనుపయానముకదా! అలౌకికముకదా! నాయనలారా! రామానుజులవారామెతో నేమో యానతిచ్చుచున్నారు వినుఁడు. "అమ్మా! వరదాచార్యసహధర్మచారిణీ! నీయాతిథ్యమునకు మిగుల సంతసించితిని. సర్వజనసమాదరణీయమైన సద్గుణసమాజము నీయందున్నది. శ్రీరంగదేవ నివేదనమునకై యీదినమునఁ దళిహ నీవే యొసర్పుము. ఇఁక గృహకృత్యముల నిర్వహించుకొనుము" అని రామానుజులవారాయమ్మతో సెలవీయఁగ మహాభాగ్యమని యామె వంటయింటిలోనికిఁ బోయెను. వంటయింటిలో నేమున్నది? ప్రొయ్యియున్నది. దానిలో రవంత బూడిదయున్నది. అంతే అంతకంటె నేమియులేదు. ఒక్కయరగిద్దెడు నూకలు లేవు. ఒక్కయుప్పుగల్లులేదు. ఒక్కచింతపండుట్టిలేదు. శ్రీరామరక్ష శ్రీరామరక్ష. ఆహా! పరాత్పరుఁడా! ఆదంపతుల నెంతదారిద్ర్య మనుభవింపఁజేయుచున్నావు. తండ్రీ! ఎందుకొఱకు? ఎందుకొఱకు? పాదభక్తులను బాధించుటకేనా కంకణము కట్టుకొంటివి? దయలేదా! దాక్షిణ్యములేదా? ఇది నీ విలాసమా? వారి ప్రారబ్ధమా? కాక మా మతిలేని యేడుపా! పై రెంటిమాట నాకంతతెలియదు. కాని యీచివరది సిద్ధాంతము. వారు దరిద్రతార్తి నెఱుఁగనే యెఱుఁగరు. సంతుష్టచేతస్కులై సంతతసౌఖ్యసంయుక్తులై వారు సంసారమును జరుపుకొనుచున్నారు. కడుపునిండిన సంతుష్టియే యామెకు లేకుండునెడల గజమున్న అకట్టుపేలికతో నాకాంత కాఁపురముచేయఁగలదా? ఊరఁదిరిగి నేరుబియ్యముచేకూర్చుకొని యింటికి వచ్చినభర్తను మఱియొక పావునేరుబియ్యము తెచ్చుటకుఁ గాళులు పీఁకుకొనిపోయెనా యని యిల్లా లీసడించును. సరిగంచు జగ్గయపేటచీరగల జవరాలు జపానుసిల్కువస్త్రము లేకపోయెనే యని మగనికి వెన్నిచ్చి మంచపు బట్టె కౌఁగిలించుకొని పండుకొనును. తారహారములోనికిఁ దాంద్రబెత్తెంత పచ్చయేనా తెచ్చితివి? అరచేయియంత

గాత్రపుది తేవలయునని యెఱుఁగవేమి యని పాదుషాచెవి పట్టుకొని
భార్య జోంకాయించును. ముష్టివాఁడు మోరపాకలో ముష్టియేడు
పేడ్చుచున్నాఁడు. సామాన్యుఁ డింటిలో 'ఇంటర్మీడియటు' యేడు పేడ్చు
చున్నాఁడు. పాదుషా పైయంతరుపై ఫస్టుక్లాసు యేడు పేడ్చు
చున్నాఁడు. తుడుము మొదలుకొని దేవతార్చనవఱ కంద ఱేడ్చుచునే
యున్నారు? ఎవనిమట్టునకు వాఁడు గంభీరముగాఁ గ్రమ్ముదలగా నొకఁ
డేడ్చినట్లు రెండవవానికిఁ దెలియనీయకుండ మర్యాదగా—మానుష
ముగా నేడ్చుచున్నాఁడు. నోరు తెఱచి పైకి బొరున నేడ్చినయెడల బాధ
తీఱియేపోవునేమో! అట్లుకాక నోరుమూసికొని కుమిలికుమిలి క్రుళ్లి
క్రుళ్లి యేడ్చుటచేతనే మఱింత పుష్టిమునుఁగుచున్నది. సౌఖ్యము లేదు.
నాయనలారా! సంసారములో సౌఖ్యము లేదు. సౌఖ్యమనునది చల్ది
గంజిముంఁతకుటిలోను లేదు. స్వర్ణక్షీరపాత్రములోను లేదు. సంతు
ష్టిలో నున్నది. అట్టిసంతుష్టిని నిరంతరముగల వరదాచార్యధర్మపత్నికి
నామె భర్తకు సౌఖ్యమున కిప్పటి కేమియు కొదవ లేదు. మధ్యాహ్న
మగుసరికి మగఁ డుంఛవృత్తిచే సోలెఁడుబియ్యమును దెచ్చును. ఆ
నూకలు పొంగఁబెట్టుకొని తదన్నము తద్రసముగా వా రొక్కపూటనే
భుజియింతురు. మఱునాఁటి కొక్కబియ్యపుగింజయైన నిలువయుండదు
సరే. ఇదివఱకు దినము లెటులో గడచిపోయెను గాని యాయిల్లాలి
కీదిన మెట్లుగడచునో? రామానుజులవారు శిష్యు లిద్దఱితో నింటికి
వేంచేసిరే. శ్రీరంగనివేదనమునకు చిత్రాన్నదధ్యోదనక్షీరాన్నాదిపక్వా
న్నములు కావలయునే. అవియెట్లువచ్చును? అంతవఱ కెందులకు? అత్తె
సరు మెదుకులైన వచ్చునాధార మేది? స్వాములవారు తిరువాధనమారం
భించినారు. భర్తవచ్చువఱకు పచనాదిక్రియ లాఁగునా? ఆఁగక జరుగు
నుపాయ మేమున్నది? భర్త వచ్చుననియే యనుకొందము. సోలెఁడు
నూకలతో నైదుగురికి సాపాటెట్లు? చుట్టుపట్లనున్న యమ్మ లెవరైనఁ
జేబదులీయరా? తీర్పలేనిదాని కొక్కగింజయైన దొరకునా? బియ్యము
దొరకుననియే యనుకొందము. తండులములలోని కెన్నివస్తువు
లున్నఁగాని యతీశ్వరభిక్షయగును? ఈవస్తువులన్నియుఁ జేబదు లెచ్చట
దొరకును? వట్టికల్ల. పోనీ! బదు లెందులకు? ఒక్కయిత్తడి చెంబును

విక్రయింపరాదా? ఏబాధయు లేదే. ఇత్తడిచెంబే! ఎంతమాట! అది యుండినవాఁ డెంతవాఁడు! అదిగో! ఆడాకతో వండుకొనుచున్నారు. ఆకడముంతతో నీరు ద్రావుచున్నారు. హరిహరీ! పోనీ! మెడలో మంగళసూత్ర మమ్మి యతిసంతుష్టి యొనర్పఁగూడదా? రామరామ! బొందున్న బసపుకొమ్ముతక్క మఱియేదియు లేదే! ఇట్టిస్థితిలో నాపడఁతి సన్యాసి సమారాధన మెట్లాచరింపఁగలదో రంగరంగరంగా! ఆయింతి కెట్టియిక్కట్లు తెచ్చిపెట్టితివయ్యా! ఎట్టిసంధి తెచ్చిపెట్టితివయ్యా! ఇఁక నేమికావలసినది? ఏమిచేయుటకును దోఁపక యా యిల్లాలు ప్రొయ్యియొద్దఁ గూరుచుండి కడుపు దఱుగుకొనిపోవఁగ నెట్లేడ్చుచున్నదో! సామాన్యుఁడగు నతిథియే విష్ణువని చెప్పినప్పుడు సన్యాసి యగు నతిథి యెంతవాఁడో చెప్పవలయునా? అందులో జగద్గురుఁడగు నతిథి యాధిక్య మెన్నుట కెవనితరము? ధనము లేనంతమాత్రమున నట్టి వాని కాతిథ్యమీయక నిరాకరింపవచ్చునా? నిరాకరింపక చేయవలసిన దేమున్నది? అయ్యయ్యో! ఆరమణీశిరోమణి రంగరంగాయని కురరివలె విలపించుచున్నదే. రంగరంగా! యెక్కడనుంటివయ్యా? అయ్యయ్యో! ఈగూటిలో నొకవరహా దొరకరాదా? ఆగుంటలో నొక్కరూపాయ దొరకరాదా యని మతిలేనిదానివలె గూళ్లలో నెమకుచున్నదే— గుంటలు త్రవ్వుచున్నదే! కాని యదియేమి? ఆమె మొగము తీక్ష్ణముగ నగపడుచున్నదేమి? చిత్తజల్లువలె నాయెండలో వర్షము కురియుచున్నదేమి? హాహా! ఆమె భయంకరస్వరూపిణిగ నున్న దెందువలననో! ఏమిచెప్పుమా? ప్రాణత్యాగ మొనర్చుకొనునా? అట్లుచేసిన యెడల యతిభిక్ష యేలాగున? ఒకపాపముతో మఱియొక పాపము కూడనా? కన్నులనుండి జాఱుచున్న బాష్పములను శాటిచెఱఁగుచేఁ దుడిచికొని రెండుచేతుల పైకెత్తి మింటివంక చూచి "రంగరంగా! తుచ్ఛమైన యీదేహము నేధనవంతునికైన విక్రయించుకొని సన్యాసి సంతర్పణ మొనర్చెదను. ఈదినముతో నాసాధ్వీత్వము సరి. రంగరంగా! కటాక్షింపుము" అని పలుకుచున్నదే. అయ్యయ్యో! ఇవి యామె యనినమాటలేనా? రామరామా! సాధ్వీతిలక మెంతసాహసమున కొడిగట్టినదో! అయ్యయ్యో! పరివ్రాజక సమారాధన మాచరింప నిశ్చ

యించుకొనినదా ? అయ్యయ్యో ? అప్పుడే యింటినుండి బయలుదేరినదే! ఆహా! ఆహాహా! ఇప్పుడైన నామెకాళులకు దారిలో నాల్గురాపాయ లున్న మూఁట దగులరాదా ? మూఁటయువలదు ముల్లెయువలదు ఆమె మృదులారుణచరణముల కేదైన కఱుకుఱాయి దగులుటచే నామె ప్రయాణ మాఁగిపోరాదా ? రంగరంగరంగా! నీవామెకు బ్రసాదించిన మహాదారిద్ర్యమువలననేకదా యానారీశిరోమణి యిట్టిఘోరకృత్యము నొనర్ప నిశ్చయించుకొనినది. నీవైన నామె నాఁపజాలవా? ఇది పాపమే యగునెడల నీపాపమునకు బాధ్యుఁడవు నీవగుదువు. జాగ్రత్త! రంగరంగరంగా! రక్షింపవా? ఱాయియైన నడ్డుపడదే. రంగఁడైన నడ్డుపడఁడే! అయ్యయ్యో! వీధివెంటఁబోవుచున్నదే! ఫాంటెన్ అను స్త్రీ తానుగన్నపిల్లను సంరక్షించుకొనుట కాధార లేశమైనలేక తెగబాతెఁడైన తన తలవెండ్రుకలను సవరములుకట్టువాని కమ్ముకొని వచ్చిన సొమ్ముతోఁ బిల్లను బెంచుకొనెనని 'విక్టర్ హ్యూగో' అను మహాకవి మహావిశేషాంశముగ 'లెస్‌మిసరబిల్స్' అను గ్రంథరాజమునఁ జెప్పెనాఁడు. వరదరాజధర్మపత్నిచరిత్రము ముందామెచరిత్ర మెంత ? వెండ్రుకలు కత్తిరింపించుకొన్న విశేషమేమి ? సంవత్సరము తిరుగకుండ సందేఁడు వెండ్రుకలు తిరిగివచ్చును. ఆహా! పోయిన పాతివ్రత్య మట్లు తిరుగ వచ్చునా ? చచ్చినవాఁడు తిరుగ జన్మింపవచ్చును గాని మాసిపోయిన మగనాలితనము మఱల వచ్చునా ? అదిగాక నోరులేని పిల్లకొరకుఁ దల్లి పడిన పాటులకును శిష్యురాలు గురువుగారికొఱకుఁ బడినపాటుల కెంత వ్యత్యాస మున్నది! ఓ ప్రపంచమంతవ్యత్యాసమున్నది. కన్నకొడుకు కొఱకు గాడిదకాళ్లు వసుదేవుఁడు పట్టుకొన్నాఁడని చెప్పుదురు. పైవాని కొడుకుకొఱకు గాడిదకాళ్లతఁడుపట్టుకొన్నయెడల నప్పుడు వసుదేవుని భళీయనఁదగినదికాదా? ఏకష్టములొందియైననెవరిపిల్లలను వారుపోషించుకొనుటలో విశేషమేమున్నది? "కం. దిక్కును దెసయునుగలుగని పెక్కుఱ బిడ్డలనుబెంచుప్రేమాంబునిధీ" యని యెవనినిగూర్చి పలుకఁదగునోయా మనుజమార్తాండుఁడే మహనీయుఁడుకాదా ? ఆహాహా ! కాంతాశిరోమణీ! నీవంటిపతివ్రతయార్యావర్తమునఁగానిమఱియెక్కడనుండఁగలదు? ఆహా! ఆర్యావర్తదేశమా! నీపూర్వనాగరకతయంతయు బుగ్గియైపోయి

నను నీఘనతయంతయు గడ్డలైనను, నీమయూరసింహాసనాది సంపత్తి యంతయు నంతరించినను, నీమతసంప్రదాయసామగ్రియంతయు మాసి పోయినను, నీస్వాతంత్ర్యమంతయు చట్టుబండలైనను, నీపురుషులం దనేకులు దేశభక్తిరహితులై దేశభాషాజ్ఞానశూన్యులై బలహీనులై బ్రజ్ఞాభావులై ప్రాచీనాచారదూరులై స్వార్థశీలురై సంసారసుఖలంపటులై యేటికొకరు కోటికొకరులాగుకొని కుమ్ములాడుచు బహుధావిభిన్నులై పాడైపోయినను నీకుఁ బ్రపంచమున నిట్టి దురవస్థలలోనైన నింత మాత్ర ఘనతయైనను మిగిలియుండుటకు నీస్త్రీల పాతివ్రత్యమే కారణముసుమా! ఆహా! వరదరాజధర్మపత్నీ! ఆగుమ్మ మెక్కుచుంటివా? హరిహరీ! ఆఁడుది స్వయముగాఁబోయి మగవాని నడుగఁగూడదనియైన నెఱుఁగలేవమ్మా! ఎంతముద్దరాలవమ్మా! ఎంతనిష్కపటివమ్మా! అదిగో! అదిగో! ఆవైశ్యునియొద్ద నిలువఁబడినది. ఏమనునో? ఏమనునో? ఆహాహా! భూకంప మొదవుచున్నదా? మనమనసులోఁగలిగినవడ కేనా? “ఓవైశ్యవర్యా! నీయొద్ద కొక్కపనికై వచ్చితి” నని యామె పలికెను. ఆతఁడు తలయైన నెత్తక యామాటలను వినిపించుకొనక యేవో లెక్కలు చూచుకొనుచుండుటచే నొక్కనిముస మీయిల్లా లాఁగి పోవలసివచ్చినది. అయ్యయ్యో! అభిప్రాయసూచకముగ,నర్మగర్భముగ ధ్వని ప్రధానముగఁ బలుకకుండ పగులఁగొట్టినట్లే చెప్పునుగాఁబోలు! హరిహరీ! ఏమైన నెఱుఁగునా? వట్టిగోల!

ఏమాయయు నెఱుఁగదే—ఏకల్మషము నెఱుఁగదే. శుద్ధసత్వస్వరూపిణి—శుద్ధతేజఃస్వరూపిణి—మంచుగడ్డకైన మచ్చయున్నదికాని యామెమనసున మచ్చలేదే—చిన్నిపూఁదేనెయందైన జేఁదున్నది కాని యామె హృదయరసమునఁ జేదులేదే—సూర్యకిరణమునకైన సూటి తక్కువతనమున్నది కాని యామెవర్తనమున వంకలేదే—ఆకాశమునకైన మఱుఁగున్నదికాని యామెయంతరంగమున మఱుఁగులేదే! ఆహాహా! అట్టికాంత కెట్టిప్రారబ్ధము సంభవించినదో! హరిహరీ! కాని యీామె యిప్పుడేవో మాటలాడఁబోవుచున్నది. నాయనలారా! వినుఁడు. “వైశ్యరాజా! జగద్గురువర్యుఁడగు శ్రీమల్లక్ష్మణయోగిపుంగవులు మాకుటీరమును బావనమొనర్పఁగ దయచేసినారు. వారి సత్కార

సమారాధనాదులకు నాయొద్ద నొకగవ్వయైన లేదు. నాదరిద్రస్థితిని
బట్టి నాకు ఋణమిచ్చువారెవ్వరును లేరు. నీవు మొగము చిట్లించుకొన
నక్కఱలేదు. నిన్ను ఋణమడుగుటకు వచ్చినదానను గాను. తాక
ట్టిచ్చుటకు నా కీతనువుతక్క తదితరమేదియు లేదు. ఈరాత్రి దీనిని
నీకు భోగార్థ మద్దేకీయ నిశ్చయించుకొంటిని. యతిసమారాధనమునకు
నాకుఁ గావలయు సామగ్రినంతయు నీవీయఁగలవా?" యని యామె
యాతని నడిగెను. ఇదివఱకు జిట్లించుకొన్న మొగ మిప్పుడు వికసించినది.
ఇదివఱకు వ్యతిరేకపుజూపులజూచినవాఁ డిప్పుడు బాబాకరపుఁజూపుల
జూచుచున్నాఁడు. కూనవలె నిదివఱకుఁ గూలఁబడియుండినవాఁ డిప్పుడు
గువ్వపిట్టవలెఁ గులుకుచు నెగురఁబోవుచున్నాఁడు. ఇదివఱకు వెన్ను
మీఁది తామర గోకికొన్నవాఁ డిప్పుడు మూఁతిమీసాలను వంపు
చున్నాఁడు. ఇదివఱకు నల్లగ నిర్భేద్యముగ నిస్తేజస్కముగ నున్నవాని
కిప్పుడు నలుపు రవంతజాఱినట్లు రవంత తళుకు కళుకుగూడఁ గలిగిన
ట్లగపడుచున్నదే. ఆహాహా! శృంగారరసదేవతామహిమము! అందులో
నంతరంగమున కెక్కఁదగిన యాఁడుది తనంతతావచ్చి యడిగి
నప్పు డికఁజెప్పవలసినదేమున్నది? దిష్టిబొమ్మకుఁదేజఃప్రాణములు వచ్చునే?
పందికి, ప్రతిభాపౌరుషము లుదయించునే? గాడిదకు గాన ముద్భ
వించునే? కాని ఆవైశ్యరా జేమనుచున్నాఁడో విందురా? "రాత్రియా?
అబ్బ! అంతవఱకా? వెఱ్ఱిమొగమా! వ్యవహారములకెల్ల అదనే
ప్రధానము. అది రవంతయు దాఁటిపోనిచ్చినయెడల నెక్కడిసర
కక్కడే" అని యింక నాతడేమో చెప్పఁబోవుచుండగ "నేను మఱియొకని
యాచింతునని" యామె తొందరతోఁ బలికెను. "అయ్యో! ఒక్కటే
తొందర! కొట్టుదగ్గఱకు వచ్చినదేది? మొగముతిన్నగాఁ జూపినదేది?
అన్నిసరకులుగూడ నెంతప్రియముగా నున్న వనుకొన్నావు. సొమ్మా?
మఱియొకటియా? చూడు. సరే! నాకిష్టమే కాని యెందఱకు సరకులు
పంపవలయు" నని యాతఁ డడుగ, నార్గురకని చెప్పి తటాలునఁ
బోయెను. సామగ్రులన్నియు వచ్చినవి. వంటయైనది. రంగనాథనివేదన
మైనది. శిష్యులతోఁగూడ స్వాములవారి భోజనమైనది, ఆమెభర్త రాకకె
యెదురుచూచుచున్నది. ఇద్దఱకు సరిపోయిన సోలెఁడునూకలను

మూటకట్టుకొని వరదాచార్యులు లోనికివచ్చి గురూత్తమునకుసాష్టాంగ దండప్రణామ మాచరించి చేతులు జోడించుకొని నిలువఁబడెను. "వరదాచార్యా! నీభార్య మాకుఁ బంచభక్ష్యపరమాన్నములతో విందొనర్చినది. నీకుఁ బ్రొద్దుపోయినది. త్వరగ శ్రీపాదతీర్థమును దీసికొని భుజియింపుము" అని స్వాములవారు పలికిరి. "ఎట్లుజరిగెనో యేమో" యనుకొని 'మహాభాగ్య' మని యాతఁడు లోనికిఁ బోయెను! భార్య భర్తకు నమస్కరించి చేపట్టుకొని పంచపాళీలోనికిఁ దీసికొనిపోయి "ప్రాణకాంతా! యతిరాజశేఖరసంతర్పణమున కీసామగ్రియంతయు నెట్లువచ్చినదో యెఱుఁగుదురా ?" యని భర్త నడిగెను. ఆప్రశ్నయే నే నడుగఁదలఁచితి నని భర్త బదులుచెప్పెను. స్వాములవారు మన కుటీరమునకుఁ దమయంత దాము విచ్చేసిరి. వారు నాకిచ్చినకాటి యిదిగో! వారికి భిక్షనిచ్చుటకు మనయొద్ద నేమియు లేక పడమటివీథినున్న వైశ్యరాజు నింటికిఁబోయి యీరాత్రి నాశరీర మాతనికి భోగార్థమై యర్పింతుననని వాగ్దాన మొనర్చి సామగ్రిని దెప్పించి యతిపూజ నొనర్చితి నని యామె చెప్పుచుండగ "ధన్యోస్మి! ధన్యోస్మి! కాంతాశిరోమణీ! కులపావనీ! నీవట్లుచేసి నీవు కృతార్థురాలవైతివి. నన్నుఁ గృతార్థునిఁ జేసితివి" యని యామెరెండుచేతులు పట్టుకొని "పవిత్రచరిత్రా! ఇవి చేతులుకావు కాళులు" అనిచెప్పి కాసంతఘుర్మముచేఁ గంపముచేఁ గ్రాలుచున్న యామెకరములను బాష్పజలపూరితములగు తనకన్నులకు బదేబదే యద్దుకొని రంగరంగరంగా! నాయిల్లాలిమూలమున నాజన్మముగూడ తరింపఁజేసితివి. తండ్రీ! రంగరంగరంగా! యని రవంత సొమ్మసిలి తిరుగ లేచెను. ఆహాహా! వరదాచార్యవర్యా! నీభార్యయే లోకోత్తరస్వభావయని యాశ్చర్యరసనిమగ్నులమై యుండ నీవంతకంటె లోకోత్తరస్వభావుఁడవైతివా ? అహా! ఎంతవాఁడవోయి! ఎంత స్వార్థపరిత్యాగివి! ఎంతశాంతయుక్తుఁడవు! ఎంత గురువిశ్వాసముకలవాఁడవు! ఎంతదైవభక్తిగలవాఁడవు! నీమనస్సెట్టిదో తెలియఁబఱుచుటకు మాకు వాక్కులు లేవే! నీమన స్సెట్టిదో యూహించుకొనుటకైన మాకు మనస్సులేదే! బ్రతికియుండియు భార్యతోఁ గాపురము చేయుచుండియు నైహికలాంపట్య మణువులో సహస్రాంశమైన

లేని నీమనస్సు—ఆహా! అది మనస్సా! యేదివ్యతత్త్వమో నీకుఁ దెలియఁదగినది. నీవు నమ్మిన శ్రీరంగమూర్తికిఁ దెలియఁదగినది. కాని యంతకంటె నెవరికి దెలియును.

సాయంకాలమైనది. రంగనికి మంగళపుటారతి యైనది. పరివ్రాజకునకు ఫలాహారమైనది. మహాత్ముని మతోపన్యాసమైనది. రాతిరి పదిగంటలైనది. స్వాములవారు శయనించిరి. కాని యాదంపతులేరీ? ఏరా! అదిగో వీథివెంటఁ బోవుచున్నారు. వైశ్యోత్తముని యింటికే? కాకేమి? అయ్యయ్యో! ఇద్దఱుగూడఁ గలసి పోవనేల? తనవెంట నిప్పుడు భర్తకూడ నెందులకని భార్యకైనఁ దోఁపలేదా? భార్యవెంట నీసమయమునం దానెందులకని భర్తకైనఁ దోఁపలేదా! ఏమివింత! ఏమివిరుద్ధత? ఏమివిపరీతత! కాని ఆయమ్మచేతిలోనున్న దదేమి? స్వామిప్రసాదముంచిన చిన్నబుట్ట. వైశ్యవర్యుని కావైష్ణవప్రసాదము సమర్పింపఁ దీసికొనిపోవుచున్నది కాఁబోలు! హాహా! కాని యాచార్యుల వారి చేతిలోనున్న దదియేమి? చిన్నమిల్లి. దానిలో శ్రీపాదతీర్థమున్నది. దానిని వైశ్యరాజున కీయ నాతఁడు తీసికొనిపోవుచున్నాఁడు. హాహాహా! ఆతనికిఁ దీర్థప్రసాదము లిచ్చుటకు దంపతు లిద్దఱు పోవుచున్నారా? భార్యచేయి పట్టుకొని భర్త మెల్లగ నామెను బరభర్త యింటికిఁ దీసికొనిపోవుచున్నాఁడు. కాని చిన్నధ్వని వినఁబడుచున్న దేదది? నాయనలారా! వారేదో పదము పాడుకొనుచుఁ బరమానందమునఁ బోవుచున్నారే!

పదము

యతిరాజులపేరంటే యమలోకం పాడైపోవు ॥యతి॥

ఆహా! యతిరాజును గీర్తించుచుఁ బోవుచున్నారే! ఆఆ ఇంకను మఱేదో పాడుచున్నారే!

కాంభోజి—పదము

వైభోగరంగని పదములఁగొలిచిన పరమపదము మనము పడయుట
సత్యము
ఈభూమిపై నున్న ఏభోగమూలైన ఏవలే యగుగాని యేమున్న
దందున ॥వైభోగ॥

రమారమణగోవిందోహరి! ఆహాహా! వారు గురుదేవస్మరణ మొనర్చుచు నానందసముద్రమున నీఁదులాడుకొనుచుఁ బోవుచున్నారే ఆహా! అమరులారా! గంధర్వులారా! కింపురుషులారా! పంచభూతములారా! సూర్యచంద్రభగవానులారా! ఇట్టి భార్యాభర్తల నెచ్చటనైన నెప్పుడైనఁ జూచితిరా? ఇంకను బుష్పవృష్టిఁ గురియ కుపేక్షించుచున్నారేల? ఇంతకంటెఁ బ్రబలావసర మేమున్నది? కానిండు ఓ! ఓ! శ్రీహరీ! శ్రీహరీ! అతనియిల్లు సమీపించినకొలఁది మఱెంత యుత్సాహమున నుప్పొంగిపోవుచున్నారే! అదిగో వైశ్యరాజు గమగమలాడుచు గదిలోఁ గూరుచుండినాఁడు. మన నాచ్చియారమ్మ స్వామి ప్రసాదమును దీసికొని గదిలోనికిఁ బోవుచున్నది. ఆచార్యులు తలుపునొద్ద నిలువఁబడినాఁడు. "వచ్చితివా సుందరీ" యని యాతఁ డెదురుగ వచ్చినాఁడు. "రాకపోవుదునా? వైశ్యరాజా! కాని యిదిగో స్వామిప్రసాదము కన్నుల కద్దుకొని భుజింపుము." అని యాతనిచేతిలో రవంత వెణ్పొంగలి యుంచినది. అది కన్నుల కద్దుకొని నోటిలో వైచికొనినాఁడు. ఇంకను దానిని మ్రింగినాఁడో లేదో "హరిహరీ! హరిహరీ! పాపాత్ముఁడను. పాపాత్ముఁడను లెంపలు కొట్టుకొనుచున్నాను. అమ్మా! అమ్మా! నీయెడల మహాపరాధ మొనర్చితిని! నీవు నాతల్లివి. తల్లివి రంగరంగా! రక్షించు రక్షించు" అని పెద్దగావు కేకలు వైచుచున్నాఁడు. మొఱ్ఱో మొఱ్ఱోయనుచున్నాఁడు. తలఁగొట్టుకొనుచున్నాఁడు. గుండె బాఁదుకొనుచున్నాఁడు. క్షమింపవా? తల్లీ! రక్షింపవా? యని యెగిరి యెగిరి యామెకాళులపైఁ బడుచున్నాఁడు. ఆమె యానందబాష్పపూరితాక్షియై యవలోకించుచున్నది. ఇంతలో భర్త శ్రీపాదతీర్థకలశముతో లోనికివచ్చి "భాగవతోత్తమా! లెమ్ము. ఇదిగో శ్రీపాదతీర్థము. దీనిని దీసికొనుము. నీమనస్సు శాంతించు" నని చెప్పి యిచ్చెను. అప్పుడాతఁడు కొంత కుదుటఁబడినపిమ్మట నాతని నిద్దఱు చెఱియొకచేయి పట్టుకొని శ్రీరామానుజగురూత్తమునియొద్దకుఁ దీసికొనిపోయిరి. ఆలస్యమైనది. మన మింక సభ చాలించి యింటికిఁ బోవుదము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 10. ఉన్మత్తునియుపన్యాసము

## స్త్రీపురుష సౌందర్యము

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నేనొకదినమున మదరాసులోని పిచ్చియాసుపత్రిఁ జూడఁబోయితిని. అచ్చట నొకపిచ్చివాఁడు నేఁబోవునరికే యేదో చెప్పుచుండెను. నేను వెళ్లినతరువాత నిట్లు చెప్పసాగెను.

"ఆఁడుది యెక్కడ? సౌందర్య మెక్కడ? ఏయాఁడుదానికైన సౌందర్యమున్నదా? సౌందర్యహీనమైనజాతియే స్త్రీజాతి. మగజాతియే సౌందర్యయుక్తమైనది. మగజాతిసౌందర్యమునుం దాఁడుజాతిసౌందర్య మధమము—అత్యల్పము. నేనేమో వెఱ్ఱిముండకొడుకును గావున నిట్లు చెప్పుచున్నానని మీరనుకోవలదు. నేనే వెఱ్ఱివాఁడనైన యెడల మీరుమాత్ర మేల వెఱ్ఱివారుకారు? కొట్టులో నుండుటచే నేను వెఱ్ఱివాఁడనని మీ రెంచుచున్నారు కాఁబోలు. మీరున్నకొట్టు నేనున్న కొట్టుకంటెఁ బెద్దదగుటచే మీరు నాకంటె నెక్కువవెఱ్ఱివారు. తెలిసినదా? పిచ్చిలేనివాఁ డెవఁడు? ఒకఁడు మాటలాడుచున్నప్పుడు తల నిట్టె యిట్టె యెగురవేయును. ఒకఁడు భుజము నెగురవేయును. మాట లాడు ప్రతిమనుజునికిఁ గూడ నేదో యొక్కయూఁతపద ముండితీఱినది. ఒకఁడు "ఏమి? ఏమి?" యని నడుమనడుమఁ బనిలేదే ప్రయోజనము లేనిదే యనును. ఇది పిచ్చికాదా! ఒకఁడు "ఏమన్నాగాని—మఱి గలిగితే—దేవుఁడు మీకు చాలా మేలుచేస్తే" యని యిట్లేదో యొక్కటి మాటల కూఁతఁగా బలుకును. ఇది పిచ్చికాదా? పిచ్చివాఁడే కాకున్నయెడల దశరథునకు ముగ్గురుభార్యలు మూడువందల యుంపుడు కత్తె లెందులకు? ఎలిజబెతు కెనిమిదివేల ఫ్రాక్కులు, తొమ్మిదివేల షర్టులు పదకొండువేల కంఠబంధములు పదునాలుగువేల కాలిజోళ్లెందు లకు? ఇంతవఱ కెందులకు? "నాకుఁ బిచ్చిలేదురా మీమొగములు మండ" నని తలఁగొట్టుకొన్ననైన నెవ్వఁడును వినఁడే! ఒక్కముండ కొడుకు తిక్కయైనఁ దీఱదే"..............................

అయ్యా! ఒకవిషయమునుండి మఱియొకవిషయమునకు జారి పోవుచున్నారు. మొదట స్త్రీపురుషసౌందర్యభేదమునుగూర్చి చెప్పనెంచి వేఱొక్కయంశమునుగూర్చి యిప్పుడు చెప్పుచున్నారని పూర్వవిషయమును నే నందించితిని.

"నేనంత మఱుపున్నవాఁడను గాను. అంత యొడలు తెలియని వాఁడను గాను. అంత యున్మత్తుఁడను గాను. ఈనక్షత్రము లన్నియు నొకరాత్రి యూఁడి క్రిందఁబడిపోవగ మాతాతగా రెక్కడి నక్షత్ర మక్కడ తెల్లవారుసరి కమర్చినారు. నక్షత్రశాలలోని దూరదర్శినీ యంత్రము చూచితివా? 'గెలీలియో' అనునాతఁడు చంద్రునిలో నగ్ని పర్వతము లున్నట్లు కనిపెట్టినాఁడుకాని తనతత్త్వములో నున్నతమాషా కనిపెట్టలేకపోయినాఁడు. గజమ్ మిథ్య పలాయనమ్ మిథ్యయని చాటుకొనిపోయిన వినియోగము లేదు. ఆ—(నుతివేయును.)

శ్లో. దేవీం వాచముపాసతే హి బహవస్సారంతు సారస్వతాం
జానీతే నితరామసౌ గురుకుల క్లిష్టో మురారిః కవిః,
అబ్ధిర్లంఘితయేవ వానరభటైః కింత్వస్య గంభీరతా
మాపాతాళనిమగ్నపీవరతనుర్జానాతి మంథాచలః.

అని కవి పలికినాఁడు. వీనిపిచ్చి కాలిపోను! కవికున్న పిచ్చివంటి పిచ్చి మఱియెవ్వనికి లేదు. అబ్బ! వానికున్న టెగనీలుగు—తలతిక్క—పొగరుఁబోతుఁదనము — కొసవెఱ్ఱి — కొంకనక్కతనము మఱియొకని కున్నదా? కవియంతటి పిచ్చివానిని మీరు కనఁబఱచినయెడల జోడు సాలువులు తోడా వేయింతును. ఏఁడీ? చూపుఁడు అద్దే యువరాజు గారు మదరాసు వచ్చినప్పుడు వారి సొంత తిరుహస్తములనుండి సాలువులు తోడా లందుకొన్నవా రేమంత గొప్పపండితులు! ఏమంత గొప్ప కవులు! ఏదో అభిమానమును బురస్కరించుకొని ప్రపంచము దొరలి పోవుచున్నది. దేశభాషలు పోషించుచున్నామని సర్కారువారి కదియొక చమత్కారమైన కల్పన.

అయ్యా! స్త్రీలసౌందర్య మధమమని యొక వింతమాట చెప్పితివి. దానిని ఋజువుపరచుకొనకుండ వేలువేలుమార్గములఁ బోవు చున్నావు. స్త్రీలే సౌందర్యవంతులని నేను వాదింతును. నీవు నావాద

మెట్లు ఖండింతువో చెప్పుమని యాయున్మత్తునితోఁ బలికి యాతనిని గాపుగాయుచున్నవాని చేతిలో రెండురూపాయ లుంచి మమ్ము రవంత సేపు స్వేచ్ఛగా మాటలాడనీయవలసినదని బతిమాలితిని.

"నాతో నీవు వాదింతువా? ఏమీ! ఎంతవాఁడవు? నే నెవఁడనో యెఱుఁగుదువా? 'నాచురలు ఫిలాసఫీ' లో 'ఎం. ఏను. 'ఎవల్యూషను'లో మహామహోపాధ్యాయుఁడను. నాతో నీకు వాదమెందులకు? అసమానవైరము. అసమానవైరము. పో! ఆవలికిఁ బో.! స్త్రీజాతి సౌందర్యవంతమైనదని నాతో వాదించుటకే వచ్చితివేమి? కాని—పట్టు—ఏమాత్రము వాదింతువో! చూడు—ధాతుప్రపంచము, శాఖాప్రపంచము, క్రిమిపక్షిపశ్వాదిప్రపంచము— నరప్రపంచము— వీనిలోనున్న సామ్యభేదములనే మనము పరిశీలింతము. వీనిపైనున్న దేవతాప్రపంచము మన కిప్పు డక్కఱలేదు. అత్యధమజాతినుండి దానిపైజాతి నుండి యాపైజాతి, దానినుండి దానిపైజాతి యిట్లువిలంఘ్యక్రమమునఁ బరిణామప్రక్రియ జరుగుచున్నదని యొప్పుకొందువా? అన్ని ధాతువులలోఁగూడ స్త్రీపురుషభేద మున్నది. మగబంగారమని యాఁడు బంగారమని భేదమున్నది. ఉండితీఱినది. ఇఁక మాటలాడకు—నోరు మూసికొని యొప్పుకో—మగమణిశిల యాఁడుమణిశిలకంటె నెక్కువ సుందరముగా నుండును. ఇందుల కాంగ్లేయశాస్త్ర మొప్పుకొనునా యని ప్రశ్నింపకుము. ఆంగ్లేయశాస్త్రము మనకేమి యాగమవాక్యమా? సజీవవస్తువులు నిర్జీవవస్తువులు నని (ఆర్గానికు, ఇనార్గానికు) వారుచేసిన భేదమేమైనది. తలక్రిందైనది. ధ్వస్తమైనది. ప్రపంచమున సప్రాణములేకాని నిష్ప్రాణములు లేవని మనవేదర్షులు సింధునదీప్రాంతమునఁ జెప్పినమాటయే సిద్ధాంతమైనదికదా! జీవమున్నచోట స్త్రీపురుషభేదము లేకుండుట కెట్లు సాధ్యము! స్త్రీపురుషతత్త్వము లొక్కవస్తువులోనే యిమిడియుండనీ. వేలువేలువస్తువులలో విస్పష్టముగ నుండనీ— అది నాకు గణనీయముకాదు. స్త్రీపురుషభేదము దేశకాలపాత్రనియమములు లేకుండ నుండి తీఱినది. అందులో స్త్రీతత్త్వము సౌందర్యమున నధమము. పురుషతత్త్వము సౌందర్యమున నధికమని నావాదము. ఇది కాదన్నవానిని గిఱగిఱ త్రిప్పి బంగాళాఖాతమునఁ

బొఱవేయుదురు. ఆమాత్రపు వాదబలము లేకపోలేదు. తొమ్మిది గంటలరాత్రి వేళ, వార్ధితీరమునకు షికారుపోవలదని యెంత నిర్బధించి నను వినని భార్యను భర్తయైన వకీలుగా రేమిచేసినారు! గడుసువాఁడు నావలె వాదబల మున్నవాఁడు కావున నావషికారు వంకపెట్టుకొని భార్యను జిన్నపడవలో నెక్కించుకొని యామెరోగము నీటివైద్యమునఁ గాని కుదురదని బుడుక్కున సముద్రములోనికిఁ ద్రోచివైచినాఁడు...

అదిగో! తిరుగ మఱియొకమార్గమునఁ బోవుచున్నావు సరే— ధాతుప్రపంచమున మాటవరుసకు స్త్రీపురుషభేదమున్నదని యొప్పు కొందును. ఆఁడుజేగురుకంటె మగజేగురే యెక్కువసుందరమని నీజబర్ దస్తీచే నొప్పుకొంటిని. సరే—దానిపైనున్న శాఖాప్రపంచపు సంగతి చెప్పుము. మఱియొకదారిని బోకు. మనస్సును గట్టిగఁ బట్టుకొని మాట లాడుమని నే నాతనిని బ్రోత్సహించితిని.

“నాకు జంఘాలశాస్త్రిలాగున నట్టె మాటలాడుట యసహ్యము. ఇది—శాఖాప్రపంచమునుగూర్చి చెప్పెదను. తాటిచెట్లలోఁ బోఁక చెట్లలోఁ— గొబ్బరచెట్లలో — మామిడిచెట్లలో — పొన్నచెట్లలో బొమ్మజెముడులో—పరిమిచెట్లలో— గాడిదగడపలో — కూఁతురుబుడ మలో—స్త్రీపురుషభేద మున్నది. ఆఁడుచెట్టుకంటె మగచెట్టెత్యంత సౌందర్యము—ఒప్పుకో — తిరుగుమాటలేకుండనొప్పుకో—నీవాసౌం దర్యవ్యత్యాసత నేల గ్రహింపలేకపోయితివో నేను జెప్పనా? నీకందు లకుఁ దగిన కనులులేక—మాముత్తాతగారి కుత్తరవయస్సులో నేత్రా వరోధత సిద్ధించినది. ఆయనను బరామర్శించుటకు కొకఁడు వచ్చి “తాత గారూ! మీకుఁ గన్నులు బొత్తిగాఁ గనఁబడవు కాఁబోలు నేమి” యని యడిగెను. ఆముసలియాయన యేమనెనో యెఱుఁగుదువా? “నాయనా! నీకు వెనుకచూపులేదు. నాకు వెనుకచూపు ముందు చూపుగూడ లేదు భేద మింతమాత్రమే సుమా” అని యాయన పలికెను. ప్రపంచమున నూటికిఁ దొంబదుగురకుఁ గనులులేవు. అందులో సౌందర్యరసగ్రహణ మున నూటి కిద్దఱకుఁగంటెఁ గనులులేవని నానమ్మకము. ఇఁక నీగ్రుడ్డి పెద్దమ్మలా సౌందర్యవ్యత్యాసతను గనిపట్టువారు? ధృతరాష్ట్రున కంధత్వ మెందుకువచ్చినదో యెఱుఁగుదువా? ఆవవడలుతినుటచేత నిప్పుడు మన

వారు కాఫీ త్రాగుటచేతఁ గౌరవరాజేంద్రునికంటె ఘను లనిపించుకొనుచున్నారు."

అయ్యా! అంతటితో నాఁగవయ్యా—సరే—శాఖాప్రపంచమున నేదియో జెబ్బపుష్టిపాకముగాఁ జెప్పితివి. ఒప్పుకొనకపోయిన యెడలఁ దిట్టుదువని యొప్పుకొంటిని. శాఖాప్రపంచముపైనఁ గ్రిమిపక్షిపశ్వాదిప్రపంచ మున్నది. దానినిగూర్చి నీయభిప్రాయమేమో చెప్పుము చూడు...మనసు కప్పదాట్లు వేయఁబోవుచుండ రవంతమఱల్చుకొని మఱి మాటలాడుమని నే నాతనితోఁ బలికితిని.

"పశుపక్ష్యాదులఁగూర్చి యిఁకజూడు నావాగ్ధాటి—తుపాను పట్టిన ట్లుపన్యసింతునో లేదో. బందరుగాలివాన సంవత్సరము రక్తాక్షి యున్న దే—అదే నాజననసంవత్సరము. మన మాలాగున నవనిపై నవతరించుటయేమి ? అనేకసహస్రజీవరాసుల నంతిపురి కనుపుటయేమి అద్దే! దుష్టశిక్షణ శిష్టరక్షణభారములు వహించిన యవతారమన్న మాట. అయిననేమి—మన కిప్పుడే నేటిశని—ఊఁచియూఁచి నేలను గొట్టుచున్నది. ముప్పదియేండ్లకైనఁ బెండ్లిచేసికొనని కన్యకల నందఱును గవర్నమెంటువారు బేవార సాస్తికింద నెంచి దాఖలుచేసికొనుట విషయములో నీయభిప్రాయమేమి ? "The Hindu Trigenarian girls-Escheat Bill" మనకు "స్వపరిపాలనము (సెల్ఫు గవర్నమెంటు) వచ్చినయెడల నా మదరాసుగవర్నరిపదవిలో సాగఁదీసి పాసుచేయింపక పోదునా ..........................................

ఓరి నీవెఱ్ఱికాలిపోను. భారతదేశస్వారాజ్యములో మనరాజధానికిఁ బ్రథమప్రభుఁడవు నీవా ? అయ్యా! నీతో మాటలాడుటచేత నామతి గూడ వెనుకాడుచున్నది. పక్షిపశ్వాదులలో స్త్రీపురుషసౌందర్యభేదమునుగూర్చి చెప్పెదవా ? పొమ్మందువా ? యని నేను బ్రాణము విసుగుటచేఁ బలికితిని.

"వెరివెల్ నీకుఁ దెలిసికొనవలెనని కుతూహలమున్నదో లేదో (టెస్టు) చేయుటకుగాను నేనిట్లు 'డిలే' చేయుచున్నాను. వెరిగుడ్ మొదటఁ బక్షులను దీసికో, పిచ్చుకనుండి మన మారంభింతము. మగపిచ్చుకకు నాఁడుపిచ్చుకకు సౌందర్యమునం దెంత వ్యత్యాసమున్నదో

సూర్యకాంతివలెఁ గనబడుటలేదా ? మగపిట్టకున్న వెండ్రుకలసొగసు
రంగులకేవి, రూపవత్తులత్వము కంఠమాలాసౌభాగ్యము నాఁడుపిట్ట
కున్నవా ? ఆఁడుపిట్ట మగపిట్టముందు దిగదుడుపునకైనఁ బనికివచ్చున
ట్లున్నదా ? చూడు. కన్నులు తెఱచిచూడు! స్త్రీపక్షి పురుషపక్షి యను
రాగమునకై యెట్లు దేవులాడుచున్నదో! ఆకారవైభవముచే మగపిట్ట
యాఁడుపిట్ట నెంతవిశృంఖలముగ నాకర్షించుచున్నదో! ఎక్కు. ఇఁకఁ
జిలుకయొద్దకెక్కు. ఓహో ! కీరశరీరసౌందర్యసారము కీరనారియందుఁ
గనఁబడుచున్నదా? మగపిట్ట ముక్కున యరుణిమ యాఁడుపిట్టముక్కునఁ
గనఁబడుచున్నదా? మగపిట్ట క్రేగంటికటాక్షమున కెన్ని యాఁడు
పిట్టలు శృంగారరసపులకితాంగములై వేచియున్నవో చూడు! నీకుఁ
బక్షిశృంగారవైభవము తెలియునా? తెలిసినయెడల నదిగో! ఆయాఁడు
పిట్ట యిప్పుడు ముక్కుతో తెక్క ప్రక్క నేల గోఁకికొనునో చెప్పుము.
నేను జెప్పఁగలను. ఆహా! మగపిట్టకున్న కంటిసౌందర్యమును గంఠ
మాలాసౌందర్యము నాయాఁడుపిట్టలు ముక్కులు తెఱచి తోఁకలెత్తి
కన్నులతోడనే యెంతపిపాసచేఁ గ్రోలుచున్నవో చూడు. ఇక్కడకుఁ
దెలిసినదా శుకశుకీసౌందర్యవ్యత్యాసత ? ఎక్కు, కోడిపుంజువఱకెక్కు.
ఎక్కితివా ? వెరిగుడ్. ఇంద్రధనుస్సుగాని యిది పుంజటోయి! దీని
సౌందర్యము నీకేమి తెలియును ? నార్తరన్ సర్కారులలో నున్న
జమీన్ దారులకుఁ దెలియవలసినది. ('నాచురలు ఫిలాసపరు') నైన
నాకుఁ దెలియవలసినది. అంతేకాని థూ ! థూ ! నీకా తెలియుట చూడు.
గ్రుడ్లు పెట్టుకొని చూడు. పుంజుతోఁకమీఁదనున్న యొక్క వెండ్రుక
కున్నసౌందర్యములో సహస్రాంశమైనఁ గోడిపెట్టకున్నదేమో చూడు.
దివిటీముందు దివ్వెలవలె నాఁడుపిట్ట లెట్లు వెలవెలపోవుచున్నవో
చూడు. ఓ ఆకంఠసౌందర్య మేమి! ఆవక్షసౌందర్య మేమి! ఆస్కంధ
సౌందర్య మేమి! ఆవాలసౌందర్య మేమి ? అన్నిటిని మించిన యాశిర
సౌందర్య మేమి ? ఓ ! ఏమహారాజులనెత్తిపై నిట్టి మాణిక్యమయకిరీట
మున్నదోయి! విస్పష్టముగ నిచ్చట స్త్రీపురుష సౌందర్యవిభేదము
కనఁబడుచున్నదా? ఎక్కు! మయూరమువఱకెక్కు. ఎక్కితివా?
వెరిగుడ్. ఓ! ఓ! కన్నులవైకుంఠము! ఆమగపిట్ట మెడకున్న

సౌందర్యము సహస్రశక్రశాపములకైనఁ గలదా? మెడవఱి కెందుల కోయి దానిపింఛమున నున్న యొక్క కంటిసౌభాగ్య మింతింతని చెప్పఁ దరమా? మయూరకంఠ కాంతిని స్పృశించినయెడలఁ దనకిరణములు శోభావంతము లగునని భాస్కరుఁడు దానిపైఁ బ్రకాశించునే! పింఛ సౌందర్యమును జూడవలయునని మేఘుఁ డంతరిక్షమున వ్రేలాడు చుండునే! ఆహాహా! దాని నెత్తిమీఁది దదియేమి? ఏవజ్రాలతురాయి సర్పేషుకూడ దాని కీడురాదే! చూచితివా? దానిముం దాఁడునెమిళులు దిష్టబొమ్మలవలె—దిగదుడుపులవలె నెట్లున్నవో! ఎక్కు. హంసవర కెక్కు. ఎక్కితివా?

వెరిగుడ్. స్త్రీపురుషహంసల సౌందర్యభేదమును దిలకించితివా? పక్షిలోకమందెల్ల నిదియే పద్ధతి. స్త్రీజాతి నాకర్షించుటకే పురుష జాతికి సౌందర్యము. తెలిసినదా? హే హే హే! (నవ్వును) నవ్వు చున్నప్పు డేడ్చుచున్నట్లున్న యాఁడుదాని మొగము నీవెప్పుడైనఁ జూచితివా? అది యేడ్చుటయే సిద్ధించినప్పుడు వహావ్వా వహావ్వా! ('మైగుడు హేవెన్సు').

"అదిగో! అదిగో! తిరుగఁ బెడదారి పట్టుచున్నావు. తరువాతఁ బశువులనుగూర్చి చెప్పుము. క్రిందటిసారివలెనే తటుచు తొట్రుపాటొంద కుండఁ జెప్పవలయును." అని నేనంటిని.

"వెరివెల్! వినువాఁడున్నప్పుడు చెప్పుట కేమిలోపము. అదిగో! కురంగము. వహావ్వా! ఏమిచక్కనియాకృతియోయి! సెబాస్! నేత్రపర్వముగనున్నదోయి! చూడుచూడు. కురంగిని యెటులున్నదో! కొమ్ములులేక కుతికిలఁబడినట్లు కొఱుగుబాఱినట్లు చిన్నతలతో దానిముం దెంత సౌందర్యవిహీన మయియున్నదో చూడు. ఎక్కు పెద్దపులి వఱకెక్కు. ఎక్కితివటోయి వెరిగుడ్. ఓ ఓ జాగ్రత్తగాఁ బరిశీ లింపుము. ఏమి మొగమునీటు. ఏమి పంజావ్రేటు. ఏమి పిల్లిగడ్డపుఁగోటు. ఏమి చారలకోటు—ఏమి కన్నులపోటు—ఏమి వాలపుతీటు. సెబాస్! భయములోఁ బ్రభయున్నదే! కఠినతలోఁ గమ్రతయున్నదే! చూడు! అదిగో శార్దూలిని అచ్చటనే యున్నదే—శార్దూలముముం దది కుక్కవలె నున్నట్లగపడుటలేదా? చిన్నతలతో, వంగిముడుచుకొన్న దేహముతో,

బోడిమొగముతోఁ బొట్టితోఁకతో దానిముం దది యెంతలావణ్యహీన మయియున్నదో ? ఇఁకఁ జాలునా ? సరే ! ఏనుఁగమీఁది కెక్కవోయి మూతిపండ్లు విఱుఁగునో మూర్ధాభిషిక్తుఁడవగుదువో ! కానీ ! ఎక్కు ! ఏనుఁగు నెక్కినప్పుడేకదా వెనుకటి (వైసురాయి) గారు మంచమెక్కుట సిద్ధించినది.

“అదిగో ! ఆఁగు. తిరుగఁ దప్పుదారి ద్రొక్కుచున్నావు. జాగ్రత్త ! ముందు చెప్పవలసినదానిని జెప్పు” మని నే నంటిని. పిచ్చివానియభిప్రాయము లెట్లుండునో తెలిసికొనవలయునని యభిలాషముచే నేనింత దేవులాడుచుంటిని.

“గడియగడియకు జ్ఞప్తిచేసెద వెందులకు ? ఏనుఁగవఱకుఁగదా వచ్చితిమి. వెరిగుడ్. అదిగో కరి. అదిగో కరణి. ఏది సౌందర్యాధిక్య సంపన్నమో నీకుఁ గనఁబడుటలేదా ? నేను వేఱచెప్పవలయునా ? మగ యేనుఁగుముం దాఁడుయేనుఁగు కళాహీనమయి కనఁబడుటలేదా ? ఆదంతములవలన మగది యెంత శోభావంతమై యున్నదో ! అదిలేక బోసిదై యాఁడు దెట్లు చిన్నబోయి యున్నదో ! ఎక్కు, సింహమువఱకెక్కు. ఎక్కితివా ? వెరిగుడ్. ఓహోహో ! మొగమునం దేమివిశాలత ! కంటియం దేమితేజము ! మెడయం దెంతజూలు ! వక్షమునం దెంత విపులత ! తోఁకయం దెంతసాగుఁడు ! అవలగ్నమం దెంతసూక్ష్మత ! ఆకారమం దెంత యౌన్నత్యము ! నడకయం దెంత రాచఠీవి ! సకల సౌందర్యలక్ష్మీవిరాజమానమగు మృగరాజముముం దదిగో యాఁడు సింహము వాలుమొగముతో, బొక్కిఱొమ్ముతో. బోడిమెడతో, హ్రస్వవాలముతోఁ, సంకుచితాకారముతోఁ, జిన్నతలతో నున్నది. చూచితివా ? ఆసౌందర్యమున కీసౌందర్యమున కెంతవ్యత్యాసమున్నదో స్పష్టముగఁ గనఁబడుచునే యున్నదికాదా ? నిజముగ మగజాతిదే సౌందర్యము. స్త్రీజాతి కత్యంతోత్సాహము ననురాగము నభిలాషము నందువలన నన్వయవృద్ధి కలుగుటకే మగజాతిలో నింతసౌందర్యము ప్రకృతిలోఁ గలుగవలసివచ్చినది. తెలిసినదా ? ఇఁకఁ బై కెక్కు. నరులవఱకెక్కు. ఎక్కితివా ? వెరిగుడ్. నరులనఁగా నాకు రోఁత—నన్ను బిచ్చివాఁడనినవా రెవరు ? నరులే—నన్నుఁ గారాగృహమం దుంచినవారు

నరులే—నాకిక్కడఁ గడుపునిండ నన్నము పెట్టకుండ నున్న వారు నరులే. నాకుఁ బిచ్చిలేదని మొత్తుకొనినను బిచ్చియని స్థిరపఱచినవారు నరులే. నిజమైనపిచ్చి నాదో యీనరులదో! దేవతలు మావాదములో మాధ్యస్థ్యము చేయవలసియున్నది. క్రిందిజాతులలోవలె నరజాతిలోఁ గూడఁ బురుషజాతియే సౌందర్యవంతమని నావాదము; కాదు. కాదు. స్త్రీజాతిదే సౌందర్యమని నాశత్రువులవాదము. నావాదమున కాధారమేది ? నాకు ధాతుప్రపంచ మాధారము. శాఖాప్రపంచ మాధారము. పశుపక్ష్యాదిప్రపంచ మాధారము. పరిణామప్రక్రమ మాధారము. ధాతుప్రపంచములో శాఖాప్రపంచములోఁ బశ్వాదిప్రపంచములోఁ బురుషజాతి సౌందర్యమే సిద్ధాంతమై పశుప్రపంచమునకు సరిగఁ బైమెట్టయిన నరప్రపంచమున స్త్రీజాతి సౌందర్యమే సిద్ధాంతమగునా ? థూ! థూ! పరిణామప్రక్రమ మిచ్చట భగ్నమగుట కేమి కారణము ? తొమ్మిదొకట్లు తొమ్మిది సత్యమా? తొమ్మిదిరెండ్లు పదునెనిమిది సత్యమా? తొమ్మిదిమూళ్లిరువదియేడు ? సత్యమా? తొమ్మిదినాలుగులు ముప్పదియాఱుగాక యఱువదిమూఁడు సత్యమా? అట్లన్నవాని నూచిపుచ్చుకొని సాగఁదీసి దౌడపై గొట్టవలసినదేనా ? కాలికిఁ జేతికిఁ గల బందము వైచి పిచ్చియాసుపత్రిలో నుంపవలసినదేనా ? ఆఁడుదియఁట. సౌందర్యవతియఁట అబ్బ! అబ్బనాఁడు లేదు. తాతనాఁడు లేదు. ముత్తాతనాఁడులేదు. కోఁతినాఁడులే. గొంగళిపురుగునాఁడు లేదు. మొక్కనాఁడులేదు. తీఁగనాఁడులేదు. ఱాయినాఁడులేదు. అప్పనాఁడులేదు. పూర్ణసౌందర్యయుక్తుఁడైన పురుషుని ముందు బోడిమొగము చేసికొని పేడబొమ్మలాగున నుండవలసినయాఁడుది ఓస్! నేఁ డేమైనది ? చిగురుబోడియట ! తడాకా ! ఆఁ ! తామరసదళనేత్రయఁట ! తమాషా ! బింబాధరయఁట ! భేష్ భేష్ కాంత యెంతయైనది ఆహాహా ! కాలగతి కాలగతి. సమస్త సౌందర్యసంపన్నుఁడైన మగవాఁడు మట్టిముద్దయగుటా? మగవానియెదుట మట్టిముద్దగ నుండవలసినమగువ మాణిక్యములకోవయగుటా ? ప్రపంచము తలక్రిందైపోయినదే ! మగవారికందఱకుఁగూడ మతులుపోయినవే ! పోనీ! మన యార్యావర్తమందే యీయవకతవక యేమోయనుకొన్న నట్లుగాదే—అఖిలప్రపంచమందుఁ

గూడ నీయున్మాదమునకు గురుఁ డేకాదశమందున్నాఁడే! పాశ్చాత్త్యులలో స్త్రీజాతి (ది-ఫెయిరు-సెక్సు) అఁట, తాము (అక్-ఫెయిరు-సెక్సు అనియే తమయభిప్రాయము కాఁబోలు! అదిగాక నింకొక తమాషా-పాశ్చాత్త్య జాతులలోఁ బాతికముప్పదిసంవత్సరము లొక్కపట్టున నదే పనిగ "కోర్టింగు" అయ్యయ్యో! మగవాఁడేమి? ఆఁడుదానిని 'కోర్టిం గేమి? అనుచితముకాదా? అవకతవకకాదా? అస్వభావముగాదా— థూ! థూ! నన్నుఁజూడవోయి నన్ను స్పృశింపవోయి యని మగ వానిని బ్రార్థించుచు మగవానిచుట్టు నాఁడుది తిరుగవలసియుండగాఁ మగవానికట్టి 'పవరు' ఉండఁగా నతఁడు భ్రష్టుఁడై పనికిమాలినవాఁడై భామాదాసుఁడై యాఁడుదానిచుట్టు గిరగిరతిరుగుచున్నాఁ డేమికర్మ మయ్యా! మనలోఁగంటె పాశ్చాత్త్యులలోనే యీవెఱ్ఱి ప్రబలతర ముగా నున్నట్లున్నదే! వీరి ప్రకృతిశాస్త్రజ్ఞానము వీరిప్రపంచజ్ఞానము వీరిభాషాజ్ఞానము వీరి నాగరకతావిశేషము తుదకీలాగునఁ దురకచదువు లాగున వెనుకకుఁ బోవుచున్నదేమి? ఇంతకు నొక్కటేమాట. అందఱకు మందుపెట్టినవారు కవులు—అందఱమతులు పోఁగొట్టినవారు కవులు. అందఱపుట్టి ముంచినవారుకవులు. ఈకవులను గట్టిగట్టి యేమిచేసినను బాపములేదు. స్వరాజ్యమురానీ! అప్పుడు నాతమాషా. కవులకుఁ బ్రత్యేకము పిచ్చియాసుపత్త్రులు కట్టించి, యాఁడుదాని నెప్పుడలరుఁ బోడి యనవుకద, వనిత నెప్పుడు వనజాక్షి యనవుకద యని బారగఱ్ఱ లనుగట్టించి తూర్పుపడమరలక్రిందఁ దోఁపతోఁపఁగాఁ గొట్టింపనియెడల నన్ను వెఱ్ఱిముండకొడకా యని పిలువుము.

పోనీ! స్త్రీసౌందర్యము నంతబహుళముగా నంతసాంద్రముగా నంత జిగిబిగిగా నంత పట్టుదలగా వర్ణించిన కవులలో నొక్కఁడైనఁ బురుషసౌందర్యమును వర్ణించినాఁడా? ఆఁడుదాని నూఁగారు మీఁద నలువదిపద్యములు చెప్పినవాఁడు మగవాని మీసము మీఁద నొక్కపద్యము చెప్పఁగూడదా? ఉహు. అది పనికిరాదు, ఎంతసేపు చెప్పినను నాఁడుదాని చక్కఁదనమును గూర్చియే చెప్ప వలెను. కాంతపైఁటచెఱఁగుమీఁదఁ బద్యముచెప్పినకవిగాఁడు నాగా వంచమీఁద నెందులకుఁ జెప్పఁగూడదు? సాకుఁ బట్టుకొన్న పెద్దపిచ్చి

యిది! మన మగజాతిలోనివాఁడే మనలఁ బరాభవించినప్పుడింకఁ జెప్ప వలసిన దేమున్నది? నే నొక్కతమాషా చేయదలఁచియున్నాను. అది కొంతరహస్యము. నీవు మఱియెవ్వరితోడను జెప్పవలదు. ఇప్పుడు నేఁ జేయుకల్పన యేదనఁగ నిది స్త్రీవర్ణనములతోఁ గెక్కుకెక్కుమనుచున్న మనకావ్యములు ప్రబంధములు పురాణములు మొదలగునన్ని గ్రంథము లున్న వే యివియన్నియు మొదటఁబురుషవర్ణనములతోడనే నిండియుండు నట్లే చేయఁబడియుండె ననియుఁ దరువాత స్త్రీలుకొందఱు చదువునేర్చి యసూయావిష్టలై పురుషవర్ణనలన్నియుఁ జమత్కారముగ స్త్రీవర్ణనల క్రింద మార్చివేసిరనియు నొక చిత్రమైన సిద్ధాంతము చేసి మగవారి మర్యాద నిలువఁబెట్టఁదలఁచియున్నాను. ఈమార్పులలోఁ జాతిభేదముచే వర్ణనాంశములందుఁ గొన్ని తేడాలు తికమకలు లెటుకులు తకరారులు వచ్చునని నే నెఱుఁగకపోలేదు. అవి యన్నియు 'ఇంటర్పొలేషన్సు' క్రింద నీడ్చివేయఁ దలఁచుకొన్నాను. తప్పుకొనుట కున్నమార్గ మిది యొక్కటేకాదా? సారస్వతవిమర్శన మని (లెటిరెరీసెర్చి) యొక 'బైవీక్లీ' ఆంధ్రదేశమధ్యమందు స్థాపింపఁదలఁచియున్నాను. ఏదీ? నే నీ యాసు పత్రినుండి యావలికిఁ బోవుమార్గమే కనబడకుండ నున్నదే? పైవారి కందఱికిఁ బిచ్చియైనప్పుడు నే నొక్కఁడను భాషాభివృద్ధి నెట్లు చేయఁగలను? పశ్వాదిప్రపంచమునకంటె నదనముగా మనకు 'రీజను' అనుతత్త్వ మొకటి యున్నది. ఈరీజనుచేతనే మనకు మతులు పోయి నవి. అది లేకపోయినయెడల నింత పుట్టిమునుకలేదు. ఈరీజనుచేతనే మనకింత స్త్రీలోలత కలిగినది. ఇన్ని వ్యసనసహస్రములు వచ్చినవి. పడఁతి బంగారుబొమ్మ యెందులకైనది? మన వ్యసనముచేత నైనది. మగువ మధురాధర యెందులకైనది? మన వ్యసనముచేత నైనది. ఈరీజనుకుఁ బైచూపుపోయి క్రిందిచూ పెప్పుడువచ్చినదో యన్నివ్యసనము లప్పుడే యంకురించినవి. ఎదురెక్కుట మాని దిగజాఱుట యారంభించిన పిమ్మట నధోలోకమునకుఁ బోయినను నంతకంటె నధోలోకము వేఱొకటి కల్పన యగుచునే యున్నది. మనకున్న సంతతకాంతాచింత పశువులలో నున్నదా? ఏదో ఋతుకాలమని కార్తె యని కొంత వానిలో నియమ మున్నది. అది మనకుఁ బూర్ణానుస్వారమే 'పర్సు'లో పావులాడబ్బుల

కంటె నెక్కువగ నెప్పుడుండునో యప్పుడే మనకు ఋతువు. ఎందుచేత ? అక్కడ 'ఇనిష్టింక్టు' మాత్రమే యున్నది. అక్కడ 'ఇనిష్టింక్టు'కు రీజను తోడైనది చూచితివా ? మఱియొక తమాషా. మనకున్న యనవరత కాంతాభిలాషము మనకుఁ జాలక దానితో సంతుష్టిపడక నల్లమందని నశ్యవామికా అని నాపిండకూడని నల్లమడుగని మఱెంత దోహద మొనర్చుచున్నాము. థూ ! థూ ! దిక్కుమాలిన ఈరీజనుచేతనే కదా మన కీకల్పన గలిగినది. మనలను బిశాచమువలెఁ బట్టుకొని పీడించుకొని తినుచున్న యీబుద్ధిని వదల్చుకొనుటయే మనకుఁ బురుషార్థమువలెఁ గనఁబడుచున్నది. ఎవ్వఁడు తిరుగఁ బశువగునో వాఁడు బుద్ధిశాలి. నేఁ జెప్పినమాట నీకర్థమైనదా ? తోట్లైవైద్య మంద ఆరంభించిన యెడలఁ బ్రకృతిలో నున్న యీస్వభావోద్రేకమంతయు నడఁగి చల్లగ సరళముగ సాఫుగ పశుత్వములోనికి జాఱిపోవుదుము. 'ఎవల్యూషను' సత్యమైనప్పుడు ఇన్వల్యూషను మాత్ర మేల సత్యము కాదు ? రాట్నము తిరుగుచున్నప్పుడు క్రిందియంచు మీఁదికి వచ్చును. మీఁదియంచు క్రిందికి వచ్చును. అడ్డుపెట్టుట నీతరమా నాతరమా? వృద్ధునకుఁ దిరుగ బాల్యలక్షణము లన్నియు వచ్చినవందువా లేదందువా ? ఏఁబదియేండ్లున్న స్త్రీకిఁ దిరుగఁ గన్యాత్వము వచ్చిన దందువా లేదందువా? ........................................

అయ్యా ! అయ్యా ! మీరు పోవలయును. సూపరింటెండెంటు గారు వచ్చుచున్నారని యచ్చటి భటుఁడు నాతో ననెను. నేను బిచ్చి వానియొద్ద సెలవుతీసికొని పోఁబోవుచుండ "అయ్యా ? ఱేపు తిరుగ రావలయునుజుమా ? ఈసారి 'ఎవల్యూషను పై నెటువంటి యుపన్యాస మిచ్చెద ననుకొన్నావు ? వ్యాసుని జడలకు డార్విను గడ్డమునకు ముడి పెట్టి యాలంకెను హెర్బర్టు స్పెన్సరు భుజముమీఁద వైచి ఓహో ఓహో భాయి ! ఓహో ఓహో భాయి యని సవారిమూల్గులు మూల్గించి నాన్కోఆపరేషను తాషామరపాలతో గాంధీటోపీలతోఁ బ్రపంచ మంతయు నూరేగింపనియెడల మూఁతిమీఁది మీసము గొరిగింపు" మని యాతఁడు శపథముచేసి లోనికిఁబోయెను. నాయనలారా ! నేనింటికిఁ బోయితిని.

# 11. ఆరోగ్యము



జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! ఒక యాయుర్వేదభిషగ్వరుఁడు నేఁడు మనసంఘమున నుపన్యసించును. మన సాక్షిసంఘము నాంధ్రదేశీయులందఱు మహాభిమానమున నాదరించుచున్నారు. మన సంఘోపన్యాసము లనేకులు విమర్శనబుద్ధితోఁ జదివి వారికిఁ దోఁచినసందేహములను నిరాతంకముగ నడుగుచున్నారు. వారియుపన్యాసములను మనసంఘమందు నాచేఁ జదివించుటకయి పంపుచున్నారు. కొందఱుకొందఱు విద్యావంతులు సాక్షిని దర్శించుటకై వచ్చి మన సంఘమునం దుపన్యాసము లిచ్చుచున్నారు. ఇదికాక—ఏలూరు రాజోలు మొదలగు గ్రామములలో మన సాక్షిసంఘమున కుపసంఘములుగా కొన్ని సంఘములను స్థాపించినారు. ఆసంఘములలో మనలోవలె సాక్షి—జంఘాలశాస్త్రి కాలాచార్యులు వాణీదాసుఁడు సెట్టియు నున్నారు. వారమున కొకతూరి మనవలె వారుకూడ నుపన్యాసము లిచ్చి వారి కార్యక్రమమును మన కప్పటప్పటఁ బంపుచున్నారు. సరస్వతీకటాక్షమున నచిరకాలములో మునసబు కరణముల రచ్చసావడివలె గ్రామగ్రామమున కొక్కసాక్షి పంచాయతీసావడి యుండవచ్చును. ఇప్పు డొక యాయుర్వేదభిషగ్వరుఁ డిచ్చట నుపన్యాస మిచ్చును. ఆంగ్లేయాయుర్వేద మహమ్మదీయాది భిన్నభిన్నజాతి వైద్యప్రక్రియా సామ్యభేదాదులను గూర్చి యుపన్యసింపుఁ డని నేను గోరితిని. అంతవఱకుఁ దనకిప్పు డవకాశములేదనియుఁ బ్రస్తుతమున నారోగ్యమునుగూర్చి కొన్నిమాటలు మాత్రమే చెప్పెదననియు నాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ఉపన్యాస మెట్లుండునో యని సంశయముగా నున్నది. తిన్నఁగాని రుచి తెలియునా? దిగినఁగాని లోఁతు తెలియునా? కనినఁగాని గర్భవేదన తెలియునా? చదివినఁగాని సారస్యము తెలియునా? వినినఁగాని విశేషము తెలియునా? కావున వినఁదలఁ

చిన దానినిగూర్చి యిప్పుడు విమర్శనమెందులకు ? ఈభిషగ్వరుఁడు కొంత యాంగ్లేయభాషాజ్ఞానమును సంపాదించినవెనుక నాయుర్వేద వైద్య వైదగ్ధ్యమును సంపాదింప నెంచి యొకయాంధ్రదేశప్రభుని సాహాయ్యముచే గాళీఘట్టమునకుఁ బోయి యచ్చట నగదంకారవిద్య నభ్యసించి భిషఙ్మణి యను బిరుదమును బిరుదముతోపాటు గరువమును సంపాదించి—జనాభాను దగ్గించు సముచితోద్దేశముతో స్వదేశమును జేరెను. శాంతమ్ పాపమ్ శాంతమ్ పాపమ్. సర్వేజనాః సుఖినో భవంతు లోకాః సమస్తా స్సుఖినో భవతు. క్రొత్తబియ్యమువలనఁ గడుపునకు బాధ. క్రొత్తమంగలివలన గడ్డమునకు బాధ. క్రొత్తభార్యవలన నిద్రకు బాధ. క్రొత్తప్లీడరువలన నాస్తికి బాధ. క్రొత్తవైద్యునివలనఁ బ్రాణమునకు బాధ. నాయనలారా ! క్రొత్తవైద్యుఁడు వరిగత్రాచువంటివాఁడు. నేనొక్క యాంగ్లేయవైద్య నెఱుఁగుదును. అతఁ డాంగ్లేయుఁడగుటచే నాపరేషనులో నధికుఁడాయని యడుగనక్కఱలేదు. ఆతని ఆపరేషనులన్నియు సక్సెస్‌ఫుల్—జయప్రదములు—అని చిఠాలో జమకట్టు కనఁబడుచున్నది. రోగులు బ్రతికిరా చచ్చిరా యను విచారణమక్కఱలేదు. ఉన్నను నది ద్వితీయపక్షము. (సెకండరీ) అది శల్యతంత్రవ్యావహారికపుస్తకము కాని జననమరణముల లెక్క కాదే. అందులోని చావొకపద్దుగా గణింపదగదు. ఆపరేషన్ జయప్రదమగునా కాదా అనియే ప్రశ్నము. అంతటితో సరి. కాని చావేల యందఱకు సంభవింపవలయును ? అప్టర్ ఎఫెక్టుకు అతఁ డెట్లు బాధ్యుఁడు ? మెదటిలోనుండి కప్పలను దీసినాఁడు. కన్నులలోనుండి జెఱ్ఱులను దీసినాఁడు. కార్జములోనుండి ఱాలను దీసినాఁడు. ఇట్లింద్రజాల మహేంద్రజాల విద్యలను ముప్పదిసంవత్సరము లగపఱచినాఁడు. ఇప్పుడున్నవాఁ డుత్తరక్షణమున హుష్‌కాత్ !

ఒకఁడా ! యిద్దఱా ! వందలు వేలు ! అతనికత్తి కట్టి కఱకు. ఆతని చేతి కంత చుఱుకు. తుద కాతఁడే సంపూర్ణప్రజ్ఞాశాలియై శల్యతంత్రమం దంతవాఁడు లేఁ డనిపించుకొనినాఁడు. నీయిల్లు కాలిపోను. నీబుద్ధి బుగ్గిగాను. నీకడుపు మాడిపోను. నిన్నుఁ బాము గరువను. నిన్ను బ్రహ్మరాక్షసుఁడు పట్టుకోను. అనునవి తిట్లుకావు. నీనాడి బాల

వైద్యుఁడు చూడను—అనునది తిట్టు—ఓ! అంత తిరుగులేనితిట్టు మఱియొక్కటి యున్నదా? అబ్బ! అబ్బ! బ్రహ్మాస్త్రమునకుఁ బ్రతిహతి మున్నది. ప్రబలనిర్ఘాతపాతమునకుఁ బ్రతిరోధ మున్నది. బాల వైద్యునివైద్య మప్రతిహతము. అప్రతిరోధకము. శ్లో. "సహస్రాదిత్య సంకాశమ్ సర్వశత్రు నిబర్హణమ్, రామశక్తిమయం ధ్యాయే దమోఘమ్ రామసాయకమ్." అని రామబాణమాహాత్మ్యమును వర్ణించి యున్నారు. సర్వశత్రు నిబర్హణశక్తిమాత్రమే రామబాణమం దున్నది. శత్రుమిత్ర భేదరహితమైన నిబర్హణశక్తి మన బాలవైద్యుని హస్తమం దున్నది. ఆతఁడు సర్వసమవర్తి. అతఁడు మాటలోనే వచ్చుచున్నాఁడు. నాయనలారా! లేచి వారికి స్వాగత మీయవలయును.( అట్లుచేయుదురు) అయ్యా! భిషఙ్మణీ! మిమ్ముఁగూర్చియే యింతవరకుఁ జెప్పుచున్నాను. మీరిఁక నుపన్యాస మారంభింపవచ్చును. ఈసభకుఁ గాలాచార్యులవారి నగ్రాసనాధిపతిగా నేను శ్రోతలపక్షమున నియమించుచున్నాను.

వైద్యునియుపన్యాసము

"అగ్రాసనాధిపా! సోదరులారా! సాక్షిసంఘమునుగూర్చి యిది వఱకుఁ జెవులార వినుటయేకాని కన్నులారఁ జూచుభాగ్యము సిద్ధింపలేదు. దాని నిప్పుడు చూచుభాగ్యమేకాక దానిలో నుపన్యాస మిచ్చు భాగ్యము కూడ సిద్ధించినది. అంతేకాక వైద్యు లెవ్వ రిదివర కీసభయం దుపన్యసించి యుండకపోవుటవలన వైద్యవృత్తి నవలంబించువారిలో ప్రథమోపన్యాసకుఁడను నేనే యగుట మఱింతభాగ్యమని యెంచు చున్నాను. (అయ్యా! డాక్టరు పింజారిరావుగారు తమకంటె ప్రథము లేమో యని సభలోఁ గేక) అటులయిన క్షమింపవలెను. అయినను బింజారిరావుగా రాంగ్లేయవైద్యులు. నే నాయుర్వేదవైద్యుఁడను. కావున నేనే మొదటివాఁడ నగుదునేమో (ఆంగ్లేయవైద్యమైన నేమి? ఆయుర్వేదవైద్యమైననేమి? అమ్మకడుపు చల్లగానున్నంతవఱ కాయుస్సున కాతంకము లేదని యెవ్వఁడో విన నిమ్మళముగ సణుగుకొనును) నేనిప్పుడు మీకు శరీరారోగ్యమునుగూర్చి చెప్పవచ్చితిని. ఆరోగ్య మందఱ కిష్టమే. ఆరోగ్య మంద ఱపేక్షించునదే కాని యారోగ్యార్జన మందఱుకూడ

నలక్ష్యముగఁ బ్రవర్తించుచున్నారు. ఇది కడుశోచనీయము. ఆరోగ్యమును సంపాదించుట యెంతమాత్రమును నష్టముకాదు. ఉషఃకాలముననే లేచి కాలకృత్యములను నిర్వహించుకొనవలయును. ఉషఃకాలమున లేచుట యేమంతకష్టము? ఒకటి రెండు దినములు రవంత కష్టముగాఁ గానఁబడినను నభ్యాసమైన పిమ్మట మాత్ర మావేళకే సరిగ మెలకువ వచ్చును. శీతోదకస్నానమే చేయవలయును. ఉష్ణోదకస్నానము తగదు. ప్రవాహినియగు నదిలో స్నానమొనర్చుట ప్రథమపక్షము. తటాక స్నానము రెండవది. కూపాద్యుదకస్నాన మధమము.

"అప్పిచ్చువాఁడు వైద్యుఁడు
నెప్పుడు నెడతెగకపాఱు నేరును ద్విజుఁడున్
జొప్పడిన యూరనుండుము
చొప్పడకున్నట్టియూరు చొరకుము వేమా."

అని వేమనమహాయోగి పలికినాఁడు. (ఇది సుమతిశతకపద్యమేమో సుమండీ యని యొకఁడు కేక - ఎడతెగకపాఱు నేరున్నచోట నారోగ్యమునకు లోపము లేదుకదా. అక్కడ వైద్యుఁ డెందుకండియని యొకఁడు కేక) కొందఱైన సరిగ నుషఃకాలమం దాయేటిలో స్నానముచేయుట కలక్ష్యము చేయుదురను కారణముననే కవి నదికంటె వైద్యునినే ముందుఁ జెప్పినాఁడు తెలిసినదా? (తెలిసినదండి. వైద్యుఁడు తప్పక యుండవలసి వచ్చినది కావున నంతకన్న తప్పని సరిగ శ్రాద్ధమంత్రములకుఁ గాఁబోలు "ద్విజుఁడున్" అని కవి పలుకవలసివచ్చినది. అని యొకఁడు సభలోఁ గేక) అది కేవలము బుద్ధిహీనత. రోగమును నివారించుటకే వైద్యుఁడు. వ్యాజ్యెమును గెలిపించుటకే న్యాయవాది. సంధానము కొఱకే రాయబారి. ఆకృత్యము లొకప్పుడు తప్పిపోవచ్చును. అందులకు విచారింపఁ బనిలేదే. (విచారము మీ కెందుకయ్యా? ధననష్టి ప్రాణనష్టికూడ పొంది యేడ్చువారము మేముంటిమికాదా! యని యొకఁడు గొణుగుకొనును). ఇప్పుడీలోకమందు—ముఖ్యముగా నవనాగరకలోకమందు—వైద్యుని జమత్కారమునఁ బరిహసించు దురాచారమున్నది. అది యొక గొప్ప బుద్ధివిశేషమని యధిక్షేపకులయభిప్రాయము. అది శుద్ధబుద్ధిహీనతకాని వేఱుకాదు. సరే; ఈగోడవయెందులకు? ప్రాతఃస్నానమైనపిమ్మట సంధ్యా

వందన మాచరించుకొని కొంతసేపు ప్రాణాయామము నారోగ్యము నపేక్షించువా రందఱు చేయవలయును. దీనియుపయోగము లనంతములు. ఈయుత్తమసాధనమువలన శరీరమున వ్యాధియే యుండదు.

ఆర్యులారా! మీ రప్పుడే యావులించుచున్నారు. నావాక్యములు మీకు రుచివంతములుగా లేకపోవచ్చును. మీజంఘాలశాస్త్రివలె జనరంజకముగ మాటలాడుశక్తి నాయొద్ద లేదు. ఒక్కనాయొద్దనే కాదు. వైద్యులెవ్వరియొద్దను గూడ నాశక్తియుండుట కవకాశము లేదు. వైద్యుల కెంతసేపు చేతితోనేగాని నోటితోఁ బనియే లేదు సరే. ప్రాణాయామమైనపిమ్మట కాఫీ గాని—టీ గాని — కోకో కాని—యేదియుఁ బుచ్చుకొనఁగూడదు. ఇవి తత్కాలికోద్రేకము నిచ్చినను శీఘ్రకాలమున శరీరమును బాడుచేయును.

పగలు రెండుయామములకుఁ బూర్వమునందు భుజింపవలయును. సాయంకాలమునఁ దిరుగ నెనిమిదిగంటలకు లోపల భుజింపవలయును. పదకొండుగంటలు వినకుండ వినకుండ నిద్రింపవలెను.

పొడుముకాని—చుట్టకాని—నల్లమందుగాని—గుడిగుడికాని—యెంతమాత్రమును దగవు. పొగాకులోని విసము బహుప్రబలమైనది. దానివలననే హృదయవ్యాధి — కాలెజపువ్యాధి — మందాగ్ని—పక్షవాతము—మొదలగురోగములు సంభవించును. పొగచుట్ట యొక్కటి తెచ్చి యదిసగముత్రుంచి యొకతునుకను సాయంకాలమున యొకయరసేరు నీళ్లలోవైచి తెల్లవాఱువఱకు దానిలో నాననిచ్చి యానీటిని బలిష్టమైన ఆ స్త్రేలియాగుఱ్ఱమునకుఁ బోయుఁడు. అంత గుఱ్ఱము కూడ గిఱ గిఱ తిరిగి యరగంటలో టారునఁ జచ్చును. పొగాకులోని విస మంతభయంకరమైనది. తాంబూలచర్వణము కూడఁదప్పే! తాంబూలము హెచ్చుగా నెవరు వేయుదురో వారినెత్తిపై మందాగ్ని మూఁడుపంక్తులఁ దప్పదు. పొగాకు తాంబూలమున వేయునాచారము కొన్ని దేశములం దున్నది. ఇది మఱెంత దూష్యము. ఇదికాక మత్తుఁగలుగఁజేయుపదార్థ మేదియుఁ దీసికొనరాదు. అందువలన నారోగ్యము నశించును.

అంటువ్యాధు లూరనున్న కాలమునందు జనసమ్మర్దము విశేషముగా నున్న చోటికిఁ బోరాదు. రాత్రులందుఁ దఱచుగా నిల్లు వెడలఁ

దగదు. వేళమించకుండఁ — దప్పకుండ — భోజన మొనర్పవలయును. నిదురింపవలయును. భయము మనస్సునఁ జేరనీయరాదు. ఉడికిననీరు చల్లాఱనిచ్చి దానిని ద్రావినమంచిది. ఉదయమున నెచ్చటికిని బోరాదు. పగటుపున విషక్రిములు శీఘ్రముగ వ్యాపించును.

ఇట్లింతయని — యెన్నియని — చెప్పఁగలను ? ఒక్కొక్కయంశముపై నొక్కొక్క గ్రంథమును వ్రాయఁదగును. ప్రధానాంశ మొక్కటి చెప్పెదను. మనుజుఁ డేమిచేసినయెడల నాయుష్మంతుఁ డై యుండును ? అనునది వైద్యశాస్త్రమందు ప్రప్రథమప్రశ్నము. ఎవఁడు జఠరదీపికను బాగుగాఁ గాపాడుకొనునో వాఁడాయుష్మంతుఁడని యాప్రశ్నకుత్తర మీయఁబడెను. సోదరులారా ! వింటిరా ? అఖిలరోగకారకమైనది యజీర్తి. ఆయుఃక్షయకరమైనది యజీర్తి. అట్టి మందాగ్ని రాకుండ మనుజుఁడు ప్రవర్తింపవలయును. మందాగ్నివలన జ్వరము — కాసము — క్షయ — పాండువు — అది యిది యననేల — సమస్త వ్యాధులు కూడఁ బుట్టును. ఇఁక మఱియొక్క చమత్కార మున్నది. చెప్పుమందురా ? (అక్కఱలేదు. అక్కఱలేదు అని గుసగుసలు) మందాగ్ని యున్నరోగి ప్రపంచమందున్న యన్నిరోగములను తానేయనుభవించుచున్నాఁడను భావనకు లోనై యుండును. నేను జెప్పినమాట మీకర్థమైనదా ? శాస్త్రీయరహస్యము లగుటచేత సామాన్యజనుల బుద్ధుల కందవు. (ఏడ్చినట్లే యున్నదని యొకఁడు మఱియొకనిమీఁద వంకబెట్టి యనెను.) మందాగ్ని యున్నవాఁడు హృదయవ్యాధిచేఁ దాను బాధపడుచున్నట్లు భ్రమించును. మందాగ్ని యున్నవాఁడు క్రిమివాతముచేఁ దాను బాధపడుచున్నట్లు భ్రమించును. మందాగ్ని యున్నవాఁడు మేదోవ్యాధిచేఁ దాను బాధపడుచున్నట్లు భ్రమించును. ఇట్లు మందాగ్నియే సర్వబాధలకు మూలము. మందాగ్నివలన నిట్టి భ్రమములు కలుగుటకుఁ గారణము లేవో నేను జెప్ప మొదలిడినయెడల మీకవి దురవగాహములుగ నుండును. చిరకాలము నేర్చుకొన్న శాస్త్రీయాంశములు క్రొత్తవారికిఁ దెలియుట సాధ్యముకాదుగదా ! (అది మాకుఁ జెప్పుమని దేవులాడినవా రెవరని కేక) ఇదివఱకేమి చెప్పితిని ? మందాగ్నియే సర్వరోగమూలక మని చెప్పియుంటిని. (ఈతని మానుమని చెప్పవలసినదని యధ్యక్షుఁడగు కాలాచార్యుని కొకచిన్న

చీటి నొకఁ డిచ్చుచున్నాఁడు. దాని నాతఁడు చూచుకొని దానితాత్పర్య మేదో తెలియక కాఁబోలుఁ—దెలిసినయెడల నేమి చేయుటకును దోఁపక కాఁబోలు నిశ్చేష్టుఁడై—రవంతసేపుండి తనవ్రేళ్ల చిటికలో నున్న పొడుము నాచీటిలోనుంచి యాచీటిని మందుపొట్లముగాఁ గట్టి పిడికిటిలోఁబట్టుకొని యధ్యక్షుఁడు మాటలాడక యూరకుండెను) సరే మందాగ్ని నెట్లు నివారించుకొనవచ్చును. అనఁగ—నగ్నిదీప్తి నెట్లు కాపాడుకొనవచ్చును? ఇందుకుఁ బాశ్చాత్యుల వైద్యపద్ధతి వేఱు. మన పద్ధతి వేఱు. వారు తఱచుగా పెప్సిన్—జైమిన్—ఇన్గ్లువిన్—పేపి యానా—మొదలగు పదార్థముల నిచ్చి యగ్నిదీప్తిని బైనుండి కలుగఁ జేయుదురు. అది మనవారి కిష్టమగు పద్ధతి కాదు. లోపలినుండియే యగ్ని దీప్తిని మనవారు కలుగజేయుటకు యత్నింతురు. వారివైద్యము సాధారణముగా బాహ్యవైద్యము. మనవైద్య మాంతరవైద్యము. జ్వరమును వారు రోగికి చెమ్మటపట్టించి తగ్గింతురు. మనవా రీపద్ధతి కిష్టపడరు. మనవారు పైరక్తపు వేఁడిమిని తగ్గించుట కిష్టపడక లోని కోశములందు వేఁడిమి పుట్టించి పైవేడిమి లోని కాకర్షించుకొందురు. ఇవి యన్నియు శాస్త్రరహస్యములు. మచ్చుకొక్కటి మీకుఁ జెప్పితిని. (ఏడువలేకపోయినావు. అని గుసగుసలు) నామాటలను వినుటకు మీకు విసుఁగుగా నున్నట్లు కనఁబడుచున్నది. అయినను మఱి నాల్గు నిముసములు కాలమిచ్చినయెడల నొక ముఖ్యమైనసంగతి చెప్పఁ దలఁచియున్నాను. (త్వరగ దిగవయ్యా యని కేక) త్వరగనే దిగుదును. ఈయాయుర్వేద మున్నదే అచ్చటచ్చట నదికొంత యసందర్భముగఁ గనఁబడుచున్నది. కొన్నికొన్ని ఘట్టములు నిరర్థకములుగ నిష్ప్రయోజనములుగ నున్నట్లున్నవి. మఱికొన్ని యస్పష్టాభిప్రాయములుగ నున్నవి. కొన్నికొన్ని భాగము లసంపూర్తిగ నున్నవి. కొన్ని యథోచితస్థానములందుండక యసంబద్ధస్థానములందున్నవి. (ఓరి నీగొంతు గోయ యని యొక్కఁడు నిమ్మళముగ ననుచున్నాఁడు) నాడీనిదానమును గూర్చి రవంత విచారింతము. (కావలసినయెడల నీవు శాశ్వతముగా విచారింపుము. మాకక్కఱలేదని కేకలు) నాయనలారా! తొందరపడెద రేల? శాస్త్రోపన్యాస మనుకొంటిరా? లొడలొడచెప్పు

టకు సామాన్యాంశములపై నుపన్యాసము లనుకొంటిరా ? క్షమింప వలెను. అయినను త్వరలో ముగింతును. ఒక్క నాడీనిదానమునుగూర్చి రవంత యోజింతము. ఇప్పటికిఁ దర్జనమీఁదిది వాతనాడియో పైత్య నాడియో తేలలేదు. ఆపక్షమున బలమున్నది. ఈపక్షమున బల మున్నది! చిత్రమేమనఁగా పైత్యనాడి యనుకొనినను బని జరుగు చున్నది. వాతనాడి యనుకొనినను బని జరుగుచున్నది. (పని జరుగుట పెద్దబ్రహ్మాండమా ? గుక్కెడుప్రాణ మెంతసేపు లాఁగివేయవలయును?) సోదరులారా ! అట్లుకాదు. పైత్యజ్వరము వాతరాక్షసమునఁ గుదురు చున్నది. వాతజ్వరము వసంతమాలినివలనఁ గుదురుచున్నది. (పైత్య నాడి యేదో తేలునప్పు డిది పైత్యజ్వరమని—యది వాతజ్వర మని—నిర్ధారణచేయుటకు నీకేమి యధికారమున్నది ? యని కేకలు. బ్లాక్ హెడ్ అనిగుసగుసలు) అట్టియాధారమున్నది లెండు. ఆలోఁతు సంగతులు మీకుఁ దెలియవు లెండు. ఎట్లైన నేమి ? నాడీనిదాన మంతయు రెండుతలలపాము వలె నిట్టు లట్టులు గూడఁ బ్రాకుచున్నది. ఇది యిట్లుండఁగా నాడియనునది యొకటి యున్నదా ? ఉన్నయెడల నంగుళమాత్రప్రదేశములో వివిధములైన మూఁనాళ్లుండుట కెట్లవకాశ మున్నది ? కావున నీనాడీవివరణ మంతయు-నెండమావులని యడ్డుసుడి వాద మొకటి బయలుదేఱుచున్నది. దీని మూలమునకే మోసము వచ్చినట్లగపడుచున్నది. ఆయుర్వేదమున సవరణలు చేయవలసిన భాగము లన్నియు నేను దీక్షతో విమర్శించియున్నాను. అవి యన్నియు లోక మునకు వెల్లడిచేసి శాస్త్రమునకు దేశమునకు నూతనప్రబోధమును గల్పింపఁదలఁచియున్నాను. (ఆ ! ఎంతవాఁడవు ! నూతనప్రబోధము నీవలనఁగలుగునా ? నూతనప్రబోధము కాదు. నూతనప్రాణోపద్రవమని వినఁబడి వినఁబడునట్లు ధ్వనులు) సోదరులారా ! నాప్రయత్న మలక్ష్య ముగా భావింపకుఁడు. నేను "దేశీయభేషజ" పత్రిక యనుపేరట నొక వారపత్రికను స్థాపింపఁదలఁచియున్నాను. ముఖ్యమైన స్థలములందెల్ల ప్రచార మొనర్చి యాపత్రికకుఁ గావలసిన చందాదారులను సంపా దించుచున్నాను. మీరందఱాపత్రికకుఁ జందాదారులుగ నుండుటయే కాక కొంత మూలధనముకూడ శక్తివంచనలేకుండ నీయవలసియున్నది.

దేశక్షేమలాభాదులకై చేయు మహాకార్యములకు దేశీయులు తోడు పడకపోయినయెడల నెవరు తోడ్పడుదురు? అందులో రైతులను బీల్చి పిప్పి చేసి యార్జించినసొమ్ము నల్లరిచిల్లరి వేడుకలందు వ్యయపఱచు కొందరు జమీందారు లున్నారే, వారొక్క సానికై కట్టించిన మోహినీ మహాల్ విలువతో నాముద్రాక్షరశాల నిర్మితమగును. (నీకర్మము సానినై పుట్టలేకపోయినావా? యను గుసగుసలు) వారొక్క సంక్రాంతి పండుగకుఁ గోడిపందెములకై వ్యయపఱచిన సొమ్ముతో నూతననాడీ నిదానమను నాగ్రంథము లోకోద్ధారణార్థమై పైకి రాఁగలదు. ఇంక నట్టె చెప్పఁదలఁచుకొనలేదు. ఇదిగో చందాపట్టి. మీరందఱు దయయుంచి— (దిగు దిగు అను కేకలు) చందాలువైచి—నాప్రయత్నము సఫలమగున ట్లాచరింపుఁడు. భగవంతుఁడు మీకు హృదయములందు దేశోపకారాభి లాషమును దృఢముగాఁ గలుగఁజేయుఁగాక. తథాస్తు (తెలివి లేని చప్పటలు.)

కాలాచార్యుని యుపసంహారోపన్యాసము

"నేనిప్పు డుపసంహారోపన్యాస మీయవలయును గాఁబోలు! ప్రారంభోపన్యాస మిచ్చిన యధ్యక్షున కుపసంహారోపన్యాస మర్హము కాని యుపసంహారోపన్యాసమే ప్రారంభోపన్యాసముగాఁగల యధ్యక్షుఁ డిప్పు డీయఁబోవు నుపన్యాసము నేమందురో యాయుపన్యాసమే యీయవలసియున్నది. భిషజ్మణియను పేరునందున్నంత బిఱ్ఱు—వారి వాక్యములలో నగపడదు; చేతిచుఱుకే కాని వైద్యులకు నోటిచుఱు కుండదని వారే సెలవిచ్చినారు. కావున వారికిఁగాని మనకుఁగాని యీవిషయమం దుపద్రవ మేదియులేదు. ఎటువచ్చినను సిద్ధాంతపూర్వ పీక్ష వ్యవహారములందుఁ జికిలిచేసిన కత్తివంటివాఁడను గావున నొకరు 'ఔ' నన్నది కాదనుటయే నే నేర్పాటుగాఁ బెట్టుకొనియున్నాను. అది గాక యధ్యక్షుని వ్యాపారము తుద కన్నియుపన్యాసములను ఖండించు టయే యని నేను వినియున్నాను. కావున నేనిప్పుడు చెప్పఁబోవున దేమనఁగా—భిషజ్మణియుపన్యాసము హరిః ఓమ్ మొదలుకొని— తథాస్తువఱకు—నంతయు మిథ్య రజ్జువందు సర్పత్వ మెంతయున్నదో శుక్తియందు రజతత్వ మెంతయున్నదో—మరీచికలందు వీచిక లెంత

యున్నవో—వీరియుపన్యాసమందు సత్య మంతయున్నది. ఇఁక నెందు లకు? ఖండింపఁదలఁచుకొన్నప్పు డాపాదశిరఃపర్యంత మొక్కటే దెబ్బ కొట్టిన మంచిదికాని చిల్లరచిల్లర దెబ్బలు కొట్టనేల? అది నా కిష్టము కాదు. ఆబుగ్గమీఁద నొక్కగిల్లుగిల్లిన నేమిలాభము. ఈవ్రేలు రవంత విఱిచిన నేమిలాభము. మోచేతితోఁ బ్రక్కలో నొక్కపోటుపొడిచిన నేమిలాభము. తెక్కగూళ్లనడుమ నొక గ్రుద్దుగ్రుద్దిన నేమిలాభము. సర్వావయవశైథిల్యముగలుగునట్లు—సర్వాంగశీతలతగలుగున—ట్లొక్కటే దెబ్బ—పాదనాడి మొదలుకొని బ్రహ్మరంధ్రమువఱకుఁ గొట్టితిని. ఇఁకఁజాలునా? నేనిఁకఁ గూరుచుండవచ్చునా? (అదేమి? స్వామిగారూ! అప్పుడే కూరుచుందురా? వైద్యుని యుపన్యాసములోని యంశముల నొక్కొక్కదాని ననువదించి దానిని సకారణముగ ఖండించి-తుదకు మీయభిప్రాయము చెప్పవలయును గాని యీఖండనవైఖరి యేమి? గొడ్డలిపెట్టుగ నొక్కటే దెబ్బయా? కావున నుపన్యాసాంశములను వివరించి ఖండింపుఁడు. అని సభలో నొక్కఁడు కేక) ఆలాగునఁటయ్యా! సరే. రవంతపొడుముపట్టేది? (పుచ్చుకొని పీల్చును) ఏదో పెద్దదెబ్బ కొట్టినాముకదా! చిన్నదెబ్బ లవశ్యముగాదని యుపేక్షించితినిగాని చేతగాక యూరకుంటినా? చింతచెట్టు కొట్టినవానికిఁ జింతబఱికలులాగుట కష్టమా? చింతాకు దూయుట కష్టమా? సరే! ప్రాతస్స్నాన మావశ్యకమని మనవైద్యులు సెలవిచ్చినారు. నేను వ్యతిరేకముగాఁ జెప్పవలసినదే కాదా? సరే. ఇది సత్యముకాదు. ఉష్ణప్రదేశములలోఁ బ్రాతస్స్నాన మారోగ్యప్రదము. కాని శీతప్రదేశములలోఁ బ్రాతస్స్నానము ప్రాణాపాయకరము అదిగాక—ప్రాతస్స్నానము కొందఱి తత్త్వములకుఁ బడదు మాతాతగారి కదేపద్ధతి. నాకు నదేపద్ధతి. స్నానమే వదలుకొన్నయోగి వేయి సంవత్సరములు ఊయివలె జీవించును. నీటికాకి పెడేమనునంతలోఁ జచ్చును. పాశ్చాత్యులందఱకు నిత్యస్నానములున్నవా? పక్షస్నానములైన నున్నవా? మాసస్నానములైన నున్నవా? వారు దీర్ఘాయుష్మంతులై యారోగ్యవంతులై యుండలేదా? కావునఁ బ్రాతస్స్నాన మారోగ్యమున కావశ్యకముకాదు. స్నానము

గూర్చి యింకఁ ద్రోచివేయవలసినదేనా? సరే. తాతాచార్యులుగారూ! రవంత నస్యము. (పిల్చును)

టీగాని కాఫీగాని త్రాఁగఁగూడదని వారు చెప్పినారు. ఖండించుటయే మనపని గావున త్రాఁగవచ్చునని నాసిద్ధాంతము. అవి త్రాగుట చేతనే యారోగ్యము చెడినట్లు నేనెక్కడను వినియుండలేదు. నేననేకులను గడవలకొలఁది కాఫీ త్రాఁగినవారి నెఱుఁగుదును. వారు పిప్పళ్ళబస్తాలవలె నున్నారు. చెక్కుచెదఱులేక—జిఱ్ఱునఁజీదకుండ—తుసుక్కున తుమ్మకుండ—నమృతము త్రాఁగిన యాదిత్యులవలె—నున్నారు. అంతమాత్రమునకే యారోగ్యము చెడదు. మానివేసినంత మాత్రమున రాదు. ఇది యింకను ద్రోసివేయనా? సరే. పంతులూ! ఇదిగో! (అని అధ్యక్షుఁడు ముక్కు చూపుచున్నాఁడు)

ఇఁకను రెండుపూటల సరియైనవేళకు భోజనముగూర్చి చెప్పెదను. (శాస్త్రులూ! నాచేతిలోఁ బొడుముపట్టు కనఁబడకుండ నున్నది. ఇప్పుడు నేను బొడుము పీల్చినట్లే కాదా? అని రహస్యముగ నడుగును.) భోజనమునకు నిద్రకు వేళయేమి? కడుపులోని కలకలనుబట్టి సాపాటా? గడియారపు గదలికనుబట్టి సాపాటా? దీని కొకఁడు చెప్పనక్కఱలేదు. ఒకసూత్ర మక్కఱలేదు. ఆకలియగునప్పుడు తినవలసినది. నిద్ర వచ్చినపుడు నిద్రింపవలసినది. ఓ! ఇంతకన్న బాహాటమైన పద్ధతి లేదు. ఆలాగునఁ జేసినవాని కేరోగము నుండదు. వాఁడు సర్వవ్యాధి దిగ్విజయ మొనర్చును. ఇఁక నిదిసరి.

పొడుముకాని పొగచుట్టకాని తగదని వారు చెప్పినారు. ఇది లోకవిరుద్ధమైనమాట. దానికి లోనుగానివా రెవ్వరోకాని లేరు. దినమునకుఁ బలము చేబ్రోలుపొగాకు కాల్చి నూటయిరువదిసంవత్సరములు జీవించిన వెలమదొరగారిని నే నెఱుఁగుదును. ఇట్లొకరా యిద్దఱా? దీనివలన నారోగ్యము చెడునన్నమాట స్వప్నవార్త. అసలు పిండపుష్టి యుండవలయును. జము నెమ్ముక నుండవలెను. అంతేకాని—నెలతక్కువ—పాలబీద—నిర్భాగ్యపుపెద్దమ్మలు చుట్టత్రాగుటవలన కెందులకు? మజ్జిగ త్రాగిననే చచ్చెదరు. అందుకొఱకు మజ్జిగ వర్జ్యమా? పడ్చినట్లే యున్నది. సూత్రమున కొక సబబు సందర్భ ముండనక్కరలేదా? ఇది

యిఁకఁ ద్రోచివేయవలసినదేకదా! పంతులూ! తిరుగ నిన్నడిగినయెడలఁ గోపమురాదుకదా! ఇదిగో రవంత! (పీల్చును) మనవైద్యుఁడు తన యుపన్యాసమునఁ జెప్పిన శాసనములన్నియు నిట్టివే. ఒక్కటియుఁ బరీక్ష కాఁదగినదిలేదు. ఇఁకను నాకుఁదోఁచిన యారోగ్యసాధనములుచెప్పెదను. ఇవి సిద్ధాంతవాక్యము లని నేను చెప్పెదను. మీయిష్టానుసారముగ మార్చుకొనవచ్చును.

మొదటిది:—(1) పెండ్లిచేసికొనఁగూడదు. ఇట్టివాఁడు తలపోటు లేక—కడుపుమంట లేక—అాతివిగ్రహమువలె—నొడల ముడుత యైన లేక—నూఱేండ్లు జీవించును. అందులకు నాదిపూఁచీ. (2) బుద్ధి లేక పెండ్లి చేసికొనినయెడల—భార్యపై నధికారము చేయఁదగదు. ఇట్టివాఁడు బట్టతలలేక—పండ్లు రాలిపోవుటలేక — యంతర్గతమైన యుష్ణములేక—గుండెలోగుబులులేక—యఱువది సంవత్సరములవఱకు జీవించుటకు నాదిపూఁచి.

రెండవది:—ఎట్టితగవులయినను సంధిమార్గమునఁ దీరుమానించు కొనవలయునే గాని కోర్టు కెక్కఁగూడదు. ఇట్టివాఁడు పార్శ్వపు నొప్పి— పక్షవాతము— పరిణామశూల— మొదలగువ్యాధులులేక యారోగ్యవంతుఁడై యెనుఁబది సంవత్సరములవఱకు జీవించును.

మూఁడవది:—జంజాట మెన్నఁడును వృద్ధిచేసికొనఁ గూడదు. ఎంత తగ్గించుకొనిన నంతమంచిది. ఇట్టివాఁడు మూర్ఛవ్యాధి జన్ని యను సన్నిపాతవ్యాధి చచ్చువాతము జలోదరము మొదలగునవి లేక యారోగ్యవంతుఁడై తొంబది సంవత్సరములవఱకు జీవించును.

నాలుగవది:—కూలికి మాత్రము గ్రంథ మెన్నఁడును వ్రాయఁ గూడదు. ఇట్టివాఁడు నక్కమోరు— నారకురుపు— నయనరోగము మొదలైన రోగములు లేకయెనుబది సంవత్సరములవఱకు జీవించును.

అయిదవది:—పరస్త్రీని బ్రక్కచూపునఁ జూడఁదగదు. ఇట్టి వాఁడు తిమ్మిరివాతము— వీర్యనష్టము— కుష్ఠము— అండవాతము— పుంస్త్వహీనత మొదలగునవి లేక డెబ్బదిసంవత్సరములు జీవించును.

ఆఱవది:—లేదని యెన్నఁడును దేవులాడవలదు. ఇట్టివాఁడు

అరిసెరోగము—అజీర్తి—గుండెబరువు—హృద్వేగము మొదలగునవి లేక డెబ్బదిసంవత్సరములు జీవించును.

ఏడవది:—ఒకని కుండిపోయెనే యని యెప్పుడు విచారింపవలదు. ఇట్టివాఁడు కాలుసేతులు మంట—కార్జెములో పోటు—అంతరకుసుమము మొదలయిన వ్యాధులు లేక యఱువది సంవత్సరములు జీవించును.

ఎనిమిదవది:—తేపటిమాట యేమి యని యోచింపవలదు. ఇట్టివాఁడు హృదయవ్యాధి—పార్శ్వశూల—మూత్రకృచ్ఛ్రము మొదలగు వ్యాధులులేక యరువదిసంవత్సరములు జీవించును.

తొమ్మిదవది:—పోయినదానినిగూర్చితలపెట్టవలదు. ఇట్టివాఁడు—కామిల—పాండువు—రక్తక్షయము—అపస్మారము మొదలగు వ్యాధులు లేక యఱువదివత్సరములు జీవించును.

పదవది:—దేవుఁడు రక్షింపఁడేమో యని భయపడవలదు. ఇట్టివాఁడు—విషూచి మహామారి—స్ఫోటకము మొదలగు వ్యాధులు లేక యెనుబదివత్సరములు జీవించును.

మనహృదయవ్యాపారమును బట్టి యారోగ్య ముండును గాని తిన్నయన్నమునుబట్టికాని—త్రాగిన కాఫీనిబట్టిగాని—కాల్చిన చుట్టను బట్టికాని—పీల్చినపొడుమును బట్టికాని—వేసికొనిన గంజాయియుండను బట్టికాని యుండదు. ఇవియన్నియు నిమిత్తమాత్రములు. ప్రధానమైనది. హృదయవైఖరి.

ఈపదిసూత్రములు—ప్రాతస్స్నానములకంటె — ప్రాణాయామములకంటె—బదునాలుగురెట్లు—ప్రశస్తములు. కాని యెమిచేసినను నాయుర్విషయమై యారోగ్యవిషయమై కర్మసూత్రమునకంటె భిన్నముగా నెన్నఁడు జరుగదు. ఈసంగతి జ్ఞప్తియం దుంపవలయును. ఆయుర్వృద్ధికి నారోగ్యవృద్ధికి మనకున్న మందులన్నియు గంగలోఁ బాఱవేయవలసినదే కాని కంటితోఁ జూడనైనఁ దగదు. ఎంతపరిమాణమో అంతే. ఎంతపిండపుష్టియో అంతే. ఇది యింకఁ ద్రోచివేయనా ? సరే. జంఘాలశాస్త్రీ ! నేనింతకుఁబూర్వమునఁ జిన్నకాగితపుజీటిలోఁ బొడుముంచి పొట్లము కట్టితిని. నీవు చూచితివా సరే. (పీల్చును).

ఆయుర్వేదములో దిద్దుపాటులని యతఁడు చెప్పినమాటలున్నవే అవియన్నియు నవకతవకలు. అర్థాన్నములు. అర్థహీనములు. అపరిశుద్ధములు. అవాచ్యములు. అస్మరణీయములు. ఏదో ముద్రాక్షరశాలకై చందాలు కోరినాఁడే—ఆచందా లెవ్వరు నీయవలసినపనిలేదు. ఆతఁ డట్లు యుపన్యాస మిచ్చినాఁడని యైన మీ రెవ్వరితో ననవలదు.

"కాలాచార్యులసంగతియేమియుఁ దెలియకుండనున్నది. ఆతడేమి చేయుచున్నాఁడు" అని యస్మదీయక్షేమశ్రవణకుతూహలులై యొక బ్రాహ్మణవర్యుఁడు నొక వెలమదొరగారును మఱియొకరును బెంట నాగులవలసనుండి సాక్షికి లేఖ వ్రాసినారు. వారిదయకు నేను మిగులఁ గృతజ్ఞుఁడను. సాక్షిసంఘమునకు వచ్చినలేఖలన్నియు మూఁడునెలల కొకసారి 'స్వవిషయసల్లాపములలో' జదువునాచారమునుబట్టి యా పెంట నాగులవలస లేఖకూడ నప్పుడే చదువఁబడునని యనుకొందును. నేనిఁకఁ గూరుచుందును.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# అఖిలాంధ్ర దేశమశకమత్కుణమూషికమహాసభ

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! సాక్షిసంఘాభిమానులలో నొకరు సాక్షి కొక లేఖ నంపినారు. అది యిదిగో! దానిని జదివెదను. శ్రద్ధతో వినఁ గోరెదను:—

సాక్షికి—అయ్యా! అనేకనమస్కారములు. ఆంధ్రపత్రికలో వారమున కొకపర్యాయము వెలువడుచున్న సాక్ష్యుపన్యాసములను చదివి వినిపించుటకై నేను మదరాసులో వేంచేసియున్న మారాజు గారిదర్శన మపేక్షించి రైలుబండిలోఁ బ్రయాణము చేయుచుంటిని. ఇంటర్ మీడియేటుతరగతి బండిలోఁ బండుకొని పైనున్న దీపపువెలుతురుసాహాయ్యమున నేదియో యొకపుస్తకమును జదువుకొనుచుంటిని.

దోమలు చెవియొద్దఁ జేరి గానకాలక్షేప మారంభించినవి. నేను బండుకొన్న బల్లపై నమర్పఁబడిన పీఁచుపఱుపు నాశ్రయించి యభివృద్ధి నొందుచున్న నల్లులు తమకేర్పడిన స్థానమాక్రమించుకొంటిననుకోప ముచేఁ గాఁబోలు నన్నుఁ జెడమడ పొడుచుచుండెను. వానిబాధ పడ లేక లేచి ప్రక్కదులుపుకొంటిని. ప్రక్కను దులుపఁగలను గాని బల్లపై బంధింపఁబడిన పఱుపు నూఁడలాఁగగలనా? లేచి యిట్లు ప్రక్కదులుపు చుండగ నాకాలిపై నేదియో ప్రాకినట్లుకాఁగ నులికిపడి చూచితిని. చిన్నయెలుక యట్టెప్రాకి పైబల్లకున్న గొలుసుపై నాఁగి నే నెవఁడనో యని నిరసనదృష్టిచేఁ బరిశీలించుచుండెను. "నీవు బండితోఁ గూరుచుండుట కర్హుఁడవుగావు దిగిపొ" మ్మని యాయెలుకయభిప్రాయము కాబోలు! ఆహాహా! యెంతవిరుద్ధముగ నున్నది! సొమ్మిచ్చి టిక్కెట్టుకొని ప్రయాణముచేయుచున్న నాపై టిక్కెట్టు లేకుండఁ బ్రయాణ మొనర్చుచుండు నాయెలుక కంతకోప మెందులకో? నిదురఁబోవు చున్న వారినైన బలాత్కారమున లేపి టిక్కెట్టు మూఁడేసిగంటల కొకసారి పరీక్షచేయు నిందఱు రైల్వేయుద్యోగు లెందులకో మనలను బాధించుటకేనా? ఆయెలుకమాట నెవ్వఁడు దలపెట్టఁడేమి? శాసనము మీఱకుండ భయభక్తులతో నడచుకొనువారిని బాధించుటకేనా యీయుద్యోగుల యధికారములు! చట్టములు చుట్టచుట్టి నట్టేటఁబాఱ వైచువారిని జూడ నధికారులకే భయముకాబోలు! ఇట్లు నేను మన సులో నేదేదియో యనుకొనుచుఁ దిరుగఁ బండుకొంటిని. నడిమివయ సున నుండుటచే రక్తపుష్టికలవాఁడను గావున నల్లులను గణింపక దోమలను లెక్కింపక యెలుకలను లక్ష్యపెట్టక నిద్రించితిని. కలఁత నిద్దురయేకాని గాఢనిద్రమాత్రము పట్ట లేదు. ఆనిద్రలో స్వప్నము వచ్చినది. ఆస్వప్నము కొంత వింతగనుండుటచే జంఘాలశాస్త్రిచే సభలోఁ జదివించుటకొఱకు మీసన్నిధికిఁ బంపితిని.

## స్వ ప్న ము

అది యొక్కపెద్దమైదానము కనుజూపు మేర వ్యాపించియున్నది. అది నాలుగు సమభాగములుగ భాగింపఁబడి యున్నట్లున్నది. ఒక్క భాగమునిండ ననేకలక్షలకోటుల దోమలు విడిసియున్నవి. ముచ్చటలాడు

కొనుచు మూర్కొనుచు మూఁగుకొనుచు ముద్దిడుకొనుచు మురిసికొనుచు మూల్గుకొనుచు మూత్రించుకొనుచు నాదోమలన్నియు చిత్రవిచిత్రచేష్టాసమన్వితములై యున్నవి. కాని యాజండాలపై నాయక్షరము లేమి? ఆంధ్రాక్షరములవలెఁ గనఁబడుచున్నవే! సెబాస్! ఇంక నేమి? చదివెదను. "పాలకొల్లు మశకములవిడిది" ఆహాహా! ఇందున్నవన్నియుఁ బాలకొల్లుగ్రామమునుండి వేంచేసిన మశకమతల్లికలా! కాని యామీఁదిదేది? "కొల్లేటిమశకరాజములమహాలు" వహవ్వా! కోడిపెట్టల నెత్తికొని పోఁగలవను కృష్ణామండలైకవిఖ్యాతి నొందిన కొల్లేటిదోమలాయివి! సెబాసు—దీనితరువాతి దదియేది? "కళింగదేశమశకమహారాజముల మార్తికమందిరము?" ఆహా! గవాక్షములు పట్టిపట్టని బలిష్ఠగాత్రస్థౌల్యముగల విజయనగరస్థాన మశకములాయివి! వహవ్వా! కాని యాపైదియేమి! "ఆనెగొంది మశకసార్వభౌముల మహాలక్ష్మీనికేతనము" శ్రీమన్ మహామండలేశ్వర మహారాజాధిరాజు గండరగండాదిబిరుదాంకితులయిన శ్రీకృష్ణదేవరాయల యాస్థానమందలి క్షీరపటీరహీరచంద్రికాసార ధిక్కార జగద్విశ్రాంత యశస్సాంద్రములైన కిష్కింధదోమలా? వహవ్వా! ఆప్రక్కనున్న గుడారము లెవరివి? చిట్టెలుకల దివి. చూటెలుకల దది. గుంటయెలుకల దిది. గాదెయెలుకల దిది. ఎఱ్ఱయెలుకల దిది. పొలపుటెలుకల దది. నాగుటెలుకల దిది. బొంతయెలుకల దది. చుంచులదది. పందికొక్కుల దిది. సెబాస్! సెబాస్! అర్బుదములు నిర్బుదములు దాఁటినసంఖ్యలు గలసర్వజాతిమూషకము లిచ్చటఁ గిచగిచలాడుచు వెనుకకాళ్లపైనిలువఁబడి ముందుకాళ్లతో ముక్కులు గోకికొనుచు మూఁతులుమూఁతులు గలుపుచు, తోఁకలు తోఁకలు పైనవైచుచుఁ గీచుకీచుమనుచు గిరుగారుమనుచుఁ జెవులట్టె విప్పుచు నట్టెమూయుచు బిలబిలలాడుచు మిలమిలలాడుచుఁ గనుచూపు నిలువఁబడలేనంత కదలికతోఁ బొట్లకాయల గబ్బుతోఁ గ్రాలుచున్నవే! సెబాస్! కాని, యావైపుననున్న విడుదులెవరివో? అవియన్నియు నల్లులోయి నాయనా! ఎఱ్ఱనల్లులు, నల్లనల్లులు, తెక్కలనల్లులు, మిడినల్లులు శంఖమహాసంఖ్యాతీత సంఖ్యాకములై తాండ్రబెత్తంతతనువులుగలవై కొత్తిమిరెపువాసనఁ గొట్టు

చున్నవి. ఛీ ఛీ ! తెట్టెలుతెట్టెలుగఁ గుప్పలుకుప్పలుగ రాసులురాసులుగఁ జేరి సముద్రతరంగములవలె లేచుచున్నవి. ప్రాకుచున్నవి. విఱుగుచున్నవి. తిరుగ వెనుకకు దొరలుచున్నవి. హరిహరీ ! ఆసన్నివేశము నిప్పుడు తలఁచుకొనగనేయొడలు గగురువొడుచుచున్నదికదా ! గుండె నీరు విడుచుచున్నదికదా ! ఆహా ! అప్పుడెట్టులుండెనో యోచించుకొనుఁడు.

పూర్ణిమాచంద్రుఁ డంబరమధ్యమునకు వచ్చి యామశక మత్కుణ మూషికాది మహాపరిషద్వైభవము నవలోకించి యాహ్లాదించుచున్నాఁడు. సంఖ్యలో మనమేమో మహాధికులమని యిదివఱకు విఱ్ఱవీఁగితిమి. పట్టుమని యొక్కయాంధ్రదేశమందున్న నల్లులసంఖ్యముందు మనసంఖ్యయెంత యధమమో యిప్పుడు తెలిసినదికదా ! గర్వప్రాయశ్చిత్తమైనదికదా యని తలలు వంచుకొని మొగములు ముడుచుకొని సిగ్గుఁదెచ్చుకొని నక్షత్రము లెట్లు చిన్నవోయి కునుకుచున్నవో !

ఇంతలో నొకనల్లి యెఱ్ఱమొకమాలుకోటుతో నిభరాజయానమున సభామధ్యప్రదేశమునకు వచ్చి తిర్యగ్వైఖరిగ నున్నతలను వీలగు నంతవఱకెత్తి యాంధ్రభాషతో నిట్లనియెను.

"అఖిలాంధ్రదేశీయ మత్కుణ మశక మూషకాది సోదర సోదరీమణులారా ! ఈమహాపరిషద్వ్యాపారము మనస్వభాషయగు నాంధ్రభాషతోడనే జరుపుకొందము. స్వభాషాగౌరవములేనిజాతి జాతి కాదు. ఈయాంధ్రజాతీయమహాసంఘకార్యక్రమనిర్వాహకత్వమునకధ్యక్షుని నియమింపవలసి యున్నది. కృష్ణదేవరాయస్థాన ప్రధాననగరమును విద్యారణ్యపీఠమును నగు విద్యానగరమునుండి యిచ్చటకు విచ్చేసిన మూషకరాజములలో మహామూర్తిమంతమైన దీర్ఘవాల నామకమూషకశిఖామణిని సాహితీగౌరవమునుబట్టియు, స్థానగౌరవమును బట్టియు సనాతనరాజేంద్రగౌరవమునుబట్టి నగ్రాసనాధిపతిగా నేను సభవారిపక్షమున నెన్నుకొనుచున్నాను" ఇంతలో నొక బోడుదురు కప్పయంత కొల్లేటిదోమ క్షైఁమని ముందుకువచ్చి నల్లిగారొనర్చిన ప్రతివాదమును బరిపోషించెను. గుంయిమని యొక్కపెట్టున దోమలన్నియు సంతోషసూచకముగ మొఱపెట్టెను. ఎలుకలు కీఁచుకీఁచుమని

రొదచేయుచు తమజాతిలో నొక్కని కిట్టిమహాసభ కధ్యక్షపదవి కలిగె నని పొంగిన దేహములతో నిండినమనసులతో నుండ, నధ్యక్షుఁ డపసవ్యపురఃపాకముతో మీసము సవరించుకొని వెనుకకాలితోఁ జెవియొద్ద దురదచేఁగాదు విలాసముచే గోకికొని పొడుగుతోఁకను గుడియెడమలకు జెటకాయెంచి సభామధ్యమునకుఁ బోయి వెనుక కాళ్లపై నిలువఁబడి ముందుకాళ్లను వినయపూర్వకముగ లోనికివంచి యవనతశిరస్కుఁడై నిలువఁబడగ నెలుకలన్నియు వాలతాళధ్వను లిచ్చెను. దోమ లుచ్చైస్స్వరమున నభినందించెను. అంత నధ్యక్షునిర్ణయ మొనర్చిన మొదటినల్లి యొకచిన్నకాగిదము నధ్యక్షుని చెవిసందున నుంచెను. అది సభాకార్యక్రమపత్రము. దాని నందుకొని గాలి కెగిరి పోవునని కాఁబోలు నధ్యక్షుఁడు కాలిక్రింద నుంచుకొనెను.

## అధ్యక్షుని ప్రారంభోపన్యాసము

ఆర్యసోదరసోదరీమణులారా ! అఖిలాంధ్రజాతీయ మశకమత్కుణాది మహాసభకు (ఆహాహా ? వినుఁడు—వినుఁడు—ఏమిస్వార్థపరిత్యాగము! ఏమినైచ్యము! తనజాతిపేరేయెత్తినాఁడుకాఁడే యనికేకలు) నన్నగ్రాసనాధిపతిగాఁ జేయుటచే నాజాతియంతయుఁ గృతార్థమైనది. ఆహా ! మీరేమి సామాన్యులా? మీసభ విద్వత్సభకాని మఱియొక్కటియా ? ఓ ! వేదవేదాంగవిజ్ఞానసంపన్నులు, ప్రకృతిశాస్త్రపాండితీమండితులు, రాజకీయతంత్రపారగులు — బ్రహ్మవాదులు — భక్తాగ్రగణ్యులు — కవిశిఖామణులు.— గాయకోత్తములు-చిత్రలేఖకులు — వక్తలు—మితవాదులు—మధ్యవాదులు—నతివాదులు — సర్వతంత్రస్వతంత్రులగు నెందఱో యిచ్చట స్వస్వరూపములతో సకుటుంబబంధుమిత్ర పరివారలై వేంచేసియుండ నల్పుఁడనగు నేను—మశకసోదరులారా! మీవలె వ్యోమయానశక్తిలేని నేను—మత్కుణసోదరులారా ! మీవలె మృదులశరీరాంతరంగ సౌష్ఠవములేని నేను—మశకసోదరులారా ! మీవలెఁ గంఠస్వర మాధురీపరిపాకములేని నేను మత్కుణసోదరులారా ! మీవలె శత్రుహింసాపరాయణతలేని నేను— మీకధ్యక్షుఁడనై నిలువవలసివచ్చినది. ఎందువలన ? మీమీయాజ్ఞ వలన. నాయీపదవికి మీ రుత్తరవాదులైనప్పుడు జ్ఞానశూన్యతచే

వచించిన నాపలుకులలోని తప్పులకు మీరేల యుత్తరవాదులు కాక పోవుదురు? ప్రకృతవిషయమునకుఁ బోవుదము.

నరజాతియంతటి తుచ్ఛజాతి ప్రపంచమున మఱియొకటిలేదు. నరుఁడు మనకు శత్రుఁడు—ప్రబలశత్రుఁడు—తానే మహావీరుఁడట! వీరాధివీరుఁడఁట—అతిరథుఁడఁట — మహారథుఁడఁట— వీనిగర్వము కాలిపోను! పిఱికిపెద్దమ్మలలో నగ్రగణ్యుఁ డెవఁడు? నరుఁడు. తెలిసినదా? (వినుఁడు—వినుఁడు—శత్రుదర్శనముననే తోఁక ముడుచుకొని పరుగెత్తువాఁ డెవఁడు? నరుఁడు. ఎంతసేపును బ్రాణ మఱచేతిలో నుంచుకొని మూలమూలల దాఁగినవాఁ డెవఁడు? నరుఁడు. (సెబాస్ సెబాస్ అనుకేకలు) చేతవాఁతగాని చచ్చు పెద్దమ్మలలో నగ్రతాంబూలమునకు సిద్ధపడువాఁ డెవ్వఁడు? నరుఁడు. తేలునుజూచి భయమా! జెఱ్ఱినిగాంచి యేడుపా? పామునుజూచి పరుగా?—దోమ కఱచిపోవునేమో యని సాయంకాలమగుసరికే సన్ననిగుడారములో దూఱినవాఁడు వీరుఁడా? మన నల్లిపోతులలో నొక్కటి ప్రక్కఁజేరి కటుక్కున నంటఁబొడిచినయెడలఁ గల్లుద్రావినవానివలెఁ దెయితక్కలాడువాఁడు ధీరుఁడా? అంతవఱకుఁగూడ నెందులకు? ముల్లు కాలికిఁ గ్రుచ్చుకొనునేమోయని ముచ్చెలుదొడిగికొని కాని వెలుపలికి రాఁడే. వీనిభయము బ్రద్దలైపోను. పల్లేరుగాయ యనఁగ గడగడలాడిపోవునే—బట్టలోఁ జీఁపురుముల్లున్నయెడల నూడఁదీసికొనినఁదాక నేడ్చుచునేయుండునే—గాలి చల్లఁబడినయెడల నొక్కరోగము — మోతాదుగనున్న మఱియొక్కరోగము—వెచ్చఁబడిన వేఱొక్క రోగము-గంగిరెద్దునకున్నంత గంతవేసికొని కాని వెలుపలికే వెంచేయఁడే—వీనికాతరత గడ్డలైపోను వీఁడేనా వీరుఁడు? వీఁడేనా సృష్టికిఁ బ్రభుఁడు? నీకింతబొంతమోతయెందులకురా యని మూఁతిమీఁదనీడ్చి పండ్లువిఱుగ నొక్కటి వాయింపఁగల నాసోదరుఁడేఁడీ? మన మట్టివేషములు వైచుచుంటిమా? ఓ తుపానుపట్టనీ—అగ్నిపర్వతము ప్రేలనీ! భూకంపములు రానీ! మంచుగడ్డలు వర్షింపనీ! మనము దిగంబరులమై యొక్కవెండ్రుకయైన నూడకుండ నొక్కతెక్కయైన జాఱకుండఁ బంచభూత మహాసంక్షోభమును మహావీరులమై యెదుర్కొనుటలేదా?

యథార్థవీరుఁ డెవఁడో యిప్పుడు తెలిసినదా? యథార్థముగ సృష్టికిఁ బ్రభుఁ డెవఁడో యిప్పుడు మీకుఁ దెలిసినదా?

తరువాత వానిబుద్ధినిగూర్చి నాల్గుమాటలు చెప్పెదను. ఎలుకలను జంపుట కాతఁ డెన్నెన్ని యేడ్పులేడ్చుచున్నాఁడో మీకుఁదెలియని సంగతియా? కట్టిబోనఁట—లోపల మినుపరొట్టెయఁట. కత్తెఱబోనఁట. లోపల గారెముక్కయఁట. వానిమాయమండ-తనువు చీల్చిననైన వానియొద్ద ధారాళతయున్నదా? ఎందుల కీదగాబాజీ? ఎందుల కీమోసము? ఇదిగాక (Ratsbone) అఁట—మీరు వినలేదా? పత్రికలలోఁ బ్రచురించి మిడుకుచున్నాఁడే? ఆహాహా! బాహాటముగా విషము పెట్టి మనలఁ జంపఁదలఁచినాఁడే—వీనిదౌర్జన్యము మాసిపోను. ఆ విసము తిని తానేల చావరాదు? పుణ్యపాపము లెఱుఁగని మనలకుఁ గూఁటిలో విసముపెట్టి గొంతుకోయునా? ఇదిగాక గౌరవార్హులగు కరుణాలవాలములగు నామశకమత్కుణసోదరులకు సంఘమరణ మిచ్చుట కేవో పౌడర్లఁట—ద్రావకములఁట! మాత్రలఁట. పత్రికలలోఁ బ్రచురణమఁట! బజారులలో నమ్మకమఁట! వానిమొగము! వానిమోర! ఆర్యసోదరులారా! నరునిమొగ మెప్పుడైనఁ బరిశీలనముగఁ జూచితిరా! మనమొగములవలె ధారాళమై, తేజస్వంతమై, నిష్కపటమై, దాక్షిణ్యయుక్తమై, యమాయికమైయుండునా? ఉహూ. వట్టిదొంగమొగము ఇంద్రజాల మహేంద్రజాల విద్యలన్నియు వానిమొగమున మొలకలెత్తుచుండును. ఊఁ యనఁగ నంగీకారమని యర్థముకాదు. 'ఉహూహూ' నఁగ ననంగీకారమని యర్థముకాదు. నవ్వుఁబట్టి దయయని యనుకొందురేమో? అసత్యము. అసత్యము బొప్పములనుబట్టి పరితాపమనుకొందురేమో? వట్టికల్ల. నవ్వుచునే నఱుకఁగలఁడు. థూ థూ! అంతటక్కరి యంతదొంగ యంతమాయకాఁడు మఱియొకఁడు లేఁడు.

తరువాత నాతని విశ్వాసమునుగూర్చి చెప్పెదను. మనసోదరులలో ముం దొక్క దోమను దీసికొనుఁడు. ఒక్కసారి యది యొకనరుని గఱచినదనుకొనుఁడు. ఆతని నెప్పుడైన నది వదలునా? తిరుగ నాతనినే కఱచుచు నాతనియొద్దనే మంచియో చెడ్డయో కనిపెట్టుకొని యుండును గాని యవిశ్వాసముతో నాతని నెన్నఁడైన వదలియుండునా?

బట్టతోఁ ద్రోచివైచిన నైనఁ జేతితో విదళించిననైన జెవులకుఁ గట్టిగ గట్టుకొని దరిఁజేరనీయకపోయిన నైన "నాతఁడే చెడినాఁడు. ఈమాత్రమునకై మనకేమి తక్కువ" యని యాతనినే యంటఁ గ్రాగియుండునుగాని యావలికిఁ బోదే. ఇఁక మామత్కుణసోదరులవిషయమై యీసద్గుణమునుగూర్చి చెప్పవలసిన దేమున్నది ? తుంగచాఁపను గాని బల్లనుగాని కుర్చినిగాని మంచమునుగాని యాశ్రయించి యొక్కనల్లిపోఁ తొక్కసారి యొక్కనరునిరక్తము దబ్బలపుమొనయంత త్రావినయెడల నావిశ్వాసము దానికి హరియని యంత మొందువఱకుండవలసినదేకదా! అది యానరు నెన్నఁడైన వదలునా? ఎన్నఁడైన మఱచునా? నరునివఱ కెందులకు ? అచాఁపను వదలునా ? ఆసోఫాను వదలునా? ఎండలోఁ బెట్టి మోదనీ! ఉడుకునీళ్లు పెట్టితడుపనీ! అప్పటికిఁ జచ్చిన ట్లుల్లిపొరవలె నుండినను మఱునాఁటికే పదనెక్కి యాతని దుర్నయమును గడింపక మఱల నాతనినే యంటఁబొడిచి యట్లే ప్రక్క నాశ్రయించియే యుండునుగాని యావలికిఁ బోదే! ఇఁక మాజాతి సంగతి రవంత మననిచేసికొందును. ఫలాహారపుబీరువానో ధాన్యపు గాదెనో యాశ్రయించి మాలో నెవ్వఁడైన నుండినయెడల నాయునికి యునికి యట్లే యుండఁదగినది గాని యందులకు భిన్నముగ జరుగుట కవకాశమున్నదా? ఇంటిలోని దాసి చీఁపురకట్టతోఁ గొట్టనీ! ఇంటిలోని వితంతువు బోనులో నుంద్రపుముక్కఁ బెట్టనీ! కొట్టు పెట్టు గూడ సమముగనే చూచి యీయిల్లెన్నటికైన వదలునా? నరున కట్టి విశ్వాసమున్నదా? కృతఘ్నుఁడు ! ఛీ ! కృతఘ్నుఁడు ! మహారాజు నాశ్రయించి యాతనివలన ననేకోపకారము లొంది, భాగ్యవంతుండైన నరుఁ డామహారాజుచేనైన నొక్కమాట పడుటకుఁ జచ్చిపోవునే — సొలువు లిచ్చినపుడు ధరింపవచ్చును గాని ఛీ యనినప్పుడు సహింపఁ గూడదేమి ? తుచ్ఛుఁడు ! విశ్వాసఘాతకుఁడు ! అంతటితో సరిపోయినదా ? అట్లుకాదే! మహారాజుపై నాగ్రహించి యెదురుకొని యాతని కపకారమునుగూడ జేయుటకు సాహసించునే ! ద్రోహి — పరమద్రోహి. అతని పరశ్రేయస్సహనమునుగూర్చి రవంత చెప్పెదను. తనసుఖములవలన్న నరునకుఁ గలుగుసంతోషముకంటె నితరులయాపద

వలనఁ గలుగుసంతోష మెక్కువ. తాను దనతమ్ముఁడు తగవులేకుండ నుండుట సంతోషము కాదు. పైవారిలో నన్నదమ్ములు తగవులుపడి జుట్టుజుట్టు పట్టుకొని కొట్టుకొని కచ్చేరి కెక్కినారనఁగ, అబ్బ! అబ్బ! ఏమిసంతోషము! చెవిఁగోసికొని యావార్తను మహానందమున వినును. తాను జుట్టలుజుట్టుకొనియో అంకులరాట్నము త్రిప్పుకొనియో పావులాడబ్బులు తెచ్చుకొనుచుండగా నందులకు సంతోషింపరాదా! ఊహు పెద్దతుపాను బట్టగ నోడలన్నియు నొక్కసారియే మునిఁగి పోవుటవలనఁ బైవర్తకుఁ డెవఁడో దివాలాతీసినాఁ డనియు నాతని నందఱు దుమ్మెత్తి తిట్టుచున్నారనియు వినినయెడల—ఓ! ఏసంగీతము దానిముందుఁ బనికిరాదే! ఆహా! వీనిస్వభావము చట్టుబండలై పోను! తాను దనభార్యయు సుఖముగాఁ గాఁపురముచేయుచున్నప్పు డాసంతోషము తనకుఁ జాలదా? చాలదు. ముమ్మాటికిఁ జాలదు. పై ఇంటి యాబిడ మాటమాటమీఁద మగనిని లెంపకాయఁ గొట్టి పుట్టినింటి కుడాయించినదని వినఁగ ఓహోహో! ఏమికులుకు? ఏమి కిచకిచ! ఏమి వెకవెక! ఎంతసేపు తనసుఖముల సంగతి మఱపే—పైవారిబాధలే, ప్రాణహింసలే—శోకములే తనకుఁ బ్రత్యక్షసుఖము నిచ్చునవి. తనభోగముకంటె నొకనిరోగము తన కెక్కువసంతోషమైనప్పుడు, తన సుఖముకంటె బైవానిదుఃఖము తన కెక్కువ సంతోషమైనప్పుడు వానిప్రకృతి యెంతదిక్కుమాలిన ప్రకృతియో చెప్పవలయునా? నేనే యింక నుపన్యసించునెడల మహావక్తలయిన మత్కుణమశకరాజేంద్రుల కవకాశమేదీ? ఇదిగో! కార్యక్రమపత్రము. ఇఁక మశకోత్తములగు కీచురావుగా రుపన్యసింతురు. ఆయన ఆనెగొంది నివాసి. ప్రకృతి శాస్త్రమునందును వైద్యశాస్త్రమునందును బ్రవీణుఁడు. అనేకబిరుద ముల నాంధ్రలోకమున సంపాదించినాఁడు. ఆయన యుపన్యాసము శ్రద్ధగా వినుఁడు. కీచురావుగారి యుపన్యాసము.

అగ్రాసనాధిపతీ! సోదరులారా! సోదరీమణులారా! మీనాగ తర యెంతపురాతనమైనదో మీరెట్టి మహోన్నతదశను బూర్వమం దనుభవించితిరో మీజాతులు పూర్వమం దెంతకట్టుదిట్టముగ నుండెడివో మీ రెఱుఁగుదురా? ప్రకృతిశాస్త్రమేమి వైద్యశాస్త్రమేమి వేదాంత

శాస్త్రమేమి ఆర్థికశాస్త్రమేమి రాజతంత్రశాస్త్రమేమి అదియిది యననేల? సర్వశాస్త్రములుకూడ మొదట నెవరివి? మనవి. వాని నన్నిటి నెంతయభివృద్ధిలోనికిఁ దీసికొనరాఁదగునో యంతయభివృద్ధిలోనికిఁ దెచ్చినవారెవరు? మనము. శాస్త్రజ్ఞానసంపూర్ణులై జగద్విఖ్యాతకీర్తిని సంపాదించినవారెవరు? మనము. సర్వలోకమునకు జ్ఞానజ్యోతికి గానఁబఱచినవారెవరు? మనము. అట్టిమనము—మతములలో నగ్రగణ్యులమైన మనము—కళలలో నగ్రగణ్యులమైన మనము—నాగరకతలో నగ్రగణ్యులైన మనము—ప్రపంచమునకంతకు సర్వవిషయములందును మార్గదర్శకులమగు మనము—అట్టిమనము నేఁడెట్లున్నాము? పతితులమై, భ్రష్టులమై, పనికిమాలినవారమై ప్రజ్ఞాశూన్యులమై, పరతంత్రులమై, బలహీనులమై, ప్రతిష్ఠాశూన్యులమై పెంటలపైఁ, దుక్కుపైఁ దూగరపై, బొరియలలోఁ బుట్టలలో నామరూపములులేక పడియున్నాము. (వినుఁడు వినుఁడు అనుకేకలు) ఎందువలన? నరునివలన. నిర్భాగ్యుఁడైన నరునివలన. నిన్నఁగాక మొన్నఁబుట్టిన నరునివలన. సమస్తవిద్యలు మనపాదములయొద్దఁబడి నేర్చుకొనిన నరునివలన. మనజ్ఞానమంతయు, మనతేజమునంతయు, మనఘనతనంతయు, మనఖ్యాతి నంతయు నపహరించిన నరునివలన (సిగ్గు సిగ్గు అను కేకలు) కవిత్వము గానము నరుఁ డెవనియొద్దనుండి సంపాదించెను? మనమశకసోదరులనుండి కాదా? Aviation అని యిప్పుడిప్పు డెగిరియెగిరి క్రిందఁబడి పండ్లిగిలించుచున్న నరుఁ డాశాస్త్రము నెవరియొద్దనుండి యపహరించినాఁడు? మన మశకసోదరులయొద్దనుండి కాదా? భూమిని త్రవ్వుట — దానిలోని లోహముల నెత్తుట— అన్ని విధములయిన Subterranean activities తోఁజేరిన 'జియాలొజి' యనుశాస్త్ర మెవ్వరియొద్దనుండి యాతఁ డపహరించినాఁడు? మన మూషకసోదరులనుండి కాదా? అంతవఱ కెందులకు? ధాన్యపుమఱలు మఱికొన్ని యితరయంత్రములు మన మూషకసోదరుల పండ్లనుబట్టికదా యాతఁడు కల్పించుకొనినాఁడు. ఇటు లెన్ని చెప్పవచ్చును. మనపందికొక్కుసోదరుల యొడలిబొచ్చును జూచికదా ఉన్నిబట్టలని రాంకవములని కోటులని కుడితినీలని యిప్పుడిప్పుడు మిడుకుచున్నాఁడు! స్వతంత్ర

జ్ఞానములేక కల్పనాశక్తిలేక యఖిలతంత్రములందు మనల ననుకరించి కొసలు త్రుంపి తలలుమార్చి యంచులూడఁదీసి క్రొత్తరంగుపూసి లక్కికి నిక్కిగ మక్కికి మక్కిగ మిడికి విక్కుచున్నాఁడే! ఏదొంగయో యే మ్రుచ్చో యంతటితో నూరకుండెనా? ఉహు. శారదాపీఠ మయిన మనపయి నెదురు తిరిగినాఁడే. మనలను మారణహోమ మొనర్పఁ బ్రయత్నించుచున్నాఁడే. విశ్వాసఘాతుకుఁడు ప్రకృతిశాస్త్రమందు మహాపండితుఁడట. ఆతని కల్పన లొకటిరెండు విమర్శింతును.

మాకాటువలనఁ దనకు మన్నెపుజ్వరము వచ్చుచున్నదని మొదలు తుదలేదని సిద్ధాంత మొకటి స్థాపించినాఁడు. ఇది యభూతకల్పన ఈపనికిమాలిన రాద్ధాంత మొనర్చి ప్రకృతిశాస్త్రమున కావలిగట్టు చేరితినని విఱ్ఱవీఁగుచున్నాఁడు. సింహము మొదలుకొని చీమవఱకు మాకాటు తిననిజంతువు లోకమున నున్నదా? అవియన్నియుఁ జలిజ్వరమునకు లోనయియున్నవా? అన్నిజంతువులకు రాదనియు నన్నిదోమలవలన రాదనియు నాసిద్ధాంతముక్రింద వెంటనే హంసపాదముంచినాఁడు! వీని సిగ్గు చిమిడిపోను ఇక్కడి కీసిద్ధాంతము సగమువచ్చినదా? అన్ని జాతుల దోమలలోను విషజాతియొకటి యున్నదని పైతుడుపునకు దిగువనే యొక చిన్న బ్రహ్మసూత్రము కల్పించినాఁడు. నరులలోగూడ నట్టి విషజాతి యున్నదేమో? తనబుద్ధి కీమాత్రమైన వినియోగ మక్కఱ లేదా? సరే ఆతగ వెందులకు? అట్టివిషజాతి యున్నది. ఆవిషజాతి గఱచినవారందఱకయినను మలేరియా వచ్చుచున్నదా? లేదని తానే చెప్పుచున్నాఁడు. ఇక్కడికి తరువాతిసిద్ధాంతముకూడఁ బరమపదించినట్టేకద? ఆచలిజ్వరపు 'టెండెన్సీ' యున్నవారికేమో యదివచ్చునని సరిక్రొత్త సిద్ధాంతము. ఈటెండెన్సీయేమి తన మొగము నామొగము; అనగా రావలసినవారికి వచ్చును. రాఁగూడనివారికి రాదన్నమాట! అంతేనా? అంతకంటె నర్థమేమైన నున్నదా? ఈమాట మొదటనే దేవులాడక నిష్కారణముగా మమ్ము నెపపెట్టుటెందులకు? మమ్ము మాడ్చివైచుటకుఁ బ్రయత్నము లెందులకు? మలేరియల్ పారసైటట మతిలేనిమాటలఁట మాదిగమంచమట—తననరతత్త్వమును దానెఱిఁగి మిడికినప్పుడుకదా మాతత్త్వమును బరీక్షించుట. మలేరియల్ పారసైటుమాకెట్లువచ్చినదో

తనకు నల్లేవచ్చినదని యనుకొనరాదా? మలేరియావలన పారాసైటు పుట్టుచున్నది కాని పారాసైటువలన మలేరియాపుట్టుచున్నదా? తోచిన ట్లూహాములా? ఏదోయొక్కటి కర్మము చాలక సరిపోవునెడల శాశ్వత సిద్ధాంతస్థాపనమా? ఇదివఱకు మాలో నొక్కవిషజాతియే యున్నదని కదా చెప్పినాడు. ఇపుడు రెండవ విషజాతి బయలుదేఱినదట. అది బోదకాలు కలుగఁజేయునఁట. బోదకాలు నీటిచేఁ గలుగునని కొన్నినాళ్లు మట్టిచే గలుగునని కొన్నినాళ్లు గాలిచేఁ గలుగునని కొన్నినాళ్లు, అవిటి దెబ్బలు—అలికిదెబ్బలనేకములు కొట్టికొట్టి యిపుడు దోమయే ఫైలేరియాకుఁ గారణమని ఢంకామీఁద దెబ్బకొట్టి కోటలోఁ బాగావేసి ఝాంకరించుచున్నాఁడే. ఇంత మతిలేని వ్యక్తులు మాజాతిలో నున్న యెడల ముక్కలక్రిందఁగోసికిచ్చివైవక మానుదునా? పాముకాటుచేనైనఁ బ్రాణము పోకపోవచ్చును గాని నరునికాటులకు దిరుగున్నదా? తిరుగు లేదని యెఱిఁగియుండియు నరులను జంపుచున్నవారెవరు! ఆమాత్రపు నీతి తనకేలయుండకపోవలయును? పోనిండు. ఈగోడవయంతయు నెందు లకు? మాకాటువలననే యతనికి మన్నెపుజ్వరము బోదకాలు వచ్చు చున్నవనియే సిద్ధాంతపఱుపుఁడు. మనముకూడ నొప్పుకొందము. ఆతని రక్తము మనము త్రావినందువలన మన కెన్నివ్యాధులు వచ్చుచున్నవో యతఁ డెఱుగునా? మనవలన నతనికి మలేరియా వచ్చుచున్నదేకాని యతనివలన మన కంతకంటె భయంకరమైన జలేరియా వచ్చుచున్నది. మనవలన నతనికి ఫైలేరియా వచ్చుచున్నదికాని యతనివలన మనకంత కంటె భయంకరమైన కైలేరియా వచ్చుచున్నదని నా సిద్ధాంతము కాదనఁగలవారెవరు? మీరుమాత్రము మూడేసిదినములు మొద్దులై పడియుండుటలేదా? మీకుమాత్రము దేహములు వాడుటలేదా? మొదటి చచ్చువాతపువ్యాధికి జలేరియాయనియు రెండవదైన గాత్రపు పొంగువ్యాధికిఁ గైలేరియాయనియు నేను పేళ్లుపెట్టితిని. నన్నడ్డుకోఁగల వారెవ్వరు? ఇంతే? ప్రపంచధోరణి యింతే? ప్రకృతిశాస్త్రపరిశీలన మింతే? ఉ॥-నాలుకయెటులాగునో యటువాగుటా! కల మెటులాగునో యటు వ్రాయుటా! పోనిండు. ఆతనియిష్టమువచ్చినన్ని పూర్వపక్ష రాద్ధాంతము లొనర్చుకొననిమ్ము. కాని నరుని సిద్ధాంతమువలన మాకు

ప్రాణహరణ మెందులకు ? మనసిద్ధాంతమువలన నరుని కేమాత్రపు ప్రాణోపద్రవము కలిగినది ? ఈమాత్రపుటౌచిత్యము తనకేల యుండ రాదు ! తాను బలిష్ఠుఁడా ! మనము బలహీనులమా ? తనబలిమిపసయేదో లోకమునకు వెల్లడియైనదికాదా ? జీమకు దాసుఁడే—జెఱ్ఱికి దాసుఁడే—నల్లికి బానిసయే—యిల్లిల్లికి బానిసయే—కంటకమునకు దాసుఁడే—కామాక్షి దాసుఁడే—వీనిబల మిట్లున్నది. పలుకులు చూడఁబోవఁగఁ బ్రపంచములు ప్రపంచములు దాఁటిపోవుచున్నవి. పనిచూడఁగఁ బ్రాణ హరణము తప్ప మఱేదియుఁ గనఁబడదు. ఇంత దొరలాటయు, నింత దుర్బుద్ధియు, నింత దుశ్చేష్టయు నెందులకు ? తనకొఱకు; తానొక్కఁడు సుఖముగా నుండుటకొఱకు; ఇంత స్వార్థలోలుఁడు, ఇంత పరశ్రేయ స్సహానాభావుఁడు, ఇంత పరపీడాకరుఁడు, ఇంత తుచ్ఛుఁడు, ఇంత దుర్మా ర్గుఁడు ప్రపంచమునందలి మఱేజాతిలోనైనఁ గనఁబఱుపఁగలిగిన యెడల నీమశకజాతియంతయు నగ్నిప్రవేశ మొనర్చి ప్రాణపరిత్యాగ మొనర్చుటకు శపథము చేయుచున్నది. పోనిండు. మనవలన నతనికి రోగములు వచ్చినను నతనివలన మనకు రోగములు వచ్చినను మనల నతఁడు చంపినను మన మతనిని జంపినను నేనంత బాధగ గణింపలేదు. నరరక్తము త్రావుటవలన మాకు మఱియొక్క పెద్దపుట్టి మునుక వచ్చినది.. నరుని రక్తములో నున్న యన్నిదోషములును మాకు సంక్రమించినవి. సంక్ర మించుచున్నవి. ఈనడుమ మఱింతతీవ్రముగ సంక్రమించుచున్నవి. అయ్యయ్యో ! మేమెన్నఁడు వర్ణభేద మెఱుఁగమే. ఎన్నఁడు జాతిభేద మెఱుఁగమే. నల్లదోమలఁట. యెఱ్ఱదోమలఁట. అయ్యయ్యో ! ఎఱ్ఱ దోమలకంటె నల్లదోమ లెక్కువయఁట. అయ్యయ్యో ! జాతిభేదమట మశకబ్రహ్మగారి మూఁతిమీసాలనుండి పుట్టిన దొకజాతియఁట. ఱెక్కలనుండిపుట్టిన దొకజాతియఁట. నడుముకణుపునుండి పుట్టిన దొక జాతియఁట. నఖములనుండి పుట్టిన దొకజాతియఁట. థూ ! వీనిలో నొకదానికంటె నొకటి తక్కువయఁట. తిరుగ నొక్కొక్కభాగములోఁ బదునాలుగేసి యంతర్భాగము లఁట. ఒకభాగము ప్రాఙ్ముఖము. ఒకటి పశ్చిమముఖము. ఒకటి యుదఙ్ముఖము. ఒకటి దక్షిణముఖము. మఱి యొకటి యూర్ధ్వముఖము. ఇంకొకటి యధోముఖము. దానికిది యష్టమ

చంద్రుఁడు. దీని కది నైధనతార. దాని కిది చుక్కయెదురు. దీనికది యేలేటిశని. దాని కిది ద్వితీయాధిపతి. దీని కది సప్తమాధిపతి. ఇది సాపడిన పేడకడి నది తాకఁగూడదు. అది త్రావిన మురికికుండనీ రిది తాకఁగూడదు. అది దీనిని స్మరింపఁగూడదు. ఇది దానిని స్మరింపఁగూడదు. దీనిని దలపెట్టినయెడల దానికి నరకము. దానిని దలపెట్టిన యెడల దీనికి నరకము. కుటుంబవ్యాపారములలో సంఘవ్యాపారములలో రాజకీయవ్యాపారములలో మతవ్యాపారములలోఁ జెప్పనే యక్కఱలేదు. ఒకరినొకరుతిట్లు—తెలిపిలేనితిట్లు—బూతులు—పచ్చిబూతులు. ఈయుద్దండశాపములతోడనే యుపన్యాసములు. ఛీ! ఈబండబూతులతోడనే పదములు. థూ! ఏమిశ్రాద్ధయోగ్యముగ నున్నదో యున్నది. పండితుల కొక్కటేరోగము, పామరులకు నొక్కటేరోగము. వేదాంతుల కొక్కటేతెగులు, విటకాండ్రకు నొకటే తెగులు. పైయుద్యోగుల కొక్కటే సంకటము. క్రిందిభటులకు నొక్కటే సంకటము. ఈకర్మము—ఈగాడిదగత్తర— ఈగందరగోళము మాజాతులలో మును పెప్పుడు లేదు. అందులో పదిపండ్రెండు సంవత్సరముల నుండి యీరవ్వ—యీరాయిడి— యీరసాభాసము— యీరణగుణధ్వని పందెపుగుఱ్ఱపుఁబరుగువలె బడాయించుచున్నవి.

మఱియొకసంగతి చెప్పనా? పూర్వమందు మాకింత స్త్రీవాంఛ లేదు. ఏదో కాలానుగుణముగా యథోచితముగ నంటియంటనట్లుగ మేము కాంతావ్యాపారమును నిర్వహించుకొంటిమి. ఇప్పు డట్లు కాదే? ఊహుఁ. ఎప్పు డదియేచింత! ఇదేమికర్మమో! ఇదంతయు మాకేదో యొకవ్యాధిలాగున బట్టుకొనియున్నది. పూర్వము ప్రాణివిధిక్రిందజరిగిన వ్యాపార మిప్పుడు దిక్కుమాలినవ్యసన మైనదే. ఇదిగాక మాలోఁ గొందఱువైద్యులు-వీరిఱెక్క లూడిపోను—వీరితొండములు తెగిపోను—మునిడిజిగు రిందులకు దోహదమని మాసోదరులకు బోధించుచున్నారు. ఇన్ని బాధలు నరరక్తపానమువలనఁ గలిగినవి.

మఱియొకయంశముచెప్పనా! ("మశకోత్తమా! ఉపన్యాసములీయవలసినవారు కార్యక్రమము ననుసరించి యింక నిద్దఱున్నారు. తెల్లవాఱవచ్చుచున్నది. శీఘ్రముగ సభ చాలింపక తప్పదు. కావున నీకింత

కన్న కాల మీాయఁదలఁచుకొనలేదు. తరువాత మత్కుణరాజమును మహామహోపాధ్యాయుఁడును నగు మంజుళాచార్యులవా రుపన్యసింప వలయును," అని యధ్యక్షుఁడు పలుకును.)

మహామహోపాధ్యాయుని యుపన్యాసము

అగ్రాసనాధిపతీ! మశక మత్కుణ మూషక సోదరమహనీయులారా! మన రావుబహద్దరుగారి యుపన్యాసమును మహానందమున వింటిమి. నేను జెప్ప నిశ్చయించిన యంశములన్నియు వారే సెలవిచ్చినారు. మనుష్యరక్తపానమువలన మనలో శారీరకముగ మానసికముగఁ గలుగుచున్నవని వారు సెలవిచ్చినబాధలు మాలోమట్టునకు శతగుణములుగ వ్యాపించి మమ్ము బాధించుచున్నవి. మాకు మనుష్యరక్తముచే గడుపునిండించుకొనుటకంటె సాపడుటకు మఱియొకసాధనమే లేదు. అందుచే మనుష్యునకున్న యవగుణములన్నియు మాలో సంపూర్ణముగ నున్నవి. మనస్సొకమార్గము; మాట మఱియొకమార్గము చేష్ట వేఱొక్కమార్గము. మాలో నిప్పుడు వక్తలెందఱో బయలుదేరినారు. రాజకీయాంశములఁగూర్చి రమడోలువాద్యములవలె మాటలాడుచున్నారు. నల్లిజాతి నభివృద్ధిపఱచుటకు నల్లిజాతి నేకీభావముగఁ జేయుటకు నల్లిజాతి జాతీయతను సమగ్రముగజేయుట కెందఱో మహావక్తలు మంచములలోనుండి మహాసనములలోనుండి పత్రాస్తరణములలోనుండి మనుష్యుల వస్త్రములలోనుండి మహోదారముగ మహాగంభీరముగ నుపన్యసించుచున్నారు. స్వార్థపరిత్యాగమని శాంతియని దేశక్షేమమని త్యాగమని యెన్నియో సద్గుణములను బోధించుచున్నారు. ఎంతసేపు బోధనమే. ఆచరణమన్నమాటయైన లేదు. ఇట్టిగుణములను బోధించువారైన నాచరించుటలేదా? లేదు. సోదరులారా? లేదులేదని చెప్పుటకు విచారములేదు. లజ్జకూడలేదు! దాదాపుగ నందఱలో నదియే లోప మున్నప్పుడు చింత యెందులకు? సిగ్గెందులకు? నరునిరక్తము త్రాగఁగూడదని యుపన్యసించువారే యత్యధికపానమున నజీర్తిబాధ పడుచున్నారు. శాంతిశాంతియని చాపలు జలజలలాడ మంచపుగోళ్లు మాఱుమ్రోయ నుపన్యసించువారే నేనెక్కువయని నీవు తక్కువయని నీది నీచమైన మిడిజాతియని నాది ఘనమైన తెక్కజాతియని

యొకరినొకరు కఱచుకొని పీకుకొని క్రుమ్ములాడుచున్నారు. స్వార్థపరిత్యాగము స్వార్థపరిత్యాగమని సాఁగఁదీసి పలికెడు స్వార్థపరిత్యాగులు కుర్చీపీఁటనందలి నల్లిసోదరులను మంచపుఁదలాటమునకుఁ జేరనీయకుండ దన్నుచున్నారు. ఇంద్రియనిగ్రహమును బోధించు విరాగిశిఖామణులు సర్వసంగపరిత్యాగులు జాముజామునకు గ్రుడ్లుపెట్టుచున్నారు. (వ్యవధి యెంతయో లేదు. త్వరగఁ దెమల్పుము అని అధ్యక్షుఁడు మందలించును.)

తాను జెప్పిన నీతులు తనకుమాత్రమే వర్తింపవనియుఁ దాను దక్క నంద అవి యనుష్ఠింపవలయుననియు ప్రతివక్తకుఁ బట్టుకొన్న పంతము. నాయనలారా! ఆలస్యమగుచున్నదని యధ్యక్షుఁ డానతిచ్చుచున్నాఁడు. ఒక్కయంశముమాత్రమే చెప్పెదను. మలేరియా పైలేరియాలసంగతి నేనెఱుఁగను గాని కాలాహజారను జ్వరమును మేము వ్యాపింపచేయుచున్నామని మమ్ముఁజంపుటకు నరుఁడు నిశ్చయ మొనర్చుకొని యున్నాఁడు. అన్నిజాతిజంతువులను జంపి పొట్టబెట్టుకొని వీడొక్కఁడు ప్రపంచమున నేమిచేయఁదలఁచినాఁడు? వీనితెలివి తెల్లవాఱిపోను. వీని ప్రకృతిజ్ఞానశాస్త్ర మిట్లు బ్రద్దలైనది. ఏమని చెప్పను! (ఇఁకఁ జాలునని యధ్యక్షుని కేక. ఆచార్య లుపన్యాసము చాలించును.) సోదరులారా! కార్యక్రమముననుసరించి మూషకసింహమగు తర్కశిరోమణి హ్రస్వకర్ణశాస్త్రిగారి యుపన్యాస మింకఁ జరుగవలసి యున్నది.

## హ్రస్వకర్ణుని యుపన్యాసము

సోదరసోదరీమణులారా! మన మనస్సులోని యభిప్రాయము లేవో వెల్లడించుకొంటిమి. ఎన్నియుపన్యాసములిచ్చిననైన నింతకంటె విశేషమేమున్నది? నేను చెప్పవలసినమాటలు నాకేమియుఁ గానఁబడకున్నవి. మహామారివ్యాధినిగూర్చి మమ్మాతఁడు పెట్టినబాధలు లోకవిదితములు. మాజాతినంతయు మాడ్చి మాపుటకే యత్నించెను. ఆవివరణములఁగూర్చి యిప్పుడు చెప్పుట కవకాశములేదు చెప్పుటకుద్దేశమును లేదు. మనుజజాతిని మాడ్చివేయుటకు మనకు సాధనమేమైన నున్నదా యని యిప్పటిప్రశ్న. (నరులను జంపవలయును.

చంపకతప్పదు. అను కేకలు) తప్పదనువారు దారియేమున్నదో కానఁబడ ప్పుడు. అంతేకాని యఱపులతో నేమివిని యోగము? అదిగో చూచు చున్నారా? తెల్లవాఱుచున్నది. సూర్యుఁడు వచ్చుచున్నాఁడు నరుఁ డింక లేచును. అయ్యయ్యో! అదిగో నరుఁడు! పొండు—పొండు— ఇప్పుడు మాటలాడుకొనుట కవకాశములేదు — లేదు — పరు గెత్తుఁడు—ఎగురుఁడు—ఇక నొక్క తెప్పపాటైన నాలస్యము చేయఁ దగదు. తగదు........................అధ్యక్షుఁడే ముందు పరుగు వాటెను బిలబిలలాడుచు నన్నియుఁ బరుగెత్తిపోవుచుండ నొక్క లేఁబ్రాయపునల్లి యిట్లు గంభీరముగఁ బలికెను. ఇదిగో—కరపత్రము— నే నిందులో జెప్పఁబడిన పనులన్నియుఁ జేయఁగలను. అత్యద్భుతము. మహాద్భుతము. యోగశక్తిసారము.

1. పరుగెత్తుచున్న యెలుకతోఁక మూఁతితోఁ గఱచిపట్టి యూఁపుట.

2. పందికొక్కుపైఁ బందికొక్కును దానిపై మూఁడవపంది కొక్కును వీఁపుపై నెక్కించుకొని జరజర ప్రాకుట.

ఇదిగో యీమూఁడవది మఱెంత యద్భుతము—వినరా! పోవు చున్నారా?"..............................ప్రాణరక్షణార్థమై పోవుచున్న యాజంతువు లాబాలమత్కుణము చెప్పినదేమో పూర్తిగ వినకుండనే పరుగెత్తిపోవుచుండెను. ఆసందడిలో నొక్కయెలుక నాకాలిపై కెక్కును. అమ్మయ్యో యని యడలిపోయి లేచితిని. 'గూడూరు గూడూరు' అని స్టేషనునొద్దనున్న భటుఁడు కేకవేయు చుండెను.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

## 13. స్త్రీలసభ

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.—

నాయనలారా! ఈనడుమను మదరాసులో నొకస్త్రీలసభ జరిగినది. అది కొంత రహస్యసభయఁట—నాభార్యకూడ నామహిళా

సభకుఁ బోయినది. ఆమెవలన నా కాసభావృత్తాంతములన్నియుఁ బూర్తిగాఁ దెలిసినవి. అవి నేను మీతో మనవిచేసికొందును. దయతో విన వేఁడుచున్నాను.

అదియేదోవీథి—దానిలో నేదో కవాటసంఖ్యగల భవనము. సాయంకాలమునందు నాలుగుగంటల ముప్పదినిముసములకు సభయని వారిలో వా రెట్లో తెలియబఱచుకొనిరి. కాని కరపత్రములు లేవు. కుడ్యపత్రములు లేవు. పత్రికాప్రకటనములు లేవు. బ్యాండుమేళముతోఁ దిరువీథులు లేవు. సరిగ నావేళకు దాదాపుగా నేఁబదుగురుస్త్రీలు మాత్రమే సభకు విచ్చేసిరి. కాని వీరుమాత్ర మాణిముత్తెములు—బ్రహ్మజాతిహీరకళలు—సరస్వతీమూర్తులు-వారిలో విశేషముగ నాంధ్ర మహిళాశిరోమణు లున్నారు. తమిళదేశస్త్రీలు, కర్ణాటకదేశస్త్రీలు, మహమ్మదీయవనితలు కొలఁదిగా నున్నారు. ఏయుద్యమమందైన ముందడుగు మనయాంధ్రులదే కాదా? ఈపనివలన దేశక్షేమము కలుగునని తెలిసినయెడల నాపనిలో ముందుగాఁ బ్రవేశించువా రాంధ్రులే కాదా? ఈప్రయత్నమువలన భాషాభివృద్ధి కలుగునని తెలిసినయెడల నాప్రయత్నమందు మొదట నడుముకట్టుకొని దిగువా రాంధ్రులేకదా? ఈకార్యమువలనఁ బరోపకారము కలుగునని తెలిసినయెడల నాకార్యమందు మొదటియంజవేయువా రాంధ్రులేకాదా? చెరవలోఁ బట్టుదలలో కష్టసహనములో స్వార్థపరిత్యాగములోఁ బరోపకారశీలతలో దక్షిణహిందూస్థానములోని యితరదేశీయుల కెంతమాత్రమును దీసిపోక పోవుటయేకాక వారికంటె నావిషయముల రవంత చుఱుకుపాటు కలిగినవా రాంధ్రులేకదా! కాని మన కర్ణాటసోదరులలో నున్న దూరదృష్టికి మనవారి దూరదృష్టి రవంత జంకునేమో! రవంత వన్నెతక్కువ గలిగియుండునేమో? వారు చప్పున నేయంశమును నమ్మరు. నమ్మిన పిమ్మటనైన నెంతకాలమో నిదానించి కాని యత్నింపరు. ఆయత్నమునైనను సందేహముతో జంకుతో సామాన్యోత్సాహముతోడనే యారంభింతురు కాని మనవలె నిశ్చయబుద్ధితో నిర్భీతితో నీరంధ్రోత్సాహముతో యత్నింపరు. ఎంతసేపు వారు స్వరక్షణమును జూచుకొనుచునే పైకిఁ బోయెదరు. కాని మనవలె మిగులనీ, తగులనీ, ఉండనీ

డూఁడనీ' యని మాత్రము తెగింపరు. మనవా రెంతసేపు వారిలో వారే గుడుగుడుగుంచము లాడుకొందురు. కాని యితరదేశీయసోదరు లతో నంతగాఁ గలియరు. వారు మనలను గలియవచ్చినను వీలగు నంతవఱకు వారిని దప్పించుకొని తమగూటిచిలుకలతోడనేకూడి కులుకు చుందురు. ఈయొంటరెత్తుదనము మనపలుకులలో వ్రాతలలో నడత లలో మొగములలోఁ గూడఁ గనబడును. జన్మదేశమును వదలిపెట్టి పోవుట మనవారికిఁ జావుగఁ గనబడునుగాని యది దాక్షిణాత్యాదిసోద రుల కెంతమాత్రమును గష్టకార్యముగఁ గనబడనేరదు. నాయనలారా! అంతయే చాలును! ఈ సామ్యవిభేదన పరిశీలనప్రవాహమున నీఁకఁ గొట్టుకొనిపోక ప్రకృతవిషయమునుగూర్చి పలికెదను.

రాజీవాక్షీమతల్లుల రహస్యపరిషత్తనికదా మనవిచేసియుంటిని? బి. ఏ., పరీక్షలో నుత్తీర్ణలైన మత్తకాశినులు, నుభయభాషాకవితాశోభిత లగు నిభరాజయానలు, నాంగ్లేయాయుర్వేద వైద్యవిద్యాధురంధర లగు సుధామధురాధరలు, రాజకీయ శాస్త్రజ్ఞానగంభీర లగు ధారాధర ధీరలు, నభోగంగాభంగభంగ ఘుంఘుమారవసార వచఃపాటవ లగు హాటకగాత్ర లెందఱో యట సభ నలంకరించియుండిరి. ఆహా! వజ్ర ముచే బంగారమునకు శోభ—పుష్పముచే వృక్షమునకు శోభ—సత్య ముచే వాణికి శోభ—దైవభక్తిచే హృదయమునకు శోభ—పడఁతిచే భవనమునకు శోభ—ఆఁడుదాని యడుగుఁదమ్ములచేఁ బవిత్రముకాని భవన మెందుకొఱకు? పరశురామప్రీతికొఱకు. అదిగో వలపలిపాప టలవారు, డాపలి పాపటలవారు, మాధ్యమిక సీమంతములవారు, ముచ్చటముళ్లవారు. జాఱుకొప్పులవారు, చక్రబంధపు జడచుట్టలవారు, తెగబాఱెడు నల్లత్రాచు జడలవారు, దీర్ఘముఖులు, హ్రస్వముఖులు, వర్తులముఖులు, మధ్యబంగీవదనలు, బంగారుచాయఁగలవారు, మొగలి పువుచాయవారు, బాదముపప్పుచాయవారు, జీడిమామిడిపండు రంగు వారు, వేగిన మొక్కజీడిపప్పుచాయవారు, చామనచాయవారు, జీడి రంగువారు, సీమబొగ్గురంగువారు, బండికందెన రంగువారు, చంటిపిల్ల లతోఁ జేతిపిల్లలతో, కడుపులోని పిల్లలతో నటకు వేంచేసి యదృష్ట వంతములైన కుర్చీలపైఁ గూరుచుండి యొకరినొకరు చూచుకొనుచు

నెవరిమట్టునకు వారే తమయంతవారు లేరనుకొనుచు ముసిముసినవ్వులు నవ్వుకొనుచుఁ బ్రక్కవారితో పనిలేనిదే యేదో ముచ్చటించుచు, నడుమనడుమ నాంధ్రపత్రికను విలాసార్థముగఁ జూచుచు సభాప్రారంభ మునకై వేచియున్నారు. కలువల గమగమ, పద్మముల వాసన, గులాబిపూల గుమగుమ, మొల్లపూవుల మొత్తు, మొగలిపూల బుగబుగ, పారిజాతముల పరిమళము, చెట్టుసంపగుల గొట్రు, మదనమస్తకుల మత్తు కలసి ద్రవరూపమున సమకూర్చి యబలామతల్లుల యంగ సౌభాగ్య సంపర్కమున గృతార్థత నొంది తరించుటకై యేఁటి ఋతు వులుకూడ నచ్చటవే కలసిమెలసి కాంతాసేవ సాయించుచున్నవే! వింత వింత తళుకులు చిత్రచిత్రవర్ణముగల చీరలు ప్రక్కనున్న పాలగచ్చు గోడలలోఁ బ్రతిఫలించి యకాలశక్రచాపశతములను గల్పించుచున్నవే! విద్యుదాయసవృంత పరిభ్రమణముసఁ జెలరేగి విసరుచున్న యోవాయు దేవా! యాకాంతామతల్లుల కుంతలములను గదలించిన సరే—కొందఱి చేతులలోనున్న సాక్షికాగితమును భవనద్వారములవఱ కెగురఁగొట్టిన సరే! కాని యాపూఁబోడుల మోములందలి "పౌడరు"ను మాత్ర మెగురఁగొట్టకుమా? అది మహాదోషము సుమా? ఆబూడిదెనే యా పుష్పగంధులు పరమసౌందర్యలక్షణముగ భావించుచున్నారు. భద్ర ముగఁ బ్రవర్తింపవలయునుసుమా!

నాయనలారా! సభ యింక నారంభింపఁబడి యుండకపోవుట వలనఁ గాలక్షేపములేక కాంతలు కొందఱావులించుచున్నారు. కొందఱు మణిబంధములనున్న గడియారముల నవలోకించుచున్నారు. కొంద ఱొడళ్లు విఱుచుకొనుచున్నారు. కొంద ఱస్సుహుస్సుమని యాతుర పడుచున్నారు. కొందఱు కూనురాగములఁ దీయుచున్నారు. కొంద ఱెందులకోకాని కిసుక్కుమనుచున్నారు. ఒక వనితారత్నము Native punctuality అనఁగ నిదేయని యార్యావర్తదేశము నాసేతుహిమా చలపర్యంత మాక్షేపించి తన చిత్రవచోధోరణి కెవ్వరును నవ్వక పోవుటచేఁ దాన్నే హాహాహాయని నవ్వెను. నాయనలారా! ఆమె యెటు లున్నదో చెప్పనా? రెల్లుపూవంత తెల్లనిగొను దొడిగికొనియున్నది. ఆమెగొంతుముడిక్రింద జేనెడువఱ కర్థచంద్రాకారముగ నామెశరీరము

నిరాచ్ఛాదితమై కనఁబడుచున్నది. కన్నులపండువుగఁ గనఁబడఁదగిన మొగమైనను బూర్తిగఁ గనఁబడకుండ మనవారు మేలుముసుగుమర్యాద నేర్పాటు చేసియుండ నయ్యయ్యో యీయమ్మ దిగంబరపద్ధతి నవలంబించిన దెందువలననో! ఆమెభర్త సీమవెళ్లినాఁడట—అది యీమె వస్త్రవైఖరికిఁ గారణమఁట. నాయనలారా! చూచితిరా? కొందఱు కునికిపాటులు పడుచున్నారు. అబ్బ! కనిపెట్టుకొనియుండుట కష్టము కాదా? ఇంతలో నొక్కయామె "అబ్బ! కుర్చికి నల్లులమ్మా" యని తటాలున లేచి వీఁపుగోఁకికొనుచు మరియొక కుర్చీపైఁ గూరుచుండఁబోవఁగఁ గొందఱు నవ్విరి. "అమ్మా శ్యామలా! నల్లి యనఁగా జ్ఞప్తికి వచ్చినది. క్రిందటిసారి సారస్వతానుబంధములోఁ బడిన—మశక మత్కుణ మూషక మహాసభాసాక్షిని నీవు చూచితివా?" యని యొక స్థూలకాయపు సుందరాంగి యొక్క యడుసుకంటి యంబుజాక్షి నడిగెను. "చూడకేమమ్మా! రుక్మిణీ! కాని యది యే యుద్దేశముతో నాతఁడు వ్రాసెనో తలఁగొట్టుకొనినన్నైనఁ దెలిసినది కాదేమి?" యని యామె ప్రత్యుత్తర మిచ్చెను. "అదియే యన్నమాట యేమి? మిగిలిన సాక్షుల యుద్దేశములుమాత్రము తెలిసియేడ్చినవా యేమి?" యని యామె తిరుగ ననెను. వారియిద్దఱి సమీపమునఁ గూరుచుండి యీసంభాషణ మంతయు వినిన యొక్క పూర్వసువాసిని "పానుగంటి లక్ష్మీనరసింహారావుగారఁట! ఆయనకు సాక్షియు జంఘాల శాస్త్రియు నేమగుదురని" వారియిద్దఱి నడిగెను. "ఓసీ! నీపాండిత్యము బండలైపోను!" యని వారిద్ద ఱెందువల్లనో కాని కడుపు చెక్కలగునట్లు నవ్విరి. ఇంతలో నందఱు లేచుచున్నారు. అగ్రాసనాధిపత్ని గారు వచ్చిరి. "క్షమింపవలెను. క్షమింపవలెను" అని కీఁచుగొంతుకతోఁ బలికి యామె యొకకుర్చీపైఁ గూరుచుండెను.

అంతలో నొక్కమహిళామతల్లి లేచి గొంతుసవరించుకొని పైట పైనున్న బొత్తామును రవంత భద్రపఱచి కుడిచేతితోఁ బయ్యెద చెఱఁగును గాసంత దగ్గఱ తీసికొని యొక్కకాలిపై నిలుచఁబడి యొక్క కాలిని గుర్చియంచుపైనుంచి దీర్ఘమైన నిశ్వాసము నొక్కటి తీసికొని మెడలోని గడియారపు గొలుసు మీఁద గానఁబడకుండఁ బైటలోనికి

వేసికొని యిట్లుపన్యసించెను. "సోదరీమణులారా! మీయందఱపక్షమున నేను నాల్గుమాటలు చెప్పుటకై లేచితిని. పాలలో వెన్న యెట్లో పుష్పములో మకరంద మెట్లో యీపురంధ్రిలలో నిచ్చుటఁ జేరినవారట్లని నేను దృఢముగాఁజెప్పగలను. ఈసభ కొన్ని కారణములవలన రహస్యముగాఁ జేయఁబడినది. ఇది మనము జయప్రదముగా జరుపుకొనఁగలిగినయెడల నఖిలభారతీయ నారీవారపరిషత్తును చిరకాలములో మనము స్థాపించి పనిచేయఁగలుగుదు మని నావిశ్వాసము. ఈసభ యెందులకుఁ జేయఁబడినదో యగ్రాసనాధిపత్నిగారివలనను నుపన్యాస మీయఁబోవు నాసోదరీమణులలోఁ గొందఱవలనను మీకుఁ దెలియఁగలదు. మన మిప్పుడు సభాకార్యనిర్వహణమున కగ్రాసనాధిపత్ని నెన్నుకొనవలసియున్నది. ఏఁబది సంవత్సరములు దాటినవారును, బురాణేతిహాసాది పరిచితి గలవారును బదుగురు పిల్లలఁగన్న తల్లియు సద్గుణసంపన్నయు సువాసినీమణియు నగు శ్రీమతి భ్రమరాంబగారగ్రాసనాధిపత్నిగా నుండుటకు వయసుచే యోగ్యతచే విద్యచే నర్హతములగువారుకావున వారిని నేను సభవారిపక్షమున నెన్నుకొనుచున్నాను."ఇట్లీమె ప్రతిపాదించినపిమ్మట నొక్క లేమ లీలాలోలయై లేచి "యీపరిపోషణమును నేను బ్రదిపాదించుచున్నాను." అని చెప్పి వెంటనే "ఆ! ఆ! కాదుకాదు. యీ ప్రతిపోషణమును నేను బరిపాదించుచున్నాను." అని దిద్దుకొని యంతలో "ఆ! ఆ! అదికాదు కాఁబోలు! యీ ప్రతిపాదమును నేను బరిపోషించుచున్నాను" అనిపలికి ముచ్చెమటలు పట్టఁగ నదుకుగింజయంత మొగముచేసికొని యట్టె కుర్చిపైఁ గూరుచుండెను. Not a happy selection" అని గొనుకట్టు కాంతాశిరోమణి యగ్రాసనాధిపత్నినిగూర్చి కొంత గొణుగుకొనెను. అగ్రాసనాధిపత్నిగా రుపన్యాసరంగమునకుఁ బోయి నిలువఁబడగ నందఱు కరతాళధ్వను లొనర్చిరి.

అగ్రాసనాధిపత్నిగారి యుపన్యాసము

"సోదరీమణులారా!" సద్దుసద్దు—సద్దుసద్దు—"నన్ను మీరు"—సద్దుసద్దు "నన్ను మీరు"—కరతాళధ్వనులచే నిద్దఱు చంటిపిల్లలు నిద్రనుండి లేచియో బెదరియో కాని యింటిపెంకు లెగిరిపోవఁ బోరు

పెట్టుచున్నారు. ఉపన్యాస మందువలన నాగిపోవలసివచ్చినది 'Silence' అనఁగ జప్పున నోరుమూసికొని పడియుండుటకు జ్ఞానమున్నవారా ? అయ్యయ్యో వట్టి చంటిపిల్లలు. "రవంత నమలఁబెట్టరాదటమ్మా ?" యని యగ్రాసనాధిపత్నిగారే వారిని మందలించిరి. "దేశక్షేమమునకుఁ బిల్లలే పెద్ద యుపరోధమని" పూర్వపూర్వసువాసినిగారు పరమ సిద్ధాంతవాక్యముగఁ బలికిరి. "నీకాబాధ లేకపోవుటవలన నీవు మహా దృష్టవంతురాలవమ్మా" యని యగ్రాసనాధిపత్నిగారామెను బరిహసించిరి. పెద్ద కార్యక్రమమునకంతకును బిల్లలచే విఘ్నమాపాదింపఁ బడినదని యందఱు తహతహలాడిరి. సభలోఁగలిగిన యీతహతహ యీతంద్రత నీయశాంతి యీసంక్షోభము యీరోత గాంచి యాపిల్లలతల్లులు క్రోధోద్రిక్తలై క్రమ్మదలగఁ బైట యడ్డుపెట్టి ప్రచ్ఛన్నముగఁ బైవారికిఁ గనుకట్టుగ హస్తలాఘవచమత్కారమునఁ బిల్లల తొడలపై గట్టిగగిల్లి చౌడలు దగ్గఱగ నొక్కి విసుఁగుకొనుచుఁ జీకొట్టుచు సభాభవనద్వారమునొద్దకుఁబోయి యచ్చటి పారాజవానుగడ్డమును గట్టనుజూపి బెదరించుచు "తానింటియొద్ద నిప్పుడు గోళ్లుగిల్లుకొనుచుఁ గూరుచుండుటకు బదులుగ నీగుమ్మములోఁ గూరుచుండి కట్టకుంకలను రవంత సముదాయింపఁగూడదేమి ?" యని సమయమున కక్కఱకురాకుండనున్న మగలను జనవుబలిమిచే సాధించుచు—నీసారి పైసభకు వచ్చునప్పుడు పిల్లలను దీసికొనిరాఁగూడదని శపథపూర్వకమగు నిశ్చితమొనర్చుకొనుచు నచ్చటనే కొంతసేపు నిలువఁబడిరి. ఇఁక నిచ్చటినుండి భ్రమరాంబగారి యుపన్యాసపుఁ దరువాయి జరుగుచున్నది.

"మీరు నన్నగ్రాసనాధిపత్నిగాఁ జేయుటచే నేను మహానంద మొందితిని! బెంగుళూరులోఁ జదువుకొని బి. ఎ. పరీక్షలో నుత్తీర్ణురాండ్రైనవా రెందఱోయుండ సీమకుఁబోయి సర్వవిధముల శ్రేష్ఠమైన జన్మాంతమేపొంది—విచ్చేసిన లోకోత్తరకళాసంపన్నులైన లోలాక్షులుండ—నూరుదాఁటి యెన్నడును బైకిఁబోయి యెఱుఁగని నేను—మీయెదుట నిలువఁబడుటకైన నర్హతనీయఁగల యక్షరజ్ఞానసామగ్రియైన లేని నేను—బూర్వాచారపరాయణనై వృద్ధనైయున్న నేను—

యీనవనాగరక నారీసభ కగ్రాసనాధిపత్నిగా నియమింపఁబడుట హాస్యాస్పదముగ నుండునేమోయని యడలుచున్నాను. (No No) అని సభలోఁ గేకలు) అనివార్యమగు కారణములచే నే నాలస్యముగ వచ్చినందులకు క్షమింపవేఁడుచున్నాను ! కార్యక్రమము ననుసరించి నేను బ్రారంభోపన్యాసము మొదలిడినయెడల మఱింతయాలస్యమగును గాన దానిని వదలుకొని నేను జెప్పవలసినమాట లేదో కడపటనే చెప్పెదను. క్షమింపవలయును. శ్రీమతి మంగతాయారంబగా రిప్పుడుపన్యసింతురు" అని యగ్రాసనాధిపత్ని పలికెను. కాంతావార కరతాళ గర్జాశతమధ్యమున మంగతాయా రుపన్యాసపీఠ మెక్కెను. "ఆమగ చెంపలచేతఁ గొంత యసహ్యముగా నున్నది కాని స్వరూపము కొంతమంచిదేసుమా" యని తాయారమ్మగారినిగూర్చి యొక్క తరుణీమణి ప్రక్కనున్న కాంతతో నిమ్మళముగఁ బలికెను. "నిట్టతాడిలాగున నా పొడుగుమాత్ర మేమంత సొగసుగానున్నదని యాకాంత మంగతాయారులో మఱియొక్క లోపము నగపఱచెను. ఆహాహా ! అన్యోన్య సౌందర్యపరీక్షకంటె నన్యోన్య వస్త్రాలంకారపరీక్షకంటె నాఁడువారి కత్యంత ముఖ్యమైనకార్యము మఱియొక్కటి లేదుకదా! ఒకస్త్రీ మఱియొక్కస్త్రీని జూచుట తటస్థించినప్పు డీమె యామెబుగ్గలు బుంగబుగ్గలో చెవులు దొప్పచెవులో గ్రుడ్లు పిల్లిగ్రుడ్లో పరిశీలింపకయుండనే యుండదుకద. ఇఁక నీమె యామెనడుము లావనియు నుదురు కొంత మెఱకయనియుఁ గనులు మిగుల లోఁతనియు నొక్కజాబితా మనస్సులో సిద్ధపఱచుకొని యుండును. విద్యావతులుకాని వెలఁదులలో మాత్రమే యీవెఱ్ఱి యున్నదేమోయని యనుకొందురేమో అట్లు కాదు. స్వభాషలో విద్యావతులుకానీ ! విదుషీమణులుకానీ ! కవితా మహనీయులుకానీ! యాంగ్లేయభాషలో B A.లుకానీ! M A. లుకానీ! ఇఁక నెంతవారైనఁగానీ యొకరినొకరు చూచుకొనుట సిద్ధించినతోడనే యీకన్ను ముక్కుతీఱు బరీక్షమాత్రము తప్పదు. తప్పదు. ఎఱ్ఱసిల్కు జాకెట్టు నల్లమొకమాలుగాగరా పరీక్ష తప్పదు. ఒకరివంశమునుగూర్చి విద్యనుగూర్చి బుద్ధినిగూర్చి పరీక్షయనునది వారిలో ద్వితీయము కూడఁ గాదు. తృతీయపక్షమేమో ఒకమగవాఁడు మఱియొక మగ

వానిని జూచినప్పు డాతఁ డేకాలేజీలో పండితుఁడో యని యోజించును గాని యాతని దెంతబుద్ధిముక్కో-యని యిగిలింపఁడు. ఇఁక నిదిచాలును. తాయారమ్మగా రుపన్యసించుచున్నారు. వింపము.

తాయారమ్మ యుపన్యాసము

అగ్రాసనాధిపులారా! సోదరీమణులారా! అయినది—అతనిపని; అడఁగినది ఆతనియెగురు—చల్లారినది అతనిపొంగు—మగవాఁ డింక మనకు దాసుఁడు—దాసాధముఁడు. మన కన్యోన్యాభినందన మహావసరము సిద్ధించినది. ఇది మహాసుదినము. భామాపరిణామచరిత్రమం దిది యుత్తమోత్తమాధ్యాయము. అదేల? అట్లూరకుండెద రేల? హుత్తే! హుత్తే యని కేకలువైవరేమి? అట్లు తెల్లబోయి తిలకించుచుంటి రేల! చూడలేదా? Mail పత్రికలలో నేమివ్రాయఁబడియున్నదో? సతుల కన్నులువలకుఁ జంద్రికాసారములే? అయ్యయో! వినలేదా? కాంతల కర్ణములకు గాంధర్వగానములే—మగవాని మనస్సును బరీక్షింపఁగల యంత్రము నిర్మింపఁబడినదఁట—'అఁట' యేమి నిశ్చయమే — ఆతని మనస్సు బట్టబయలుగఁ జేయుసాధనము నేడు సౌభాగ్యవతుల భాగ్య విశేషముచే బయలువెడలినది. (వహావ్వా! వహావ్వా యను కేకలు) ఇప్పుడు మీమనస్సు లుప్పొంగుచున్నవా? ఇప్పుడు మీహృదయము లెగిరియెగిరి తాండవించుచున్నవా? ఇప్పుడు మీతనులత లాపాదమస్తకముగ మొగ్గదొడిగి శోభిల్లుచున్నవా? ఆతనిమనస్సున కింక దాఁపఁజోటెక్కడిది? దాఁచినాఁడు. దాఁచినంతకాలము దాఁచినాఁడు. పిడికటిలోఁ గట్టిగఁ బట్టుకొని దాఁచినాఁడు—కోటుజేబులో దాఁచినాఁడు. కనుబొమముడిలో బిగించి దాఁచినాఁడు. వెకిలినవ్వులతో మలామా చేసి దాఁచినాఁడు. వేళాకోళపుమాటలతోఁ దేనెపూసి దాఁచినాఁడు. (సిగ్గుసిగ్గు అనుకేకలు) ప్రియతమాలాప పుష్పకలాపముల క్రిందనడిచి పెట్టి దాఁచినాఁడు. (ఛీ ఛీ యనుకేకలు) వెలిబడిపోవునేమో యని గాఢపరిరంభముల యిఱుకటను దాఁచినాఁడు. మనసున దొంగతనమే లేకుండునెడల నింత ముడుచుకొనుట యెందులకు? ఇంత యడఁచి పెట్టుకొనుట యెందులకు? ఇంత మూలమూలల దాఁచిపెట్టుకొనుట యెందులకు? ఇంత ప్రాఁతిపెట్టుకొనుట యెందులకు? సోదరీమణులారా!

మనము వట్టిబేలలము. అమాయికలము. నిష్కపటులము. తెల్లని వెల్ల పాలు నల్లనివెల్ల నీళు లనుకొను శుద్ధసత్యకాలపు గోలలము. (వినుఁడు వినుడు అనుకేకలు) రాత్రులం దాలస్యముగ నింటికి వచ్చి నందులకు మగవాఁడు కారణ మెప్పుడైనఁ జెప్పినాఁడా? ముంగాళ్ల మీఁదఁ గూరుచుండి మూఁడుమెదుకులు ముక్కున నంటించుకొని తుఱ్ఱున నెగిరిపోయినందులకుఁగారణ మెప్పుడైనఁ జెప్పినాఁడా? మొగము ముడుచుకొని ధుమధుమలాడుచున్నందులకుఁ గారణ మెప్పుడైనఁ జెప్పి నాఁడా? పొట్టిపొట్టి టక్కుటిక్కు ప్రత్యుత్తరముల కెప్పుడైనఁ గార ణముఁ జెప్పినాఁడా? ఎడమొగము పెడమొగములకుఁగారణ మెప్పుడైనఁ జెప్పినాఁడా? అర్థములేని చూపులకుఁ గారణ మెప్పుడైనఁ జెప్పినాఁడా? పదునాల్గుపర్యాయము లద్దము చూచుకొని నీటుగా గోటుగాఁ బాపట సవరించుకొని మీసాలకు మల్లెనూనె రాచికొని పట్టువస్త్రములఁ దొడిగి కొని పైని సెంట్లుచల్లుకొని య త్తరువుసాహేబులాగున గమగమలాడుచు వీథిలోని కొయ్యారముగఁ బోవుటకుఁ గారణ మెప్పుడైనఁ జెప్పి నాఁడా? (చీ—చీ యనుకేకలు) క్రొత్తగాఁ గాపురమునకు వచ్చిన పిమ్మట నేపదిదినములు మనసిచ్చి ధారాళముగ దయాదాక్షిణ్యయుక్త ముగ మాటలాడెనో కాని యటుపైన నాతఁ డట్లుండెనా? ఆతని మన స్సులో నేమున్నదో యని తెలిసికొనుట కెంతయైన దేవులాడితిమే! ఇప్పు డది మనకు ముంజేతికంకణమైనది! మనకాతని మనస్సిప్పుడు కర తలామలకమైనది! ఇంతటినుండి యాతనియాటలు సాగునా? ఆతని తిరువీథు లింక జరుగునా? సినీమా వంకపెట్టుకొని సింగారించుకొని యాతఁడు పోఁబోవఁ జెవిపట్టుకొని యాతని నీడ్చితెచ్చి మంచముపైఁ గూరుచుండఁబెట్టుదుము కాని మానుదుమా? అతనియెక్కువయేమి యేడ్చినది?

అది యెంతచమత్కారమైన యంత్రమో మన మూహించు కొనలేము. తెల్లని గాజుబుడ్డిలోఁ బెట్టిన తేలులాగున నాతనిమనస్సు మనకుఁ దేఁటతెల్లముగఁ గనఁబడునఁట. సెబాస్. ఇంతకంటె మనకుఁ గావలసినదేమి? ఆమనస్సు పెద్దపెసరట్టంత కంపస్సుపెట్టెవలె గుండ్ర ముగా నుండునుగాఁబోలు! దాని కైవారపుటంచంతయు 'హెడ్డింగు'ల

క్రింద భాగింపఁబడియుండును గాఁబోలు! నాయూహామేదో చెప్పు చున్నాను. తప్పై నఁ గావచ్చును. ఆహెడ్డింగులేవో నాకుఁ దోఁచి నట్లు చెప్పెదను. (1) భార్యను బుట్టినింటికిఁ బంపుట కిష్టములేకపోవుట (2) భార్యకు నగలు చేయించుటకు సమ్మతింపకపోవుట. (3) భార్య నవనాగరకపద్ధతిగ సింగారించుకొని వీధిగుమ్మములో నిలువఁబడి సృష్టి లోని వింతలను విమర్శించుట కంగీకరింపకపోవుట. (4) ప్రెసిడెంటుగాఁ గాని స్వీకరుగాఁగాని పెండ్లాము పై కిఁబోవుట యోఁపలేక లోలోన నేడ్చుట. (5) బంధుమిత్రమర్యాదచే భార్య పైవారితో మాటలాడుట పనికిరాకపోవుట. (6) తనకువచ్చిన రాఁబడినంతయు నణాలపైసలతో భార్యకు నప్పఁజెప్పుట కసమ్మతమగుట. (7) భార్య నాణకోఆపరేషనులోఁ జేరుటకుఁ జింతిల్లుట. ఇవిగాక—దొంగకర్చులు—దొంగచూపులు—దొంగభోజనములు— దొంగ మాటలు— దొంగప్రేమలు— అట్టి వన్నియుఁ గలిసి యొక్క హెడ్డింగు క్రిందఁ జేర్చెదను. ఇటులెన్ని చెప్పఁ గలను? ఇట్లె మఱికొన్ని హెడ్డింగులేవో యాపెసరట్టుచుట్టు దగ్గఱ దగ్గఱగా వేఱువేఱుగా నగత్యమగునప్పు డంతర్భాగములతో నుండు నని నాయభిప్రాయము. దానిమీఁద నీయంచు మొదలుకొని యాయంచువఱకొక్క ముల్లుండును. కంపస్సులో ముల్లు త్తరదిశను జూపు నట్లు దానిపై ముల్లున్న దే అది యవసరమువెంబడి నాయా హెడ్డింగులు సూటిగఁ జూపుచుండును సోదరీమణులారా! తమకుఁ దెలిసినదా? ఇక లోపమేమున్నది? పరస్త్రీలోలత యను హెడ్డింగువైపున ముల్లు రవంత చూపుచున్నట్లు మనకంటఁ గానంతపడినయెడల జుట్టుపిలకపట్టు కొని యీడ్చి తెచ్చి మంచపుఁగోటికి నవారుపట్టెడతోఁ గట్టిపెట్టజాలని పనికిమాలిన వనిత బ్రహ్మసృష్టిలో నెచ్చటనైన నుండునా? (వినుఁడు వినుఁడు అను కేకలు) మఱియొక్క సంగతి యేదనఁగ—పరస్త్రీలోల తయను పెద్దహెడ్డింగున్నదే—ఇది బ్రాహ్మణా బ్రాహ్మణాంతర్భాగముల క్రింద విభాగింపఁబడియుండి యటుపైన నొక్కొక్కయంతర్భాగములో శాఖాంతశ్శాఖా భేదములుగూడ నుండినయెడల బాగుగా నుండు నేమో మీరాలోచింపవచ్చును. ఇంతకు నాయంత్ర మెట్టిదో తెలియ కుండ నున్నది. ఎటులున్నను స్త్రీల కిది యత్యంతోపయుక్తముగా

నుండకలేఁడు. కావున పుణ్యస్త్రీలందఱు తలకొక్క యంత్రమును గొని యుపయోగించుకొనుచుండు నెడల స్వాధీనభర్తృకలై సౌఖ్య మొందుదురని నాయభిప్రాయము! అదిగాక కన్యాప్రదాన సమయ మందుఁ దండ్రి కన్య కిది యరణముగా నిచ్చు సదాచారము త్వరలో స్థాపింపఁబడవలయును. ఆయంత్రము మగవానిమెడలో శాశ్వతముగఁ గట్టవలయునో కాక పరీక్షావసరమున మాత్రము చంక క్రిందఁబెట్టియో నడుమునకుఁ గట్టియో యుపయోగింపవలయునో యికఁ దెలియ కున్నది. ఇచ్చటఁ జేరిన స్త్రీరత్నము లిందునుగూర్చి విచారించుకొని విమర్శించుకొని స్థిరపఱచుకొనుటకై యీరహస్యసభఁ గావింపవలసి వచ్చినది. కావున నాసోదరీమణు లంద ఱాలోచింపవలయును."

ఇ ట్లుపన్యసించి యామె యుపన్యాసరంగమునందుండి క్రిందికిఁ దిగెను. అందఱు కరతాళము లిచ్చిరి. అంత వ గ్రాసనాధిపురాలు లేచి సోదరీమణులారా! తరువాత శ్రీమతి వేంకట వేంకమాంబగా రుపన్య సింపవలయును. అని పలికెను. "అగ్రాసనాధిపురాలా! నాపిల్ల యింక నేడుపు మానలేదమ్మా! నేను రాఁజాలను! నావంటిదాని కుపన్యా సములుకూడనా? నాపిల్ల యేడుపులే యుపన్యాసము." లని శ్రీమతి వేంక మాంబగారు సభాద్వారమునొద్ద నుండి కేకవైచెను. "ఏమిపిల్లలమ్మా!" యని కొందరు విసుఁగు కొనిరి. అట్టి పెద్దవిదుషీమణి యుపన్యాసము పిల్లకారణమున లేకపోవుట మిగుల శోచనీయమని కొందఱు చింతించిరి. "ఏమైన నగుఁగాక! పిల్ల నింటియొద్ద దిగవిడిచి రా లేకపోయినదా?" యని కొందఱు మందలించిరి. ఇట్లు కొంతసేపైనపిమ్మట శ్రీమతి భ్రమ రాంబ గారు లేచి యి ట్లుపన్యసించిరి.

భ్రమరాంబగారి యుపన్యాసము

సోదరీమణులారా! అనివార్యములగు కొన్ని కారణములవలన మనసోదరీమణి శ్రీమతి వేంకటవేంకమాంబగా రుపన్యసించుటకు వీలులేకపోవుటనుబట్టియుఁ దరువాత నుపన్యసించువారు కాద్యక్రమము ననుసరించి యెవ్వరును లేకపోవుటనుఁబట్టియు నాకుఁ దోఁచినమాటలలో చెప్పెదను. సోదరీమణులారా! నేను బెద్దదానను. పూర్వాచారపరా యణను. నామాటలు మీకు రుచిమంతములుగా నుండకపోవవచ్చును.

అయినను మాటలాడక తప్పదుకావున మాటలాడెదను. మాకాలస్థితి వేఱు. మీకాలస్థితి వేఱు. మేమత్తమామల యాజ్ఞలో మెలఁగిన వారము. ఆఁడుబిడ్డల యదపులలో నాఁటితేఱినవారము. బావలయెడల భయభక్తులుకలిగి ప్రవర్తించినవారము. మఱఁదులను మన్నించినవారము. పదుగురు పిల్లలఁగనినను భర్తతోఁ బగలెన్నఁడు మాటలాడిరైన నెఱుఁగనివారము. భర్త మాకంటె నధికుఁడనియు భర్తృబంధువు లందఱు పూజనీయులనియు విశ్వాసముతోఁ బెరిగినవారము. మామ గారి విస్తరిలోఁ బట్టెడన్న మెప్పుడైనఁ బెట్టినపాపమున మీరు పోయి తిరా? లేదు. అత్తగారి కాలిమీఁద నట్టె చేయివైచి యెఱుఁగుదురా? లేదు. పోనిండు. బావగారు వచ్చినప్పుడు రవంత లేచుటకైన బ్రయత్నించియుంటిరా? లేదు. భర్త వచ్చినప్పుడు లెక్కయేమి? చనవుచే గౌరవింపకపోయినను గణనలేదు. ఏదీ? అత్తమామల నావలికి సాగనంపకుండ మీరు భర్తనే చేరకపోయితిరి. ఇఁక బావగారిలెక్కయేమి? మీవైఖరి చూచి వానియంత వాఁడే లేచిపోయెను. గర్భాదానమైన వెంటనే హరిఃఓమ్ అని మీకు వేఱింటి కాపురమయ్యెను. ఆర్యావర్తదేశమున ననూచానముగ వచ్చుచున్న సంఘకుటుంబసంప్రదాయమును జంపినవారెవరు? సోదరీమణులారా! మీరేకారా? తండ్రికిఁ గొడుకులకు వ్యాజ్యెములు—సోదరులకు సోదరులకు వ్యాజ్యెములు—లక్షోపలక్షలెవరిమూలమున వచ్చుచున్నవి? సోదరీమణులారా! మీమూలముననేకాదా? అడ్డిషనల్ కోర్టులు స్థాపింపఁబడుటకు, హైకోర్టులలో నిందఱు న్యాయమూర్తులు నియమింపఁబడుటకుఁ జాలమట్టునకుఁ గారణభూతు లెవరు? సోదరీమణులారా! మీరే కారా? ఈవేఱింటి కాపురములు వచ్చినతరువాతఁ—గొడుకుమీఁదఁ దండ్రికిలేదు. దండ్రిమీఁదఁ గొడుకునకు లేదు. అన్నమీఁదఁ దమ్మునికిలేదు. తమ్మునిమీఁద నన్నకు లేదు. అన్ని బంధుప్రేమలుకూడ నడుగంటినవి. అతిథిపూజ లంతకుముందే యంతరించినవి. అందులకుఁ జింత యక్కఱయే లేదు. పోనిండు. అత్తమామలు వలదు. ఆఁడుబిడ్డలు వలదు. బావమఱఁదులు వలదు. మఱియెవ్వరును వలదు. భార్యయే వైకుంఠమని భర్త—భర్తయే వైకుంఠమని భార్య—యనుకొని

యన్యోన్యము ప్రేమించుకొనుచు మీరైన సుఖముగ నున్నారా! శ్రీరామరక్ష! శ్రీరామరక్ష! ఆసుఖమైనఁ గనఁబడదేమి ప్రారబ్ధము.

**M. A.** పరీక్షలో ను త్తీర్ణుఁడైన వానికైన నేఁబదిరూపాయల కంటె నెక్కువ దొరకుట లేదుకదా? అందులో బ్రాహ్మణుఁడైనయెడల నామాత్రమయిన లేదుగదా! సంసారము దిద్దుకొనుట మీచేతకాదు కదా! అరసేరుబియ్య మత్తెసరు వేయుట కాఱురూపాయల కష్టలెక్క కదా! భర్త పైకిఁ బోయినయెడల నింటిలో దిక్కు లేకపోవుటచే నాల్గు రూపాయల కొకనౌకరుకదా! ఈనౌకరులు సంసారమును ధ్వస్తము చేయకుండ రవంత కనిపట్టుటకు గ్రంథరచనమూలమునను బత్రికా పఠనమూలమునను మీకుఁ దెలిపిలేదుగదా! ఇదిగాక వారమునకు రెండు వైటురోజుసబ్బుబిళ్లలు—రెండుమోహినీతైలపుబుడ్లు—రెండు వాసిలీనుబుడ్లు—రెండు మొగపుమెఱుఁగుబూడిదె డబ్బాలు—రెండు సెంటుబుడ్లు—ఇఁక నేవో రెండు, మఱియింక నేవో రెండయ్యెను. ఇఁక మీసంసారములు బాగుపడుట యెట్లు? రోజున కైదుపర్యాయములు సబ్బుపెట్టి మొగము గట్టిగఁ దోముకొనుచున్న మీ రుదయముననే యొక్కసారి యంటతప్పెల తోముకొనలేరేమి? గంటగంటకుఁ బన్నీరు బుడ్డిపైన విలాసముగాఁ జిలుకరించుకొన్న మీరు ముంగిటిలో రవంత పేడ్లనీళ్లుచల్లలేరేమి? మీకిందులకు దాసీయెందులకు? ఏది మీయిష్టము. ఇవియే తగనికర్చులై యుండునప్పుడు సాయంకాలమగుసరికి సినీమా తప్పదయ్యెను. మగవాఁ డింతవ్యయము నెదురుకొనుటకు ధన మెక్కడి నుండి తీసుకొనివచ్చునని మీరనుకొనుచున్నారు? అప్పుదొరకి నదికాదురా, భగవంతుఁడా యని లోలోపలఁ గుమిలియేడ్చుచు భర్త యింటికిరాఁగ "నదిగో నన్నుఁ జూచి మొగము ముడుచుకొంటివి. నీదృష్టిమఱియెవతెమీఁదనో వ్రాలిన" దని పెద్దతనమైన యోజింప కుండ నాతనిమూఁతిమీఁదఁ బొడుచుటకు మీరు సిద్ధపడుచున్నారు. పాపము! మీధాటికి తాఁగలేక పాఱిపోయిన యాతని తల్లియుఁ దండ్రియు నాతనియొద్దనున్నయెడల మీరంతపని చేయలేరుగద! సోదరీమణులారా! మీయెడల మీభర్తల మంచితనమున కెన్నడు లోపములేదని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను. మీబూట్సుకై

స్టాకింగులకై, గౌనులకై, జాకెట్లకై, ప్రామిసరినోట్లు వ్రాసివ్రాసి, తిరుగఁదోడి వ్రాసి తుట్టతుదకు తనవాటా దరిమిలాయీనా మమ్ముకొని నాఁడా లేదా? మీగానముకొఱకు గేదె దూడ నమ్మి కృష్ణాహార్మోని యమ్ కొనినాఁడా లేదా? సంగీతము చాలదు, పాశ్చాత్యులవలె నాట్యముకూడఁ గావలయునని మీరుకోరినప్పు డేయొంటికాలిభరతమో చెప్పించినాఁడందురా? లేదందురా? దొరసానులవలెఁ బురుషులతో Shake handsచేసినఁగాని ఘనతలేదని మీరు మూతిముడి పెట్టినప్పుడు తాను నల్లుఱు పెద్దమనుష్యులయొద్దకు మిమ్ముఁ దీసికొనిపోయి వారితోఁ గరచాలనమహోత్సవము చేయించినాఁడందురా? మీరు బెజవాడకో విశాఖపట్టణమునకో కాంతాసభల నుపన్యాసము లిచ్చుటకో వినుటకో పోయినప్పుడు తాను జేయిగాల్చుకొని అమ్మా అమ్మా యని యేడ్చు చంటిపిల్లనోదార్పలేక కంట నీరుపెట్టుకొనినాఁడందురాలేదా! సోదరీమణులారా! మంచికి మంచిచెప్పుకోవలయును. చెట్టకుఁ జెట్టఁ జెప్పుకోవలయును. ముంగురుల వంకరటింకర సొగసుకొఱకు మీరు తల నీచెంపయు నాచెంపయు బెత్తెడువెడల్పునఁ గత్తిరించుకొన్నను నేను బ్రతికియుండగానే యీకర్మము చూడవలసివచ్చినదా యని లోపల నేమి యేడ్చినాఁడో కాని పైకి నోరుమూసికొని పడియుండెనందురా లేదా? అతఁడు మీదయకొఱ కిన్ని విధముల ప్రాకులాడుచున్నాఁడుగదా! మీసంతోషముకొఱ కన్నియును జంపుకొనినాఁడుగదా! మీరే పరదైవములుగ భావించి ప్రార్థించుచున్నాఁడుగదా! ఇంతకంటె నాతఁడు మీకేమిచేయవలసినదని మీయభిప్రాయము? మీకింత విధేయుఁడై యున్నను మీయెడల నింత దైన్యపడియున్నను మీకొఱకు పట్టి పనికి మాలినవాఁడై పోయినను నింక నతని మెడకో నడుమునకో యీక్రొత్త యంత్ర మొక్కటి దగిలించి యాతనిమనస్సును గేవలము దిగంబర మొనర్చి యాతనిని మఱింత బాధింపఁదలఁచితిరా? మగముండకొడుకు నకు మన స్తత్వమని ప్రాణమని యేదియు నుండఁగూడదనియేనా మీయభిప్రాయము? మీచేతిలో బొమ్మవలె మీకాలిక్రింద జోడు వలె నాతఁడు నిశ్చైతన్యప్రవృత్తితో నుండవలసినదనియేనా మీయభిప్రాయము?

సోదరీమణులారా! కుట్టు మాటలాడుచున్నానని కోపపడకుఁడు. శ్రీమతి తాయారమ్మగారి తీవ్రమైన యుపన్యాసములోని సంగతులను బట్టి యిట్టిమాట లాడవలసివచ్చినది. క్షమింపుఁడు ఒకనిమన స్సొకని కప్రత్యక్షమగునట్లు భగవంతుఁడు సృష్టించుటచేతనే బ్రతుకు లింక దక్కుచున్నవి కాని యటులేకానిచో వాఁడు దానిని దన్ని, యది వానిని గఱచి, వాఁడు దానిని నఱికి, యది వీనిని గొంతుపిసికి అయిదు ఖండము లలోనున్న యాఁడువారు మగవారందఱు మూఁడుదినములలో నొకరి నొకరు జంపుకొందురనుట కేమైన సందేహమా?

ఇది కాక మఱియొకటి. ఈదిక్కుమాలినయంత్రము నెవఁడు సృష్టించినాఁడో యెఱుఁగుదురా? మగవాఁడు ఎందులకు సృష్టించెనో యెఱుఁగుదురా? మనకున్న తెలివి మగవానికి లేదు. పదునాల్గుపుట ములువేసిన రాదు. మనమెట్లయిన మగవానిమనస్సు కనిపెట్టఁగలము కాని తల పగులఁగొట్టుకొని గింజుకొని తన్నుకొని చచ్చిననైనసరే వాఁడు మనమనస్సులను గనిపెట్టలేఁడు. ఎన్నిపాటులుపడినను యెన్ని యేడ్పు లేడ్చినను మనరహస్యము లాతనికిఁ దెలియకపోవుటచేత తుదకుఁ బ్రాణము విసిగి యిందువలనఁ బ్రపంచము భగ్నమైనను సరే యని యీయంత్ర మొక్కటి నేటికిఁ గల్పించినాఁడు. ఈయంత్ర మొక్క మనుష్యునివలన సృష్టియైనదికాదు. సృష్టి యారంభమునుండియు మగ జాతి యాఁడుదానిమనస్సులోని రహస్యములు తెలిసికొనుటకుఁ బాట్లు పడగాఁ బడగా—నూహము లూహింపఁగ నూహింపఁగఁ—గల్ప నలుచేయఁగఁ జేయగ—దారులు ద్రొక్కఁగఁ ద్రొక్కగ—ప్లానులు వేయగ వేయగఁ దుట్టతుదకుఁ స్త్రీచేతిలో వట్టి పనికిమాలిన చచ్చుపెద్దమ్మ యగునప్పటి కీయంత్రమును సృష్టింపఁగలిగినాఁడు. ఇది మీకొంపతీయుటకుఁ బుట్టినదికాని మఱియొకటికాదు. (మాకట్టిరహ స్యము లేమున్నవని కేకలు) ఎంతమాట! నేనెఱుఁగనా? లేకపో వచ్చును. కాని యేవో యున్నవనుకొను నాతెలివితక్కువ మగ నిర్భాగ్యుని సందేహము పోవు టెట్లు? కావున నాయంత్రముజోలికి మీరు పోవలదు.

ఇదిగాక మఱియొకమాట చెప్పుచున్నాను సోదరీమణులారా!

ఆతఁడు చెప్పినమాట వినక యాతని ప్రాణము విసిగింపక, యాతని ఈచి అంపమునఁ బెట్టక, యాతనివ్యక్తిని వల్లకాఁడుచేయక, యాతని పురుషతత్త్వమును గాపాడి మీస్త్రీతత్త్వమును గాపాడుకొని సృష్టిని యథాక్రమముగా మాత్రము జరుగనిండు. అట్టి తొందరపడ కుఁడు. అదిగాక వట్టి మట్టిముద్దయైనమగఁడు మనకేందులకు ? బస వన్నా పాలుద్రాఁగుదువా యనఁగ నూ, త్రాఁగవాయని యనఁగ నూహూ అని మీకొరడాబ్రేటు భయమునఁ దలనాడించు గంగిఎద్దును వెంటవైచుకొని మీ రూరూరఁదిరుగుట మీకుమాత్ర మేమంత గౌరవము ? వానిగౌరవము గడ్డలైపోనిండు. అదిమనకేందులకు ? సోద రీమతల్లులారా ! ఒక్కటేప్రార్థన. ఆతని స్వాతంత్ర్యముమాత్రము చంపవలదు. ఆతని తలబిఱుసుఁదనము మాత్రము తగులబెట్టవలదు. పకోడీవంటిది రవంత పంటిక్రింద కాగి కఱకఱలాడుచుండినఁగాని మీకు రుచియే లేదే. పోఁకచెక్కవంటిది కాసంత దంతముల కెదురెక్కి కటుక్కుమన్నఁగాని సొగసేలేదే. అట్టిచోఁ మగఁడు వట్టి పెసర పప్పు గరిటెజారు పాకపువాఁడైనయెడల మీకుమాత్ర మేమి సౌఖ్యము ? సోదరీమణులారా ! భర్తను దైవమువలెఁ జూచుకొనుఁడని చెప్పునెడల నన్నుఁ దలకొకఱాయి ఱువ్వి చంపుదు రేమో యని భయ ముగా నున్నది. బానిసలాగునమాత్రము చూడకుఁడు. అంతేచాలు. ఆమాత్రమునకే యాతఁడు సంతోషించును. పాపము ! వట్టియల్ప సంతోషి. అదిగాక మఱియొకప్రార్థన. ఇట్లు మనము రహస్యసభ చేసికొంటిమనిమాత్ర మెవ్వరికిని దెలియఁదగదు. ఇఁకఁ జాలునా ? ప్రియసోదరీమణులారా ! మఱియొక చిన్నమాట — మీయమ్మలు మీయమ్మమ్మలు వారినాయనమ్మలు వారివారిభర్తల నెట్లు గౌరవించి సేవించిరో మీరుకూడ మీభర్తల నట్లె గౌరవించి సేవించినయెడల మీవంశములోని మూలపురుషులు మెత్తురు. మీకులదేవతలు మెత్తురు. అదిగాక మగవాని సర్వస్వముమీఁది. ఆతనిశరీరమే మీఁది. ఆతని ప్రాణమే మీలో నున్నది. ఆతనివలన మీరు బంగారపుఁ బూవులు పూయుచున్నారు. బంగారుకాయలు కాచుచున్నారు. అట్టి యాత నిని మీరు కన్నులలోఁ బెట్టుకొని గౌరవింప వలసినదికాదా ?

మీకంటె నిజముగా నాతని కెవ రున్నారు. ఎంద జెవ్వరున్నను మీరగుదురా ? "కార్యేషు మంత్రీ కరణేషు దాసీ రూపే చ లక్ష్మీ క్షమయాధరిత్రీ, భోజ్యేషుమాతా శయనేషురంభా షట్ ధర్మయుక్తా కులధర్మపత్నీ" అను నీశ్లోకము మీ రెఱుఁగనిదికాదు. కేవల మెఱిఁగి యున్నంతమాత్రమున వినియోగములేదు. ఆచరణములోని కవశ్యము తేవలయును. అప్పుడు మీరు వారుకూడఁ గృతార్థత చెందెదరు. ఇదికాక భర్తను భగవంతునిగాఁ జూడవలసినదని మనవారెందులకు శాసించినారో యెఱుఁగుదురా ? అట్లు చూడుఁడని మీకు బోధించుచున్నానని నాపైఁ గొఱకొఱలాడకుఁడు. భర్తయందలి మీకున్న భావనాగౌరవమునుబట్టి మీకు సంతానము కలుగును. తెలిసినదా ? భర్తయే పరాత్పరుఁడని మీ రెంచి యాతని సేవింపుఁడు. మీకు దేవతల వంటి పిల్లలు పుట్టుదురు. భర్త మీకు బానిసయని యెంచి మీ రాతనిపై నధికార మొనర్పకుఁడు. మీరు బానిసక్రింది బానిసవంటి పందలను గందురు. అది నిశ్చయము. ముమ్మాటికి నిశ్చయము. ఈసంగతి బాగుగా జ్ఞప్తియందుంచుకొనుఁడు. అభిమన్యుని సుభద్రయే కనవలయును గాని మఱియొక్కతె కనఁగలదా ? భరతుని శకుంతలయే కనవలయునుగాని మఱియొకతె కనఁగలదా ? ఈకాలములో నభిమన్యులు భరతు లెందుకు లేరు ? సుభద్రలు, శకుంతలలు లేకపోవుటవలన— భర్తలను దైవములుగ సేవించుటకు భగవత్సములైన భర్త లిప్పుడున్నారా యని తెలివితక్కువప్రశ్న మొనర్పకుఁడు. ఒకప్పుడుమాత్రము భగవత్సములైన వారుండిరా ? ఇప్పు డంతకంటె లేరు—లేకపోయినప్పటికి మీభావన కభ్యంతరమేమి ? మగలుకాని మట్టిబొమ్మలుకారె మట్టిబొమ్మనే ద్రోణాచార్యులుగ భావించినవాఁడు ధానుష్కశిఖామణి కాలేదా ? ప్రథమమునఁ గేవల విగ్రహారాధకుఁడైన రామకృష్ణార్యుఁడు పరమహంసశిఖామణి కాలేదా ? అంతవఱ కెందులకు ? గాజులతట్టుతోఁ గలుపఁబడిన గోడిగ యరేబియా గుఱ్ఱమును గనుటలేదా ? భావనయే ప్రధానమా ? అంతకంటె నేమైన నున్నదా ? అట్టి యాభావనలోపమువనే జాతిలోని బానిసతన మెక్కువ యగుచున్నది. మీయొద్ద మీ భర్తలు గడగడలాడినపిమ్మట మీరు కన్నకొడుకు లెలుకనుజూచి పిల్లిని

జూచి యేడ్చినారనగ వింతయేమున్నది? సోదరీమణులారా! బాహు బలసంపన్నులు—ప్రజ్ఞాశాలులు—క్షాత్రవంతులైనపుత్రులఁ గని భారత దేశప్రాచీనగౌరవమును గాపాడుదురుగాక.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# 14. మహారాజబిరుదము

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! సాక్షి కీలేఖ వచ్చినది. దీనిని జదివెదను.

సాక్షిగారికి—నమస్కారములు. మాయూరి రాజుగారికి మహా రాజ బిరుదము వచ్చినది. ఆశుభవార్త మాకుఁ గ్రిందటి శనివారము సాయంకాలమునఁ దంత్రీవార్తామూలమునను భానువారము మధ్యాహ్న మున వార్తాపత్రికలమూలమునను దెలియ, బహుసంతోషతరంగిత స్వాంతులమైతిమి. సర్కారువారు ముమ్మాటికి మిగుల మంచిపనిచేసి నారనునట్లు కోటబురుజుమీఁది ఫిరంగి ముమ్మారు మ్రోఁగినది. ఫిరంగి మాట సత్యమేయని బురుజుమీఁది తెల్లపట్టుజెండా శిరఃకంపన మొనర్చి నట్లు కనఁబడినది. రాజోద్యోగులు గ్రామములోని ప్రజలెల్లరు కోట ముందు పరిశుభ్రవస్త్రధారులై చేరి "మహారాజదంపతులకు వారిసంతతికి సకలాయురారోగ్యైశ్వర్యాదులు సిద్ధించుఁగాక" యని యుచ్చైస్స్వర ముల నభినందించిరి. మాయాస్థానప్రభువుల యిలువేల్పగు శ్రీమాధవ స్వామి రుక్మిణీసత్యభామాదేవులతో గరుడవాహనారూఢుఁడై సమస్త మంగళవాద్యరవసమన్వితుఁడై నృత్తగానాది వైభవములతో ద్రావిడ వేదనినాదకలాపముతోఁ గోటముందునకు వేంచేసిరి. ఇక్కడనుండియే యుత్సవ మారంభమైనది.

ఏనుఁగులపై సమర్పబడిన ఢంకానౌబత్తుల బజాయింపులు నలుదిక్కులఁ దీఁగప్రాఁకి పుష్పించి పరిమళించుచున్నవి. ఏనుఁగులు మంద

యానమున నొయ్యారముగఁ బోవుచు హుత్తేహుత్తే యని యఱచు చున్నవి. వాని కీవైపున నావైపున నటిజాగరూకతతో భటులు తట్టలతో మిఠాయి నందించుచున్నారు. మిఠాయియుండలు మిగుల రుచిమంత ములుగా నున్నవని కాఁబోలు. రుచిగ్రహణపారీణములగునవి శిరఃకంపన మొనర్చుచున్నవి. ఏనుఁగ కెంతసేపు తిండి. పాముకు కెంతసేపునిద్ర పిచ్చుక కెంతసేపు కలయిక. శశమున కెంతసేపు భయము. ఏనుగులపై నెక్కినవారు దగ్గఱదగ్గఱగఁ గట్టఁబడిన మామిడాకుల తోరణముల క్రిందనుండి వంగి దాటి పోవుచుండఁ దుండము లెత్తి కరులు తోరణ ముల స్పృశించుచున్నవి. వాని వెనుక నరేబియాగుఱ్ఱములు—ఆస్ట్రే లియాకంఖాణములు, రంగూను టంగనాలు సర్వశుభలక్షణసమన్వితము లైనవి; జుల్మతీనికాసుదారులచేఁ జిత్రవిచిత్రాటికనములతో నడపింపఁ బడుచున్నవి. ఏనుఁగుల హుత్తేలకు గుఱ్ఱము లిహిహిహీయని సకిలించి పరిహసించుచున్నవి. 'రూపసౌందర్యములోఁ, జాకచక్యములో, వర్ణ వైచిత్ర్యములో, వేగాధికతలో యుద్ధనైపుణిలో మేమే యగ్రగణ్యు లమై యుండఁ దాము మాకంటె ముందు నిలిచి హుత్తేయని స్తుతించు చున్నవి. వీనికి బుద్ధియొకటి యున్నదా ? రసగ్రహణశక్తి యున్నదా ? మెచ్చిన మేమే మెచ్చవలయును గాని వీని కేమియధికారమున్న' దని గుఱ్ఱము లిహిహీయని యధిక్షేపించుచున్నవి కాఁబోలు. సురంగులపై' నొకరాలపైఁ బంచకల్యాణులపై పజ్జాలపై నీఁగన్నైన వ్రాలనీకుండ దుమ్మైనఁ బడనీకుండ వింజామరములు చేఁబూని భటులు విసరుచుండ 'మనుష్యుఁడు మనసేవకై భగవంతునిచే సృష్టింపఁబడినాఁ' డను గర్వ ముచేఁ దమసేవకులను వాలుగంటఁ జూచుచుఁ దల నెగురవైచుచు విఱ్ఱవీఁగుచు నొయ్యారముగ నడచుచు నడుమనడుమఁ బ్రక్కనున్న యాఁడుగుఱ్ఱములను సవిలాసముగా సాదరముగా సాపేక్షముగా సాను నయముగా సరసముగా వీక్షించుచున్నవి. గుఱ్ఱములు మనవలె మాట లాడలేవను లోపము వాని కేమైనను న్నదా ? ఓ ! కంటిచూపులో నున్నంత గ్రంథము నోటిమాటలో నున్నదా ? పనికిమాలినమాటలోఁ బసయేమున్నది ? ఎంత చమత్కారమైన మాటకైన రెండుమూఁడర్థము లుండుసరికిఁ జాపుత్రెంపులైపోవును ! చూపున కట్టివెలితియున్నదా ?

చూపు సూటిగా వెడలిన నొకయర్థము. అర్ధచంద్రాకృతిగ వెళ్లిన నొక యర్థము. పాముమెలికలుగ వెళ్లిన వేఱొకయర్థము. కప్పదాటులుగ వెళ్లిన నింకొకయర్థము. తరంగఫక్కిగా వెళ్లిన వేఱొకయర్థము. ప్రక్కబాఱుగఁ బోయిన మఱియొకయర్థము. మొదట నేటవాలుగఁ గ్రిందికిఁ బోయి యటనుండి యెదురెక్కుగఁ బైకెక్కిన నొక్కయర్థము. ముందునకు వెనుకకుఁ దటపటాయించుచుఁ బోయిన నింకొకయర్థము. అదిగాక మఱియొకచిత్రము! చూపెంతపొడుగు వ్యాపించునో యంతపొడుగున కొక్కటే యర్థముకాదు. మొదటియంగుళములో నొకయర్థము. మూఁడవయంగుళములో రెండవయర్థము. అయిదవయంగుళములో మూఁడవయర్థము. ఇట్లివి దీర్ఘమైనకొలఁది స్థలభేదములఁ బట్టి యర్థ భేదములు గలిగియుండును. చూపులోనున్న గడుసుదనము మాటలో నున్నదా? మాట వట్టితెఱ్ఱ—వట్టిబట్టబయలు—వట్టివెలితి—చూ పట్టిదా? జ్ఞానేంద్రియము కన్నా నోరా? నోరుపోయిననైనఁ గంటితో సమస్తగ్రంథములు చక్కఁబెట్టవచ్చును. మనవా రిప్పుడు బుద్ధిహీనులై నోరెక్కువ చేసికొనుచున్నారు. కన్ను తక్కువచేసికొనుచున్నారు. అందువలననే యెక్కడఁ జూచినను మనుష్యులలోఁ దఱుచుగ బ్రహ్మకాయలు, బోదురుకప్పలు, కీచుపిట్టలు, తాపామరపాలు, పెటేపకా యలు—నోటితొందరను డాబును ధాటిని వృద్ధిచేసికొనువాఁడే కాని కంటికఱకును గమనికను గ్రహణశక్తిని వృద్ధిచేసికొనువాఁడు కనఁబడఁడే! ఎంతదురవస్థయో! ఇట్టి యసందర్భము పురుషులలోకంటె, బాలఁతులలో నెక్కువగానున్నట్లు కనఁబడుచున్నది. కాంతలలో సాధారణముగాఁ గంటికి నోటికి లంకియే కనఁబడదు. వారిలోమట్టుకు నూటి కెనుబదుగుఱివఱ కెక్కడి కక్కడికే కప్పలతక్కెడ. ఎక్కడి కక్కడికే పీఁతల మొంగము. ప్రపంచపరిజ్ఞానపరిపూర్ణులైన యోసాక్షిగారూ! మీరు దృష్టిశాస్త్రమన్న పేరితోఁ గంటిమహత్తునుగూర్చి యొకగ్రంథము వ్రాయ రాదా? జగత్తులోఁ గన్నున్నంతకాల మది శాశ్వతముగానుండునే.

జుల్మతీని బోవుచున్న గుఱ్ఱములవెనుక నొంటరులు మొదలగు నాస్థానవీరులు బాణాకఱ్ఱలు త్రిప్పుచు జిరుతలను బజాయించుచుఁ గత్తులను జళిపించుచుఁ దుపాకులను డామ్మనిపించుచు నొట్లను రోడ్డుపై

మోదుచు 'జయా! మహారాజాసర్కారునకు జయా! జయా! మహారాజ్ఞీసర్కారునకు జయా! జయా! మహారాజసంతతికి జయా!' యని జయజయధ్వానములతోఁ దుపాకిదెబ్బల నోట్లవ్రేటుల నణచివేయుచుఁ బోవుచున్నారు. వీరు పూర్వరాజేంద్రుల యోధులవంశములోనివారు. వీరితాతలు వారితండ్రులు మహావీరులు. ఆరక్తతేజోధాటి వీటిలోఁగూడ నున్నది. అయిననేమి? కఱ్ఱ చేఁతబట్టుటకు వీలులేదు. కత్తి యంతకంటెఁ బట్టుటకు వీలులేదు. కఱ్ఱఁబట్టినయెడల గేదె నింటికి మలపుకొనవలయును. కత్తిపట్టినయెడలఁ బలుదోముపుల్ల గోసికోవలయును. అంతకంటె వీరి యిప్పటిప్రయోజకత యేదియులేదు. పగలు చుట్టల దుకాణము రాత్రి పహరాకాపు. వీరి పూర్వపౌరుషము లెంతగా నశించిపోయినవి! సాము కుస్తీ మొదలగు మనపూర్వవిద్య లెంతగా ధ్వస్తములైనవి! ఏమిచేయఁగలము? కాలగతి! పోవలచిన వస్తువును బోకుండ నెవఁ డాపఁగలఁడు? రాఁదలఁచిన వస్తువును రాకుండ నెవఁ డడ్డుకోఁగలఁడు? ఈయాపత్తు వానివలన వచ్చినది. ఈసుఖము వానివలనఁ బోయినది. ఈసుఖము వానివలన వచ్చినది. ఈయాపత్తు వానివలనఁ బోయినది" యను నీనాల్గువాక్యములు పరిశీలనహీనుల నోటనుండి రాఁదగినవి. మంచిదైనసరే—చెడ్డదైనసరే—ఇచ్చువాఁ డొక్కపరాత్పరుఁడు తక్క నెవ్వఁడు లేఁడు. మంచియని చెడ్డయని తెలివితక్కువ భేదము నీవు చేసుకొన్నదికాని యాలోకేశ్వరునిదృష్టిచే నంతయు మంచిదే. మంచియేకానియెడల నాతఁడు మన కెందుల కిచ్చును! నీవిధి యేదో నీవు చేసికొనుము. సర్వయత్నఫలమును భగవంతునిపై నుంపుము. ఇఁక నీకు బానిసతన మెక్కడనో చూచెదను. నీబానిసతనము పోఁగొట్టుకొనుశక్తి నీలో నున్నప్పుడు వారా వీరా యని దేవులాడెదవేల? ఎవ్వరిపైఁగూడ నాస పెట్టుకొనకుము.

ఈవీరుల వెనుక నాస్థాన వందిమాగధజాతిలోనివారు నడచుచున్నారు. ఊరకే పోవుచున్నారా? లేదు. గొంతునరములు పొంగునట్లు పాడుచున్నారు. ప్రేగులు కదలునట్లు పాడుచున్నారు. ఆపాట లేవియో? ఆస్థానపూర్వరాజేంద్రుల పవిత్రములైన పద్యపదరూపక గాథలు. వారు భీష్మునివలె యుద్ధనిపుణులనియు ధర్మరాజువలె ధర్మనిష్ఠా

పరులనియు శ్రీరామునివలె నేకపత్నీవ్రతులనియు హరిశ్చంద్రునివలె సత్యదీక్షాధురంధరులనియుఁ జెవులు పవిత్రము లగునట్లు జిహ్వాదోషము లడఁగునట్లు గాలి పరిశుద్ధమగునట్లు పాడుచున్నారు. పూర్వరాజేంద్రు లెటకుఁ బోయినను నీమాగధులు వారితోఁగూడ నుండి హెచ్చరికలు చెప్పుచుండెడివారు. ఇది మిక్కిలి యుపయోగకరమైన పూర్వాచారము. దీని నాదరింపఁదగినదికాని విడువవలసినదికాదు. పూర్వరాజన్యులు వీధులవెంట స్వారులు పోవుచుండునప్పుడు పయోధరోత్తుంగచంద్రశాలాసదనముగాని పయోధరోత్తుంగచంద్రముఖీవదనముగాని తమ కంటఁబడినప్పుడు మనుష్యధర్మముచే బుద్ధి తప్పుదారి త్రొక్కునేమో యని "నీతండ్రి పరధనము లోష్ఠప్రాయముగ భావించినాఁడనియు, నీతాత పరకాంతను దల్లిగా భావించినాఁడనియు" హెచ్చరికలు వినుచుండెడివారు. ఇప్పటివా రట్టి పవిత్రగాథల ననుక్షణమును వినకపోవుట వలన వీరిలోఁ గొందఱు వీధులవెంట స్వారులుచేయునప్పుడు—వేవురలో నొక్క మహారాజమార్తాండుఁ డెవరో తక్కఁ బరకాంతలను జూచి కిచకిచలాడుచున్నారు. లొట్టలు వేయుచున్నారు. గ్రుక్కిళ్లు మ్రింగుచున్నారు. గుబగుబలాడుచున్నారు గమగమలాడుచున్నారు. చిటపటలాడుచున్నారు. కన్నుమూసి తెఱచులోపలఁ బండ్లిగిలించుచున్నారు. వీరిబుద్ధి తప్పుదారిఁ బట్టి దొరలిపోవునప్పుడు గట్టిబిగింపు దిట్టమైన 'లగా' మేదియు లేకపోవుటవలన ముప్పు విశేషముగా నున్నది. పురాణములలోని పూర్వరాజేంద్రుల నీతిపుంజములైన యెన్నియాఖ్యాయికలైనను "మీతండ్రిగా రట్లు ప్రవర్తించినారు. మీతాతగారిట్లు ప్రవర్తించినా" రను హెచ్చరికలతో సాటిరావు. కుటుంబగాథలకున్నశక్తి పురాణగాథలకు లేదు. మీతండ్రిగా రానూతినీరు ద్రాగినారనఁగ మీరుకూడ నానూఁతినీరె త్రాగవలయును. మీతాతగారికిఁ గాకరకాయ యిష్టమైనయెడల దానిచేదు మీరు భరింపలేకపోయినను దానియందు గౌరవము మాత్రము మీకుఁ దప్పదు. తాతగారినిబట్టి తప్పదు.

ఆమాగధవర్గమువెనుకఁ బలువిధములగు రంగులజెండాలను

జేతులఁ బట్టుకొని బాలురు బాలికలు గలసి మహోత్సాహమున మహా మధురస్వనములఁ బాడుచున్నారు.

బిలహరి—రూపకము

మహారాజ నూరేండ్లు మమ్ముఁ బాలించి సంపదలతోఁ
దులదూఁగుమీ॥ మ॥
పరసతులఁ దల్లులుగఁ జూచుచుఁ బరుల కుపకారములఁ జేయుచుఁ
పరమభక్తిని దేవుఁ గొల్చుచుఁ బరమసుగుణాభరణుఁ
డగు శ్రీ॥ మహా॥

బాలవాక్యము బ్రహ్మవాక్యముగాదా! ఈపాట విని మదగజము హుత్తేయని తిరుగ నడచుచున్నవి. శతమృదంగరంగద్రవములతో గుఱ్ఱములు సకిలించుచున్నవి.

సెబాస్! కుక్కచెవి జెటకాయించిన శకునము, గాడిదకూసిన శకునము, గుఱ్ఱముసకిలించిన శకునము వహవ్వా! యుత్సవము ముందునకుఁ బోవుచున్నది. ఈబాలసమాజము వెనుక

సీ. పసుపుమోమున రాచి పట్టెనామముఁబెట్టి
పొట్టికొమ్ములఁ బూలు చుట్టఁ బెట్టి
గంటలపేరులు కంఠమందున వైచి
కులుకుసింగారముల్ కుస్తరించి
నట్టి యాఁబోతులచుట్టును నిలఁబడి
తబుకుతాళముల నాదములతోడ
డొల్లతేకులమీఁది గుల్లదెబ్బలతోడ
గొల్లలెల్లరుఁగూడి గొంతులెత్తి
రండు! మనరాజు శ్రీమహారాజునుండి!
కృపను మాధవుఁ డతని రక్షించుఁగాక
యంచుఁ బాడుచుఁ దెయితక్క లాడుకొనుచు
నొడలు తెలియని ముదముతో నుందు రహహ.

ఆహా! వారియుత్సాహ మింతింతని చెప్పరాదుగదా! ఐరావత మంతటి యాఁబోతులుకూడ నాహాహా! ప్రశంసాసూచకముగఁ దల లూఁపుచున్నవే? ప్రభునియెడల విశ్వాసమనునది పెద్దయుద్యోగులలో

కంటె భటవృత్తిలో వారికే హెచ్చుగా నుండునుగాఁబోలు. తత్త్వములోఁ జెక్కినదక్కువమైనకొలఁది విశ్వాస మెక్కువకదా! అందులో వట్టి యమాయకులగు గొల్లలకు విశ్వాసమింతంతయా! చతుష్పాత్తులకుఁ గలవిశ్వాసము ద్విపాత్తులకు లేనేలేదు. నరులలోఁ బదవి యెక్కువయైనకొలఁది ప్రభునియందు భక్తి తక్కువయయిన ట్లగపడుచున్నది. పెద్దపదవిలో నున్నవానికిఁ దనప్రయోజకత్వమువలననే యాపదవి సిద్ధించినదని రవంత తెగనీలుగు మొట్టమొదట నుదయించును. అది క్రమముగాఁ గొన్నిరోజులలోపల గుబగుబలాడి యాగుబగుబ పొగరురూపముగా నొడలంత వ్యాపించును. ఆరంభించిన తెగనీలు గిట్లు చిన్నరోగముక్రిందఁ బరిణమించి యది క్రమముగా ముదిరి ఘనీభవించి చర్మగతి దాటి రక్తగతి నొంది రక్తగతిఁదాటి మాంసగతి నొంది, మాంసగతి దాటి యస్థిగతినొంది యభివృద్ధినొందును. అంతట నొక చిత్రమైన చెవుడు సంభవించును. అది బంధుమిత్రులమాట వినకపోవుటగా నారంభమై రాజుగారిమాటవినకపోవుటవఱకు వ్యాపించును. ఈచెవుడిట్లు దిన దిన ప్రవర్ధమానమై తేజరిల్లుచుండగఁ గంటికి గాసంతపొర యారంభించును. చెవికిఁ గంటి కేమిసంబంధమందురేమో? ఒకయింద్రియ మవిటిదైనప్పుడు బీరకాయపీఁచువంటి నరములసంబంధముచేత రెండవది కూడఁ జెడినఁ జెడవచ్చును. ప్రకృతివిరుద్ధమైన యంశముకాదు. ఈపొర యారంభమైనపిమ్మట దగ్గఱవాఁడేమో దూరముగాను దూరపువాఁడేమో దగ్గఱగాను నున్నట్లగపడును. చిన్నవస్తువు పెద్దవస్తువులాగునఁ బెద్దవస్తువు చిన్నవస్తువులాగునఁ గనఁబడుటకూడఁ గలదు. ఈపొర శీఘ్రకాలములోనే నీటిమీఁద వైచిన నూనెచుక్కలాగున నట్టె యట్టె కన్నంతయు వ్యాపించును. అంతటినుండి ప్రభువుగారు కనఁబడనే కనఁబడరు. కనబడకపోవుటచేత రాజగారు లేనేలేరని స్వల్పమైనభ్రాంతి కాతఁడు లోనైయుండును. ఈప్రపంచమంతయు వట్టి భ్రాంతిమయమే కాదా! చెవికిఁ గంటికిఁ బుట్టిన పైరోగ మిప్పుడు క్రమముగా భ్రాంతిరూపముగా మనస్సులోనికి వ్యాపించినది. ఈభ్రాంతి మొట్టమొదట హెచ్చువాఁగుడుగ నారంభమగును. ఈవదఱుఁబోతుఁదనము రవంత మతి చెదఱుట లోనికి జాఱీ యంత క్రమముగా ముదిరిముదిరి భయం

కరమైన యున్మాదములోనికి దిగును. అంతటినుండి యందఱకును దిట్లు. ఓ! శరపరంపరలు! ఓ! యొక్కటే వడగండ్లవాన. పాపము పిచ్చి వాఁడు. ఆతని నసవలసినపని యేమున్నది? పెద్దపనులవలన వచ్చిన బద్ధకములు, ననారోగ్యములు, సు స్త్రీలు, చిన్నరోగములు, పెద్దరోగము లివి. ఇట్టి వేవియు లేని యధమసేవకులలోనే విశ్వాసము హెచ్చుగా నుండునని తోఁచుచున్నది. మొత్తముమీఁద విశ్వాసముమట్టున కధమత్వముతోఁ జేరిన గుణముకాని యాధిక్యముతోఁజేరిన గుణము మాత్రముకాదు. ఈగొల్లలకుఁ గొంతవెనుక భజనకీర్తనమేళము లున్నవి. పిడేలుసుతులతో తేకుఁదాళపుదెబ్బలతోఁ గీర్తనపరులు భగ వంతునిఁ గీర్తించుచున్నారు. హాహాహా! ఏమిభక్తి పరవశులై పాడు చున్నారు?

కాంభోజి—ఆది

మాధవ! నీనామస్మరణ మొనర్చిన మనుజుల కే
లోపమును గలుగదుగా॥మా॥
శ్రీధర కేశవ రాధారమణ హరి బాధితసకలాఘు
బోధామృతరూప॥ మా॥
మా మహారాజును మాన్యచరిత్రుని
మా మహారాజ్ఞిని మహితచరిత్రను
మా మహారాజకుమారుల సుతలను
మహిమాయువు లిచ్చి మఱిమఱి రక్షించు ॥మా॥
జయ రమారమణ గోవిందో హరిః

సరిగా, సరిగా, మఱిసరిగా, మఱిమఱి సరిగా పాడినారనికాఁ బోలు పిడేలు పలుకుచుఁ గులుకుచున్నది. కణకణలాడుచు మ్రోగు చున్న మృదంగము, మహిమను గూర్చియు నాయువును గూర్చియే భజకీర్తనపరులు పాడినారుకాని ధనముమాట పారపాటుపడినారు కాఁబోలు నని ధనమ్ ధనమ్ ధనమ్ అని జ్ఞప్తిచేయుచున్నది. సంవత్సరము నకుఁ బాతికలక్షలరూపాయలు వచ్చు ప్రభునిగూర్చిపలుకునప్పుడు ధనము మాటచెప్పవలయునఁట! ఇది బుద్ధిహీనతకాదా!" యని గుబ్బము లిహిహీ యని సకిలింతలచే మృదంగమును బరిహాసించుచున్నవి. ముందున్న

మేసుంగు లేయశ్వపరిహాసములను హాత్తేహాత్తే యని తిరుగ నామోదించుచున్నవి.

భజనకీర్తనపరుల వెనుక వేశ్యలు వీలగునప్పు డొకహస్తమును బట్టుచు నొక్కగంతు వేయుచు నొక్కకన్ను త్రిప్పుచు (రెండవకన్ను లేకపోవుటచేగాఁబోలు) కత్తికోఁతగాఁడనియో అత్తగారింట లేననియో యొక్కముక్క మాత్రమే పాడుచు వెంటనే యుత్సవముతో నడచుచున్నారు. సరిగా వారి వెనుకప్రక్కనే చేరియున్న యాస్థానోద్యోగులు గ్రామములోని యితరమహాజనులు కలసి తొందరలో ముందునకుఁ బోవునప్పుడు పొరపాటుచొప్పుననో కాక విధిలేకయో వేశ్యలకాళ్లు త్రొక్కుచున్నారు. కత్తికోఁతగాఁడు కాఁడే కాలుత్రొక్కుడుగాఁడే యని వేశ్యలు తమలోఁ దాము నవ్వుకొనుచు భజనకీర్తనపరులను ముందునకుఁ ద్రోయుచున్నారు. ఆసందడిలో నొక భజనకీర్తనపరుఁడు తన జుట్టులోని గులాబిపూ వున్నదో యూఁడినదో చూచుకొనఁబోయి ప్రమాదమున నొక వేశ్య నెత్తిపై నున్న నాగరమును తడుముచుండెను దొంగ దొంగ యని యావేశ్య కేకవైచెను. ఇన్నికోర్టులుండి యిందఱు న్యాయమూర్తు లుండి, యిందఱు న్యాయవాదులుండి యింతకాలము విచారణము లుండినను దొంగ యెవఁడో దొరయెవఁడో తిన్నగఁ దేలకుండనున్నప్పు డాపెద్దసందడిలో దొంగను గనిపెట్టువాఁ డెవఁడు? భజనకీర్తనపరు లాత్రోపులతో గొల్లలపైఁ బడుచున్నారు. ఆగొల్ల లదరిపడి యాఁబోతులపైఁ బడుచున్నారు. అట్టెతొందరపడకుఁ డట్టె తొందరపడకుఁ డని యాఁబోతులు తలల నడ్డముగ నూఁపుచున్నవి. మనుష్యుల త్రొక్కులాటలలోఁ ద్రోపులాటలలోఁ బశువులు మనుష్యులకు బుద్ధిచెప్పవలసివచ్చినది! కాలగతి! తెలివిమాలిన నరుఁడు! ఎంతసేపు గ్రుడ్డిత్రోపుగ ముందునకుఁ బోవుటకే దేవులాడును గాని యెందులకుఁ బోవలయునో! పోవలసియున్నను బోవచ్చునో లేదో యనుచింత లేశమాత్రమును జేయఁడు కదా! ముందున్నది మృత్యువేకాని వేఱొక్కటి లేదనుజ్ఞాన మీతని కెంతమాత్రమును లేదేమి? వీని తెలివి తెల్లవాఱిపోను! ఎప్పుడైన వీనికి జ్ఞానము వచ్చునా? అత్యంతోత్సాహమున నగ్గిలో నాహుతి

యగు మిడుతకు నీతనికి భేదమేమైనఁ గనఁబడుచున్నదా ? ఈగొడవ యెందులకుఁగాని.—

వీరివెనుకనే యుద్ధాత్రములతో నొక్కప్రక్కను వైష్ణవులు మఱియొక్క ప్రక్క నద్వైతులు వేదములఁ బఠించుచున్నారు. ఆహాహా! ఏమి హృదయంగమముగ నున్నది! ఎంత యుదారాభిప్రాయబోధకముగ నున్నది! ఎంతదివ్యముఁగ నున్నది! ఉద్యోగులతోఁ గలసిన వేశ్యల పరమాసహ్యాపుబొత్తుననే ఈ మహాపవిత్రమధురగాథాగానసన్నివేశ మున్నదే! కంఠాభరణములోని వెఱ్ఱిరామశాస్త్రులు నరకమునకు స్వర్గమునకు బెత్తెడేకాదా యెడమని పలికినప్పు డది వట్టి తెలివితక్కువమాట యనుకొంటిమి. "వ్యక్తురాలను కాలేదు." అని వారకాంత పాటయేమి ? అందుల కీమిఁసాలయుద్యోగుల యాహాహాలు వహావ్వా లేమి ? సరిగా వానిప్రక్కనే "ఏకమేవాద్వితీయమ్ ఖల్విదం బ్రహ్మే" త్యాది మహావాక్యపఠన మేమి ? బొగ్గుప్రక్కనే వజ్రమున్నది పామువిసపు గోరకుపైననే మణియున్నది. పాపమునంటియే పుణ్యమున్నది. వాని సామీప్య మెఱుఁగక యోగి భోగియగుచున్నాఁడు. భోగి యోగి యగుచున్నాఁడు. వహావ్వా! ఈవేదపాఠకుల వెనుకనే యెవ్వరున్నారు ? వేదవేద్యుఁడు పురుషోత్తముఁడు వసుదేవనందనుఁడు రాధాకాంతుఁడు నగు శ్రీకృష్ణపరబ్రహ్మము గరుడవాహనారూఢమై యున్నది. కన్నులు కృతార్థములగుచున్నవి. మనసులట్టెయట్టె పెద్దవియై జగమంతయు వ్యాపింపఁబోవుచున్నవి. జన్మమునకింతకంటె సార్థకత యేమున్నది ? ప్రపంచలంపటవలన మన సట్టెయట్టె ముడుచుకొనిపోవునే! ఎంతసేపు దిక్కుమాలిన మనసు —తాను తనకుటుంబము — తనసుఖము— తనభాగ్యము — తనబ్రతుకునే చూచుకొనుచు నొక్క యంగుళములోనే గిఱగిఱ తిరుగుచు గుడుగుడుగుంచము లాడుచు దేవులాడుచుండునే! గానుగయెద్దు కాశి కెన్నఁడైనఁ బోఁగలదా! ఉదయమునుండి సాయంకాలమువఱకుఁ దిరుగుచునే యుండునే! కాశివఱ కెందులకు ? గడప దాటఁగలిగినదా ? ప్రాజ్ఞుఁ డనిపించుకొనుచున్న మనుజుఁ డంతకంటెఁ బ్రయోజకుఁడు కాఁడే ? కన్నులు గానఁబడకపోవుటచే బుద్ధిలేకపోవుటచేత గానుగ

యొద్దను గొంత క్షమింపవచ్చును గాని మొగముమీఁద రెండుకన్ను లున్న మనుజుఁడు మనసులో మూఁడుకాలములకు మూఁడుకన్ను లున్న మనుజుఁడు—పశుప్రకంటెఁ బనికిమాలినవాఁడైన యప్పుడు వాని కేమిక్షమాపణ యున్నది? స్వచింత తక్క పరచింత యెవ్వనికో కాని లేనేలేదే! తన యావరణము దాఁటినప్పుడుకదా మనస్సునకు వ్యాప్తి? మనస్సునకు వ్యాప్తికలిగినప్పుడుకదా తనకుఁ బరునకుఁ దత్త్వమున భేదమేమైన నున్నదేమో కనిపట్టుట? గంట కొకసారి తప్పకుండఁ జిన్నముంటిని స్పృశించుచుఁ బిల్లముంటిని దనచుట్టు త్రిప్పుకొనుచు ముద్దిడుకొనుచుఁ బరిభ్రమించుచున్న గడియారపుబెద్దముల్లు మూత దాఁటి పైకి నెప్పుడుపోవునో యప్పుడే, భార్య నట్టెయట్టె స్పృశించి బిడ్డ నట్టెయట్టె ముద్దిడుకొని "వానలప్ప" తిరుగు పరచింతా శూన్యుఁడు స్వచింతాలోలుఁడు ముక్తి నొందును. గంగానదిపైఁబడిన పులివిస్తరాకైన సముద్రమునఁ జేరుచున్నది. కాని గంగలో నున్న సుడిగుండములు భీష్ముఁడు పుట్టినప్పు డెక్కడనుండెనో యిప్పుడుకూడ నక్కడనే యున్నవి. పరచింతాశూన్యుఁడైన నరుని బ్రదుకునకుఁ బర్యవసానము శ్మశానముకంటె వేఱేది! భవతాప పరితప్తప్రాణిలోక తాపోపశమనార్థమై భగవద్గీతామృతమును బార్థవ్యాజమునఁ బ్రపంచమునకుఁ బ్రసాదించిన యో పరమపురుషా! పావనబృందావన గోపికాచ్ఛలమున భక్తియోగవైభవమును బోధించిన యోపురుషోత్తమా! నమస్తే నమస్తే నమస్తే. కాని మాధవా! రుక్మిణీభామాధవా! ఒక్క చిన్నమాట నడుగుచున్నాను. పార్థసారథిస్వరూపమున మదరాసులో వేంచేసిన నీవు మొన్నటి యాదివారమున తేనాంపేట మీఁదుగా సైదాపేటమీఁదుగా మీ యాస్థానగ్రామమైన మాంబళము నకు జమాబంది నిమిత్తమై వేంచేసితివఁట నిజమేనా! అంద ఱుద్యోగు లుండ మీరే యంతశ్రమ మొందుట న్యాయమా! కోఁతిని బంపి వ్యవహారముయొక్క 'ఆను' కనిపెట్టినవాఁడవుకదా! ఈమాత్రమునకుఁ బీఠమేల కదలిచితివి! నాయనా! పాండవకౌరవసంధియని బయలు దేఱితివా? భీష్మవధమని చక్రముపట్టుకొని బయలుదేఱితివా? నాకు బోధపడినదిగాదు తండ్రీ! నీ వెందులకు బయలుదేఱితివి? రవంత చెప్పవు?

ఒకవేళ యిందుకొఱకై యుండునా? కోడిపందెములని సానిమేళము లని యాస్థానవ్యవహారములను స్వయముగఁ జూచుకొనక యన్ని విధములైన యాగడము లాచరించుచున్న కొందఱు జమీందారులకు సంవత్సరమున కొక్కదినమందైన మీయెస్టేటుగ్రామములు చూచు కొనుఁడని బోధించుట కిట్లు బయలుదేఱితివా? ఏమో? అందుకొఱ కేమో! కాని యీయూహముకూడ సరికానట్లు కనఁబడుచున్నది. ఇందులో నొక్క ప్రత్యవాయ మున్నట్లున్నది సర్వజ్ఞుఁడవు నీకుఁ దెలి యని దేమున్నది. Estate Land Act మూలమున జమీందారుల కన్నియధికారములుగూడ నంతరించినవని నీవెఱుఁగవా నాయనా! జమీందారుల కింక జమాబందియెందులకు? జమీందారులకు జమీం దారీయే లేనప్పు డింకను జమాబందియేమిటి నాతండ్రీ! Estate Act ప్రకారము నిజమైన జమీందారుఁ డెవరు? రైతేకదా! ఇదివఱకు జమీందారుఁడని యనుకొనుచున్నవాఁ డిప్పు డెవరు? శిస్తుదారుఁడు మాత్రమేకాదా? జమీందారునకు పైసయేకాని జమీనేది? కృష్ణా యదునందనా! ఇచ్చటి ఘృతకోశన్యాయము చిత్తగించితివా? ఎస్టేటు గ్రామములలోనికి వెళ్లుమని మీరు బోధించుచున్నా రనుకొందము సరే! పెద్దవారు గనుక తాము చెప్పవలసినదే. కాని జమీందారులకు వారిగ్రామములలోఁ బలుకుబడియుండుట కవకాశమే లేనప్పుడు పని లేనిదే పోయి పరాభవమొందుట యెందులకు? రమ్మనిన రైతు రాఁ డయ్యెను. కరణము కబురునకే యందఁడయ్యెను. ఇఁక జమాబందిలోఁ జేయవలసిన దేమున్నదయ్యా? ఈ ఆక్టువలన జమీందారులు పొందుచున్న యిబ్బందులున్నవే శాంతమ్ పాపమ్ శాంతమ్ పాపమ్ చెప్పనలవికాదు కృష్ణా! నీకైనఁ దెలియవేమో యని నాసందేహము. ఇటులంటినని కోపపడకుము. కృష్ణా! నీవు లక్ష్మీవయస్యుఁడవు. నీ కితరులబాధ చప్పున నాటునా? అదిగాక మఱియొక్క పెద్దకారణ మున్నది. దేవాదాయములు Estates Land Act అసలునుండి సర్కారు వారి ధర్మమాయని మినహాయింపఁబడుటచే మీరిప్పు డీషాన్ షోకు లతో జమాబంది యనుచు సింగారించుకొని బయలుదేఱితిరి కాని లేకున్నయెడల మాజమీందారులవంటిస్థితియే మీఁదియునై యుండునే?

దేవకీనందనా ! రాజాధిరాజా ! నాదొక్క ప్రార్థనయున్నది. విందురా ? ఈయాక్టును శీఘ్రముగా సవరణచేయించి ప్రభువుల గౌరవమును గాపాడవలయుననుసదుద్దేశమును శాసనసభ్యుల హృదయములందు మీరు ప్రవేశించి కలిగింపవేడుచున్నాను. మీరు తలఁచుకొన్న యెడల నెంతపనియైనను నగును. జమీందారులేమి సామాన్యులా ? ఎంత యాదాయము వచ్చుచున్నవారు ? ఎంతెంత పరోపకారకకృత్యము లొనర్చినవారు ? పూర్వపువారివంశములోనుండి సర్కారునకుఁ బూర్వపుపాదుషాలకు నెన్నెన్ని మెహనతులుచేసినవారు ! ఈదినము వఱకు సర్కారు సెలవనఁగ లక్షలకొలఁది రూపాయలు ద్రిమ్మరించు చున్నారే. అట్టివారికి ఇప్పుడు క్రొత్తయధికారము లేవియు నీయనక్కఱ లేదు. వారి పూర్వాధికారములిచ్చినఁ జాలు. ఆమాత్రముననే కొండయెక్కినట్లు వారు సంతోషింతురు. స్వామీ ! మాధవా ! ఏమిసెలవు ?

మామహారాజునకు జయ ! మామహారాజ్ఞికి జయ ! మామహా రాజసంతతికి జయా ! యను జయజయధ్వానములతో నుత్సవము ముందునకుఁ బోవుచున్నది. సాయంకాలమగుటచే దీపపంక్తులచే శోభిల్లు చున్న ముంగిళ్లలోని యంగనలు మంగళపుటారతుల పళ్లెరములు చేతఁబుచ్చుకొని మాధవస్వామిని సేవించుచున్నారు. ఏవో మంగళపు టారతులు పాడుచున్నారు. ఈసందడిలో నేదైన వినఁబడునా ? ఈసమ యమున బాణాసంచాగూడ కాల్చుచున్నారు. ఇఁక వినఁబడుటయేమి ? కస్సుమని పేకజువ్వ లంతరిక్షమున కెగిరి చప్పుడుకాకుండఁ గ్రిందఁబడు చున్నవి. ఉన్నయధికారమేదో యూడినతరువాతఁ జల్లగఁ జఱుగవలసి నదే కాని లేనిపోని కస్సుబుస్సు లెందులకు ? చిచ్చుబుడ్లాగ్నేయవృక్ష ముల నీనుచున్నవి. అదిచూచి భయముచే దుండము చుట్టిచుట్టి నోటఁ బెట్టుకొని యూపిరి సలుపనీక ఆత్మహత్య చేసికొనుట కేనుఁగ ప్రయత్నించుచున్నది. మనకంటె శరీరమే యెక్కువకాదు. భయముకూడ నెక్కువేయని గుఱ్ఱము లిహిహీయని పరిహసించుచున్నవి. గుఱ్ఱములు మాత్రము భయపడుటలేదా ? కాని యేనుఁగులు తమకంటె భయ పడుచున్నవని వానిని బరిహసించుచున్నవి. ఎంతవిచిత్రముగా నున్నదో

ఈపరిహాసమున కర్థ మేమైనసున్నదా? కాని ప్రపంచవైఖరి యదియే; దినమునకు నియమముగా రెండుచుట్టలు కాల్చువాఁడు పదునాల్గు చుట్టలు గాల్చువానిని నిత్యాగ్నిహోత్రియని యధిక్షేపించును. రెండైన నేమి పదునాలుగైననేమి? పైవానిచుట్టలు పనికిమాలిన పొగాకుచుట్ట లనియుఁ దనచుట్టలు తులసికట్టలనియుఁ దనయభిప్రాయము కాఁబోలు! సంసారపక్షముగా నొక యాటకత్తెను జాగ్రత్తపఱచి సందడి చప్పుడు లేకుండఁ బ్రచ్ఛన్నముగ భవతరణ మొనర్చుచున్న పవిత్రగాత్రుఁడు వేశ్యావీథివెంటఁ దిరుగు గిరజాల మీసాల జాఱుకచ్చరాయని మిండ కాఁడని, ముండలముతాదారని రౌడీయని స్కౌండ్రెలని చెడమడఁ దిట్టును. తానుమాత్ర మెవఁడు? పెండ్లాముయొక్క ప్రక్కనుండి పెడ ద్రొక్కిన తరువాత ఆడుముకు పాడుగైనయెడల నగౌరవము పొట్టిదైన యెడల గౌరవమని తన యభిప్రాయముకాఁబోలు పైవాడుంచుకొన్న వారు గుడిసెవ్రేటులనియుఁ దానుంచుకొన్నది కీర్తికాంత యనియుఁ దనయభిప్రాయము కాఁబోలు. ఎంతమతిమాలినతనము! బ్రాంది త్రాగినవాఁడు రమ్ త్రాగినవానిని బరిహసించును. రమ్ త్రాగినవాఁడు తాటికల్లు త్రాగినవాని నధిక్షేపించును. తాటికల్లు త్రాగినవాఁ డీతకల్లు ద్రాఁగినవానిని బరిహసించును. ఇట్లే కీడులో మేలు చూచుకొని జనుఁడు తన్నుఁ బొగడుకొనుచుఁ బరులను బరిహసించును. ఇదియే మనుష్యప్రకృతి. ఈవాసియే పశువులలోఁగూడ నున్నది. అందువలననే చిచ్చుబుడ్లచే గుఱ్ఱములుగూడ బెదరినను దమకంటె నెక్కువ బెదిరిన యేనుగులఁ బరిహసించుచున్నవి. అదిగో గొట్టములనుండి మామహా రాజు కీర్తివలె స్వచ్ఛములై వెన్నముద్ద లెట్లెగురుచున్నవో! కృష్ణా! నవనీతప్రియా! ఆవెన్నముద్దలను రవంత కబళింపఁగలవా? ఏమి సందేహించుచున్నావు? ప్రక్కలఁ గూరుచుండిన రుక్మిణీసత్యభామ లింక మాభర్తగారికిఁ జిన్నతనపుఁజేష్టలు వదలినవి కావని యధిక్షేపింతురేమో యని సందేహించుచుంటివా? లేక మూఁతి కాలునేమో యని భీతిల్లు చుంటివా? నా తెలివిలేమిచే నేనేమైన నిన్నన్నయెడల నాగ్రహింపకుమా! కృష్ణా! అదిగో లంకాపురీదహనము! అదేమి? అదేమి? ఇప్పుడు నీవు సౌమిత్రిసహితుఁడవై యరణ్యవాసివైన రామచంద్రమూర్తివలెఁ గనఁ

బడుచున్నావేమి ? కథనుబట్టి యవతారము కాని యవతారమునుబట్టి కథయా ? దశరథరాజనందనా ! విశ్వామిత్రయాగసంరక్షణా ! జానకీ ప్రాణనాథా ! పరశురామగర్వభంజనా ! దండకారణ్యవాసీ ! మారీచ మదనా ! సీతావిరహవ్యాకులచిత్తా ! సుగ్రీవప్రియమిత్రా ! వాలిహరణా ! ఆంజనేయశ్రితపాదపంకజా ! రావణశిరఃఖండనప్రవీణా ! నమస్తే నమస్తే నమస్తే.

ఉత్సవము ముందునకింకఁ బోవుచున్నది. అచ్చటఁ బెద్దబజారు చౌకులోఁ జేరిన పురంధ్రిలు స్వామికి నీరాజనములిచ్చుచు మంగళపు టారతు లెట్లు పాడుచున్నారో ?

సురటి—రూపకము.

స్మరియింపరారే మా-పరమపురుషుని ॥స్మ॥
మఱిమఱి దయఁగల్గి మమ్ముఁబ్రోవుమని ॥స్మ॥
మామహారాజును మామహారాజ్ఞిని
మామహారాజుకుమారుల సుతలను
శ్రీమహితాయుష్య క్షేమము లొసఁగుచు
కామితార్థము లిచ్చి కాపాడవలెనని ॥స్మ॥

తథాస్తు—తథాస్తు—

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః.

## 15. వైద్యునిలేఖ—ఆరోగ్యము

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

ఎవ్వఁడో వైద్యుఁడు సాక్షిసంఘమునకు వ్రాసిపంపిన లేఖను జంఘాలశాస్త్రి యిదివఱకే చదువుచుండెను. అదివఱకేమి చదివెనో కాని నేను సభకుఁ బోయినతరువాత నిట్లు చదువసాగెను.

"లేవు—వాని కిన్ని రోగము లెక్కడివి ? ఇంత చిత్ర విచిత్ర వ్యాధిసమూహము పశువుల కెక్కడిది ? నరుఁడు తనబుద్ధిమహత్వ

ముచే నిన్ని యపూర్వవ్యాధుల సంపాదించుకొనినాఁ డనుట కేమైన సందేహమా? బుద్ధి రోగవృద్ధికే యుపయోగించినదా? సృష్టించిన వైద్యగ్రంథములు సృష్టించుచునే యున్నారు. వృద్ధియగుచున్న రోగములు వృద్ధియగుచునే యున్నవి. క్రొత్తరోగములకుఁ గారణముల నూహించుచునే యున్నారు. ఆకారణములను నాశన మొనర్చుటకుఁ బ్రయత్నించుచునేయున్నారు. ఆప్రయత్నమువలననే క్రొత్తరోగములు పుట్టుచున్నవి. వీనిని తగ్గించుటకుఁ గ్రొత్తక్రొత్తవైద్యపద్ధతులు కల్పించుచున్నారు! ఆపద్ధతులవలననే యెన్నఁడెఱుఁగని వింతవింత రోగములు వందలు వేలు పుట్టుచున్నవి. నరుఁ డీవెఱ్ఱియోజనలు కల్పనలు చేయక నోరుమూసికొని యుండినయెడల ప్రపంచమున నింత రోగవృద్ధి యుండదేమో? పశువులవలె సంతకంటె సహస్రగుణములైనయారోగ్యముగలిగిననరుఁడు పథ్యపుఁదిండిలేక మాత్రమ్రింగుడులేక కత్తికోఁత లేక సూదిపోటులేక రవంత సుఖముగా నుండునేమో? మనుజునకు బుద్ధి యున్నంతకాల మట్లు నోరుమూసికొని పడియుండుట కవకాశమేది? వయసుచేతనో యేదైన ప్రమాదముచేతనో దంతము కదలుచున్నయెడల నింతలో యేమి పుట్టిమునిఁగినది? నాల్గుదినములు నోరుమూసికొని పడియుండరాదా? ఊహు—అదికారుచే నూఁడలాగించుకొనువఱకొకచేతహాతహ—తనంతఁ దా నూఁడిపోఁదలఁచిన దంతమునుగూర్చి నరున కీదౌర్జన్య మెందులకు? సరే. ఏతలమాసిన కంటిజోటి నోటిథాటి యవకతవక యపాతీకెరీయొద్దకో పోవును. ఆతొందరలో నతనిచేత జబ్బుపన్నుతో మంచిపన్నుకూడ నూఁడలాగించుకొని ముఖపక్షవాతమునకో మూర్ఛకో లోనగును. ముఖపక్షవాతమునకై పైన రాచిన గాటగు మందులతోఁ గంటిలో నుడుకు బయలుదేఱి లోనివసము హరింపజేయును. ఇప్పుడైన సిగ్గుపడి లెంపలువైచుకొని యూతఁ డూరకుండునా? ఊహు. ఆయొండుకంటి కాపరేషను చేయించుకొనును. అందువలన నది పూర్తిగ లొట్టపడిపోవుటయేకాక తలతిరుగుడు, మెదటిలో నొకవిధమైనవికృతియుఁ గలుగును. దానివలనఁ ద్వరలో మతి పోవును. అది తగ్గుటకుఁ దలగొరుగుడని, నిమ్మకాయమర్దనలని, మృత్తికాస్నానములని, నస్యములని, యరదండములని, సంకెలలని, కొరడా

దెబ్బలని యనుభవింపవలసిన యాపదలన్ని, యనుభవించి యంత మొందును. ప్రథమమందుఁ బన్నూడఁదీయించుకొని దాని పర్యవసానముగాఁ బ్రాణమును బోఁగొట్టికొనినాఁడు. వైద్యుఁడు పట్టుకారుతో లాగినది పన్నుకాదు ప్రాణమేయని నిశ్చయింప, దగినట్టు కనఁబడుచున్నది. ఇట్లీ ప్రపంచమందు నిముసమున కొక్కఁడు బుద్ధిపూర్వకముగఁ దెచ్చుకొన్న మఱియేదో రోగపరంపరచేఁ జచ్చుచుండును.

నరునకుఁ బరమాయువు నూటయిరువది యని శాస్త్రములు చెప్పుచున్నవి కాని జనసంఘముయొక్క సాముదాయికాయుష్యము మిగులఁ దక్కువగా నున్నట్టు లెక్కలవలన స్పష్టమగుచున్నది. ఆరోగ్యశాస్త్రజ్ఞాన మాకాశమంటిన యాంగ్లేయదేశమందుఁగూడ సాముదాయకాయుఃపరిమాణము 45.5 అయియున్నది. అన్ని యారోగ్యశాసనముల నలక్ష్యము చేయుటయేకాక యనావశ్యకములని ప్రాగ్దిశనున్న బంగాళాఖాతములోను నపరదిశనున్న యరేబియాసముద్రములోనుగట్టకట్టి పాఱవేయ సంకల్పించుకొన్న యార్యావర్తదేశమున నాసాముదాయికాయుర్మితి యెట్లున్నదో విందురా? ముప్పదియో ముప్పదికిఁ దక్కువయో యున్నది. మనకట్టి యారోగ్యశాసనోల్లంఘన మెందులకుఁ గలుగవలయునో! శరీరారోగ్యశాసనము నటుంచుఁడు. మనలో స్వభాషనైనఁ జదువుకొనినవా రెందరున్నారో చూచితిరా? నూటికిఁ బదివంతుచొప్పున నున్నారు. నూర్గురిలోఁ దొంబదుగురిక క్షరజ్ఞానమే లేనప్పు డారోగ్యశాసనజ్ఞానమెటనుండివచ్చును? రోగము వచ్చినప్పుడు చచ్చిపోవుదుమేమో యని విచారించుచున్నారు. రోగము పోయినప్పుడు యథాపూర్వకముగాఁ బ్రవర్తించుచున్నారు. రోగము తనంత తాను రావలసివచ్చియుండెను కాని యారోగ్యశాసనోల్లంఘనమున వచ్చినదని వారి కూహామే లేదు. ఉడికియుడుకని పప్పు తినినందువలన నాతనికిఁ గడుపునొప్పి వచ్చినదని నీ వెవనితోడనైనఁ జెప్పినను వండినపప్పంతయు నాతఁ డొక్కఁడే తినెనా యనియు మిగిలినవారందఱు తినలేదా యనియు నందఱకుఁ గడుపునొప్పి రాక యాతనికిమాత్రమే యేల రావలయుననియు నుడుకని పప్పునకుఁ గడుపునొప్పికి సంబంధము లేశమాత్రమును లేదనియు నట్టిసంబంధమున్నదని

తలఁచువారందఱు పరమమూర్ఖులనియు రావలసివచ్చినప్పుడు కడుపు నొప్పి రాకతీఱదనియు నతఁడు నిన్నుఁ దలవాచునట్లు మందలించును. ఆవకాయ తినినందువలనఁ గాకచేయలేదు. కాకచేయవలసి కాకచేసి నది. కుళ్లునీటిలో మునిఁగినందువలన జలుబుచేయలేదు. జలుబుచేయ వలసి చేసినది. వేఱుసెనగకాయలు చెడ దినినందువలనఁ బైత్యము చేయలేదు. పైత్యముచేయవలసి చేసినది. తినఁగూడని యన్నివస్తువులు తినినను దినఁదగినవస్తువులన్నియు మితిమీఱి తినినను, జేయవలసిన పనులు వేళకుఁ జేయకున్నను, జేయఁగూడనిపను లెన్నిచేసినను వ్యాధి వచ్చుటలేదు. వ్యాధి రావలసి వచ్చుచున్నది. ఈసూత్రమునకు మిన హాయింపులేదు. ఇట్టి యభిప్రాయముగలవా రనేకులున్నారు. వీరిలో స్త్రీలధికముగా నున్నారు. మఱి వారిలో ముసలివారు ప్రబలసంఖ్య గలవారై యున్నారు.

ఇదిగాక విద్యావంతులైనను ననూచానముగ వచ్చుచున్న యాచారముల మీఱలేక కొందఱువ్యాధిని గొని తెచ్చుకొనుచున్నారు. వారిలోను స్త్రీ లధికసంఖ్యగలవారే. ఏకభుక్తియగు శనివారమున సాయంకాలమం దుప్పిడిపిండియో మినుపరొట్టెయో తిని మఱునాఁటికి గుండెబరువుతోఁ దలనొప్పితోఁ గడుపుపీఁకుతో విలవిలలాడుచున్నారు. నాగులచవితినాఁడు పచ్చిచలిమిడి చిమ్మిలియుండలు తిని యారాత్రి నుండియే గ్రహణివలనఁ బదునైదుదినములవఱకు బాధపడి చావు తప్పి తేలుచున్నారు. తీర్థయాత్రలకై బోయి దారిలోఁ బచ్చిపులుసు మెదుకులు పచ్చిపెసరపప్పుపచ్చడి పగలు మూఁడుగంటలకుఁ దిని వాంతులకు భేదులకు లోనై యమదర్శనము తరువాయిగా నన్నికృత్య ములు నెఱవేర్చుకొనుచున్నారు. ఈకారణమువలన మనవారిలో ననే కులు బుద్ధిపూర్వకముగ నారోగ్య శాసనోల్లంఘనమును చేయుచున్నారు. అందువలనఁ గలిగినరోగములచే ననేకులు మరణించుచున్నారు. మరణించినవాఁడైనను రోగముచే మరణింపలేదనియు మరణింపవలసియే మరణించినాఁడనియు మనవారు సిద్ధాంతీకరించుచున్నారు. మృతి తత్త్వనిర్ణయమును గూర్చి విచారణ మిప్పుడక్కఱలేదు. ఎటులైనను బుద్ధిపూర్వకముగనో యబుద్ధిపూర్వకముగనో యారోగ్యశాసనము

ఉల్లంఘింపఁబడుచున్నవి. ఏకారణములచేనైననేమి ? అనేకవిధములగు రోగములు నరులలోఁ గలుగుచున్నవి. ఈరోగములు పశుజాతిలోఁగల్గు రోగములకంటె సంఖ్యలో హెచ్చు తీవ్రతలో హెచ్చు విచిత్రతలో హెచ్చు. వ్యాప్తిలో హెచ్చు నాశనశక్తిలో హెచ్చు. ప్రజారోగములకీ బహువిధప్రాబల్య మేల కలిగినదో రవంత పరిశీలింతము. పక్వములైన ఫలములను భుజించి పరిశుద్ధమైన యుదకమును మాత్రమే త్రావి మనుజుఁడు బహుసుఖముగాఁ బ్రాణయాత్ర జరుపుకొనఁగలఁడు కాని— మనుజుఁ డట్టిసామాన్యాహారముతో సంతుష్టినంది యుండఁగలఁడా? ఊహు భగవత్ప్రసాదితమైన బుద్ధిని బశువులకంటె నదనముగాఁ గలిగి యున్నవాఁడు కావున నాబుద్ధిని బోడిచి పొడిచి యుపయోగపఱచి యాహారమును సాధ్యమైనంతరుచిమంతముగా నుండునట్లుచేయుటకుఁ బానీయమును సాధ్యమైనంత యాస్వాదనయోగ్యముగ నుండునట్లుచేయుటకు మఱింతయాహారమును దినుటకు మఱింతపానీయమును ద్రావుటకుఁ బరిపూర్ణప్రయత్న మొనర్చును. చిత్రవిచిత్రములైనరుచులు చిత్రవిచిత్రవస్తుసమ్మేళనమున నుద్భవింపజేయుట కుత్సహించును. చిత్రవిచిత్రాతివిచిత్రమహావిచిత్రములైన రుచులు గలిగించుటకు బుద్ధి కెన్నికల్పనలు, నెంత పాత్రౌచిత్యము నెంతభావగాంభీర్యము నెంతయర్థవైశద్యము నెంత కవిత్వవైచిత్ర్యము వ్యాకరణశాస్త్రముకంటెఁ దర్కశాస్త్రముకంటె వేదాంతశాస్త్రముకంటె ముందుగాఁ గల్పింపఁబడిన దేశశాస్త్రము? పాకశాస్త్రము భగవద్గుణానుసంధానమునకయి యీయఁబడినబుద్ధి ప్రప్రథమమ్మునఁ, బ్రధానముగా నెందులకు వినియోగింపఁబడినది? పోగపు సొగసునకు; మసాలామజాకు—తిరుగబోఁత పరిమళమునకు. దేవునికయి యుపయోగపడవలసినబుద్ధి తిండికయి యుపయోగపడుచున్నది. ప్రార్థనచే నిండవలసిననోరు పన్నీటిమిఠాయిచే నిండుచున్నది. మహాదేవశంభూయని పలుకవలసిననోరు మసాలాపకోడీని మ్రింగుచున్నది. పార్థివలింగ పూజచేయవలసినచేయి పరమాన్నమును బావుకొనుచున్నది. వడలలోఁ గొత్తిమిరెము, కాకరకాయపులుసులో నీరుల్లిపాయ, పనసకాయకూరలో నావ, కోడిగ్రుడ్డట్టులో జీడిపప్పు, ఆవకాయలో నూఁబిండి, వానెన తెలకపిండిలో వెల్లుల్లి, కందబూరెలలో పలావుమసాలా,

ఇష్టే ఒకటా ? ఒకవిధమా ! వందలు వేలు, ఇన్ని చిత్రకల్పన లెందులకు? జుఱ్ఱున నోరూరుటకు—గఱ్ఱున గడుపునిండుటకు—బఱ్ఱునఁ ద్రేచుటకు. ఇన్ని పనికిమాలినవస్తువులు, నరముల కుద్రేకముగలిగించు నిన్ని గాటువస్తువులు, గిఱ్ఱునఁ గన్నీరుకలిగించు నిన్ని కారపువస్తువులు రోగములు కలిగించుట కాశ్చర్యమేమి? నీకుఁగలిగిన కన్నీ ళ్లానందముచే వచ్చినవికావనుట స్పష్టమేకదా ? ఏడ్పుచే వచ్చినవని యెఱిఁగియుండియు నింక నాయేడుపే యేడువనేల ? అస్వాభావమయిన యాగాటునకు. ఆబాధకు-ఆపొగరునకు-ఆకారమునకు - ఆకొఱ్ఱునకు-ఆగొట్రునకు నీబుద్ధివిశేషముచేత నీ వలవాటుపడియుంటివి. కావున నీ కాయేడ్పుకూడ నలవాటయినది. ఆచారమయినది. సహజముకూడ నైనది. సంతతాభ్యాసమువలన నేడుపేడుపుగాఁ దోఁచుటలేదు ఎన్ని బాధలయినఁ బడి యెన్ని యేడ్పులైననేడ్చి చేయవలసినదేమి? గొంతుముడివఱకుఁ దినవలయును. అంతకంటెనేమిపని? అదియైనతరువాతనే యన్నివన్నెలుచిన్నెలు కాంతాలోలుఁడు శక్త్యుత్సాహవర్ధకముగా గంజాయియుండనో నల్లమందునో వేసికొనినయెడల నాతని మీరేమనుచున్నారు? తుచ్ఛుఁడనుచున్నారు. చిత్తకార్తెకుక్క యనుచున్నారు. వాఁ డట్టివాఁడైనప్పు డధికరుచికొఱకు నత్యాహారముకొఱకు మెంతిపెరుగులో నావముద్ద కలిపిన వాఁడు మాత్ర మెవఁడు ? చేరులో రొయ్యపప్పు కలిపినవాఁడు మాత్ర మెవఁడు ? పకోడీలో గైమా కలిపినవాఁడు మాత్ర మెవఁడు ? వాఁడెవఁడో వీఁడు కూడ నట్టివాఁడే నారీసుఖాధికతకొఱకు (Nux Vomica) వేసికొన్నవాఁ డెట్టివాఁడో పెసరట్లుపలావులో వెల్లుల్లి మసాలా వేసికొన్నవాఁ డట్టివాఁడే వెల్లుల్లిపాయలు నూరి కాళ్లకు రాచికొనునెడలఁ గాళ్లు పెక్కులెక్కినవిగదా!. అవి కడుపులోనికి వెళ్లిన పిమ్మట నీమొగముచూచి నీతండ్రిబిళ్లకచ్చఁ జూచి నీతాతకుండలములు చూచి నీకు రోగము కలిగింపకుండ నూరకుండు ననుకొంటివా ? అశన విషయకకల్పనావైచిత్రిచే ననారోగ్యము జనులలో ముఖ్యముగా సిద్ధించుచున్నది. ఇది మనము బుద్ధిపూర్వకముగఁ దెచ్చుకొనుచున్నది కాని యది రావలసివచ్చినది కాదు.

తరువాత ఏదోవృత్తిచేసికొనకుండ మనుజునకు జీవయాత్ర గడ

చునా? క్షుద్రక్షేత్రములలో ననేకములు రోగములు జేయునవి కుట్టుపని వానికి కూను, గుఱ్ఱపుసవారునకు మూలశంక, మావటీనికి గుండెదడ, ఆలుచెక్కువానికి క్షయ, ఉత్కంఠగాయకున కుబ్బసము, వణిజునకండ వాతము, మోటారు నడుపువానికి నేత్రోష్ణత, వైద్యునకు సాంక్రామికవ్యాధి, కవిత్వము చెప్పువానికిఁ బిచ్చి, వాచిపనివాని కంతరకుసుమము, మఱియొకనికి మఱియొకటియుఁ దఱచుగా సిద్ధించును. ఇదిగాక ప్రభువులయెదుట చాలసేపు నిలువఁబడి వారి సెలవులేకుండఁ గదలుట కవకాశ మెంతమాత్రములేని భటులకు మూత్రపురీషవిసర్జనము లావశ్యకమయినప్పుడు లేకపోవుటవలన గర్భాశయరోగములు నాంత్రనాళరోగములు మూత్రకోశరోగములు కలుగును. రాజుగారి వదాన్యతచేఁ దనకు సిద్ధించిన వస్త్రములు కంకణములు కాంచనము నొక్క సంవత్సరములో నెగిరిపోవును గాని తనలోభమునఁ దనకుసిద్ధించిన కీళ్లవాతము మూత్రకృచ్ఛ్రము మందాగ్ని చచ్చినదాఁక నిలిచియుండును. నీవు రాజసేవలో సంపాదించుకొనినది బుజముమీఁద సాలువే కాదు, వీఁపుమీఁది రాచపుండు కూడను.

ఇఁక మఱియొకటి. మేజువాణీలమూలమున సర్కసులమూలమున నాటకములమూలమున సినీమాలమూలమునఁ బహుచుభార్యల మూలమున రాత్రులు చాలసేపు మేలుకొని యుండువారికి రోగముల కభ్యంతర మేమి? కన్ను మూయవలసినప్పుడు తెఱచినను రోగమే. తెఱువవలసినపుడు మూసినను రోగమే. కంటితోఁ బీకులాట మాత్రము గట్టిదనుటకు సందేహమా !

తరువాత సాంక్రామికవ్యాధులను గూర్చి రవంత చెప్పవలసియున్నది. ఇవి స్ఫోటకము విషూచి గ్రహణి ఆంత్రజ్వరము మొదలగునవి. చేతులు పరిశుభ్రముగాఁ గడుగుకొనకపోవుటవలన నెన్నిసాంక్రామికరోగములైన సంభవించుచున్నవి. చేతులిట్టియట్టినీటి పాత్రలోఁ బెట్టి కడుగుకొనిన లాభములేదు. ధారావంతమైన నీటిలోఁ గట్టిగఁ గడుగుకొనవలయును. గోళ్లసందు లెంతచ్ఛాందసముగఁ గడుగుకొనిన నంత మంచిది. మొదలుగోళ్లు లేశమైనఁ బెరుగనీకుండఁ దఱచుఁ దీసివేయించుకొనుచుండవలయును. సందేహాస్పదమైన వస్తువును గూడఁ

దాకఁగూడదు. కర్మముచాలక తాకుట తటస్థించునెడల నాచేతులతోఁ దలగాని పెదవులుగాని వస్త్రములుగాని తాకకుండ వెంటనే చేతులను గడుగుకొనవలయును. చేతులను గడగికొనుటకుఁ బిండికంటెఁ గుంకుడుకాయకంటెఁ బరిశుద్ధమైనమట్టి బహు ప్రశస్తము. దోషము నాకర్షించుకొని తనయం దిమిడ్చుకొనుటలో మట్టివంటిది మఱియొక్కటి లేదు. సమస్తదోషభోగ్యత్వగుణము మట్టిలో నున్నది. మనవారి మృత్తికాస్నానములు నిరర్థకములు కావు. నీటికాకిమున్కలు కావు. మట్టితో నిప్పు డనేకవ్యాధులు కుదుర్చుచున్నారు. ఈయంశమును గూర్చి యిప్పు డింతకంటె నక్కఱలేదు. సాంక్రామికవ్యాధులవలని జననాశనమునకంతకును మురికిచేతులే మూలకారణము. అపరిశుద్ధ హస్తములాచరించుచున్న జననాశన మగ్నిపర్వతములైనఁ జేయఁజాలవు. అవనీకంపములైనఁ జేయఁజాలవు. ఏదియో యొక్క సాంక్రామికరోగమునుగూర్చి రవంత యోజింతము. టైఫాయడ్ జ్వరమును (ఆంత్రజ్వరము) గూర్చి యోజింతము. ఈజ్వరము సాధారణముగా మృగశీర్షాప్రవేశమైన పిమ్మట నారంభమై అనఁగా జూనునెల చివర నారంభమై అక్టోబరు చివరవఱకుండును. అన్నివిధములైన యంటురోగముల కిదియే ప్రధానసమయము. ఈజ్వరముకూడ నన్నిటివలెనే యన్నపానాదుల మూలమున సర్వసాధారణముగా వ్యాపించును. పాలు పిదుకుటను గూర్చి బహు శ్రద్ధవహింపవలయును. పాలుపిదుకువాఁడు తనచేతులను మట్టియో పేడయో పెట్టి ధారోదకమున బహు జాగ్రత్తగాఁ గడుగుకొనినపిమ్మటఁ దాని పిదుకుట నారంభింపఁ గూడదు. ఈజ్వర సంబంధమైన సూక్ష్మక్రిమి పాలలో బహుశీఘ్రముగా వ్యాప్తిచెందును. పాలు పైకిఁ బరిశుభ్రముగా నున్నను దానిలో విషక్రిములు బహుళముగా నుండి ప్రాణముల కపాయకరములై యుండవచ్చును. ఒకగొప్ప వైద్యుఁడు పరిశోధించి యిట్లు వ్రాయుచున్నాఁడు. "బహుపరిశుభ్రమైన పాలలో 78 సూక్ష్మక్రిము లున్నవి. అవి యిరువదినాల్గు గంటలలో 60000 అయినవి. 48 గంటలలో నవి 10300000 అయినవి. ఏడు దినములలో 480000000 అయినవి. అంగళ్లలోని మిఠాయి మొదలగు పదార్థములుగాని వీథులవెంట నమ్మఁబడు పెసరపుణుకులు నావడలు

మొదలగు వస్తువులుగాని రుచిచూడఁగూడదు సరేకదా తాకనైనఁ గూడదు. అనేకులు భుజించుచున్న యన్నసత్రములలో నొకనిగుడ్డ కాని, యొకని చెంబుకాని యొకనిపీఁటకాని యెంతమాత్రమును స్పృశింపఁగూడదు. అచ్చటనున్న పుస్తకములుకాని కాగితములుకాని తాకఁ గూడదు. అద్దెమోటారుబండ్లుకాని ట్రామ్‌బండ్లుకాని స్పృశింప రాదు. గొప్పగొప్ప షాపులలోని మేడమెక్కవలసివచ్చినప్పుడు మెట్ల ప్రక్కనున్న కటకటాలు తగులకుండ వానిమీఁదఁ బ్రమాదవశమునఁ జేయిపడకుండ బట్టచెంగైన వానికిఁ దాఁకనీయకుండ నెక్కవలయును. ఇన్ని మాటలేల ? ఈచేయి ముట్టుకొని యాచేయి కడుగుకొనవలయును. ఆచేయి ముట్టుకొని యీచేయి కడుగుకొనవలయును. ఈవిషయములం దెంత భద్రముగఁ బ్రవర్తింతురో యంతక్షేమము. ఈశాసనము ఉల్లంఘించువాఁడు సంఘమునకెల్ల ద్రోహి. ఒక్కని యజాగ్రత్త మూలమున నొక్కపట్టణము నాశనము కావచ్చును. ఒకనియన్నములోఁ బాషాణము కలిపినవానికి ద్వీపాంతరశిక్షయో మరణశిక్షయో యగుచున్నది. పాషాణము పెట్టినవాని పాపమువలన నొక్కప్రాణమే పోవుచున్నది. కాని పరిశుద్ధినొందని చేతులు గలవాని పాపమువలనఁ బదివేల ప్రాణములైనఁ బోవుచున్నవి. ఇది యెంత మహాపాపమో యోజింపుడు. దీనికేమి శిక్షయున్నది? ఏమియు లేదు. ఇక్కడ లేనంత మాత్రమున నక్కడలేదని యెవరు చెప్పఁగలరు ? సందేహాస్పదమైన వస్తువేదియు స్పృశింపనే కూడదు. అనేక కుటుంబపోషణధురీణులగు మహారాజులు సొమ్మును స్పృశింపనే కూడదని చెప్పుదురు. ఇది యెంత దివ్యశాసనమో ! దీనిలో నెంతగంభీరార్థమున్నదో ! ఎంత ప్రకృతి శాస్త్రరహస్య మున్నదో! డబ్బుకంటె దేశసంచారి ప్రపంచమున గలదా ? స్ఫోటకపువాని తలక్రింద దిగదుడుపుగఁ బెట్టిన రూపాయ సోడె చెప్పు మాదిగవాని చేతిమీఁదుగా గేదెతామరగల కోమటివాని గల్లా పెట్టెలోఁ బడి యటనుండి పాదపూజాదక్షిణారూపముగాఁ బరమహంస గారిచేతఁ బడి యాతనియొద్దఁ గుష్ఠరోగమునకై మందుపుచ్చుకొను చున్న వేశ్య కుందరదన రొంటనుబడి యటనుండి యంతకంటె నేహ్యమైన మఱియొక్కచోటికిఁ బోయి యొక్క నిముసమైనఁ గాలు నిలువక

దిమ్మదిరుగు డబ్బు నూరేండ్లు నిరుపద్రవముగా బ్రదుకవలసిన యనేక సహస్రకుటుంబపోషకుఁడగు నవనీథవుని హస్తమునఁ బడవచ్చునా? సమస్తసాంక్రామిక రోగములను వృద్ధిచేయుటలోఁ బైసవంటి పనికి మాలిన పదార్థము ప్రపంచమున మఱియొక టేది? అట్టిడబ్బు నెవరికైన దాన మీయవలసివచ్చినప్పుడు ధారాపూర్వకముగ నేల యీయ వలయునో యిప్పుడు తెలిసినదా? నరునిపాపము లాతనిధనము నాశ్రయించియుండునని పెద్దలు చెప్పినమాట నిరర్థకమైనది కాదు గదా? ధారావంతమైన యుదకమునఁ జేతులు కడుగుకొనకుండ · నేపనియుఁ జేయఁగూడదని యిదివఱకుఁ జెప్పియుంటిని. మనకు సాధారణముగా వంటచేయు నౌకరు లెంతయపరిశుద్ధులో యెంత ముష్టికివారో యెంత యెడ్డెవారో యెంత దుర్గంధభూయిష్ఠులో చెప్పవలయునా? వంటయిండ్లు వడ్డనసాలలకుఁ గొంతచాటుగ నుండుటచే నౌకరుల నుంచుకొన్న భాగ్యవంతులు బ్రదుకుచున్నారు. కాని వాంతిభేదులతో వారము దినములలోఁ బరమపదింపవలసినదనుట కేమైన సందేహమా? దాఁకలో బడు చేపను ఱాతిపై నలుగఁదీసిన ట్లీవంటవాండ్రను మన్ను గొబ్బెర పీఁచుతోఁ బడఁదోమించిన పిదపఁగాని వారిని వంటశాలలలోనికిఁ బోనీయఁదగునా? గోళ్లలో మట్టియుంచుకొన్న Cook ను నోదా వరిలో వారముదినములు నానఁబెట్టినపిమ్మటఁ గాని ప్రొయ్యియొద్దకు రానీయఁగూడదే. ఇద్దఱుసాహేబులు చెఱియొకపళ్లెరములోని వంటకమును భుజించినపిమ్మట వారివంటవాండ్రాపళ్లెరములను వంటగదిలోనికిఁ దీసికొనిపోయిరి. ఆపళ్లెరములనుగడిగి వేఱొకపదార్థము వానిలో నుంప వలసియున్నది. "జల్దీజావ్" అని యింతలో ముసలిమానులు కేకవైచిరి. ఆపళ్లెరములను మంచితీర్థమునఁ గడిగి యార్చి వానిలో నూతనపదార్థములను బెట్టుటకు వ్యవధిచాలక తుబుక్కున నాపళ్లెరములలో నుమిసి గుడ్డతోఁ దుడిచి క్రొత్తవంటకముల వానిలో నుంచి తీసికొనిపోయిరి. ఆహాహా! ఎంత దారుణకృత్యమో! ఇంతకంటె మహాఘోరకృత్యములు మీవంటయింటిలో జరుగుచున్నవి. చెప్పఁదగదు సరికదా! స్మరింపనైనఁ దగదు. అట్టివారివలన నాంత్రజ్వరవ్యాధి వృద్ధియై వ్యాపించుననుట కేమైనసందేహమా? బాధ్యత ప్రేమలేని నౌకర్లచే వండించుకొనుట

కంటె స్వస్త్రీలచే వండించుకొనుట సర్వోత్తమము కాదా? వారైనను సుస్నాతలై యత్యంత జాగరూకతతోఁ జేతులను గడుగుకొని వంట చేయవలయును. పచనకాలమందా చేతులతో నేవస్తువును స్పృశించిననైన సరే మరలఁ జేతులను భద్రముగఁ గడిగికొనవలయును. పుణ్యస్త్రీలకుఁ దఱచు శిరస్స్నానమున కవకాశములేని హేతువున వితంతువులే పగలు వంటచేయుట యాచారమైనది. నౌకరులచేఁ గాక భార్యచేతనే తముల పాకులు చుట్టించుకొనవలయును. ఆమెయైనను వానిని జుట్టునప్పుడు వ్రేళ్లతోఁ దలను గోకికొనకుండునట్లు చెప్పవలెను. ఎంతభద్రముగఁ బ్రవర్తింతురో యంతమంచిది. ఎంతతఱచుగఁ జేతులు కడిగికొందురో యంతమంచిది. ప్రాణముతోఁ జేరినపని. బద్ధకము వలదు. అలక్ష్యము తగదు. అశ్రద్ధ పనికిరాదు.

ఆంత్రజ్వరమువచ్చి కుదిరినవా రయిదు మొదలుకొని దాదాపుగఁ బదివారములవఱకు తద్వ్యాధి నితరులకు వ్యాపింపజేయుటకుఁ జాలియుందురు. నూర్గురిలో నయిదుగు రీవ్యాధిని బ్రతికియున్నంత కాలముకూడ వ్యాపింపఁజేయుదురు. వారు చచ్చిన పిమ్మటఁగాని వారి వ్యాపనశక్తి పోదు. ఆజ్వర మంత భయంకరమైనది. దానివిష మంత ఘోరమైనది. దానిపట్టంత ప్రబలమైనది. నీటిలో ముంచనిచేతులు ప్రజల కొంప లెంత ముంచుచున్నవో యూహించుకొనునంతటి తెలివి యెవ్వరికో కాని లేదు. మనవైద్యులలోఁ గొందఱు రోగిచేయి చూచి తమచేతిని నేలపై టక్కు టక్కునఁ గొట్టుదురు. ఆమాత్రమునకే యాసూక్ష్మజీవులు క్రిందఁ బడిపోవునని వారినమ్మకము. మఱికొందఱు చేతులు గడిగికొందురు. చేతులు గడిగికొనుటయే శిష్టాచారము. రెండ వది రెండవపక్షము. చేతులుగడుగుకొనకుండఁ జేయిచూచునట్టియుఁ జేయిచూచి చేతులు గడిగికొననట్టియు వైద్యుఁడు ప్రత్యక్షయమదూత. కరము లిట్లు తఱచుగాఁ బరిశుద్ధిపఱచుకొను సదాచారము తల్లిదండ్రులు పిల్లలకుఁ జిన్నతనమునుండియే బోధింపవలయును. కొంతకష్టమైన యాచారమయ్యును బ్రాణసంరక్షణముతోఁ జేరినదగుటచే దానిని వారిచేఁ దప్పక యభ్యసింపఁజేయవలయును. అంత మహావ్యాధి కావసరము కలిగినప్పుడుకాని యొకరినొకరు ముట్టుకొనఁదగదు. మనలో నొకరి

నౌకరు చూచుకొనుట సిద్ధించినప్పుడు చేతులుజోడించుకొని యన్యోన్యన్య నమస్కార మాచరించుకొందురు. ఇట్టిసదాచారము మనలో నుండఁగాఁ బాశ్చాత్యులలోని కరచాలనమర్యాదను మనవారు పరిశీలనహీనులై యనుకరించుచున్నారు. పాశ్చాత్యులలోని యీకట్టుపాటు శాస్త్రీయ మెంతమాత్రమును గాదు. ఈకట్టుపాటెందులకు నిరాకరణీయమో మీకిప్పుడు తెలియకపోదు. స్వకీయసదాచారమును వదలుటలోఁ బర కీయదురాచారములను బైన పడవేసికొనుటలో మనవారియంత మహా శూరులు మఱెవ్వరు? ఎంతసేపు మనది గొడ్డుగేదె పై వానిది కామ ధేనువు. మనది చీకు, పై వానిది చేవ. మనది యంట్లకుండ, పై వానిది యపరంజికుండ. ఇట్టి దుర్బుద్ధిచేతనే కాదా మొదటినుండియు సరస విధిసమంజసమైన జాతీయత్వమును జంపుకొంటిమి. మనదేశమునకుఁ దగిన, మనజాతికిఁ దగిన, మనకాలమునకుఁ దగిన బట్టకట్టు మనవారు మనకేర్పాటుచేసియుండఁగాఁ, గ్రమ్ముదలకుఁ గ్రమ్ముదల గాలికిగాలి అవ సరకృత్యముల నిర్వహించుకొనుట కత్యంతమైనసులువు, నగ్నిభయము కలిగినవెంటనే యట్టె యొక్కయూపుతో నూడఁదీయుట కవకాశ మున్న బట్టకట్టు మనవారు మనకేర్పాటుచేసియుండఁగా John గారిని జూచి బొంతయరఁటికాయ పోలికగాఁ బంట్లముతో సిద్ధపడిన నిన్నే మనఁదగినదో తెలియకుండనున్నదే—సంవత్సరమున కయిదుమాస ములు 114 కు దాఁటి నూటికి దిగని మహోష్ణతచే మరగి మంగలములో మాడిపోవుచున్న నీకీబుజములమీఁదినుండి బిగించిన తోలుపటకా లతోనున్న ప్లానలుపంట్లు మెందులకో యను కాసంతయైన చింతఁ గలు గకపోవుట నీపూర్వులగు మహర్షుల మహాపాపముగాని మఱియొక టియా? ఇప్పుడిప్పు డేదో రవంత ప్రక్కగాలి తిరిగినదికదా కొయ్యలెత్తి చాపలంకారించి మొత్తాబిగించి కాపుదలకొఱకు డమాను చేత వద లుగాఁబట్టి ప్రవాహమున కెదురెక్కుటకుఁ బ్రయత్నింపఁగా—ఇదేమి కర్మమో! ఇదెంతమహాపాపమో! ఇదెంతప్రారబ్ధమో పడవ కెక్కడఁ జూచినఁ దూటులే—ఎక్కడఁ జూచిన బీఁటలే—బ్రాహ్మణాబ్రాహ్మణ వైరమను బెద్దసురంగము పడవమోర్జాలోఁ బడినప్పుడీజాతి మునిగి పోవలసినదే కాని. యింకఁ దేలుట కేమైన నాధారము కనబడుచున్నదా?

సాక్షిగారూ ! మీరీయంశమునుగూర్చి యనేకపర్యాయములు ప్రశ్నించి యున్నారు. ప్రాసంగికవశమున జెప్పితినిగాని మీకంటె నెక్కువసొగసుగా జెప్పగలనని చెప్పియుండలేదు, క్షమింపుడు.

ఇదిగాక—రోగముల కారోగ్య శాసనోల్లంఘనముకంటె వృత్తిభేదములకంటె, వ్యసనములకంటెను ప్రధానకారణమైనది మనస్సు. సంతతచింతయే సర్వరోగములకును గారణము. భర్తలకు భార్యలనుగూర్చి బెంగ, భార్యలకు భర్తలనుగూర్చి మఱింతబెంగ; తండ్రికి గొడుకుల బెంగ, కొడుకులకు దండ్రిబెంగ ; కొడుకులవిషయమై కోడండ్రబెంగ, కూతులనుగూర్చి యల్లురబెంగ ; చావకుండనున్న ముసలివారిని గూర్చినబెంగ, చచ్చినపడుచువాండ్రను గూర్చినబెంగ, ఉన్నదానితో సంతుష్టిలేనిబెంగ, లేనిదిరాలేదనిబెంగ, ఆస్తిదాచలేనిబెంగ, అప్పుతీర్పలేనిబెంగ, ఇంక నెందులకో బెంగ, మఱియింక నెందులకోబెంగ, ఎన్నియని చెప్పగలను. ఇన్నిబెంగలుగల నీమనస్సు నాల్గుమూరలంటుకొన్న పూరికొంపలాగును దెమలి మండను మండక, యాఱిపోను నాఱిపోక, రాజిరాజి కుమిలికుమిలి లోలోపలనే కాలికాలి యొక్కొక్కప్రక్కనుండి కూలికూలి యేడ్చుచుండగా నీకును బొర్ల్వశూల యాశ్చర్యమేమి ? పక్షవాత మాశ్చర్యమేమి ? జ్వర మాశ్చర్యమేమి? జలోదర మాశ్చర్యమేమి ? అక్షిరోగ మాశ్చర్యమేమి ? అండవాత మాశ్చర్యమేమి ? నీకు జ్వరమువచ్చుటచేత నీవు లంఘనములు చేయుచుండుట లేదు. నీవు లంఘనములుచేసిన హేతువుచే నీకు జ్వరమువచ్చుచున్నది. తెలిసినదా ? నీకు మందాగ్నిచే నిద్రపట్టకపోవుటలేదు నిద్రపట్టకపోవుట చేతనే మందాగ్నిరోగము సిద్ధించినది. తెలిసినదా ? హిక్కారోగముచేత నీవేడ్చుటలేదు. ఎప్పుడు లోలోన నేడ్చుటచేతనే నీకు హిక్కారోగము వచ్చినది తెలిసినదా ? మీరోగములు మీరు కుదుర్చుకొనవలసినదే కాని మీకు ధన్వంతరియైన మాట దక్కునట్లు మందీయలేడు. మీరోగములకు భగవద్గీత బ్రహ్మసూత్రములు పనికివచ్చును గాని బాహటము బసవరాజీయము పనికిరావు. మీరోగములు కుదర్పగలవారు వేదాంతులుగాని వైద్యులుగారు. అందుకొఱకు—పోయినదినములేవో పోయినవి. ఇప్పుడైన లెంపలువైచుకొని యుషఃకాలస్నాన మాచరించి

యుపనిషద్భాష్యము పఠింపుడు. అప్పుడుకాని మీరోగములన్నియు రూపుమాసిపోవు. జ్వరము వచ్చినప్పుడు సన్నిపాతభైరవికంటె సనత్సుజాతీయ మెక్కువ పనిచేయును. కాక చేసినప్పుడు గులాబీషర్బత్తుకంటె గజేంద్రమోక్షణగాథ తురాయకట్టు—డీ. లెండు. ఇఁక సందేహింపకుఁడు. తలపైనున్న బంగాళాపంపిణీలను భూమి మట్టముచేసి వేపకాయయంత పిలక యుంపుఁడు. చుట్టలపెట్టెల సిగరెట్లపెట్టెల మూలలఁ బాఱవైచి రుద్రాక్షమాలలు గోముఖములు మూలలనుండి పైకిఁదీయుఁడు. పనికిమాలిన కాఫీకై నోరుతెఱచుట మాని ప్రాణాయామమునకై ముక్కు మూసికొనుడు. ప్రాచీనాచారము లవలంబించి నిరోగదీర్ఘాయుస్సంపన్నులై యుండుఁడు. తథాస్తు.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# కాలాచార్యులయుపన్యాసము-బ్రాహ్మణత్వము

కాలాచార్యు లి ట్లుపన్యసించెను:—

"శ్రీమతే రామానుజాయ నమః ఆర్యులారా! ఉపన్యాసపీఠమున నే నీదినమున నిలువఁబడవలసివచ్చినది. అందువలన మీరు లేచిపోవలసివచ్చునేమో యని సందేహించుచున్నాను. సాక్షీ యిప్పుడిచ్చట నుండినయెడల వక్తృత్వము లేని నే నుపన్యాసమిచ్చుటకుఁ బ్రయత్నించుట తటస్థపడియుండదు. ఆయన మదరాసులో నున్నను జంఘాలశాస్త్రివలన నిచ్చటి సభావ్యాపార మెట్లో జరిగిపోవుచునే యున్నది. కాని జంఘాలశాస్త్రి రొంపభారముచేఁ గాళ్లు నొప్పులచే బాధపడుచుండుటచేత నాతఁ డీదినమున నుపన్యసించుటకు వీలుకలుగక పోయినది. ఉపన్యాసమునకుఁ గాళ్లునొప్పు లంతప్రతిబంధము కావనియే నావిశ్వాసము. కాని రొంపభారము కొంత ప్రతిబంధమై యుండవచ్చునని తోఁచుచున్నది. అది నస్యమువలనఁ గొంత నివారణ కావచ్చునని నాదృఢమైన నమ్మకము. తొలకరించినహేతువుచే నిప్పు

డంవఱకు దగ్గులు రొంపలు ప్రబలముగా నుండకతీఱదు. కప్పలకుఁ గూడ తొలకరి ప్రారంభమందు రొంప పట్టునో పట్టదో సిద్ధాంతముగాఁ జెప్పుటకు వీలులేదుకాని దగ్గు మాత్రము సిద్ధించుట సిద్ధాంతము. ఆదగ్గునే బెకబెక లని జంతుశాస్త్రజ్ఞులు కొందఱు పేర్కొనుచున్నారు. వానకా రారంభించుటతోడనే మనుజప్రపంచమునం దేమి, శాఖా ప్రపంచమునందేమి యితర జంతుప్రపంచమునం దేమి, నిష్ప్రాణ ప్రపంచమునం దేమి యిమిడియున్న యంతస్తత్త్వము పైకి రాకతప్పదు. తీఁగ మొగ్గతొడుగుట, చెట్టు చిగిరించుట, ఊయి మదము స్రవింపఁ జేయుట, నేలపై గడ్డి మొలచుట, యతిమూత్రరోగికి రాచపుండు పుట్టుట, కప్ప బెకబెకలాడుట, జంఘాలశాస్త్రి దగ్గుట వస్తుతత్త్వమున నన్నియు నొక్కటే. ఇదికాక సర్వరసరాజమైన శృంగారరసమునకుఁ దొలకరియారంభమందే యుద్రేకమని నాయభిప్రాయము. బ్రహ్మచారి యభిప్రాయమును మీరు పరిగణింపకపోవచ్చును. అందుకొఱకే కాళిదాసుఁడు “కశ్చిత్కాంతా విరహ గురుణేత్యాది” శ్లోకము చెప్పిన వెంటనే “ఆషాఢస్య ప్రథమదివసే మేఘ మాశ్లిష్టసానుం వప్రక్రీడా పరిణతగజ ప్రేక్షణీయం దదర్శ” యని మేఘసందేశమునందుఁ జెప్పుటకుఁ గారణమైనది. “అయ్యా! భగవద్విషయకగ్రంథములు చదువుకొన్న మీకీప్రకృతిగొడవ లెందుకయ్యా! ప్రపంచజ్ఞాన మున్నవానికిఁ బ్రకృతి పరీక్షకాని ప్రపంచాతీతజ్ఞానమున్న మీ కెందులకయ్యా! కావున మీకుఁదోచినట్లేదో పూర్వాచార్యులఁగూర్చియో పూర్వాచారములఁ గూర్చియో భక్తినిగూర్చియో ప్రపత్తినిగూర్చియో చెప్పఁగోరుచున్నాము. బాగుగానుండిన నుందుము. లేకున్న మీబాధ మాకులేదు. మాబాధ మీకులే” దని యొక్కఁడు సభవారిపక్షమునఁ బలికెను.

కాలాచార్యులు “అద్దే! అందుల కభ్యంతరమేమి”? శ్రీమతే రామానుజాయ—ఏదీ రవంత పాడుము—శ్రీమతే—చాలదు. మఱి కొంచెము. శ్రీమతే రామానుజాయ నమః. మీయిష్టము ననుసరించి భక్తినిగూర్చి యొకటి రెండు శ్లోకములు చదివి యర్థము చెప్పెదను. నే నుపన్యాసమీయ శక్తిగలవాఁడును గాను. భక్తి యెనిమిదివిధములని చెప్పఁబడినది.

మద్భక్తజనవాత్సల్యం పూజాయాం చానుమోదనం
స్వయ మభ్యర్చనం చైవ మదర్థే దంభవర్జనం
మత్కథాశ్రవణే భక్తిః సర్వనేత్రాంగవిక్రియా
మమానుస్మరణం నిత్యం యచ్చ మాం నోపజీవతి
భక్తి రష్టవిధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే
స విప్రేంద్రో మునిశ్శ్రీమాన్ స యతిస్స చ పండితః
తస్మై దేయం తతో గ్రాహ్యం సచ పూజ్యో యథాహ్యహం.

భగవద్వాక్య మిట్లున్నది. దీనిలో వర్ణింపఁబడిన యెనిమిదివిధము లైన భక్తి యెవ్వనికుండునో వాఁడు మ్లేచ్ఛుఁడైనను వాఁడే బ్రాహ్మణోత్తముఁడు. బ్రాహ్మణమాతాపితలకుఁ బుట్టుటగాని యుపనయన సంస్కార మొందుటఁగాని యూర్ధ్వతిర్యక్పుండ్రాదిధారణ మొనర్చుట కాని వేదాధ్యయన మొనర్చుటకాని యజనయాజనము లొనర్చుట కాని బ్రాహ్మణత్వమునకు నిశ్చయాభిజ్ఞానములు కావు. నిశ్చయమైన సంజ్ఞ యొక్కటియే యున్నది. అదియే భక్తి. భక్తివలననే బ్రాహ్మణత్వమును నిశ్చయపఱుపవలసియున్నది. స విప్రేంద్రః అయిపోయినది. ఇఁక స మునిః వాఁడే ముని, మౌనవ్రతమును ధరించి వ్యాఘ్రాజినమునఁ గూరుచుండికాని పంచాగ్నిమధ్యమునఁ గూరుచుండికాని తలక్రిందుగ వ్రేలాడికాని జపమొనర్చి కాయక్లేశము లొంది కందమూలాదు లాహరించి యారణ్యవాసియై యుండుటయే మునిత్వమునకు నిశ్చయ లాంఛనముకాదు. నిజమైనలక్షణ మొక్కటియే యున్నది. అదియే భక్తి. అట్టి లక్షణముకలవాఁడు మహమ్మదీయుఁడైనను మౌనియే. మాలవాఁడైనను మౌనియే. మఱే యేజాతివాఁడైనను మౌనియే. స విప్రేంద్రో శ్రీమాన్ — ఆతఁడే శ్రీమంతుఁడు— భండారములలోఁ బరిమితిలేని ధనమున్నవాఁడు—పతివ్రతయైన భార్యను గలవాఁడు, పితృభక్తియుక్తులగు బిడ్డలుగలవాఁడు, బహుదాసదాసీజనసంవృతుఁడైనవాఁడు యథార్థముగ శ్రీమంతుఁ డని చెప్పవీలులేదు. భక్తియున్న వాఁడే శ్రీమంతుఁడు. స యతిః. వాఁడే యతి—యజ్ఞోపవీతత్యాగ మొనర్చి, శిరోముండన మొనర్చుకొని, కాషాయదండధారియై ప్రణవ జప మొనర్చినవాఁడే యతి కాఁడు. (ఇచ్చట ద్వైతాద్వైతయతుల

సంగతియే చాలఁ జెప్పి తమయతులమాట చెప్పలే దెందువలననో యనుకేకలు; భక్తిగలవాఁడే యతి. స చ పండితః వాఁడే పండితుఁడు—తర్కవ్యాకరణాది శాస్త్రజ్ఞానముకాని నాటకాలంకారజ్ఞానము కాని వేదార్థజ్ఞానముకాని పండితుని జేయలేవు. భక్తియున్నవానికే పండితనామమున కర్హతయున్నది. అట్టివాఁ డేజాతివాఁడైనను వాఁడే బ్రాహ్మణుఁడు. వాఁడే ముని. వాఁడే మోక్షలక్ష్మీయుక్తుఁడు. వాఁడే యతి. వాఁడే పండితుఁ డని తెలియఁదగినది. ఇదిగాక,

"న శూద్రా భగవద్భక్తాః, విప్రాః భాగవతాః స్మృతాః,
సర్వవర్ణేషు తే శూద్రాః, యేహ్యభక్తా జనార్దనే."

అని సాయించిన హేతువుచేత నరులలో బ్రాహ్మణాబ్రాహ్మణ భేదము లేనే లేదు. భక్తిహీనుఁ డైనబ్రాహ్మణుఁ డబ్రాహ్మణుఁడు. భక్తియుక్తుఁడైన యబ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడు. ప్రజలలో నున్న భేదము భక్తాభక్తభేదముకాని బ్రాహ్మణాబ్రాహ్మణభేదము కాదు. కాదని స్పష్టముగాఁ దెలియఁదగినది. శాంతిలేక దాంతిలేక తపస్సు లేక వైరాగ్యములేక సదాచారములేక స్వార్థపరిత్యాగములేక దైవభక్తిలేక నేను బ్రాహ్మణుఁడ నని విఱ్ఱవీఁగు జన్మబ్రాహ్మణుఁడే యధముఁ డనిపించుకొనునప్పుడు కామక్రోధలోభమదమత్సరయుక్తుఁడై సర్వవేద కర్మదూరుఁడై స్వశ్రేయోభిలాషియై బ్రాహ్మణనిందాపరుఁడై ప్రపంచ సౌఖ్యవాంఛా సమన్వితుఁడై దైవభక్తిరహితుఁడై నేను బ్రాహ్మణాధికుఁడ నని సంతతము గర్వపడుచున్న జన్మబ్రాహ్మణేతరుఁడు మాత్ర మధముఁ డనిపించుకొనఁడా ? ఇద్దఱుకూడ సమానముగ నధములు. ఇద్దఱుకూడ నొక్కవర్ణమువారు. ఒక్కజాతివారు. ఒక్కయధికారమువారు. ఒక్కగతికే పోవలసినవారు. వీరిని వారు దూషింపఁదగదు. వారిని వీరు దూషింపఁదగదు. ఇదిగాక—శ్లో. శ్వపచోఽపిమహీపాల, విష్ణుభక్తోద్విజాధికః, విష్ణుభక్తివిహీనస్తు, యతిశ్చ శ్వపచాధమః. అని పెద్దలు సాయించినారు. "భగవద్భక్తియుక్తుఁడైనను శ్వపచుఁడైనను ద్విజునికంటె నధికుఁడు—భగవద్భక్తిశూన్యుఁడగు యతియైనను శ్వపచునికంటె నధముఁడు" అని విస్పష్టముగాఁ జెప్పఁబడినప్పు డిఁక బ్రాహ్మణుఁ డెవఁడు ? అబ్రాహ్మణుఁ డెవఁడు ? బ్రాహ్మణు నబ్రాహ్మ

ణుఁడు తిట్టుట యెందువలన? అబ్రాహ్మణుని బ్రాహ్మణుఁడు తిట్టుట యెందువలన? ప్రజ్ఞాహీనతవలన — పరమార్థజ్ఞానశూన్యతవలన— ప్రబలగర్వాతిరేకమువలన—అందువలన భక్తియే ప్రధానముకాని వర్ణలింగజాత్యాదులు ప్రధానములుకావు. ఆభక్తి యెన్నివిధములు? ఎనిమిదివిధములు. మొదటిది —మద్భక్తజనవాత్సల్యం; అందఱము దేవునికుటుంబములోనివారముకదా! సోదరులముకదా! ఒకరినొకరు సోదరులవలెఁ బ్రేమించుకొనుచున్నామా? నాయూర్ధ్వపుండ్రములు నీకుఁ జెమ్మకాయలు—నీవిభూతిరేఖలు నాకుఁ బెండెకట్లు. వేపారుల నామములు మనకిద్దఱకు బెండకాయబొట్లు. వాఁడు నీటికాసువాఁడు. వీఁడు నియోగిప్రభుఁడు. వాఁడు వెలనాటివెఱ్ఱివాఁడు. వీఁడు వేగినాటి సన్యాసి. వాఁడు తెలినాఁటి తెగనీల్గుబోతు. వీఁడారామద్రావిడిహంశవారి వాఁడు సపాదుఁడు—వీఁడు నిష్పాదుఁడు. వీఁడరవ—వాఁడాంధ్రుఁడు. వీఁడు బ్రాహ్మణుఁడు—వాఁ డబ్రాహ్మణుఁడు. ఇటులెన్ని చెప్పవచ్చును? ఈరీతిగాఁ గొంతకాలమునుండి యొకరినొకరు గాఢముగా దూషించుకొనుచున్నారు. జ్ఞానహీనములగు నితరజంతువులెట్లు తమలోఁదాము పోరాడినను గఱచుకొనినను నవి క్షంతవ్యములుకాని జ్ఞానయుక్తులగు మన మిట్లొకరినొకరు తిట్టుకొని తండ్రులను దాతలను గూడ నోటికిరాని దుర్భాషలాడుకొని పూర్వాచార్యులవారినిగూడ బుంఖానుపుంఖముగఁ దిట్టుచు వీరిపై వారు వ్రాసికొనుచు వారిపై వీరు వ్రాసికొనుచు వీరు వారి నడచివైవఁ బ్రయత్నించుచు వారు వీరి నడచివైవఁ బ్రయత్నించుచు వీరావేశములఁ దెయితక్కలాడుచుండు నెడల మన కేమి క్షమాపణయున్నది?

ఇఁక రెండవది:—పూజాయాం చానుమోదనమ్. దీనినిగూర్చి చెప్పనక్కఱలేదు. మూఁడవది స్వయమభ్యర్చనం చైవ—దీనినిగూర్చి నాల్గుమాటలు చెప్పవలసియున్నది. రవంత జరుగుబాటున్న కుటుంబములలో దేవతార్చనపు బ్రాహ్మణుఁ డొకఁ డుండక తప్పదు. మనవారు కూలిపెట్టి దైవపూజ చేయించుచున్నారు. మనము కూలిపెట్టి భోజనము చేయించుటలేదు. నిద్రచేయించుటలేదు. కాలకృత్యములు నిర్వహింపించుటలేదు, తుదకుఁ గూలిపెట్టి చుట్టయైనఁ గాల్పించుటలేదు.

పాడుమైనఁ దీర్పించుటలేదు. ఇవియన్నియు మనము స్వయముగఁ జేసి కొనుచున్నాము. స్వయముగఁ జేసికొనఁదగిన యావశ్యకకృత్యము కాక పోవుటచేతనే కదా దైవపూజ కూలిపెట్టి చేయింపవలసియున్నది. ఎట్లు తగులఁబెట్టినను బాధలేని పనికిమాలిన తంతుకావుననే యట్లుచేయు చున్నాము. మనము మంచముపైఁబడి చేతులు జోడించుటకు స్వాధీన ములు కాకపోయినప్పుడు గోవిందా మహాదేవా యనుటకు నోరైనస్వాధీ నము కానప్పుడు సంతతదుస్సహబాధచేత మనస్సునకుఁ గానంత నిలుకడయైన లేనప్పుడు కూలిపెట్టికాని వెట్టికిఁగాని దైవపూజ చేయింప వచ్చునేమో కాని, బజారునకుఁ బోయి భార్యకుఁ బకోడీలు, బనా రసుకాజాలు తీసికొనివచ్చుట కోపికయుండఁగాఁ గరణముగారిని యాచించి కల్లుకుండు తెచ్చి' పాడుముచేయుట కోపికయుండఁగా నుంచు కొన్న వేశ్యయింటికిఁ బైవాఁ డెవఁడైన వచ్చునేమో యని ప్రచ్ఛన్న ముగ వీధిమొగను గాపుంచి దాని పెరటిగుమ్మమునొద్ద ముసుఁగు వైచికొని తెల్లవాఱినదాఁక గనిపెట్టుకొనియుండుటకు గాత్రశక్తి యుండఁగా రవంతసేపు దేవతారాధన వేదికపైఁ గూరుచుండి పుష్ప మొక్కటి పుండరీకాక్షునిపై వేయుటకే చేతు లక్కఱకు రాక పోయెనా ? పనికిమాలినకూత లెన్నియైన గూయుటకుఁ దెఱపియున్నది. కాని నారాయణా ! పరమేశ్వరా ! యనుటకు నాలుకయే లేకపోయి నదా ? ఇఁక దీనినిగూర్చి చాలును. 'మదర్థే దంభవర్జనమ్' అని మఱి యొకటి. తాను దైవపూజచేయుచున్నట్లు నలుగుఱకుఁ దెలియ వలయును. గ్రామస్థులందఱు వచ్చి తనయంత భక్తుఁడు లేఁడని కొని యాడవలయును. వీరవరపు వెంకటేశ్వరునకు దాను వింజామరము లిచ్చిన ట్లాంధ్రపత్రికలోఁ బెద్దయక్షరములతో వేయింపవలయును. తన కేదైన రోగమువచ్చినప్పు డెవ్వఁ డేసాధనముచెప్పునో యని నలు గుఱతోఁ జెప్పుకొనవచ్చును. రోగ మెంతయైన రట్టుచేసికొన వచ్చును. అంతేకాని తాను దేవీనవరాత్రములు చేసినట్లు తెలుఁగుపత్రి కలలోఁ బ్రకటించుకొనుట యెందులకు ? తాను బెంచుచున్న కుక్క పిల్ల తప్పిపోయినయెడల డప్పువేయించి చాటింపవచ్చును. పత్రికలలోఁ బ్రకటింపవచ్చును గాని గోపాలస్వామికిఁ దానుజేయఁబోవు దీపారా

ధనమునుగూర్చి బ్యాండుమేళములతోఁ గరపత్రములు పంచిపెట్టించుట యెందులకు? ఇదేమి? నాటకమా—సర్కసా — అడవిమృగమును బ్రదర్శించుటా? క్రొత్తప్లీడరు వృత్తిప్రారంభమా? తాను భక్తుఁడని భగవంతుని మనసులో నుండవలయునా? మునసబుకరణముల మనసులో నుండవలయునా? భగవంతునికున్నప్పు డితరులకు లేని నష్ట మేమి? ఇతరులకున్నను భగవంతునికి లేనప్పుడు లాభమేమి? "శ్లో. త్వయి ప్రసన్నే మమకిం గుణేన త్వయ్యప్రసన్నే మమకిం గుణేన, రక్తే విరక్తే చ వరే వధూనామ్ నిరర్థకః కుంకుమపత్రభంగః" అనునట్లు సంతుష్టినొందవలసిన లోకనాథుఁడు సంతుష్టినొందనప్పుడు నరులెందఱు సంతోషించిననేమి? తన్నుఁ దరింపఁజేయువాఁడు మహాదేవుఁడు కాని మనుష్యుఁడు కాఁడే! రేపు నీవు చచ్చి దండధరుని దర్బారులో నిలువఁబెట్టఁబడినప్పుడు బాణాసంచాకట్టిన భద్రయ్యకాని, మేళ మొప్పుకొనిన మంగలి వెంకస్వామికాని, యూరేగింపురాత్రి గజ్జెకట్టిన యిక్కిసానికాని, నీవు దైవభక్తుఁడవని సాక్ష్యమిచ్చెదరా? ఈదంభము మహాదోషము—భక్తిలేనివాఁడు లేనట్లే ప్రవర్తించినయెడలఁ గొంత మంచిదికాని యున్నట్లు డాబుచేసినయెడల భక్తిలేనందు కొక శిక్ష నటనమున కొక్కశిక్షయు సిద్ధింపవా? ఇఁకఁ దరువాత—మత్కథా శ్రవణే భక్తిః—ప్రాతకుర్చీలు వేలముపాడుచున్నారని తెలియఁగఁ బరుగెత్తువాఁడే కాని భాగవతపురాణము వినుటకు గడపదాఁటి యీవలికి వచ్చినవాఁ డెవఁడున్నాఁడు! పంచనాథయ్యరు జావళీకిఁ దలయూఁపినవాఁడే కాని తిరుప్పావులోని పాశురమునకు శిరఃకంపన మొనర్చినవాఁ డెవఁడు—తరువాత స్వరనేత్రాంగవిక్రియా—పరమ దయాపరిపూర్ణుని గుణానుసంధానమున స్వరము గద్గదిగ నొందవల యును. నేత్రము లానందబాష్పపూర్ణములై యుండవలయును. దేహము రోమాంచాది లక్షణ సమన్వితమై యుండవలయును. కూఁతు రత్తవారింటికిఁ బోవునప్పుడు గొంతుకలోఁ గెక్కు కెక్కు మనువాఁడే కాని గోపాలస్వామివాహనారూఢుఁడై యింటిముందుఁ బోవునప్పుడు కాసంతయైనఁ గరగినవాఁ డెవఁడు? దొంగలు వచ్చి యట్లకట్టి దొంగిలించుకొని పోయినారని స్వప్నమురాగ గొంతుగద్గదతతో

గేకలు వేసినవాఁడే కాని, గోపికలు తరించుటకుఁ గోపాలుఁడు వారి వస్త్రము లపహరించినాఁడనఁగ గద్గద గలిగినంత వెఱ్ఱివాఁ డెక్కడ నున్నాఁడు? వదినెగారికి మనోవృత్తి నీయనక్కఱలేదని కోర్టువారిచ్చిన యొగఁ బెట్టు తీర్పును దెచ్చినప్పుడరు మొగముచూచి యానందబాష్ప ములు విడిచినవాఁడేకాని, శ్లో. న ధర్మనిష్ఠోఽస్మి నచాత్మవేదీ? న భక్తి మాఁ త్వచ్చరణారవిందే, అకించనోనన్యగతిశ్శరణ్య, స్త్వత్పాద మూలం శరణం ప్రపద్యే" అనుశ్లోకమును జదువుచుఁ బార్థసారథిని దర్శనముచేసినప్పు డానందబాష్పములను విడిచినవాఁ డెవ్వఁడు? "అంగ విక్రియా" యనఁగ రోమహర్షాదులు—వెనుకఁబడిన కష్టములు తలఁచుకొన్నప్పు డొడలు జల్లుమనుచున్నది కాని కష్టములనుండి కాపాడిన కావేరిరంగని దలఁచుకొనినప్పుడు కాదుగదా. చూచినప్పు డైన నొడలు పులకరించుచున్నదా? లేదు. భక్తులారా లేదు. తరు వాత—"మమానుస్మరణం నిత్యమ్" పూజావేళమాత్రము రవంత సేపు దైవచింత చేయుచు నితరవేళలందు దైవమే లేనట్లు ప్రవర్తించు వా రనేకులున్నారు. ద్వాదశోర్ధ్వపుండ్రధారణ మొనర్చి—ధనుర్మాస వ్రతదీక్ష నాచరించి దైవనివేదిత ప్రసాద మారగించి—శిరోవేష్టమును ధరించి—సివిల్ కోర్టునకుఁ బోయి యబద్ధసాక్ష్యములు ప్రసాదించిన యాచార్యపురుషు లెందఱు? పణ్యస్త్రీలయింటికి వేంచేసి పవళిం చిన భాగవతోత్తము లెందఱు? ఇప్పుడు చెప్పిన యెనిమిది విధములైన భక్తి కలవాఁ డేజాతివాఁడైనను వాఁడే పూజ్యుఁడు—వాఁడే బ్రాహ్మ ణుఁడు—వాఁడే మౌని—వాఁడే శ్రీమంతుఁడు—వాఁడే యతి—వాఁడే పండితుఁడు—ఇది నిశ్చయము. అందువలన బ్రాహ్మణు లార్యా వర్తముననే కాదు. ఆఫ్రికాదేశమున నుండవచ్చును. అమెరికాదేశమున నుండవచ్చును. ఆస్ట్రేలియాదేశమున నుండవచ్చును. భగవద్భక్తి యెచ్చటనున్నదో యచ్చట బ్రాహ్మణత్వమున్నది. అది యెచ్చటలేదో యచ్చట మహీసురత్వములేదు. సరేకదా మనుజత్వమైన లేదని చెప్ప వచ్చును. భక్తుఁడు శ్వపచుఁడైన సరియే వాఁడు నావలెనే పూజార్హుఁ డని భగవంతుఁడు పలికినాఁడు.

తస్మై దేయం తతో గ్రాహ్యం—అని సాయింపఁబడినది. అనఁగా

నట్టివాని కీయవచ్చును. అట్టివానినుండి గ్రహింపవచ్చును. ఏది ? చిత్రాన్నము కాదు— చిట్టిగారెలు కావు—కోడిపలావు కాదు—కుందేటి కుర్మా కాదు— కొక్కగోడు గూరగాయ కాదు — చక్రధరభక్తుఁడు సర్వాధికారయుక్తుఁడు. కాన నతనికిచ్చునవి మహామంత్రములు. ఆతని యొద్దనుండి గ్రహించునవి మహామంత్రములు. నిస్సంశయముగా నట్టి వాని కుపదేశింపవచ్చును. అతనినుండి గ్రహింపవచ్చును. అట్లు జరిగిన స్లెచ్ఛుటనైన నిదర్శనమున్నదా యని యందురేమో ? పంచమవేదమైన భారతమునుండి యొకకథ మనవిచేయుదును.

శ్లో. కశ్చిద్ద్విజాతిప్రవరో వేదాధ్యాయీ తపోధనః
తపస్వీ ధర్మశీలశ్చ కౌశికో నామ భారత.

అట్టికౌశికుఁ డను బ్రాహ్మణుఁ డొక్కవృక్షముక్రిందఁ బద్ధాసనాసీనుఁడై తపమొనర్చుకొనుచుండఁగా నొకకొంగ యాతనితలపై రెట్టవైచెను. అందుపై బ్రాహ్మణుఁడు కోపోద్రిక్తుఁడై యాపక్షివంకఁ జూడఁగ నది భస్మమైపోయెను. అట్లు భస్మమైపోవుటకుఁ బ్రకృతిశాస్త్ర సంబంధమగు కారణమేదో జంఘాలశాస్త్రి యిదివఱకే చెప్పియున్నాఁడు. పక్షి బ్రాహ్మణకోపాగ్ని చేతనే భస్మమైనది. బ్రాహ్మణుఁ డంతఁ దిరుగ స్నానమొనర్చి పరిశుద్ధుఁడై మాధ్యాహ్నికకృత్యములు నిర్వహించుకొని భిక్షకై బయలువెడలెను. ఒకబ్రాహ్మణుని యింటియొద్దకుఁ బోయి నిలువఁబడెను. ఆయింటి బ్రాహ్మణి యాకౌశికునిఁ గాంచి స్వామీ! ప్రసాదము తెచ్చుచున్నానని మనవిచేసికొని లోనికిఁ బోయెను. ఇంతలో నామెభర్త యింటికివచ్చెను. వచ్చినభర్తనుగాంచి వినయమున నాతనికి నమస్కరించి స్నానమునకు నీరిచ్చి స్నానానంతరమున సంధ్యావందనమునకుఁ గావలసిన సామగ్రినంతయు నందిచ్చి యటుపైన దేవతార్చనవేదికపై ముగ్గులుంచి గోఘృతదీపము లమర్చి నీరాజనమునకుఁ గర్పూరాదిసామగ్రిని సిద్ధపఱచి యాతఁడు దేవతారాధన మొనర్చినపిమ్మట నాతనికి భోజనమిడి భోజనానంతరమునఁ గరపాద ప్రక్షాళనమునకు నీరిచ్చి తములపాకులు చుట్టియిచ్చి యాతఁడు నిద్రించిన పిమ్మటఁ గొంత ప్రసాదము నొక్కపళ్ళెరమునందుంచి గుమ్మములోనికి వచ్చి "అయ్యా ! క్షమింపవలయును. ఆలస్యమైనది. నాభర్తగా రింతలో

దయచేసినకారణమున ననివార్యమగు నీయాలస్యము జరిగినది. మీకుఁ గలిగించిన శ్రమమునకు మన్నింపవలయును." అని వినమ్రయై ప్రార్థించెను. అంత నాతఁ డుగ్రుఁడై "పతియే దైవం కండీర్ అతిథిపూజ వేండావా" (పతియే దైవముకాఁబోలునేమి? అతిథిపూజ యక్కఱలేదేమి?) అని యుద్రిక్తుఁడై గద్దించెను. ఆమాట లామహాపతివ్రత విని "నాయనా! కోపముతోఁ బలికినను మీరు కొంత సత్యమే పలికినారు. పతియే దైవము. అంతవఱకు నిశ్చయము.

'శ్లో. పతిర్హి దైవతం నార్యాః పతిర్బంధుః పతిర్గతిః, ప్రాణైరపి ప్రియం తస్మాత్ భర్తుః కార్యవిశేషతః' అని తమవంటిపెద్దలు చెప్పిన మాటనే వేదవాక్యముగా నెంచి స్త్రీలమైన మే మాచరించుకొనుచున్నాము. నాయనా! అంతతీవ్రముగఁ జూచెద వెందులకు? నీక్రూర వీక్షణమున భస్మమగుటకు నేనేమి గ్రుడ్డికొక్కెఱ ననుకొంటివా?" యని యామె పలికెను. ఆమెమాటలు విని గడగడ వడఁకి "అమ్మా! నేను బాపాత్ముఁడను. నీవు బహుపుణ్యశీలవు. నీతపస్సామర్థ్యమున నీవు కాలత్రయవేదినివలె నున్నావు. నాకేమైనఁ దారకమార్గమును బోధింపు" మని యామె నాబ్రాహ్మణుఁడు ప్రార్థించెను. "నాయనా! వినుము. శ్లో. క్రోధశ్శత్రుశ్శరీరస్థో మనుష్యాణాం ద్విజోత్తమ, యః క్రోధమోహౌ త్యజతి తం దేవా బ్రాహ్మణం విదుః" అని యామె కొంచెము కఠినముగాఁ బలికి యామాత్రమునకే యాతఁడు డిబ్బందిపడునేమోయని యెంచి శ్లో. భవానపిచ ధర్మజ్ఞ స్స్వాధ్యాయనిరతశ్శుచిః, నతు తత్త్వేన భగవన్ ధర్మాన్ వేత్తీతి మే మతిః" అని కొంత మృదులముగాఁ బలికెను. "అందుకొఱకే నన్నుఁ దరింపఁజేయుసాధనమును బోధింపుమని వేడుకొనుచున్నాను." అని తిరుగ నాతఁ డాపతివ్రతను బ్రార్థించెను. "నావలన నేమగును? ధర్మవ్యాధుఁడను నొకమహాత్ముడున్నాఁడు. శ్లో. మాతాపితృభ్యాం శుశ్రూషు స్సత్యవాదీ జితేంద్రియః, మిథిలాయాం వసన్ వ్యాధః........తత్ర గచ్ఛస్వ భద్రంతే యథాకామం ద్విజోత్తమ, వ్యాధః పరమధర్మాత్మా సతే చ్ఛేద్యతి సంశయాన్" అని యామె పలికెను. ఆమెకు నమస్కరించి యాతఁడు పోవుచుండఁగా—"అయ్యా! మఱియొక్కమాట—నేను బ్రాహ్మణుఁ

డనుగదా! ఆచారవంతుఁడనుగదా! అధికుఁడనుగదా యను గర్వమును బూర్తిగాఁ జంపుకొని సంతత మాతాపితృసేవాసంసక్తమానసుఁడగు నాతని కేమాత్రమైన తొందరయుఁ గలుగనీయక, యాతనిగుమ్మములోఁ బడియుండి, యాతనితో నీవు ముందుగా మాటలాడక, యాతనిని బిలువనైనఁ బిలువక, యాతఁడు నిన్నవలోకించి మాటలాడు నప్పుడే నీవు మాటలాడి నీసంగతి యాతనికి నివేదించుకొని యాతని సమయమును గనిపెట్టి తత్త్వజ్ఞానము నొందుము" అని యాబ్రాహ్మణుఁ డెట్లయినఁ దరింపవలయునను వాంఛచే నాతనియందలి కరుణచేఁ దిరుగ నామె పలికెను. "అటులే యని" యామెయొద్ద సెలవుతీసికొని ధర్మవ్యాధునియొద్దకుఁ బోయి యాతని యథానిర్దిష్టముగా సేవించి, "శ్లో. పంచైతాని పవిత్రాణి శిష్టాచారేషు నిత్యదా, ఏతన్మహామతే వ్యాధ ప్రబ్రవీహి యథాతథా" యని ప్రార్థింపఁగ, శ్లో. యజ్ఞం దానం తపో వేదః సత్యంచ ద్విజసత్తమ, పంచైతాని పవిత్రాణి శిష్టాచారేషు సర్వదా" యని ధర్మవ్యాధులవా రాబ్రాహ్మణునకు సాయించిరి. ఇక్కడఁ గౌశికుఁడు నేర్చికొన్న గ్రంథమంతయుఁ బోగొట్టుకొన్న సందేహము లన్నియు సంపాదించిన తత్త్వమార్గమంతయుఁ జెప్పవలయుననియే యున్నది. కాని చెప్పుట కవకాశము లేదు. ధర్మవ్యాధక్వాసిలిలె తువండు ధర్మసందేహంగళై శమిపిత్తుకొండార్గళ్' (ధర్మవ్యాధునిగుమ్మములోఁ బడియుండి ధర్మసందేహములను శమింపఁజేసికొనినారు) అని చెప్పఁబడినది. అందువలన బ్రహ్మోపదేశమైనను భగవద్భక్తుఁడైన పంచముని యొద్దనైన నవశ్యము పొందవలసినది. పంచముఁడైనను భగవద్భక్తుఁడైన యెడల నాతనికి బ్రహ్మోపదేశము చేయవలసినది. భగవద్భక్తియే ప్రధానముఁ కాని వర్ణలింగజాత్యాదులు ప్రధానమైనవి కావు. ముమ్మాటికిఁ గావు.

"భారతములోనున్న కథలన్నియు సత్యములనుట కేమి యాధారమున్నది? ఎప్పటిభారతము! ఎప్పటికథలు వానియందు మనకంత ప్రమాణబుద్ధి యుండవలసినపని యేమున్న" దని నవనాగరకులు కొందఱధిక్షేపింపవచ్చును. ఆయధిక్షేపణమున కాధారమున్నను లేకున్నను దానిని నిరాకరింపక యంగీకరింతము. పురాణములలోని పూర్వగాథల

వఱ కేందులకు? ఆపురాణకాలముతోఁ బోల్చినప్పుడు మొన్న మొన్నగా భావింపవలసిన శ్రీమద్రామానుజులవారి కాలములో జరిగిన యొకచిత్రమును మనవిచేసెదను. మార్నేరునంబిగారును బెరియనంబి గారును గూడ యామునాచార్యులవారి శిష్యులు. పెరియనంబిగారు బ్రాహ్మణుఁడు. మార్నేరునంబిగారు పంచముఁడు. పెరియనంబిగారు రామానుజులవారి గురువు—మార్నేరునంబిగారి కవసానదశ సమీపించినది. "ఈశరీరముఁ బరమగురు భగవానుండగు యామునాచార్యులవారికి శేషత్వమొందినది. అట్టి యీదేహమును బ్రకృతిసంబంధులగువారు స్పృశించుట నాకంగీకారము కాదు. అంతటిమహాత్ముని సేవచేయుటచే వారికి శిష్టమైన యీగాత్రము వారి మాహాత్మ్యమును బట్టి ప్రాకృతికస్పర్శము తగులకుండఁ గాపాడుకొనవలయునని యూహించుచున్నాను. మీరు బ్రాహ్మణులు భాగవతోత్తములు మీఁదు మిక్కిలి దాసునికి సత్తీర్థులు. దేవరవారు దీనుఁడగు నడియేనికి బ్రహ్మమేధ సంస్కారమును గావింతురా" యని పెరియనంబిగారికి మార్నేరునంబిగారు వార్త నంపిరి. "అభ్యంతరమేమి? మహాభాగ్యమని యామహోదారమనస్కుఁడగు పెరియనంబిగారు చరమావస్థలోనున్న మార్నేరునంబిగారిని సేవించి వారికి బ్రహ్మమేధసంస్కారమును గావించెను. మార్నేరునంబిగా రిట్లు చరమవాక్యముగా సాయించి పరమపదించిరి.

"నాఁ యిన్నపడి యిన్నపడి యిన్నపడి సెయిదాల్, నీర్ యిన్నపడి యిన్నపడి యిన్నపడి సేయుంగో" దీనియర్థ మేమనఁగా నేను ఈరీతిగా—ఈరీతిగా—ఈరీతిగాఁ జేసియుంటినేని, మీరు–ఈరీతిగా–ఈరీతిగా—ఈరీతిగాఁ జేయ వేఁడుచున్నాను. ఈరీతిగా నేను జేసిన యెడల మీ రీరీతిగాఁ జేయవలెను. ఈరీతిగా నేను జేసినయెడల మీ రీరీతిగాఁ జేయవలయును. నేను—ఈరీతిగాఁ జేసినయెడల మీ రీరీతిగాఁ జేయవలయునని క్రమాలంకారసందర్భముగా మార్నేరునంబిగారు సెల విచ్చిరి. దీనికిఁ దాత్పర్య మేమనఁగా:—"నేను దైవనామమును స్మరించుచుఁ బ్రాణములు విడిచినయెడల మీరు దశరాత్రము లాశౌచము పట్టి కర్మ మాచరింపవలయును. నే నాచార్యుల స్మరించుచుఁ బ్రాణ

ములు విడిచినయెడల మూఁడుదినములు మాత్రమే మైలపట్టి కర్మ మాచరింపవలయును. నే నెవ్వరిని స్మరింపకుండఁ బ్రాణములు విడిచితినేని మీరేకర్మముకూడ నాచరింప నక్కఱలేదు." మాఱ్నేరునంబిగారి యీయన సానాజ్ఞను శిరమున ధరించి యాయనకు యతీశ్వరార్హమైన చరమకైంకర్య మొనర్చి స్నానమైనఁ జేయక, వస్త్రములయిన మార్పక, పెరియనంబిగారు తిర్వారాధన మొనర్చుకొని సాపాటు కానిచ్చుకొనెను. ఆహాహా! ఇది యెట్టి మహాద్భుతాంశమో! ఇది కేవలము కల్పితమైన కథయని యెట్లు చెప్పనగును? దీనిని నమ్మకపోవుట కిందున నసాధ్యమైన దేమున్నది? అస్వాభావికమైన దేమున్నది? అనుచితమైన దేమున్నది? అసాధారణమైన దేమున్నది? ఇట్లు జరిగినవియే నిశ్చయపఱుపవలయును. పూర్వగ్రంథములం దామాత్రమైన విశ్వాసము లేనియెడల మన కొక్కనిముసమైన జీవయాత్ర జరుగునా? నమ్మకపోవుటకుఁ గారణాభాసమైన నుండవలయునా? పదిపండ్రెండువందల సంవత్సరములనుండి తరతరముగా వచ్చుచున్న యీపవిత్రగాథ పరమార్థమైనదేకాని తద్వ్యతిరేక మెంతమాత్రమునుగాదు దీనివలన నేమి తెలిసికొనఁదగినది? నరుఁడు భగవద్భక్తిచేతనే బ్రాహ్మణుఁ డగును. భగవద్భక్తి శూన్యతచేతనే యబ్రాహ్మణుఁ డనిపించుకొనును. స్థిరమైన బ్రాహ్మణత్వ మెవ్వరికిని లేదు. స్థిరమైన యబ్రాహ్మణత్వ మంతకంటె లేదు. బ్రాహ్మణుఁ డబ్రాహ్మణుఁడు కావచ్చును. అబ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడు కావచ్చునని మనపెద్దలు చెప్పినారు. నరుల మగుటచే మనకు సోదరత్వమే సిద్ధత్వమైనదికాని బ్రాహ్మణాబ్రాహ్మణత్వము కాదు. కావున నిశ్చలమైన భగవద్భక్తిని సంపాదించుకొని యందరము కూడ బ్రాహ్మణుల మగుదుము. అందఱము బ్రాహ్మణులమైనప్పుడు మనకుఁ దగవులేల? భగవద్భక్తిని వదలి ప్రపంచలంపటులమే యందఱైనయెడల నందఱబ్రాహ్మణులమే యగుదుము. అప్పుడుకూడ మనకుఁ దగవు లక్కఱలేదు. పరమేశ్వరునందలి భక్తి సంపాదించుకొని తరింతము.

ఆర్యులారా! ఇదిగో సాక్షి మదరాసునుండి జంఘాలశాస్త్రికి వ్రాసినలేఖ—దీనిని జదువుమని జంఘాలశాస్త్రి యిప్పుడే నాయొద్ద కంపినాఁడు.

జంఘాలశాస్త్రికి—సాక్షి యనేకనమస్కారములు. 19 వ తేదిగల న్యాయదీపికలోఁ జనించిన సౌభాగ్యవతియగు పులవర్తి కమలావతమ్మ గారు వ్రాసినవ్యాసమును నీవు చూచియుందువు. ఆంధ్రదేశీయులందఱు జూడఁదగిన వ్యాసమది. ఆవ్యాసమున్న న్యాయదీపికనైన నందఱు సంపాదించుకొని చూడవలయునని నీవు సభలో నాపక్షమున సభ్యులను బ్రార్థింపవలయును. దానిలో సాక్ష్యుపన్యాసములఁగూర్చి యేదో విమర్శనమున్నదని నీవు భ్రాంతిపడి తొందరచే నామె వ్యాసమును క్రూరముగ ఖండింతువేమో యని భయపడి నీపేర నీయుత్తరమును వ్రాసితిని. నాయనా 'అది విమర్శనము కాదు. సాక్షిని దిట్టిన తిట్లు సాక్ష్యుపన్యాస విమర్శనమగునా? తిట్లకుఁదిట్టుగాక వేఱ ప్రత్యుత్తరమేమున్నదని యెంచి నీవు మనసోదరీమణిని దిరుగఁబడి మనసులోనైనఁ దిట్టుదువేమో సుమా! మగువను దిట్టుట మహాపాతకము సుమా! నవనాగరకతామాహాత్మ్యమువలనఁ బురుషులలోనేమి స్త్రీలలోనేమి కలిగి మనజాతితత్త్వము భంగపఱుచుచున్న దురాచారములఁగూర్చి మృదులముగాఁ బలుకుటయే మనవిధి. అందువలనఁ బురుషులుకాని స్త్రీలుకాని తిరుగఁబడి తిట్టినఁ దిట్టుదురుగాక! తెలివిలేకుండఁ దిట్టినఁ దిట్టుదురుగాక! తిట్టినప్పుడే మనయుపన్యాసములు వారిమనస్సునకు బాగుగా నెక్కినవని భావింపవలయును. వారిదురాచారములను వారు బాగుగాఁ దెలిసికొనుచున్నారని నిశ్చయింపవలయును. సామాన్య మనుష్యధర్మముచేతఁ గోపమును బట్టలేక యులుకుచేతఁ దిట్టుదురు. వారితిట్లకు మన దీవనలే ప్రత్యుత్తరములు. అందులోఁ గాంతామణి—మన సంఘమునకు స్త్రీజాతియందున్న యసాధారణగౌరవమునుబట్టి యధికభక్తినిబట్టి యామె నేమియు ననఁదగదు. భర్తను బరదైవముగ భావించి పూజించుచు నామె చిరకాలము సౌభాగ్యము ననుభవింపవలయునని యాశీర్వదింపవలయును. పండ్లవంటి బిడ్డలగని పౌత్త్ర ప్రపౌత్త్ర దౌహిత్త్రవృద్ధితో నామె చిరకాలము వర్ధిల్లవలయునని యాశీర్వదింపవలయును. ఇంతకంటె నిప్పటికి వ్రాయఁదగిన దేదియు లేదు.

ఇట్లు విన్నవించు సాక్షి.

ఆర్యులారా! ఈలేఖయైనది నేను జెప్పఁదగినదియు నైనది. ఇఁకఁ

పెద్దలకు నమస్కరించుటతక్క జేయఁదగినది లేదు. ఆళ్వార్ తిరువడిగళే శరణం—ఎంబెరుమానార్ తిరువడిగళే శరణం—జియ్యర్ తిరువడిగళే శరణం—అళహియమనవాళ్ నయనార్ తిరువడిగళే శరణం.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

# 17. ఉన్మత్తునియుపన్యాసము-దశావతారములు

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

"నాయనలారా! స్త్రీసౌందర్య మధమమని పురుషసౌందర్య ముత్కృష్టమని యీనడుమను బోధించిన పిచ్చివానియొద్దకు మఱి యొక్కసారి పోవలయునని కౌతూహలముకలిగి యాతఁడున్న గది యొద్దకుఁబోయి నిలువఁబడితిని. ఆతఁడు గదిలో నేమిచేయుచుండెనో నాకుఁ గనఁబడుటలేదు కాని యాతనిమాటలు నాకు వినఁబడుచుండెను. "నక్ బిన్ కటా దేఖే సీస్ భారీజటా దేఖే జోగికఱ ఫటా దేఖేఖాక్ లాయెతన్మే, సూర్ దేఖే బీర్ దేఖే ఔర్ దీర్ దేఖే వైనదేఖేజిన్కేలాలుచీ నహీతన్మే హే హే హే హే నదేఖే నదేఖే నదేఖే వహావ్వా! వహావ్వా బలవా నింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి—కర్షతి—కర్షతి— కర్షత్యేవ తడాఖా! కాంతాకనకకాంతా క్రాంతుఁడు కానివాఁ డెవఁ డురా! నన్నుఁగాక మఱియొక్కనిఁ జూపుము. కనిష్ఠి కాధిష్ఠితకాళిదాసః ఛీ. మ॥ మలభూయిష్ఠపుఁ దోలుబొమ్మయగు కొమ్మంజూచి విద్వాంసుడుం బులినశ్రోణి మహాస్తని... హే హే! ఇప్పుడు నవనాగరకుల యొద్ద నదిగో ఆమాట యనుటకు వీలుకాదఁట! యసభ్యమట! థూ థూ! పనికిమాలిక పెద్దమ్మలు! మలపసన్యాసులు! వట్టినపుంసకులు! థూ! మాతాతగారికాలములో నటులేయుండెనా! ఓ! పేకజువ్వలు! పెళుపకాయలు! ఫెరంగిగుండ్లు! ఇంగ్లీషుచదువులు వచ్చినతరువాత మన దేశమునకు వచ్చిన దీనిస్సత్త్వము. ఈకంటిబెదలు, ఈకాళ్లపీకు, ఈ నడుమిాడ్పు, ఈగుండెదడ, ఈయాడంగితనము. మన వేదవిద్యలలో

నున్నంత ధాతుపుష్టి విదేశవిద్యలలో నెక్కడిది! తద్దినపు బ్రాహ్మణుడు దెబ్బదెబ్బకు బ్రతుకుచున్నాడు. బి. ఏ., గాడు below Thirty (ముప్పదేండ్లయిన నిండకముందే) థూ! ప్రాణముమీఁదికి వచ్చినప్పుడు కూడఁ బైచదువెందుకోయి? ఊడ్చివేయవోయి త్రోచివేయవోయి. పెట్టు అక్కడఁబెట్టు. అదిగో పెట్టుమనగాను—మానిషాద ప్రతిష్ఠాంత్వ మగ మశ్శాశ్వతీస్సమాః—అది మనకుఁ దగినచదువు. అంతేగాని Once upon a time there lived a donkey and an ass హే హే హే రెండు నొక్కటియే కాఁబోలునేమి never mind."

ఈమాటలు వినఁబడినవెంటనే మఱియొకకంఠరవమున నోరు మూసికొని యన్నముతిందువా కొరడాతో బజాయింపనా యని యింకొకఁడు మాటలాడినట్లు వినఁబడెను. "నోరుమూసికొని యన్నము తినుట యేలాగునోయి fool కన్నుమూసికొని నీవు చూడఁగలవా block head! ముక్కుమూసికొని యాఘ్రాణింపగలవా idiot! అని పిచ్చివానిమాటలు వినఁబడెను. ఇంతలో చెళేలుమని కొరడాదెబ్బ వినఁబడెను. "అమ్మ నీసిగదరగ ఎంతదెబ్బ కొట్టితివిరా! నేను మతి లేనివాఁడ నగుటచేతనేకదా నీవు నన్నుఁ గొట్టుట సిద్ధించినది! మతి యున్నవాఁడవు నీవిశేషముమాత్ర మేమున్నది? మతియున్నవాఁడు మతిలేనివానిని గొట్టినప్పుడు యధార్థముగా మతిలేనివాఁడు మతియున్న వాఁడా? మతిలేనివాఁడా? కూలిముండకొడుకవే. కోటీశ్వరుని గొర డాబుచ్చుకొని కొట్టితివే! నీగొంతుగోయ! నీకుఁ బుట్టగతులున్న వఁటరా! కానీ! కానీ! మావేదర్షులు బోధించినదేదో యెఱుఁగుదువా? శాంతి. గాంధిగారు క్రొత్తగా నిప్పుడు చెప్పిన దేదియు లేదు. అదియే రాట్నపూజక్రముతోఁ దిరుగఁ దోడినారు. ఉపన్యాసధోరణి వలన నామహాత్మునకుఁ గారాగృహబాధ కలిగినది. నాకుఁ గారా గృహబాధవలన నుపన్యాసధోరణి కలిగినది. వారికి మనకున్న భేదమే యిది" అని పిచ్చివాఁడు పలికెను. అన్నముతిందువా మఱియొకవ్రేటు వేయనా యని తిరుగ నతని నాకాఁపరి బెదరించెను. "ఉండు rascal ఉండు ౧ విఘ్నేశ్వరపూజలేకుండ వివాహమా? పాదప్రక్షాళనము లేకుండఁ దద్దినమా? దైవప్రార్థనములేకుండ సాపాటా? నిలువఁబడు.

Rogue అక్కడనే నిలువఁబడు. చెవులలో వ్రేళ్ళుక్రుక్కుకొని మహా మ్మదీయులు ప్రార్థింతురు. చెవులతమ్ములు లాగుకొని యవలు ప్రార్థింతురు. చేతులు జోడించుకొని యాంధ్రులు ప్రార్థింతురు. నిలువఁబడి మహారాష్ట్రులు ప్రార్థింతురు. మా కీపద్ధతులు నచ్చకపోవుటచేతఁ బండుకొని మేము ప్రార్థింతుము. "ఓయిభగవంతుఁడా! పిచ్చివానిని గొట్టింతువా? మేము మతిలేక యేడ్చుచుండగాఁ బైగ మాకు దెబ్బలా? ఇది యేటి న్యాయము? నీ ప్రపంచపరిపాలన మింత యవకతవకగా నున్న దేమి! ఈ పదునాల్గుభువనములలోను బిచ్చిముండకొడుకను నే నొక్కఁడనే నీకంటికిఁ గనఁబడితినా? పిచ్చిలేనివాని నొక్కనినైన నీవు సృష్టింపనే లేకపోయినప్పు డీలోకము నీలో నున్నట్లు కనఁబడుచుండఁగా నాకు దెబ్బ లెందులకయ్యా? పటపట యుపన్యాసము లిచ్చువారే కాని బోధనప్రకార మాచరించువాఁ డొక్కఁడైనఁ గనఁబడఁడు గదా? వారందఱు పిచ్చివారుకారా? వారిలో నెవరినైన నొక్కకొరడాదెబ్బఁ గొట్టించితివా? పదునాల్గుపెండ్లిండ్లు చేసికొని పదునార్గుఱువేశ్యల నుంచుకొని దేశోపకారము చేయుచున్న వారందఱు పిచ్చివారుకారా? ఊచిపుచ్చుకొని యొక్కలెంపకాయ వారి నెప్పుడైనఁ గొట్టించితివా? కోడిపందెములలో నాస్థానగ్రామములను గూడ నొడ్డఁ దగిన సామంతులు—ఓ! దేశాలంకారములుగ నున్నారే! వారిని జేయిచేసికొనుటకు నీకు సందేహముగా నున్నయెడలఁ బోనీ? యొక్కని పైనైనఁ గన్నెఱ్ఱజేసి చూచితివా? వారియందు నీకీపాక్షిక మెందులకు? నాయం దీవైర మెందులకు? ఎవ్వరిమాటయు నాకేల? నీవు పిచ్చివాఁడవు కావని నీవు ధైర్యముగ టొంకకుండ గుండెకొట్టుకొని చెప్పఁగలవా? పిచ్చివాఁడవే కానియెడల నీ కీప్రపంచపు జంజాటమంతయు నెందులకు? ఇంతగొడవ నెత్తినివైచికొనుట యెందులకు? సరే వైచికొంటివయ్యా! తిన్నగ నిర్వహింప నక్కఱలేదా? వ్యవహార మనుకొంటివా? వెఱ్ఱివానిచేతి తాయి యనుకొంటివా? నీపరిపాలనము నీపరిశీలనము నెట్లున్నవో చెప్పనా? ఇదిగో? నాకంటెఁ బిచ్చివాఁడు చెప్పినకవిత్వము! చదువుచున్నాను కాచికో.

గీ. వీరవరుకంఠమునఁ దరవారికోఁత

ఘోరగళమున సితపుష్ప విజయమాల
శేముషీమంతుపెట్టెలోఁ జెదలపుట్ట
వాలుకలవానిమొలను బత్రాలకట్ట
పరమదాతకు నుభయపార్శ్వములఁ దిట్లు
లెపుడయిన నిచ్చునని నుతుల్ కృపణునకును
భర్త నింటను శ్రాద్ధాలబహుళతయును
నాస్తికునియింట నిత్యకల్యాణకలన
సత్యవాగ్ధనునకుఁ జెఱశాలత్రోవ
ననృతవాదికిఁ దూఁగుటుయ్యాలకైపు
మెత్త నగువానికంటికిఁ జిత్తవాన
మఱి కసాయిమీసాలకు మల్లెనూనె.

ఇదేకాదా నీసౌభాగ్యము! నీవ్యవహారపుడౌలు! అంత చేతఁగానివాఁడ వైనప్పుడు వ్యవహారమునుండి రవంత తప్పుకొనలేకపోయితివా? తగినవాని నెవనినైన నేను జాగ్రత్తపెట్టకపోవుదునా? దౌర కదు? జానేదేవు; ప్రపంచమంతయు నొక్కసారి పోవుటయే దానికి మంచిది మనకు మంచిది. ప్రపంచమున్న విశేషముమాత్ర మేమున్నది? ఇదిగో మావంటి పెద్దమనుష్యులకుఁ గొరడాదెబ్బలకే కాదా? నన్నీ బానిసముండకొడుకుచేత దెబ్బలుకొట్టించుట నీకు లీలకాబోలు నేమి? నీ కది ఖేలనముకాబోలునేమి? నాన్‌సెన్స్ నాకంటె సహస్రగుణములు పిచ్చివాఁడవైన నిన్నెవఁడు కొరడాపుచ్చుకొని కొట్టుచున్నాఁడు? ఆమాత్ర మాలోచించుకొననక్కఱలేదా? నీవరుస నాకెంతమాత్రము బాగుగా నున్నది కాదు. అయిననేమి? మ్రొక్కుటకీమాత్రపు గ్రుడ్డికంటి బొమ్మయైన వేఱొకటి కనఁబడకపోవుటచే మన మేమిచేయవలసినది? మ్రొక్కెదము. మ్రొక్కెదమేమి? ఇదిగో! మ్రొక్కినాము! రక్షింపగలిగినయెడల రక్షింపు. లేకపోవునెడల కొరడాదెబ్బలే తిందుము. ఇంతకంటెఁ జెడున దేమున్నది? తథాస్తు."

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

ఈవిచిత్రమైన దైవప్రార్థన మొనర్చి యాతఁడు గదిలోనే భుజియించెను. భోజనసమయమునం దిట్లు ప్రలపించెను. "భోజనం దేహి

రాజేంద్ర ఘృతసూపసమన్వితమ్। మాహిషంచ శరచ్చంద్రచ్చంద్రికా ధవళం దధి॥ ఈశ్లోకములో 'మాహిషంచ' శబ్దములోఁ దప్పున్నదా లేదా యని మూఁడుదినములు నిక్షేపవిత్తాచార్యులవారితో మనము వాదించి యది ప్రమాదమేన' యని సిద్ధాంతీకరించినాము. మహిషాసురమర్దనికి జయా! అఁడుదానికున్న దేహపాటవ మసురునికెక్కడిది? అందుచే సంకల్పించుకొన్నతరువాత మగవానిగొంతుక యరఁట్టి దూఁటవలెఁ గోయుట కేమైన సందేహమా? అందుకొఱకే మనవారు జాగ్రత్తోభయం నాస్తి న్యాయముచేత "భజగోవిందం భజగోవిందం భజగోవిందం మూఢమతే, ఇహసంసారే—కృపయాపారే పాహి మురారే భజగోవిందం" అని సెలవిచ్చినారు. దీనికిఁ బాఠాంతరముగ "త్యజసంసారమ్ త్యజసంసారమ్ బహుదుస్తారం బహుదుస్తారం—భజ గోవిందమ్" అని మనము సెలవిచ్చినాము. కారణములేని కార్యముండుట కవకాశమేది? "పర్వతో వహ్నిమాన్ కుతః బహిర్గత ధూమత్వాత్" "స్పెన్సర్ కంపెనీనుండి రెండణాల కొకటిచొప్పునఁ దెచ్చిన చుట్టయైనసరే వట్టి యరటినారగు గాటా కారమా కైపా! ధూ!" ధూమజ్యోతి స్సలిలమరుతాం సన్నిపాతః క్వమేఘః, స్సందేశార్థాః క్వపటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః, మధ్యేశ్యామా శిఖరి దశనా పక్వబింబాధరోష్ఠీ—" ఆ ఆ తప్పినదాయేమి? అబ్బ! దీని సిగఁదరగ! మఖలోనుండి పుబ్బలోనికి దాఁటితిమాయేమి? (నెవర్ మైండ్) మఖా పుబ్బా నక్షత్రజాతకుల కందఱ కిప్పుడే నేఁటికని వెళ్లిపోవచ్చినది. ఇఁకఁ గొలఁదిదినములు మాత్రము కన్నులు మూసికొని కాలక్షేపము చేయఁదగినది. ఆపైనుండి నిత్యకల్యాణము పచ్చతోరణము వహావ్వా! వాహావ్వా—చూడవోయి! కందస్వామి కల్యాణమోయి! ఊ—ఊ-ఉపాంగముపట్టు.

జంఝూటి

మగవానినీ నమ్మరాదే చెలి॥ మగ॥
వద్దనున్నసేపు వగలమాటలతీపు
వద్దలేనిమాపు వారు వారకంటిచూపు॥ మగ॥
తధిగిణతోమ్ తధిగిణతోమ్ తధిగిణతోమ్.

వానికంటెమూపకటు వహావ్వా ! శబ్దములోనున్న వంకర యటుంచదోయి ! అర్థములో వంకర కనఁబడుచున్నదే సెబాస్! ఈనడుమ సాక్షి దృష్టిశాస్త్రము వ్రాయుదునని సొరకాయకోఁతలు గోసినాఁడే ! ఏదీ ! నీకు సందేహ మెందుకు ? సాక్షిని సాగఁదీయుటకు నే నున్నానని చెప్పవోయి—మనది పొట్లమిరెపుకాయవంటి బుద్ధిగాదటోయి. అబ్బ ! ఎంత కారము వేసినాఁడు గాడిదకొడుకు. ఉస్సు—సరే ! ఇక్కడికి మజ్జిగ వఱకు వచ్చినామన్నమాట—బేవు—బేవు—మనకు సాపాటులో నాద్యంతములు పుష్కలముగా నుండవలయునన్నమాట—"సంస్కృతం బాద్యప్రకృతి ప్రాకృతంబు ద్వితీయప్రకృతి" యని వ్యాకరణశాస్త్ర మర్యాద. చిన్నయసూరియు శాస్త్రజ్ఞుఁడే—చూడయ్య శాస్త్రజ్ఞుఁడే—ఎంతభేద మున్నదో ధూ ! ధూ ! బేవు—బేవు—ఇక్కడికి నాటకాంతం కవిత్వం హీ ! ఇఁక భరతవాక్యము మిగిలినది. ఇఁక లేవవలెను. ఉశ్శో బాబా ! ఉశ్శో ! అబ్బ ! దయ్యముపట్టినవానికివలె నొడలు బరువెక్కిన దేమి చెప్పుమా ? "హ్రాం హ్రీం ఐం ఫట్ ఫట్ ! జారేతూ ! హైవాన్" ఇట్లు హంగామాచేసి యాహారించి యాపహారావాని నావలికిఁ బంపి "భుక్త్వాతు శతపదం గత్వా" అను న్యాయముచేత మన మాపంచపాళిలోనికిఁ బోక తప్ప"దని నేను నిలువఁబడినచోటికి దగ్గఱగా వచ్చి నన్నుఁ జూడకే యటునిటు తటపటాయించుచుండెను. "మనుష్యుఁ డంత మాయకాఁడు మఱియొక్కఁడున్నాఁడా ? ముందునకు వాఁడే నడచును. ఆకాళ్లతోనే వెనుకకును వాఁడే నడచును. ఛీ ! పౌరుష మున్న యెడల ముందునకైనఁ బోవలయును. లేకపోయినయెడల వెనుకకైనఁ బోవలయును. అంతేకాని ఖల్వపుఁబొత్రములాగున వెనుకకు ముందునకుఁ గూడనా ? ధూ! ఇఁక మన మీతుచ్ఛమైన పిష్టపేషణ వ్యాపారమునఁ దిగఁగూడదు. బస్ ఖడో బాబా ! ఖడో"

ఇట్లు పలికి యాతఁడు నిలువఁబడి నావంక జూచెను. ఆతఁడు నన్నానవాలు పట్టఁగలఁడో లేఁడో చూతమని నే నేమియు మాటలాడక యాతనివంకఁ జూచితిని. ఆతఁడు నన్నుఁ దీవ్రముగఁజూచి "కానీవయ్యా ! కానీ ! పంచాంగశ్రవణమునకై ప్రభుసన్నిధికి వచ్చినవాఁడవు

కదా! పండిటిగుంజవలెఁ బలుకకుండ నిలునఁబడెదవేల? వానీ—మనన దుప్పై సిద్ధముగా బైఠాయించియున్నాము.

సీ. ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వనికుమా
రతకుఁ గ్రౌంచాచలరాజమయ్యె
రెండవది యెట్సటరా
దానితరువాతిది—యెట్సటరా
సకలయాచక జనాశాపూర్తి కెవ్వాని
ఘనభుజాదండంబు కల్పశాఖ
ప్రబల రాజాధిరాజ వీరప్రతాప
రాజపరమేశబిరుద విభ్రాజితుఁడైన
యట్టి శ్రీముష్టి చిటివీరయాగ్రగణ్యుఁ
డాసుపత్రిని గొలువున్న యవసరమున.
వడ్డించు—మఱియొకటి వడ్డించు—ఔర్ ఏక్ ఔర్ ఏక్ (•)
సీ. ఇందీవరంబుల నీనుకాల్లన్నుల
శరదిందుముఖులు చామరము లిడగ

వహావ్వా! వహావ్వా! మనప్రక్కలో నింపఅు పడఁతు లెందుల కోయి! తాడిల్లిజాతి దొకతె—నూనెపురుగుడుజాతి దొకతె—తివాచి పాడజాతిదొకతె—నల్లికన్నులజాతిదొకతె—మిడినాగుజాతి దొకతె—జెట్టిగొడ్డుజాతిదొకతె—జనమేజయుఁడు సర్పయాగముచేసిన ట్లీ దండు నంతను మంచిరోజుచూచి 'అగ్నినాగ్నిస్సమిధ్యతే' యని "సహేంద్ర తక్షకాయస్వాహా" యనకుండు నెడలఁ జెవి గోయించుకొనక మాను దునా? నాకుఁ జెవి లేకపోయినంతమాత్రముచేతఁ బ్రపంచమాగిపోయి నప్పుడు చూడవచ్చును. హేహే! శ్లో. కర్ణారుంతుదమేవ క్రోకిలరుతం తస్యాశ్రుతే భాషితే" అని యన్నవాఁడెవఁడయ్యా! మాటలాడవేమి? అక్షయపాత్రకులాగున నీకు నోరేకాని కూఁతలేదేమి? నన్ను వెక్కి రించుటకే వచ్చితివా? డొక్కచీల్చి తాలుగొట్టెదను" అని యాతఁడు తీండ్రించుచు నన్నుఁ గొట్టవచ్చెను. "ఆహా! అమావాస్యయగుటచేఁ గాఁబోలు నీదిన మీతఁ డింత తీవ్రముగ నున్నాఁడు" అని మనసులో ననుకొని "అయ్యా! నన్నుఁ జూచినట్లు మీకు జ్ఞప్తియున్నదా" యని

యడిగితిని. "కుంభీపాకములోఁ జూడలేవటోయి! కప్పస్తంభమును గౌఁగిలించుకొనుటకు నీభార్యను నీవు తీసికొనివచ్చినప్పు డశ్వత్థప్రదక్షిణములు చేయింపవలసినదని యుపన్యాస మిచ్చినవాఁ డెవఁడు? ఇదిగో! వీఁడు-వీఁడు" అని గుండె కొట్టుకొనుచున్నాఁడు. అయ్యా! "యెవల్యూషన్" ను గూర్చి మీ యుపన్యాసమును వినుటకే తిరుగ వచ్చినాను. మనసు కవంత శాంతిపఱచుకొని యుపన్యసింపఁగోరితిని" అని నేనంటిని. (వెరిగుడ్) నీవు నీవేనఁటోయి! నీవు నీలాగున లేనప్పుడు నేను నిన్ను నీవనుటకు నీకిష్టమైనను నాకేమి యధికార మున్నది? సరే-ఇప్పుడు కావలసినదేమి? ఉపన్యాసమఁటోయి! యెవల్యూషణ్ గూర్చి యటోయి (వెరిగుడ్) మనయుపన్యాసములన్నియు సమకూర్చి కొన్ని సంపుటములుగా నచ్చువేయించి ప్రకటింపవలయునని యూహించుచున్నాము. నీవు మనకుఁజేమున ఏజెంటుగానుండి కొంతరుసుము తీసికొని పనిచేయఁగలవా? పోసఁగుడు వ్యాపారములోనున్న గౌరవము ధనాగమము మఱియొకదానిలో నున్నవనుకొంటివా? ఎ—A go between is always a gentleman, but a gentleman is not always a go between. తెలియలేదా.

"అయ్యా! ఈమాటలకేమిగాని తొందర నడచుకొని యూపిరి తీసికొని కవంత నిదానించుకొని (యెవల్యూషణ్) పైన నీకుఁ దెలిసిన సంగతులు చెప్పవలయును. ఊ—ఆరంభింపుము.

"బస్ బస్, అబ్ ఆగాజ్ ఖిస్సే కాకర్తాహుఁ - జరాకాస్ థర్ కర్ సునో—ఔరమస్ సఫీకరో—అరెరే చార్ దర్వేష్ పఢ్తాహుఁ క్యా—ఛీ! మనకుఁ జూచితివా? పెండ్లిమంత్రములోనుండి తద్దినపు మంత్రములోని కొక్కటేదాటు—పిండశ్రాద్ధమంత్రమునుండి పునస్సంధానమంత్రములోని కొక్కటే (లాంగ్ జంప్) కం॥ ఇటుచూపటు నటుచూపిటు । పటుతరశస్త్రంబు లేసె పార్థుం డంతఙ్. వహవ్వా! సవ్యాప సవ్యచాకచక్యమునకు మనది పెట్టినదిపేరు! అందులో నాలుభాషలు జిహ్వాగ్రమందుఁ దాండవించుచున్నప్పు డడ్డమేమున్నదోయి! తడాఖా!.........॥"

"అయ్యా! అయ్యా! ఎవల్యూషనుగూర్చి చెప్పెదనంటిరి. చెప్పుదురా? పోదునా" యని నేనంటిని.

"అదిగో! ఒక్కటేతొందర—చెప్పుచుండఁగా గడియ గడియకు నడ్డుదగిలెద వెందులకు? విశేషముగఁ దొట్రుపాటువచ్చినప్పుడు తక్క నే నేదిచెప్పినను బ్రతిబంధింపకుండ నీవు వినఁదలఁచుకొన్న యెడల విను—లేనియెడలఁ బో నీవు శ్రోతవుకానియెడల నా యుపన్యాసమునకు గౌరవహీనత యనుకొంటివా? ఇక్కడ నేను బ్రతిదినము పంచభూతముల కుపన్యసించుచుంట లేదా?

అవి చచ్చినట్లు వినుచున్నవా లేదా? హరిః ఓమ్మని యారంభించుచున్నాను కాచికో. "జంతువులపరిణామమునుగూర్చియే యిప్పుడు చెప్పెదను. గుండె దడగా నుండుటచేత నడుము బిఱ్ఱుగా నుండుట చేతఁ దల గిఱ్ఱుగా నుండుటచేత నంతకంటెఁ గ్రిందికిదిగుటకు మన కవకాశము లేదు. మొట్టమొదట సృష్టిలోఁబుట్టిన జీవమున్నదే. అది యెట్టిదైనను నీటిలోఁబుట్టిన జంతువుకాని భూమిపైఁబుట్టిన జంతువుకాదు. ఈయంశమును బాశ్చాత్యులు మూఁడువందల సంవత్సరముల క్రింద మూఁడుచెరువులనీరు త్రాగి ముప్పుతిప్పలఁబడి కనుగొనినారు. మనవారీయంశమును మూఁడువేలసంవత్సరముల క్రిందనే ముక్కుమూసికొని కనులుమూసికొని కమలాసనమునఁ గూరుచుండి కనుగొనినారు. మొదటఁ బుట్టిన యత్యల్పజంతువు చర్మపుదిత్తివలె నుండును. అది సర్వావయవశూన్యమై యుండును. అట్టి యల్పజంతువులనుగూర్చి మనవారు చెప్పలేదు. తెలియకకాదు. వానిపేరేమి ఊరేమి రూపమేమి స్వభావమేమి? ఏమియు లేదు. అందుచేఁ జెప్పలేదు. నీటఁబుట్టినజంతువే ప్రప్రథమజంతువని కనిపట్టిన మనవారు నామరూపములులేని యితరజంతువులను దీసికొనక మత్స్యమే మొదటిజంతువని చెప్పినారు. దీనికిఁ గాళ్లులేవు. చేతులులేవు. నోరులేకపోవుటచేఁ గొన్ని ముక్కువెంటనే యాహారమును దీసికొనును. కొన్నిటికి నోరున్నను గంతనాళము లేదు. లంచముపుచ్చుకొనుచుండకొండుకునకుఁ బడుచుకొని జీవించుచుండవలెను గొంతుకముడి యుండదనుసంగతి నీవెఱుఁగుదువా? మాబావ బ్రహ్మ

వర్ణాశ్రమమునకు భంగములేకుండ నొకదాసీదానిని యజ్ఞపశువుక్రిందఁ బట్టి. . .

"అదిగో! తప్పుదారిని బోవుచున్నావు. జలసంభవమైన చేఁప మొదటిప్రాణిగా మనవారు గ్రహించినారు. అటుపైన—

"ఎంతరక్తిగలకథ చెడఁగొట్టితివోయి! ఛూ! చేఁప మొదటిది. దీనిపై జంతువునుగూర్చి చెప్పెదను. నీవు పైకెక్కఁగలవా? ఎక్కు ఎక్కు! తాఁబేలువఱకెక్కు. బలిష్ఠమైన బొరుసున్నది. సందేహింపక యెక్కు ఎక్కితివా? వెరిగుడ్. చూచితివా? దీనికిఁ దల ప్రత్యేకముగఁ గనఁబడుచున్నది. మెడ కొంచెముకనఁబడుచున్నది. కాళ్లునేతులు వేఱువేఱుగఁ గనఁబడుచున్నవి. యిది యెచ్చటఁబుట్టినదో యెఱుఁగుదువా? ఆతిసూర్యకాంతిచేఁ గొంతసముద్రము తరిగిపోవుటవలన భూమి పైకిఁ గానఁబడగ భూమికి నీటికి మధ్యముననున్న యవకాశములో నిది పుట్టినది. అందుచేఁ దాఁబేలు స్థలజంతువు జలజంతువుగూడను. మొదటి తరగతి జంతువులలో మనవారు మచ్చునకు చేఁపను దీసికొనినట్లు రెండవతరగతిజంతువులలో మనవారు తాఁబేలును మచ్చునకై తీసి కొన్నారు. అట్లు వెఱ్ఱిమొగము వైచుకొని చూచెదవేల? హక్సలే నడుగు. డార్విను నడుగు. స్పెన్సరు నడుగు. అసత్యమని చెప్పినయెడలఁ దలకదపా, అంతే? వెఱ్ఱిముండకొడుక ననుకొంటివా? బ్రహ్మర్షిసిద్ధాంతములకుఁ బాశ్చాత్యులసాక్ష్యము కావలసివచ్చినదేమి? ఛూ! హైకోర్టెప్పుడు తీసెదరో యెఱుఁగుదువా? మామిత్రుని బావగారు మఱఁదలికి మనోవృత్తి నిచ్చుచు గాలముచేసినారు. కాలముచేసినతరువాత నాయన భార్యయే యిదివఱకుఁ బ్రచ్ఛన్నముగా మనోవృత్తి పుచ్చుకొనుచున్న మఱఁదలు కావున నిప్పుడు మనతరపు బారిస్టరుగా రీమఱఁదలను లోపు చేసికొనుటకుఁ బ్రయత్నించినట్లు మనకుఁ దెలిసినప్పుడు. . ."

"అయ్యా! ఇకఁజాలు తప్పుధోరణిలోఁ బడిపోయినారు. మనసు కుదుటఁబఱచుకొని ముందెచెప్పుడు. తాఁబేలు రెండవతరగతిలో మచ్చుజంతువు సరే. అటుపైన" నని నేను మందలించితిని.

"ఇంకొకమెట్టెక్కఁగలవా! మఱియొక్క పందివఱకెక్కు? ఎక్కితివా? వెరిగుడ్. ఇది కేవలము స్థలజంతువు ఈతరగతినుండి

పైని పుట్టినవన్నియు స్థలజంతువులేకాని జలజంతువులు లేవు. ఎన్ని జల జంతువులైనను మొదటి రెండుతరగతులలోనివే. పంది పరిపూర్ణావయవ స్ఫూర్తిగల జంతువు. దీనికంటె బలిష్ఠతలో నెక్కువ జంతువు లున్నవి. కాని యవయవస్ఫూర్తిలో నధికములగు జంతువులు లేవు. ఈజాతి జంతురాజమైన సింహమువఱకు వ్యాపించియున్నది. దీనిపైజాతియేది ?

"నరజాతి—నరజాతి" యని యంటిని.

"తప్పు తప్పు. సింహస్వరూపము నరస్వరూపములోనికిఁ బరిణ మించులోపల రెండింటికి మధ్యమునన్న మఱియొక్కస్వరూపము నొందినవి. ఇదియే నరసింహస్వరూపము. చేప యిప్పటి కున్నది. తాఁబే లున్నది. పంది యున్నది. కాని నరసింహజంతు వున్నదా యను ప్రశ్నము రాకతప్పదు. అట్టిజంతువు పూర్వమం దుండియుండవచ్చును. స్వల్పకాలముమాత్రమే యుండి యది స్వరూపనాశన మయియుండ వచ్చును. కాదనఁగలవా రెవరు ? కాదనినయెడల మూఁతిపైఁ గొట్టెదను. సన్నద్ధుకొనఁగలవా రెవరు ? మామ్మతు అను జంతువు స్వరూప నాశనమైన ట్లిప్పుడు ప్రకృతశాస్త్రజ్ఞు లెందరో ఘోషపెట్టుచుండుట లేదా ? మూఁడేనుఁగులంతజంతువే మాయమైనప్పుడు నాలుగడుగుల యెత్తు నరసింహ మేల మాయము కాకూడదు ? అందున నసంభవ్య మేమున్నది ? అవిగాక యన్ని భగవదవతారములుకూడఁ గొంతకాలము భూమిపై నున్నవి. కాని నరసింహావతార మొక్కయరగడియలో మాయమైనదని మనవారే చెప్పియుండలేదా? ఆజంతుజాతి స్వరూపనాశన మప్పుడే యైనదేమో. అదిగాక, అట్టిజంతువు మొదలు పుట్టనేలేదని మీరు సిద్ధాంతపఱచినప్పటికి నాకు సమ్మతియే. ఏటులైనను నరునకు సింహమునకు నడుమ మనవా రొక ఇంటర్ మీడియేట్ స్టేజ్ కల్పించినారు. అందువలన నధిక్షేపించుట కెవని కధికారమున్నది ? అధిక్షేపకుఁ డెవఁడో రానీ! బడితబాజాతక్క మనకు రెండవపద్ధతి లేదు. చాణక్యనీతి దాని కంవదు. 'దండమ్ దశగుణం భవేత్తే' న్నదియే ప్రథమరాజనీతిసూత్రము. కాంతలకుమాత్రము కార్పొరల్ పనిష్మెంటు పనికిరాదని సర్వజాతి శిక్షాశాస్త్రములు చెప్పుచున్నవి. ఎందులకు వారి నాశిక్షనుండి తప్పించి

సారో యెఱుఁగుదువా? తిరుగఁబడి మరల గొట్టుదురని ఇది శాస్త్ర రహస్యము."

"అయ్యా! ఆగొడవ యిఁకఁజాలును. ఇఁకఁ దరువాతఁ జెప్పుఁ" డని నేనంటిని.

"ఎక్కు నరునిభుజముమీఁది కెక్కు. ఎక్కితివా? వెరిగుడ్. యతీశ్వరులకువలె నీకు బ్రహ్మరథము సిద్ధించినదిరా! ఓహోభాయి! ఓహోభాయి! ఓహోభాయి! దింపు సవారిదింపు! దింపుటకాదురా. తిరుగఁద్రోయరా! సర్వోభవ—సర్వోభవ—ఇక్కడికి నహుషుఁ డేమైనాఁడో యెఱుఁగుదువా? బడితెతే కొట్టు కొట్టు—ఓరినిర్భాగ్యుఁడా చంపు. దొరకలేదా?—కలుగులోనికిఁ బాఱిపోయినదఁటరా? అయ్యయ్యో! చండాలుఁడా! ఎంతపనిచేసితివిరా! పోనీ. సుబ్బారాయఁడా తండ్రీ రక్షింపు. నాయనా! నాగులచవితినాఁడు నీపుట్టలోఁ బాలుపోసి కొంసునుబాబూ! మాయావిడచేత నాగులకోక కట్టింతును తండ్రీ! మొదటిబిడ్డ యాఁడుదైనయెడల సుబ్బమ్మ, మగవాఁడైనయెడల సుబ్బారాయఁడు.

"నీ—వెఱ్ఱి మండిపోను! ఎక్కడను హద్దుపద్దు కనఁబడకుండ నున్నది. ఒకొక్కప్పుడు తిన్నగనే మాటలాడుదువే. ఇప్పు డింతలో నీదిక్కుమాలినథోరణి యెక్కడనుండి వచ్చినదయ్యా! నరునిగూర్చి చెప్పవయ్యా!" యని నేనంటిని.

"అద్దే అద్దే! ఇక్కడికి వామనావతారఘట్టము నొద్దకు వచ్చితిమి. మొదటినరుఁ డెట్టివాఁడు? పొట్టివాఁడు. బడుగు. పాపము పెండ్లి లేదు. వట్టి బ్రహ్మచారి. మొదటి నరుఁడు కావుననే యాతఁ డర్భకుఁడుగ హ్రస్వస్వరూపుఁడుగఁ జెప్పఁబడినాఁడు. మొదటిగ్రంథమేమి? మొదటి బిడ్డఁడేమి? మొదటిప్రయత్న మేదైననేమి? సర్వసాధారణముగా బల హీనముగా నుండక తప్పదు. పెద్దన్నయ్య యనఁగా దద్దయ్య—ప్రథమ ప్రయత్నమనఁగాఁ బాడైన ప్రయత్నమన్న మాట—దీనికి మినహాయింపు లుండవచ్చును. మినహాయింపులే సామాన్యసూత్రమును బలపఱచు చున్నవి. క్రమక్రమవృద్ధియే ప్రపంచసూత్రము. ఇది భిన్నభిన్న నర వ్యక్తులలో నెట్లు సత్యమో సాముదాయక నరజాతిలోఁ గూడ నంతయే

సత్యము. మైకేలుఏంజిలో అనునాతఁడు ప్రథమపురుషుఁడగు ఆడము యొక్క శిలాస్వరూపమును నిర్మించినప్పు డైదుగురు కోడి రామ మూర్తి బహద్దరులంత విగ్రహమును సృష్టించినాఁడు. మనవారి ప్రథమ పురుషుఁడు మూఁడడుగులవాఁడు. పరమార్థజ్ఞానసంపన్నులు. గ్రీకులో యూరప్యలో యిందువలనఁ గనిపట్టలేవా? కావున వామనుఁడే ప్రథమ పురుషుఁడు కాని యాతఁడు స్వభావములో నెట్టివాఁడో యెఱుఁగు దువా? వట్టి మాయకాడు వట్టిమోసగాడు. బలిచక్రవర్తి నాశీర్వదించు చునే యున్నాఁడు. అధోలోకమునకుఁ బంపించుచునే యున్నాఁడు. ఇది గాక మఱియొక్కచిత్రము. నీవెఱుఁగవేమో—పిల్లలంతమోసగాండ్రు పెద్దవారుకారుసుమా.

అన్ని యింద్రజాల మహేంద్రజాలవిద్య లర్భకులయొద్ద నున్నవి. శుద్ధమాయాస్వరూపు లెవరనఁగా—పిల్లలు. బ్రహ్మాభేద్యమైన గుట్టు కలవా రెవరనగా—పిల్లలు. భూగర్భమందున్న పాతాళగంగనైన సులభముగాఁ బైకిఁ దీయఁగలవు కాని తలఁగొట్టుకొనినిమైన పిల్లవాని హృదయమునుండి రహస్యమును నీవు తీయలేవు. ఇది భిన్నభిన్న నర వ్యక్తులలో నెట్లు సత్యమో సాముదాయక నరజాతి వ్యక్తియందంత సత్యమే. అందుకొఱకే వామనుఁడు మాయకాఁడయ్యెను. ప్రపంచమం దితరజాతులలో ఎవల్యూషన్‌పైఁ గలిగిన యన్నిగ్రంథములు తెచ్చి యొకపెద్దకాటాలో నొక్కప్రక్క నుంచుము. "మత్స్యఃగి కూర్మ వరాహశ్చాచ నారసింహాశ్చ వామనః, రామో రామశ్చ రామశ్చ బుద్ధః కలికియేవచ" యను శ్లోకమును దాటాకుముక్కపై వ్రాసి దానిని రెండవవైపున నుంచుము. సంస్కృతశ్లోకమే బరువుగా నున్నదే! వెరిగుడ్ వెరిగుడ్. ఇతరగ్రంథములలో వివరము లెక్కువయుండనీ! గాని—ప్రిన్సిపల్ అంతయు నొకటి. అదిగాక వారి ఎవల్యూషన్ నరునిపుట్టుకతోఁ బూర్తియైనవి. "మత్స్యఃగి కూర్మవరాహశ్చాచ నారసిం హాశ్చ వామనః" అంతటితోడనే వారి ఎవల్యూషన్ పూర్తియైనది. మనయేర్పాటుప్రకార మింక నర్ధశ్లోకము తరువాయియే యున్నది. ఉత్తరార్ధము దేనినిగూర్చి చెప్పుచున్నది? ఏనరజాతికి వామనుఁడు మొదటిమచ్చుగాఁ దీసికొనఁబడినాఁడో యానరజాతి యేయేమెట్లెక్కి

తుదకుఁ బరిపూర్ణాభివృద్ధి నొంది యేయే మెట్లుదిగి క్షీణించి క్షీణించి తుదకుఁ బశుత్వములోఁ గలసిపోయినదో యాయెగుడుదిగుడుమార్గము చెప్పుటకీయుత్తరార్ధము చెప్పఁబడినది. ఇదే ఇన్‌వలూ్యషన్‌కు మార్గము. పుట్టి యెదిగి పెరిగి వస్తువునకు క్షీణదశ శుష్కదశ నాశనదశ చెప్పకుండు నెడల వస్తుతత్త్వ పరిపూర్తి యేదీ? ఛీ! పాశ్చాత్యులు ఇన్‌వలూ్యషన్ ఒప్పుకొనకపోయినయెడల మనమీసముమీఁద నొక్క వెంట్రుకయైన నూడలేదు. థూ! సెల్ఫుషేవింగు చేసికొనువాఁడు స్నాదే—స్వయంపాకనియమస్థుఁడైన యాహితాగ్ని యన్నమాట—ఉఫ్ ఉఫ్ మని ప్రొయ్యి యూఁదినప్పుడు మీసములు కాలుననియే మన వారు శ్మశ్రుముండనము శ్రోత్రియత్వమండనముగాఁ జెప్పినారు. This is the Economic and Scientific aspect of the problem.

"అదిగో అదిగో తిరుగఁ దప్పాడుచున్నావు, వామనునితరువాత నేమిచెప్పఁదలఁచితివో చెప్పు."

"పరశురాముఁడు—ఛీ ఛీ వట్టికఠినుఁడు. ప్రభులోకమునంతను బనసకాయపొట్టుక్రిందఁ గొట్టినాఁడు. ధరణీనాథుల లెక్కయేమి తల్లి గొంతునే కోసినాఁడు—తండ్రి సెలవైనదని తల్లిగొంతు కోసినవాఁడు—తల్లిసెలవైనయెడలఁ దండ్రిగొంతు కోయుట కభ్యంతరమేమి? పరమ కిరాతుఁడు కాని వట్టి యమాయకుఁడు. చూచితివా వామనునిలోనున్న మాయ వామనుఁ డెదిగి పరశురాముఁ డగుసరి కెట్లు మాయమైనదో! ఈసంగతి ప్రకృతి సత్యము, జ్ఞప్తియందుంచుకొనుము. మఱియొకటి—జంతుస్వభావమైన క్రౌర్యము నరజాతి పరిణామదశలో నీయవతారము వఱకుఁగూడ నింక వృద్ధియగుచునే యున్నది. పరశురామునిలో నున్న సింహ మింక శతగుణముగ బొబ్బరించుచునేయున్నది. శాంతిలేదు. క్షమ లేదు. అహంకారవర్జనము లేదు. అడఁకువలేదు. బ్రాహ్మణ్యము నామ మాత్రముగ నున్నది. కర్కశక్షాత్రముగ క్రౌర్యసహితమై గాఢముగ నున్నది. ఇఁక నీతని వదలిపెట్టి పైకిఁబోవుదము. అదిగో అదిగో పడ వోయి. మనతండ్రి శ్రీరామచంద్రమూర్తి కాళులపైఁ బడవోయి! ఓ! నామనస్సునకు నచ్చినవాఁడు నరజాతికిఁ బరిపూర్ణాభివృద్ధి ఈయవతార మందే. నరజాత్యభివృద్ధికి రాముఁడే శిరోనక్షత్రము. తెలియలేదా!

ఇతఁడు పరిపూర్ణబ్రాహ్మణుఁడు. పరిపూర్ణక్షత్రియుఁడు పరిపూర్ణప్రభుఁడు పరిపూర్ణభర్త. పరిపూర్ణపిత, పరిపూర్ణమిత్రుఁడు. పరిపూర్ణసోదరుఁడు. పరిపూర్ణబంధుఁడు పరిపూర్ణవైరాని. పరిపూర్ణసేవకుఁడు. పరిపూర్ణమనుజుఁడు. నరత్వ మిచ్చటఁ బరమావధినొందినది. ఇచ్చటనుండియే దిగుదల మొదలుపెట్టినది. వడి మఱలినది. తీఁత యారంభమైనది. అదిగో! యిసుక దిబ్బలు. ఊటలంక యదిగో! అరరే పొగాకునకు చల్లతెర బట్టినదిరా! మొలగజ్జికి పొగాకంతమందు లేదు సుమీ. పొగాకువాసన దగిలినచోట మహామారి ప్రవేశింపనేరదు.

"అయ్యా! శీఘ్రముగఁ దరువాతిసంగతికూడఁ జెప్పు" మని యాతనిని బతిమాలితిని.

"నాన్ సెన్సు నీతో నందరయేకాని చెప్పకుందునా? రామో రామశ్చ రామశ్చ—ఇఁక మూఁడవరాముఁడు—రాముఁ డనగా బలరామ కృష్ణులని యర్థము. అస్త్రములు పోయినవి. శస్త్రములు పోయినవి. అంబుల పొదులు పోయినవి. పూర్వక్షాత్రము రూపాయలో ముప్పావులావఱ కెగిరిపోయినది. పరశురామునిచేతిలో గండగొడ్డలి యేమి? బలరాముని చేతిలో నాగలియేమి? ఇప్పటికి యెంతదిగిపోయినదో చూడు. అదిగాక వామనావతారములో నున్న మాయవంటి మాయ తిరుగఁ గృష్ణునిలో నారంభమైనది. నరజాతి చిన్నతనములో మాయ అనఁగా వామనావతారములో మాయ-మధ్యవయస్సులో మాయలేదు. (అనగా బరశురామ శ్రీరామావతారములలో) మఱలుదలవయస్సులోఁ దిరుగ మాయ. (కృష్ణావతారములో) ఈసంగతి జ్ఞప్తిలోనుంచుకొనవలయును నరవ్యక్తులలోఁగూడ నిట్లే. అదిగాక మఱియొకసంగతి. పరశురాముఁడు బ్రహ్మచారి. శ్రీరామచంద్రుఁ డేకపత్నీవ్రతుఁడు. కృష్ణున కెనమండ్రు భార్యలు. పదునాఱువేలు గోపికలు. చక్రము పట్టలేదు విల్లు వంపలేదు. మహానుభావుఁడు. కన్నుగీటినంత మాత్రమునఁ బదునెనిమిది యక్షౌహిణుల సైన్యము చచ్చినది. పదునాఱువేల గోపికల యిండ్లలో ననుక్షణము సంచరించుచున్నను నస్ఖలిత బ్రహ్మచారి. కృష్ణా! నమస్తే నమస్తే నమస్తే.

కృష్ణుని యవసానమైనపిమ్మట నరజాతితత్త్వములో నరవ్యక్తితత్త్వములో క్షాత్రము పూర్తిగాఁ జచ్చినది. గాత్రబలము ధ్వస్తమై

నది. మోసము హెచ్చినది. అనేక కాంతాలోలత హద్దుమీఱిపోయి నది. స్వసుఖవాంఛ సంపూర్ణబలాన్వితమైనది. శ్రీరామావతారమునకు బుద్ధావతారమునకు నెంత యేతపెట్టుగా నున్నదో చూచితివా? ఓ అనుక్షణము సమస్తయోగ్యతలు దిగిపోవుచున్నవి. అట్టిసమయ మున బుద్ధుఁ డవతరించినాఁడు. వేదము లేదు. భగవంతుఁడు మిథ్య. ఆత్మ నహి. మోక్షమిల్ల యని యామహానుభావుఁడు బోధించినాఁడు. ఇదివఱకే దిగిపోవుచున్న యవస్థలో నుంటిమేమో యిది మఱింత దిగ లాగినది. బుద్ధుఁడు ప్రేమమతము బోధించినాఁడు కాని యొకని నొకఁ డెందులకుఁ బ్రేమింపవలయునో యాకారణమును దిన్నగఁ జెప్పలేక పోయినాఁడు. అతని నీతికిఁగూడఁ గారణ మంతగా నగపడదు. నీ వెప్పు డైన సంధ్యావందనము జేసినావా? బౌద్ధావతారే యని యెచ్చటనైన నున్నదేమో జ్ఞప్తియున్నదా? అదేయిది ఇప్పటి దైహిక మానసిక సాంఘిక నైతికావస్థలన్నియు నీకే తెలియును. నేను జెప్పవలసిన దేమున్నది? ధనమే దైవము. స్వసుఖమే మోక్షము. ఈప్రక్కను వేశ్య ఆప్రక్కను దాసి. ఈచేతిలో బ్రాందిబుడ్డి ఆచేతిలోఁ జుట్ట. ఆజేబులో నోట్లకట్ట ఈజేబులో సిగరెట్లపెట్టె. వాచిజేబులో సెంటు బుడ్డి. టిక్కటుజేబులో నల్లమందు. గొంతుకకుఁ ద్రాడు. పాదన్ మీఱ కుండ జోడు ప్రేగుజాఱకుండబెల్టు. మఱి నాపిండకూడు. నల్లమడుగు. ఈదిక్కుమాలిన వేషముతో మగవాఁ డున్నాఁడు. ఇఁక నాఁడుదాని వేషము శాంతమ్ పాపమ్. శాంతమ్ పాపమ్ చెప్పనే వీలులేదు.

"కోకమీఁద గొల్లభామోయినాసామి రైకమీఁద రాజహంస పేడి మూఁతికి నూగుమీసం నాసామి బోడితలకు తమలపాకు." ఓహూోహూో వహావ్వారే.

"ఛీఛీ! ఇఁకఁ గట్టిపెట్టు. అంతటితోఁ జాలును. కలికమూర్తినిఁ గూర్చి యేమైనఁ జెప్పుదువా?"

ఇఁక నేమున్నది. ఇఁకనేమున్నది. కలికావతారము వచ్చినపిమ్మట జాతివర్ణభేద మెంతమాత్రము లేక యందఱు కలసి యొక్కగూనలోఁ గల్లుత్రావి యొక్కగొడ్డును బీఁకుకొని తిందురు. వావివరుసయు లేక జనులెల్లరు ప్రవర్తింతురు. ఇప్పటికే మీఁగాళ్లవాపు మొగముమీఁదఁ

గనఁబడుచుండఁగా నన్నడిగెద వెందులకు ? అందఱు వట్టిపశువులగు దురు కొంతకాల మట్లుండి శాఖా ప్రపంచములోనికి జంకిపోవుదురు. అంత నగ్ని ప్రళయము కలుగును. దానిపై జలప్రళయము కలుగును. ఒక్కటేసముద్రము. దానిలోనిది నీరో పాలో యేమియుఁ దెలియదు. ఆసముద్రముపై 'ఒకటి పండ్రెం డైనయప్పుడు నాలుగే సున్నయిన యప్పుడు ఆకుమీఁది రామచిలుక యట్టె సుఖముగ నిద్రబోవు దీని భావము దెలియవలెనండి జనులార మీరుదీని.'

అని వెఱ్ఱిరామశాస్త్రియన్నగారు చెప్పినట్లుండును తెలిసినదా ? ఎవల్యూషన్ చెప్పుమని నీవడిగినప్పటికి ఇన్వల్యూషన్‌కూడ బోధించి నాము. డబ్బిమ్మనుసరికి రెండుడబ్బులిచ్చు స్వభావముచేత నాలాగునఁ జేసితిమి. అయినను దప్పులేదు. "మత్స్యః కూర్మవరాహా చ నార సింహశ్చ వామనః, రామో రామశ్చ రామశ్చ బుద్ధః కలికయేవ చ" యను నీయొక్క శ్లోకమునకే మనపురాణములు నితిహాసములన్నియు వ్యాఖ్యానములు సమస్తసృష్టి. యీశ్లోకమునకే వ్యాఖ్యానము సాల గ్రామములలో మత్స్యమూర్తి మొదలుకొని కలికమూర్తివఱ కన్ని మూర్తు లున్నవి. స్త్రీపురుషులలో మత్స్యముఖులు, కూర్మముఖులు, వరాహముఖులు, సింహముఖులు, వామనముఖులు, రామముఖులు, కృష్ణ ముఖులు, బుద్ధముఖులు, కలికముఖు లున్నారు. ఇదిగాక మఱియొక్క చిత్రమును జెప్పెదను. వినుము. ప్రపంచమునందున్న, యుండిన నుండఁ బోవు జనులందఱుస్వభావములు కూడ నీశ్లోకమునఁ జెప్పిన పదిలోనే యిమిడియున్నవి. ఇందులోనిది కొంత యందులోనిది కొంత కలసి సాంకర్య ముండవచ్చునేమో కాని యీపదినిమించిన స్వభావములు మాత్రము లేవు ముమ్మాటికి లేవు. ఇక నీకుఁ జెప్పవలసినది లేదు పో" యని యాతఁడు తటాలున లోనికిఁ బోయెను.

నాయనలారా ! పిచ్చివాని ప్రలాపములను వింటిరా ? అసందర్భా లాపము లేగదా యని యలక్ష్యముచేయక రవంత యోజించుకొనుఁడు. యోజించుకొన్న మీఁదటఁ గూడ నసందర్భములని తోచిన యెడల మఱచిపొండు.

---

# 18. దేశకాలపాత్రములు



జంఘాలశాస్త్రి యిట్లు పలికెను—

"నాయనలారా ! యీదినమున నొకపండితుఁడు సాక్షిని జూచుటకు వచ్చినాఁడు. సాక్షి యీగ్రామమునందున్నాఁడని నమ్మి యాయన యిటకు వచ్చియుండెను. ఆయనయొద్దకుఁ బోయి సాక్షిసంఘమున నొక యుపన్యాస మిమ్మని యాతనిని బ్రార్థించితిని. అందుల కాతఁ డంగీకరించెను. ఆయన యదిగో యిక్కడికి వచ్చుచునే యున్నారు. మీరు లేచి యాయనకు స్వాగతమిండు. (అంత అట్లుచేయుదురు) అయ్యా ! మీ రుపన్యాస మారంభింపవచ్చును."

"నాయనలారా ! మనుజుని దేహతత్త్వము మనస్తత్త్వముకూడ దేశకాలపాత్రములఁబట్టి యుండునని పెద్దలు చెప్పినమాట యసత్యము కాదు. ఏదేశమున నేకాలమున నేపాత్రములందు మనుజుఁ డుదయించునో యాదేశమునుబట్టి యాకాలమునుబట్టి యాపాత్రములబట్టి యాతనిదేహమనస్తత్త్వములుండునని మనవా రభిప్రాయపడుచున్నారు. ఉష్ణప్రదేశములందుఁ బుట్టువారు సన్నిహితసూర్యతేజముచేఁ గాలవర్ణమున నుందురు. సామాన్యోష్ణప్రదేశములఁ బుట్టినవారు సర్వసాధారణముగాఁ బచ్చనిరంగుకలవారై యున్నారు. శీతాతిశీతప్రదేశముల జన్మించినవారు మంచుగడ్డవలెఁ దెల్లగ నుందురు. అత్యుష్ణప్రదేశములందుఁ బుట్టినవారిదేహములు కొలఁదికాలములో నెదిగి స్వల్పకాలమే బలిష్ఠములైయుండి త్వరలో క్షీణించి నాశనమొందును. ఈప్రదేశములందలి పురుషులు దాదాపుగాఁ బదునేనుసంవత్సరములకే బాగుగా నెదిగి యిరువదియయిదువఱకుఁ బూర్ణబలాన్వితులై యుండి యంతటినుండియే యుత్తరవయస్సులోఁ బడి క్రమముగా క్షీణించి నలువదిలోపలనే నాశనమొందుదురు. నిజముగా నార్యావర్తసాముదాయికాయుస్థితి ముప్పదికంటె నెక్కువయేలేదని నే ననుకొందును. పదునాలేండ్లకే

భార్యతోఁ గలిసి పదునేడవయేటికే పానపాము వంటి బిడ్డకుఁ దండ్రియై వాఁడు తొట్టెలో బాలులేక తాను ప్రక్కమీఁద నోపికలేక యేడ్పు నవస్థలోనికి దిగిపోవును. మగవాని బ్రదుకే యిటులుండ నిఁక నాఁడు దాని బ్రదు కెంత చింతాకరమో యోజింపుఁడు. పదియేండ్లకు సమస్త స్నానము నాఁడే పునస్సంధానము. గర్భవేదనపడలేక పదుమూఁడుండు నెడలఁ బదునొకటవయేట తొండపిల్ల యంతబిడ్డకుఁ బిండిబొమ్మవంటి తల్లి. రామరామరామా! ఇది దురవస్థాగ్రగణ్యము. తానుగన్న పిల్లవంటి కొయ్యబొమ్మలతోఁ దానాడుకొనవలసిన వయస్సులో నింతపూచీతోఁ జేరిన యీశిశుపాలనకృత్య మహాభారము పర్వతమువలెఁ బైనఁ బడినప్పు డామె బ్రదు కెంత మహాకష్టభూయిష్ఠమో చెప్పవలయునా? తల్లియే పిల్లయైనప్పు డామెపిల్లయెంతపిల్లయో? సూతికాదిరోగములకై మందులుతిని, పిల్లరోగములకై చప్పిడిపథ్యములుచేసి, పిల్లయేడ్పు చేత రాత్రులు నిద్రలేక, పథ్యభోజనమగుటచేఁ బగటినిద్ర లేక, యన్ని దారులు బిగించిన కొట్టుగదిలో రేయింబగళ్లు వెలుఁగుచున్న గంటువంటి దీపమునఁగలిగిన దుర్గంధముచేత, వాము వెల్లుల్లిపొట్టు ధూపపుగొట్టు చేత, మ్రింగిన యింగువమాత్రల తెకతెకచేత, నూపిరిసలుపకుండ మంతురసాని బిగించిన యేనుగుమెలతనడుముకట్టువలనఁ గలిగినయాయా సముచేతఁ బిల్లవాని వేఁడిమికొఱకు నులకమంచము క్రిందఁబెట్టిన యూఁక కుంపటిపొగవలనఁ గలిగిన యుక్కిరిబిక్కిరిచేతఁ బీల్చినదుష్టవాయువునే మరలఁ బీల్చుటవలనఁ గలిగిన రక్తమాలిన్యముచేత సమస్తబాధలుపడి పడి తనతల్లికడుపు చలువయున్న యెడలఁ దానే సూతికాగృహమునుండి యీవలికి వచ్చును. తనబిడ్డ నిర్భాగ్యురాలే యగునెడల సూతికాగృహ మునుండి యావలికిఁ దీసికొనిపోఁబడును. హరిహరి! ఈబాధ యెంత యైన మనదేశమున నున్నది. దేహవికసనమునుగూర్చి యింకజాలును.

మనవారిబుద్ధులు బహుశీఘ్రముగ వికసించుచున్నవి. కొలఁది కాలమే పరిమళించి త్వరలోనే వాడిపోవుచున్నవి. బుద్ధి జాతి యత్యు త్కృష్టమనుట కేమాత్రము సందేహములేదు. కాని యతిశీఘ్రవికస నము. అతిశీఘ్రవృద్ధి—అతిశీఘ్రనాశనము కలది. ఇంద్రధనస్సువలె నది యెన్ని వన్నెలు చిన్నెలు గలదియైన నగును. కాని దానివలెనే

యల్పకాలపరిమితి కలది. సమస్తశక్తినిక్షేపమైన సూర్యుఁ డత్యంతసన్నిహితుఁడగుటచే నీబుద్ధులందుఁ దీవ్రత చండత నైశిత్యము ధాటి విశేషముగ నుండును. ఈబుద్ధులందు వింతయైన విద్యుల్లతలు ప్రకాశించుచుండును. ఎంతసేపు పరుగు — ఎంతసేపు దుముకు — ఎంతసేపు సమస్తావకాశవ్యాపనశక్తి వీనియందు నిరాఘాటముగా నిశ్శంకముగా నున్నవి. (ఉష్ణప్రదేశములందున్న నీగ్రోల కట్లున్నదా యని సభలోఁ గేక) నాయనలారా! చెప్పుచున్నాను. ఒక్క దేశముబట్టియే బుద్ధి ఘనాఘనత లుండవు. ఒక్క కాలమును బట్టియే యుండవు. ఒక్క పాత్రమునుబట్టియే యుండవు. దేశకాలపాత్ర సన్నిపాతమునుబట్టి యవి యుండును. ఈమూఁటినిగూర్చియు నొక్కసారియే చెప్పుట కసాధ్యమగుటచేఁ గ్రమమునుబట్టి యిప్పుడు దేశమునుగూర్చి చెప్పుచున్నాను. మీరడిగినప్రశ్న సరియైనదే—నీగ్రోలు నార్యులుకూడ నుష్ణదేశమందే యుండినను వారివారిబుద్ధుల కంతవ్యత్యాస మేల యుండవలయునని యడిగినారు. దేశస్థితియే సమానముకాని పాత్రస్వభావము సమానము కాదు. అందువలన నీవ్యత్యాసము గలిగినది. పాత్రస్వభావ మనఁగా నేమి? ఆర్యావర్తముననున్న, పాత్రాధిక్యమేమి? ఆఫ్రికాలోనున్న పాత్రహీనతయేమి? మొదటఁ దల్లిదండ్రులదేహ మనస్స్వభావమే పాత్రము. ఆర్యులు హిందూదేశమునఁ బ్రవేశించునప్పటికే కొంతనాగరకత కలవారు. ఆర్యావర్తమునఁ బ్రవేశించినపిమ్మట శీఘ్రకాలములో వారి నాగరకత పరిపూర్ణావస్థకు వచ్చినది. దేవతాప్రార్థనలందేమి, శత్రువిజయకార్యములందేమి, వాణిజ్యకృత్యములందేమి, కృషివ్యాపారములందేమి, పరిశ్రామికతంత్రములందేమి, యంత్రాదినిర్మాణములందేమి, వారు మహోన్నతదశకు రాఁగలిగిరి. మొదటిపాత్రము మాతాపితృతత్త్వవిశేషమని చెప్పితిని. ఆపాత్రమునకు సాహాయ్యపడిన యితరపాత్ర సన్నివేశ మేమనఁగా రత్నగర్భ యని సార్థకనామమును ధరించుట కేకారణమువలన సర్వవిధముల నార్యావర్తభూమి సమర్థమైనదో యాకారణసమూహమే యితరపాత్రసన్నివేశము. నేల యత్యంతము ఫలవంతమైనది. బంగారము పండదగిన పార్థివతత్త్వము ప్రపంచమున మఱియొకటి యేది? ఈవైపునఁ బంచోపనదులతోఁ గైలాసము

వెనుకనుండి కచ్చిపైవఱకు సింధునది. అది దాటి రవంత కుడి ప్రక్కకు రాఁగనే, యభవజటాజూటోద్భవయై, యనేకోపనదులతో, నమృతాధిక మాధుర్యధురీణాంబుప్రవాహముతో, ననేక శతయోజన పర్యంతావనీస్థల ఫలీకరణపాటవ ప్రాబల్యముతో, ననేక జన్మార్జితాఘ వినాశన మాహాత్మ్యముతో నార్యావర్తమున కామూలనుండి యీ మూలవఱకు జగజ్జనజేగీయమానప్రకాశముతోఁ బ్రవహించు నార్యావర్తభాగ్యదేవతయైన గంగాదేవి—మఱిరవంతఁదాటఁగనే ధవళగిరిపైన యెవరెస్టుపైన నాపై నున్న శిఖరములపైన నేమూలనో యుద్భవించి వాయువేగముతోఁ బ్రాగ్దిశగాఁ బ్రవహించి 'ఆస్సాము' నొద్ద మో చేతివాటముగా మఱలి దక్షిణముగఁ బ్రవహించు బ్రహ్మపుత్ర—ఇవి కాక నర్మద, మహాగౌతమి, తుంగభద్ర, కావేరి మొదలగు మహానదులు తమ శీతలత్వముచే తమ సరళత్వముచే తమ మాధుర్యముచే తమ పవిత్రతచే తమ ప్రవాహశక్తిచే నార్యావర్త జనసంఘ బుద్ధితత్త్వమునకు శీతలత్వము సారళ్యము మాధుర్యము పవిత్రతథాటి యొసఁగుటకుఁ జాలియున్నవని చెప్పుట యతిశయోక్తి కాదే. ప్రపంచపర్వతములలోఁ బ్రథమగణనీయమగు ప్రాలేయాచలము భరతదేశ మాతృదేవతకు హీరకిరీటమై ప్రకాశించుచుండ, వింధ్యాద్రి వజ్రాల మొలనూలై యుండ, సింహళద్వీపము పాదపీఠమైయుండ, సమస్త ప్రకృతివైచిత్రీ సన్నివేశ ప్రథమనిదానమైన భరతవర్షమునందుఁ గవులకు గాయకులకు భక్తులకు జ్ఞానులకుఁ గార్మికులకుఁ జిత్రలేఖకులకు నేమాత్రమైన లోపమున్నదా? నాయనలారా! యిట్టి పాత్రసన్నివేశ మాఫ్రికాలో నున్నదా! ఆఫ్రికాలోనే యన్నమాటయేమి? మఱియెచ్చటనైన నున్నదా? 1,30,00,000 చదురపుమైళ్లు గలిగిన 'యార్యావర్తములో మైలునకు మూడేసి దేవాలయము లున్నవే. ఎన్ని మహాగోపురములు—ఎన్ని యద్భుత ధ్వజస్తంభములు—ఎంత శిల్పనైపుణ్యము—ఆహాహా! ఎలిఫెంటాలోనున్న గుహాదేవాలయము 'లార్యావర్తదేశమునకేకాక యవనీస్థలికెల్ల నద్భుతజనకములు కావా? దేవతానిర్మితములవలెఁ గాక మనుష్యనిర్మితములవలె నున్నవా! తమ ప్రయోజకత్వముచేఁ గాక శక్తిలోపముచే రవంత యొకప్రక్కకొరగిన 'పైసా'లోని దేవాలయమును

ప్రపంచాద్భుత సప్తకములోఁ బాశ్చాత్యులు పరిగణించిరి కదా! యంతకంటె నాశ్చర్యజనకములగు నగుదేవాలయములసంగతి వారేల చెప్పలేదో? పోనిండు—అందులకుఁ బగవేల? ఇఁకఁ జిత్రలేఖనమును గూర్చి చెప్పెదను. ఈవిద్య బహుమృదులమైనదగుటచే దేహసౌష్ఠవముచేఁ జిత్తసౌష్ఠవముచే శరీరకుసుమకోమలతరలైన పూవుఁబోఁడుల యధీన మొనర్పఁబడినది. పుష్పములోని కేసరములకైన రవంతకఠినత కలదుకాని యార్యావర్తసుందరీమణుల—యందులో మహారాజకాంతల—యంగుళ్యగ్రములం దామాత్రమైన కర్కశత లేదే. ఒంటెకుచ్చునైన నుపయోగింపక వ్రేళ్లకొనలతోడనే రంగులుపూసి వారుచేసిన వింతసృష్టిలోని వింతవింతవ్యక్తు లార్యావర్తవిజిగీషులగు విదేశీయులు పాడుచేసినకోటలలోని యంతఃపురభాగములందలి కుడ్యములందింక—గోడమీఁదినుండి దుముకఁ బోవుచున్నట్లు—నోరుతెఱచి మాటలాడఁ బోవుచున్నట్లు—కులకాంతల యంతఃపురములోని కేలవచ్చితివిపో యా పలికిఁ బొమ్మని చేయియూఁపునట్లు—వెచ్చనియూరుపు పైకిఁబఱపునట్లున్నవే. పోయి కన్నులు కృతార్థములగునట్లు చూడుఁడు. హృదయము తాండవించునట్లు చూడుఁడు. చిత్రలేఖనవిద్యయు సంగీతము స్వభావసిద్ధముగ స్త్రీలసొమ్ము.

గానవిద్యనుగూర్చి రవంత చెప్పెదను. రాగప్రస్తారమునుగూర్చియుఁ దాళప్రస్తారమునుగూర్చియు మనదేశమునున్న యనుపమానమైన యగాధమైన యత్యంతవిపులమైన యద్భుతావహమైన శాస్త్రము మఱి యేదేశమున నున్నది? గానశాస్త్రజ్ఞానముఁ బరమావధిని భరతదేశమందే పొందినది. స్వరూపసౌందర్యముచే నేమి స్వరసౌష్ఠవసౌభాగ్యముచే నేమి యదియిది యననేల సర్వవిధములచే సంపూర్ణమైన గానకళా యంత్రమగు వీణ యేదేశమున నుద్భవించినదో యాదేశమున శారదాదేవి, యప్సరఃకాంతల వెనుకపాటలనడుమ, దేవతల పుష్పవృష్టులనడుమఁ, దుంబురునారదుల సాధుసాధ్వితి ప్రశంసాలాపపూర్వక శిరఃకంపములనడుమ, వాడలు తెలియని మహానందముతోఁ దాండవించుననుట కేమైన సందేహమా? మహీమండలిలోనున్న మంగళ

వాద్యములలో మహత్తరమైన దేది ? మద్దెలను మించినది మఱేదియుఁ గానఁబడదే !

కవితనుగూర్చి కాసంత చెప్పెదను. వేదములవంటి ప్రాచీన గ్రంథములు ప్రపంచమున లేవు. వేదఋక్కులలోనికవితవంటి నిప్పుని యతోన్నద్ధ్బుద్ధమైన కవిత్వము లేదు. వేదద్రష్టలవంటివారివల కెందులకు ! వ్యాసునివంటి బహుగ్రంథరచనాసమర్థుఁ డీమైదుఖండములలోఁగూడ నొక్కఁడైనఁ గనఁబడఁడు. వీరరసప్రధానమైనభారతేతిహాసము ప్రపంచమందలి వీరరసప్రబంధములలో నగ్రగణ్యమనుటకు సందియము లేదు. వ్యాసుఁ డొక్కఁడే కాఁడనియు ననేకు లావేరను గ్రంథములు రచియించిరనియు నూతనవిమర్శనము బయలుదేజేనమాట సత్యమే. దాని సంగీకరింతము. పోనిండు. విద్యారణ్యునివంటి శతాధిక గ్రంథకర్తను మఱియొక్కని పూర్వపశ్చిమార్ధగోళముల నగపఱుపఁ గలరా? కల్ల—వట్టికల్ల. రామాయణకవిత్వమంత సర్వాంగసుందరమైన కవిత్వము వెనుకలేదు ముందుండదు. పరదేశీయు లింక ప్రబంధ మన నేమో యెఱుఁగనిస్థితిలో నుండఁగా మనకాళిదాసుఁడు నాటకరాజము లనురచియించినాఁడు. ఉష్ణదేశముననున్న వారి భావనాశక్తియొక్కయెగు రలో స్వర్గమున కెగిరి, యొక్కజెటకాలోఁ బదునాల్గుభువనములుదిరిగి, యొక్కయూఁపులో "నలోకంబగు పెంజీఁకటి కవ్వల నెవ్వం డేకాకృతి వెల్గునతని" సేవింపఁగల మహావ్యాపనశక్తి గలదైయుండును. ఉష్ణ ప్రదేశమగుటచేత మనవారికి శృంగారరసమం దధికాదర ముండును. ఆ శృంగారరసమే భగవంతునిపైఁ బఱపిన భక్తి యగును. మన యార్యా వర్తదేశమున నొక్కగ్రామముననున్న దైవభక్తులు పరఖండములలో నొక్కదేశమందైన లేరు. ఆసేతుహిమాచలపర్యంతము మతమం దాసక్తిలేనివాఁడు లేఁడు. కట్టులో మతము. జుట్టులో మతము. బొట్టులో మతము. మాటలో మతము. పాటలో మతము. బ్రదుకులో మతము. చావులో మతము. చచ్చినతరువాతఁగూడ మతము. ప్రాక్తన కర్మమే మనల నాడించుచున్నదనియు, మన కష్టసుఖములు మనపూర్వ కర్మఫలములేయనియుఁ బడమూల్గకుండఁ దెగనీల్గకుండ వాని ననుభవింప వలయునినియుఁ బ్రారబ్ధమున కనుభవమునఁగాని క్షయము లేదనియు,

భారతదేశమునకు బరమహంస మొదలుకొని బానిసవఱకుంబరిపూర్ణవిశ్వాస మున్నది. ఏదీ ? అమెరికా దేశమున నొక్క గొప్పవర్తకుని ప్రారబ్ధ మననేమొ యడుగుము. భగవత్తత్త్వము సుగుణమా నిర్గుణమా యని యడుగుము. ఆ సామానేదో మేమెప్పుడు తెప్పించియుండలేదని అతఁడు చెప్పవచ్చును. అమ్మా ! నీపిల్లవాఁ డింత రోగభూయిష్ఠుఁడై యున్నాఁ డేల యని మనయూరిలోని ముష్టిదాని నడుగుము. ఏమని చెప్పును ? నాయనా ! పూర్వమం దెవనికో కుళ్లుకాయ దానమిచ్చినహేతువుచే నిప్పు డిది నాకు సిద్ధించినదని చెప్పును మతమే మనమూలుగులోని మూలుగై యున్నది. అలౌకికభావనాశక్తివ్యాపన ఫలమైనమతము మనకు బ్రప్రధానమైనప్పుడు, మనముక్కల కూఁపిరిగ్గౌనప్పుడు, మనకంటెకిఁ దేజమైనప్పుడు, మనజాతి యెంతభావనాశక్తియుక్తమైనదో వేఱ చెప్ప వలయునా ? ఈభావనాశక్తి యంతయు సవితృసన్నిహితత్వముననే వచ్చినది.

శీతలప్రదేశములం దుద్భవించినవారు సూర్యకాంతిదూరులగు టచే నల్లగనుండక శ్వేతరక్తవర్ణములు గలవారై యుందురు. వీరు బలిష్ఠశరీరులై యుందురు. దీర్ఘాయుష్మంతులై యుందురు. వీరిశరీర మాలస్యముగ వికసించును. విశేషకాలము పూర్ణశక్తిసమన్వితమై యుండును. మనలోఁ బదునాలేండ్లతల్లి—చేత నెడపిల్లతోఁ జంకను జంటిపిల్లతోఁ గడుపులోఁ గ్రొత్తపిల్లతోఁ గదలక హాస్సుహాస్సు మను చుండగా—నదేయీడుగల యాంగ్లేయబాలిక మగఁడనఁగ నేమో యెఱుగనిస్థితిలోఁ జేరి క్రికెట్టుబ్యాటుతోఁ జంకను బంతితోఁ గడుపు నకు బిగించినతోలుపటకాతోఁ గిలకిల నవ్వుచుఁ గేకలువైచుచు లేడిపిల్ల వలె నాటస్థలమునకు గంతులువైచుచుఁ బోవును. మనబుద్ధులు వికసించి నంతశీఘ్రముగా వారిబుద్ధులు వికసింపవు. మనలోఁ బదియేండ్లపిల్లవాఁ డెన్నియో గుంటచిక్కు లెఱిఁగియుండును. తల్లిని బింకముగ నెదిరింపఁ గలఁడు. తండ్రి నవలీలగఁ గన్నుకప్పఁగలఁడు. కనిష్ఠసోదరులపై నింటి పెద్దవలె నధికారము చేయఁగలఁడు. మంచిమాటలతోడనే వారిబొమ్మ లను హరింపఁగలఁడు. ఉపాధ్యాయునికుర్చిపైఁ బల్లేరుకాయలుంచినందు వలన నాతఁడు బాధపడుచుండఁగానానందవాచకపుస్తకముచాటుననానంద

మొందుచుఁ బ్రక్కనుగూరుచున్న బాలునిపైఁ బల్లేరుకాయతప్పును బడఁద్రోయఁగలఁడు. అదేయీడుగల యాంగ్లేయబాలుఁ డింక నతని నిర్ణయమునే నేర్చుకొనకుండ నమాయకుఁడై యమ్మగౌను కొంగు పట్టుకొని వదలకుండ నల్లరిచిల్లరిచేష్టలు లేకుండ నాడుకొను చుండును. మనలోఁ బదునాలుగేండ్లపిల్లవాఁడు పండ్రెండేండ్లయాఁడు దానితో మాటలాడవలసినప్పు డమాయకమైన యానందమయమైన యామెమోమును నిష్కపటమైన పరిశుద్ధమైన నిర్వ్యాంఛమైన బూర్ణ ముగ దెలిచిన కన్నులతోఁ జూడక, యోరచూపుల, వక్రిదొంగచూపుల నామె రవిక బొత్తాముల రవికయో మామూలు ముడిరవికయో మెడలోని జిగినీకి ముత్యెమఁలున్నవో మువ్వలున్నవో తెలిసికొనుటకుఁ గాబోలు సాభిలాషముగఁ జూచును. అదే యీడుగల యాంగ్లేయ బాలుఁడు తనచెల్లెలితో మాట్లాడిన ట్లామెతో మాటలాడి యానంద మొందును. మనవారిచదువు పూర్తియగుసరికి వారిచదు వారంభదశ వదలి యభివృద్ధిదశలో నుండును. మనవారైదుగురుబిడ్డలు గన్న వయస్సున నాతఁడు కోర్టింగు ప్రయత్నమునకై క్రొత్తకోటుకొఱకు గుడ్డ వెదకుచుండును. మనవారు పూర్ణాయుష్మంతులై నలుబదిదాఁటువఱకు జీవించియుండునెడలఁ జేతిలోఁ గఱ్ఱ కంటికి కాటరాక్టుతీసినతరువాతఁ బెట్టినజోడు, చెవికి బాకా, నోటికిఁ జొల్లు కడుపులో నల్లమందు, వీఁపుమీఁది రాచపుండుమచ్చ గలిగియుండఁగా నదేయీఁడున నాంగ్లే యుఁడు క్రొత్తగాఁ గాఁపురమునకువచ్చిన దేవకన్యకతోఁ దెఱపిలేకుండ 'హనీమూన్' ఆనందసముద్రమున నోలలాడుచుండును. మొత్తము మీఁద శృంగారసంబంధమగు సాంసారికసౌఖ్య ముష్ణప్రదేశస్థులమైన మనలో నున్నంతహెచ్చుగా వారిలో నుండదు. ఎన్ని దేశములు లేవు. ఎన్ని శాస్త్రములులేవు. మనదేశముననున్న కామశాస్త్రము మఱి యింక నెక్కడిది!

ఇఁక బుద్ధినిగూర్చి రవంత యోజింతము. వారిబుద్ధి విశేష ద్రఢిమకలది సూక్ష్మమైనది కాదు. స్థూలమైనది. బర్మావలె కఱకఱ యడుగువఱకుఁ గోయలేదు. సమ్మెటవలెఁ జావఁగొట్టి సాగఁదీయును. రసో ద్రేకముతోఁ జేరని సర్వకళాశాఖలందు వారు మనకంటె ఘనులు,

కంటికితోఁజూచి పరీక్షించి సామ్యవస్తువులను జేరఁదీసి సామ్యగుణమును గనుపెట్టి దాని తత్త్వమును నిర్ణయించి లోకమునకు వెల్లడించుటలో వారుత్కృష్టులనక తప్పదు. వారిబుద్ధి యెంతసేపు దేశమువలెఁ జల్లనిబుద్ధి. ఎంతసేపటికైన వేడి యెక్కదు. తాఁబేలువలె నిమ్మళముగ నడచును గాని లేడిపిల్లవలెఁ బరుగెత్తదు. రవంత పరుగెత్తి కాళులు లటలట లాడ గుండె దడదడలాడ నాలుక వ్రేలాడ వగర్చుకొనుచుఁ జెట్టుక్రిందఁ బండుకొనదు ఆమందగమనముతోడనే కష్టములకు జంకక యభ్యంతరములకు లొంగక యాయాసమునకు లోనుగాక యంత్యశ్వాసము వఱకుఁ బోవును. రసవిజృంభణము వారిసొమ్ముకాదు అది మనది. వారు శారీరశాస్త్రములో శాఖాశాస్త్రములో జంతుశాస్త్రములో దశాస్త్రములో ప్రకృతిశాస్త్రములో యంత్రనిర్మాణశాస్త్రములో వర్తక శాస్త్రములో వంటశాస్త్రములో రాజకీయశాస్త్రములో వస్తువులు సంకెలు గీతలుగల యన్నిటిలో వారు మహాధీశాలులనక తప్పదు. కేవల భావనాశక్తిపై నాధారపడిన సమస్తకళలలో నుష్ణప్రదేశస్థుల కాధిక్యమీయక తప్పదు. గొప్పగొప్ప కళాభిజ్ఞులు వారిలో ననేకులు లేరాయని యందురేమో. మనలోకంటె నెక్కువలేరు. ఉన్నవారైనను గళలలో గట్టివారేలరైరో కాలమునుగూర్చి చెప్పినప్పుడు చెప్పుదును. బుద్ధి నిశ్చలత్వములో శీతలప్రదేశస్థులకు విజయపత్రమీయక తప్పదు.

Imagination భావనాశక్తిలో Emotion రసమయత్వములో మన మధికులమనుట నిస్సంశయము Intellect ధీశక్తిలో will లో వారు ఘనులనుట యంతకంటె నిస్సంశయము. వారు కష్టముల కోర్వఁగలవారు. మన కాశక్తి కొంత తక్కువ. వారిహృదయముల దయారసము తక్కువ. మనకున్న భండారమే యది. వారినిశ్చితముక్కుకంటె వజ్రముకంటె గట్టిది. మనది వెన్నపూసకంటె మెత్తనిది. వారికి వారమున కొక్కదినము గుడికిఁ బోవునెడలఁ గొల్ల. మనకు నిత్యదేవతార్చనమైన పిమ్మటనే కాని ప్రాణాహుతులు లేవు. మతమనునది వారికున్న యన్ని వ్యాసంగములలో నొక సామాన్యప్రాధాన్యముకలది. మనకు మతమే సర్వస్వము. దేశమునుగూర్చి యింకఁ జాలింతును.

దేశకాలపాత్రములని చెప్పియుంటినిగదా. ఇఁకఁ గాలమును

గూర్చి చెప్పెదను. దేహతత్త్వము మనస్తత్త్వము దేశమున కెట్లధీనములై యుండక తప్పదో యట్లే యవి కాలమున కధీనములై యుండక తప్పదు. Spring, Summer, Autumn, Winter. అని శీతోష్ణాదిస్థితులంబట్టి సంవత్సరమును నాల్గుభాగములుగాఁ బాశ్చాత్యు లొనర్చిరి. మనవా రాఱుఋతువులుగా విభాగించిరి. మూఁడేసిమాసముల కొక పాశ్చాత్యర్తువు రెండేసిమాసముల కొక్కమనఋతువు. స్థూలముగా సంవత్సరమును వేసవికాలమని వర్షకాలమని శీతకాలమని సామాన్యులు విభజించుచున్నారు. ఫాల్గునము చైత్రము వైశాఖము జ్యేష్ఠము కలసి వేసవియనియు. నాషాఢము శ్రావణము భాద్రపదము నాశ్వయుజము కలిసి వర్షకాలమనియు, కార్తికము మార్గశిరము పుష్యము మాఘము కలసి శీతకాలమనియు, స్థూలవ్యవహారము, సామాన్యమనుష్యులలో నున్నది. విశేషవ్యత్యాసము లేనిహేతువుచేత మన మీవిభాగత్రయమునే విద్యమానవిచారమున నవలంబింపవచ్చును. విశేషదోషము లేదు. ఈలెక్కప్రకారము వేసవికాలములోఁ బుట్టినవారు మంచిచాయగలవారై తీవ్రస్వభావముకలవారై దీర్ఘదేహులై కల్పనాశక్తి కలవారై కళాభిజ్ఞులై సూక్ష్మగ్రాహులై చంచలస్వభావముకలవారై సత్యమందు కించిద్వైరాగ్యము కలవారై యుద్రేకము వచ్చినప్పుడు భక్తిసమగ్నులై యాతీవ్రత యడఁగినప్పుడు గ్రామ్యసుఖసక్తులై కోపనులై పశ్చాత్తాపయుక్తులై యుందురు. పుట్టినకాలమే నరునిస్వభావమును శాశ్వతముగా స్థిరపఱచుటకుఁ జాలియున్న దని తెలిసికొనఁదగినది. ఆకాల మెంత వివరముగాఁ దెలియునో నరునిస్వభావ మంత విస్పష్టముగఁ దెలియును. ప్రతివస్తువు నందుఁగూడఁ బృథ్వీతత్త్వము విశేషముగ నున్నది. అట్లే నరునిలోఁ గూడ నున్నదని వేఱ చెప్పనక్కఱలేదు. పృథ్వి యాపస్సు తేజము వాయువు నాకాశము నని పంచభూతములు. వేసవికాలమందుఁ బ్రబలమైన భూతము తేజస్సు. వర్షకాలమునందు వాయువు. శీతకాలమునం దాపస్సు—అనఁగ నీరు. ఇవిగాక పిత్తము వాతము శ్లేష్మమని మూఁడు ప్రధానవిధములగు నాళ్లు. వేసవికాలమునఁ బైత్యము వర్షకాలమున వాతము శీతకాలమున శ్లేష్మము ప్రధానములుగ

నుండును. వేసవికాలమునఁ బుట్టినవానికి శరీరమునందు మనస్సునందుఁ దేజ మధికముగా నుండుటయేగాక, దేహతత్త్వమునందుఁ బైత్య మధికముగా నుండును. వాతశ్లేష్మములు సామాన్యముగా నుండును. ఇట్టి వానికి మేహజాతిజ్వరముఁ బైత్యాధిక్యమునఁ గలిగిన యశక్తి, స్ఫోటకము, స్ఖలనదోషము, రక్తక్షయయు, మూత్రమున సుద్దకట్టు, తల త్రిప్పు, నపస్మారము, నేత్రరోగము, ఎక్కిలి, మతిభ్రమము, దడ మొదలగు హృద్రోగములు సంభవించును. ఇంతవఱకుఁ జాలును. వర్ష కాలములో - ఆషాఢము శ్రావణము భాద్రపదము నాశ్వయుజము - ఈమాసములలోఁ బుట్టినవానికి దేహమనోనిర్మాణములందు వాయువు ప్రబలముగా నుండును. వేసవికాలమునఁ బుట్టినవానికిఁ బైత్యనాడి యెట్లు ప్రబలముగా నుండునో వర్షకాలమునఁ బుట్టినవానికి వాతనాడి యట్లు ప్రబలముగా నుండును. ఇతఁడు సర్వసాధారణముగాఁ జామనచాయ గలిగి యుండును. పొడుగువాఁడు కాఁడు. పొట్టివాఁడు కాఁడు. ఇతఁడు కోపముకలవాఁడే కాని సాధ్యమైనంతవఱ కడఁచుకొనియుండును. తీవ్రమైన వాగ్ధోరణి కలవాఁడు కాఁడు. రవంత నిశ్చలమైన యభిప్రాయములు గలవాఁడు. దైవచింతకలవాఁడు. న్యాయమందు బుద్ధికలవాఁడు. తొట్రుపాటులేని మనస్సుకలవాఁడు. వ్యవహారమందు నిపుణుఁడు. ఈ మొదలగుగుణములు కలిగియుండును. ఇట్టివానికి వాతజ్వరము వాత సంబంధమగునజీర్ణి, కీళ్లవాతము, ప్రక్కశూల, పక్షవాతము, చచ్చు వాతము, నక్కమోరు, కీళ్లవాపు, మలబద్ధత, క్రిమివాతము, తిమ్మిరి వాతము, విషూచి మొదలగువ్యాధులు సంభవించును. ఇఁకను శీత కాలమందు—అనఁగఁ గార్తిక మార్గశీర్ష పుష్య మాఘమాసములలోఁ బుట్టినవానికి దేహమనోనిర్మాణములయందు నీరు ప్రబలముగా నుండును. వేసవికాలమందుఁ బుట్టినవానికిఁ బైత్య మెట్లు ప్రధాననాడియో వర్ష కాలమందుఁ బుట్టినవానికిఁ ననఁగా—వాయుతత్త్వమువానికి వాతమెట్లు ప్రధాననాడియో, శీతకాలమందుఁబుట్టినవానికి—ననఁగానాపస్తత్త్వము వానికి శ్లేష్మనాడి యట్లుప్రధానము. అట్టివానికి జలోదరము బోదకాలు- అండవాతము—ఉబ్బుశ్వాసము క్షయ ఉబ్బసము గ్రహణి విషపుబడి సెము మొదలగువ్యాధులు సంభవించును. ఇతఁడు పరమశాంతుఁడు.

స్థవిష్ఠదేహము కలవాఁడు. నల్లనిరంగుగలవాఁడు. ఆహారాదిత్రయాసక్తుఁడు. మాటలాడునంతలో గుఱ్ఱుమని గుఱ్ఱుతీయువాఁడు. లెక్కలలో సమర్థుఁడు. వ్యవహారనిపుణుఁడు. స్థూలమైన బుద్ధిగలవాఁడు. ఇతనికి సర్వసాధారణముగా నేదియు మనసున నెక్కదు. ఎక్కినదేదో విడువడు. తొందరపాటులేనివాఁడు. ఇట్టిగుణములు గలిగి యితఁడు చిరకాలజీవియై యుండును.

శీతలప్రదేశములందైన నుష్ణకాలమధ్యమునఁ బుట్టినవారికిగూడ మంచి కళాభిజ్ఞత యుండును. ఉష్ణదేశములందైన శీతకాలమందుఁ బుట్టువారికి కళావైముఖ్యము సిద్ధించును. దేహమనస్తత్త్వములకు మూలకారణములు దేశకాలపాత్రములు. వీనితరువాత శిశుపోషణ వైఖరులు. విద్యాభ్యసనవైఖరులు, సహవాస స్వభావవైఖరులు, వృత్త్యాదివైఖరులు మొదలగునవి యాయాదేహమనస్తత్త్వములను గొంత బలపఱచుటకుఁ గాని క్షీణింపజేయుటకుఁ గాని చాలిన కారణములగును కాని దేహమనస్తత్త్వములందుఁ బ్రథమముద్రను, బ్రధానముద్రను వేయునవి జన్మదేశకాలములు. తరువాతఁ గలిగిన కారణములంత ప్రబలమైనవి కావు. ఇదివఱకున్న దేహమనస్తత్త్వములకు రవంత వన్నెలు చిన్నెలు పెట్టుటకు, రవంత సాపుచేయుటకుఁ గాసంత వెఱ్ఱితలను ద్రుంపుటకు, రవంత యెగుడు దిగుడులను సవరించుటకుమాత్రమే యక్కఱకు వచ్చునని తప్పక తెలియఁదగినది. ఏకాలమం దెవ్వఁడు పుట్టునో సర్వసాధారణముగా వాఁ డాకాలమందే మరణించును. అదికాక యాకాలమునఁ బ్రకృతినిబట్టి యేయేవ్యాధు లుండునో వానిలో నేవ్యాధిచేతనో మరణించుటగూడ సర్వసాధారణముగా జరుగుచున్నది. జన్మస్థలమందే మరణించుటకు బ్రతి జనుని కెట్లు మహావాంఛయుండునో యాత్మకు దేహముతో సంబంధ మేమాసమం దేగడియయందు గలిగినదో యామాసమందే యాదినమందే యాగడియయందే దేహసంబంధము విడుచుట కాత్మ యట్లుత్సాహమొందుచుండును. కావున బుట్టినదినము ప్రతి నరున కుత్సాహదినము గాదు ఉత్పాతదినము. పర్వదినము కాదు భయంకరదినము. మంగళదినము కాదు మరణదినము. పుట్టినదినము గండదినమని నిశ్చయింపవలసినది. ఏకారణముచే

నట్లుయ్యెనో యిప్పుడు చెప్పుటకు నాకవకాశము లేదు, ఈయంశమును గూర్చి యొకపర్యాయము కాంబోలు జంఘాలశాస్త్రి గారు చెప్పియుండిరని నాకు జ్ఞప్తి యున్నది. పుట్టినదినములందు పలావు తినవలసినది కాదు. పరమేశ్వరారాధన మొనర్పవలసినది. కారపుబూంది బాసంది తినవలసినది కాదు గండశాంతికై రుద్రాభిషేకములు చేయింపవలసినది. వేశ్యా నృత్త గానాదులతోఁ గాలక్షేపము చేయఁదగినది గాదు. వేదవిహిత శాంతిసమారాధనములతో దైవపూజలతోఁ గాలక్షేపము చేయఁదగినది అని జన్మదినములలో నలువదియవది మహాగండము. అది మహాగండము కావుననే దానికి మహాగండమనియే మనవారు పేరిడిరి. ప్రత్యాస్తికుఁడును షష్టిపూజ చేసికొనక తప్పదు, అది వైదిక మహామంత్రము. వానినంతయు విధ్యుక్తముగా నెఱవేర్పవలయును. కొందఱు మహామహులు జన్మదినమునందే మరణించిరి. అది కాకతాళీయముకాదు. కారణనిబద్ధము. ఆకారణములన్నియుఁ జెప్పుట కిప్పుడవకాశము లేదు. క్షమింపవలయును. పాత్రమునుగూర్చి యిదివఱకే దేశసందర్భమునఁ యథోచితముగా మనవిచేసియుంటిని. అంతకంటె విపులముగఁ జెప్పుట యనావశ్యకము. ఇదివఱకే చాలఁ జెప్పితినికాంబోలు. నాతప్పులను మన్నింపవేఁడుచున్నాను. భగవంతుఁడు సర్వదా మిమ్ము రక్షించుఁ గాక.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 19. వాణీదాసునివిడుదల

సత్యపురమునుండి
15.7.22

ఆంధ్రపత్రికాధిపతిగారికి:—

జంఘాలశాస్త్రియనేకనమస్కారములు—మీసారస్వతానుబంధమునకు మేము ప్రతిశనివారము నొక్కయుపన్యాసమును బంపుచున్నాము. ఈదినమునఁగూడ నాయాచారము ననుసరించి పంపవలసినదే. కాని యట్లు పంపకుండుటకుఁ గారణమేమో యెఱుఁగుదురా? మావాణీదాసకవి కీదినమునఁ గారాగృహవిముక్తి కలిగినది ఇది మాకు మహోత్సాహదినము. కావున సాక్షిసంఘద్వార మీదినమునఁ దెలుపుటకు వీలులేదు. సాక్షిసంఘమున కీదినము సెలవిచ్చి మాసంఘకవిని గౌరవింపవలసియున్నది. కవిని దిట్టువారేకాని గౌరవించువారెవ్వరును లేరు. మాకవినైన నాతనికవిత్వమునుబట్టి యిట్లుగౌరవింపఁ దలఁచుకొనలేదు. కాలధర్మము నొందకుండఁ గారాగృహమునుండి వచ్చినాఁడని గౌరవింపవలసి వచ్చినది. కారాగృహవిముక్తుల నందఱను బ్రజలు గౌరవింపవలసినదా? స్వార్థలోలురై పరబాధాకరులై కారలోఁ బడి విడుగడయైనవారిని గౌరవింపనక్కఱలేదు. కాని స్వార్థపరిత్యాగులై, దేశక్షేమలాభాదులకై దేహస్వాతంత్ర్యపరిత్యాగమొనర్చి మోక్షము నొందినవారిని గౌరవింపక తప్పదు. వాణీదాసుఁ డీదినమున నుదయమున ముక్తుఁ డగునని కడచినరాత్రియే యిచ్చటి నిరాకరణ సంఘకార్యదర్శి చుట్టుపట్టులనున్నఁ బదిపండ్రెండు చిన్నగ్రామములలోఁ జాటించి తెలియఁబఱుప నుత్తరువిచ్చియుంటచే నీయుదయముననే యనేకజనులు పల్లెలనుండి వాణీదాసుని గౌరవించుటకు నుత్సవముదర్శించుటకు వచ్చియుండిరి. ఈదినమున దైవకటాక్షముచే మాగ్రామమందు బశువులసంతయగుటచే విజయనగరము తుంపాల యాప్రాంతముల నుండునట్టియు దాసూరామము కాకఱపఱ్ఱు నీప్రాంతముల నుండునట్టియు

కాపులనేకులు పశువులను గొనుటకో యమ్ముటకో వచ్చియుండిరి. గ్రామ మంతయు జనసమ్మర్దముచే మిగుల సంకులముగ నున్నది.

ఉదయమగుసరికే గ్రామములోని నిరాకరణవాదులు మఱి కొందఱు వాణీదాసుని కారాగృహమునొద్ద కేగి యాతని బహిరాగమ నమునకై నిరీక్షించుచుండిరి. "అదిగో! ఆవచ్చుచున్నవారు వాణీదాస కవిగారే" యని నిశ్చయపఱచుకొని "జయా! వాణీదాసకవిగారికి జయా" యని యచ్చటి జనలోకమంతయు నొక్కపెట్టున నార్చెను. అంతలో నచ్చటి మంగళవాద్యములన్నియు మ్రోయింపబడెను. ఆతఁడు దైవవశమున వాణీదాసకవికాక నియతమైన దుస్తు తీసివైచి యీవలికిఁ గాలకృత్యములకై కాంబోలు — వచ్చుచున్న రక్షకభటుఁడగు టచే నెవరిమట్టునకు వారు పశ్చాత్తప్తులై "సద్దుసద్దు" అని కేకలు వైచిరి. మంగళవాద్యము లన్నియు నాఁగిపోయినవి. కొంతసేపటివఱకు జనులు ఖద్దరువ్యవహారమునుగూర్చియు గాంధిమహాత్మునిగూర్చియుఁ గాలస్థితినిగూర్చియు మాటలాడుకొనిరి. ఎంతసేపటికిని వాణీదాసుఁ డీవలకు రాలేదు. ఇంతలో నెవ్వఁడో వచ్చి వాణీదాసుఁడు కారా గృహపుఁ బాణిద్వారమున విడువఁబడినాఁడని చెప్పెను. సింహద్వారము నుండి విడువబడవలసినవాఁడు పాణిద్వారమునుండి యేల విడువఁబడి నాఁడని రమ్డోలువాండ్రతో బాకాలవాండ్రతో మిగిలినవారందఱు దొడ్డిగుమ్మమునొద్దకుఁ బరుగెత్తిరి. అప్పటికే యాతఁడు తలవంచుకొని మాకెదురుగ నడచి వచ్చుచుండెను. జను లాతనిఁ గాంచి మహానంద భరితులై "జయా వాణీదాసునకు జయా" యని కేకలిడిరి. కాలాచార్యుఁ డుత్సాహపూరితుఁడై యాతనిమెడలోఁ దెల్లగన్నేరు పూలదండను వేయుచుఁ దొందరలో నాతనికంటిలోఁ దనవ్రేలి చిటికెలోనున్న బొడుముగూడ వైచెను. వాణీదాసుని బాష్పోద్గమమునకుఁ బట్టరాని యానందమేకాక పాటిపొగాకు పొడుముకూడఁ గారణమయ్యెను. నా కాతఁడు నమస్కరించి సాక్షి యెప్పుడు మదరాసునుండి వచ్చునని యడిగెను. ఆతని నాశీర్వదించి రెండుమూఁడుదినములలో సాక్షి వచ్చునని చెప్పితిని. జనులు మహోత్సాహమున దేశభక్తివిషయకములగు కీర్తనలఁ బాడుచు దైవభజనలు చేయుచు ముందునకు నడచుచుండిరి.

అప్పటి కూరిలోని కొందఱు వేశ్యాకాంతలు వచ్చి జనసంఘమునఁ గలిసి గన్నేరుపూలదండను బట్టి కారాగృహవిముక్త కవిశిఖామణిని గుర్తించి యాతనికి నమస్కరించిరి. వేశ్యలు జనసంఘమునఁ జేరరాదని యిచ్చటి జనులలోఁ గొంద ఱధిక్షేపింపగ "వారిప్పుడు పూర్వవృత్తులు మానుకొని దేశక్షేమమునకై నూలు వడకుకొని కాలక్షేపము చేయుచున్నా" రని కొందఱు వారిని బ్రశంసించిరి. కాలాచార్యుఁడు బొట్టుముక్కుగల యొకవేశ్యను గాంచి యామె పోడుముపీల్చును గాఁబోలునేమి యని యడుగవడి దెబ్బడి జనులకుమాత్రమే వినఁబడునంత మెల్లగా వాణీదాసు నడిగెను. ఆమెనే యడుగరాదాయని వాణీదాసుఁ డాతనికిఁ బ్రత్యుత్తరమిచ్చి నన్నుగాంచి "జంఘాలశాస్త్రీ! ఇఁక ముందు జరుగవలసినదేది?" యని యడిగెను. క్షురకర్మమని నేను బదులు చెప్పితిని. "అదికాదయ్యా! దేశక్షేమమునుగూర్చి యేమి జరుగ వలసినదని నే నడిగితిని" నని యాతఁడు పలికెను. "ప్రాయశ్చిత్తకర్మమైన తరువాత భారతదేశాభివృద్ధివిషయ మాలోచించుకొనవచ్చునులే, దేశ మోక్షమునకు నీవొక్కడనే తరువాయి యనుకొనుచున్నావు కాఁబోలు నేమి" యని నేనంటిని. నామాటల కాతఁడు కొంత కోపించి నాతో మాటలాడక యటునిటు చూచుచుండెను. ఇంతలో శివాలయము నొద్దకు వచ్చితిమి. ఈదినమున శనివారమైనను క్షురకర్మవిషయమైన తిథివారవిశోధనము కారాగృహవిముక్తునియెడలఁ జూడఁదగదను కారిక ననుసరించి యాతని కక్కడనే క్షురకర్మము చేయించితిమి. వాణీదాసు నికి జయా యని జనులు నాల్గుకేకలువైచి యెవరిదారిని వారుపోయిరి. మేమట్లు పోవుటకు వీలులేనివారమగుటచే నేనును గాలాచార్యులు నాతనియొద్దనే యుండి మృత్తికాస్నానములు రుద్రాభిషేకము మొద లగు విధులన్నియు శాస్త్రీయపద్ధతిగాఁ జేయించి మాయింటికిఁ దీసి కొనిపోయి పంచగవ్య మిప్పించి పరిశుద్ధునిఁజేసి భోజనమిడితిని. భోజన మైనపిమ్మట మాలో మేమిట్లు సంభాషించుకొంటిమి.

కాలా—వాణీదాసా! నీవు చుట్టకాల్చువాఁడవుకదా? నీకుఁ గారలోఁ జుట్ట యెట్లుదొరకెడిదో నాకుఁ జెప్పలేదేమి?

వాణీ—కారాగృహనిర్బంధమువలననే నాకాదురభ్యాసము

పోయినది. నీనస్యాభ్యాసముకూడఁ బోవునేమో నీవుకూడఁ గొట్టులోనికిఁ బోయెదవా యేమి? ఈమాటకేమి? కాని కారాగృహనివాసమువలన నిజముగాఁ గొన్నిలాభములు లేకపోలేదు. నేనొక్క గ్రంథము వ్రాసితిని.

జంఘూ—అది యేదయ్యా?

వాణీ—కారాగృహపద్ధతులలో నేయేదోషములున్నవో యవి యెట్లు నివారింపవలయునో యను విషయమునుగూర్చి వ్రాసితిని.

కాలా—ఆగ్రంథము పేరు?

వాణీ—కారాగార కాచారఖండనము

కాలా—“కాచార” యనఁగా నేమి? గ్రహచారమా?

వాణీ—దురాచారములని యభిప్రాయము.

జంఘూ—ఈపుస్తకము గద్యముననే వ్రాసితివా?

వాణీ—లేదు. పద్యముననే.

జంఘూ—పద్య మెందులకోయి నీమొగము! నీగ్రంథ మెవరు విందురని నీయభిప్రాయము? అరణ్యరోదనమువలె నీ కీకారాగృహ కవిత్వమెందులకు? పోనీ! వేణుగోపాలశతకమో కుక్కుటేశ్వరశతకమో వ్రాయలేకపోయితివా? కొందఱైనఁ జదివి సంతసింతు రేమో?

వాణీ—శతకముల కివి దినములుకావు.

జంఘూ—నీవంటి కవికిఁగూడఁ గావు.

వాణీ—నీవంటివక్తకుమాత్ర మివి దినము లనుకొనుచున్నావు కాఁబోలు. నీయుపన్యాసముల నెంద అధిక్షేపించుచున్నారో యెఱుఁగుదువా?

జంఘూ—వాణీదాసా! ఇదివఱకేమో పరిహసించితిని. కోపపడకుము. నేను వక్తనుగానని నేనెఱుఁగుదును. నాయుపన్యాసముల నధిక్షేపించుచున్నవారిని నేనెఱుఁగుదును. ప్రశంసించుచున్నవారిని నేనెఱుఁగుదును. అందులకు నాకు విచారము లేదు. ఇందులకు సంతోషమును లేదు. ఎందుచేతనో చెప్పనా? అధిక్షేపించుచున్నవా రెందుల కధిక్షేపించుచున్నారో యెఱుఁగరు. ప్రశంసిం చున్నవా రెందులకు ప్రశంసించుచున్నారో యంతకంటె నెఱుఁగరు. అట్టివారి నిందాస్తుతుల

తోఁ బనియేమి ? నీ వొకని శిరఃకంపనమునకు లక్ష్యపెట్టవలదు. మఱి యొకని మూతిముడుపునకు లక్ష్యపెట్టవలదు. ఒకనిదీవనను గణింప వలదు. మఱియొకనితిట్టును గణింపవలదు. అభిప్రాయప్రకటనమే ప్రతి వ్యక్తికి స్వభావము. వేదర్షులబుఱ్ఱ లెంత స్వభావజన్యములో కాలాంబుదములోని గర్జారావము లంత స్వభావజన్యములు. ప్రస వమునుండి వెడలిన పరిమళ మెంత స్వభావజన్యమో కవి ముఖోత్థిత మగు గీత మంత స్వభావజన్యము. మహావక్త యుఱిమిన యుపన్యాస మెంత స్వభావజన్యమో పెద్దపులి పైచిన అంకె యంత స్వభావ జన్యము. ఎవని స్వభావమునకుఁ దగిన, యెవని హృదయమునకుఁ దగిన, ఎవనివిద్యకుఁదగిన యెవని ముఖమునకుఁ దగిన పలుకు వానినుండి బయలువెడలుచున్నది. కణకణమను మృదంగమునుజూచి బెకబెకలాడు కప్ప యేడ్చిన వినియోగ మేమున్నది ? కలస్వరకలితమగు కలకంఠ మునుజూచి గాడిదె తన్నుకొని యోండ్రపెట్టిన లాభమేమి ? అదిగాక యొకవ్యక్తిని జూచి యొకవ్యక్తి యసూయపడుట కొకని ఘనతయేమి ? యొకని నీచతయేమి ? అన్నివ్యక్తు లల్పములే అన్ని యభిప్రాయప్రకట నలు కూఁతలే. వస్తుతత్త్వమున, దోమ గుంయిమనుట యెట్టిదో పెద్ద పులి గాండ్రుమనుట యట్టిదే. ఆఁకలిచేఁ గుక్క తోఁక నాడించుట యెట్టిదో పౌరుషమున సింహము కేసరముల జళిపించుట యట్టిదే. పర మార్థజ్ఞానాభావునకు, పామరాధమున కది యెక్కువ యని యిది తక్కువయని—యది మనోహరమని యిది కర్ణకఠోరమని కనఁబడును. నీవు బుద్ధిహీనుఁడవు కావున నీవల్పుఁడవు కావున నీవు జడుఁడవు కావున నీ కా భేదము కనఁబడుచున్నది. సచ్చిదానంద స్వరూపుఁడైన భగవంతునియెదుటఁ గుమ్మరిపురుగు తక్కువయేమి ? గోరాజ మెక్కువ యేమి ? గొయ్య తక్కువయేమి ? తిమింగిల మెక్కువయేమి ? నల్లి తక్కువయేమి ? నరుని యెక్కువయేమి ? పరిపూర్ణ శక్తిమంతుఁడైన పరమేశ్వరునివలె కెందులకో ! గాలిగుమ్మట మెక్కి మైలున్నర పైకిఁ బోయి చూడుము. హైకోర్టుగుమ్మ్మా యెంతయో ఆఁడుపిల్ల సముద్ర తీరమునఁగట్టిన పిచ్చుకగూడు నంతయే—కాకచేసినయెడల మసకగాఁ గనఁబడిన, పైత్యముచేసినయెడలఁ బచ్చగాఁ గనఁబడిన, హ్రస్వదృష్టితో

దూరమునకుఁ గనఁబడని, దూరదృష్టితో దగ్గఱకుఁ గనఁబడని, చీఁకటిలో మొదలే కనఁబడని, వట్టి పనికిమాలిన కన్నుగల నీకే మైలు పొడుగునఁ బైకెక్కుసరికి గొబ్బరచెట్టునకు నేలములగచెట్టునకు భేదమే గానఁబడునప్పు డనేకాద్భుతగోళములకుఁ గ్రిందమీఁద లోన వెలుపల నిండియున్న, యప్రతిహతమైన యనిర్వాచ్యమైన యననుసంధేయమైన భగవద్వ్యక్తికి, వాణీవాసుఁడు పొట్టివాఁడని జంఘాల శాస్త్రి పొడుగువాఁడని భేదముండునా ? వట్టికల్ల-వట్టికల్ల నీవల్పజ్ఞుఁడవు, నీ వధికుఁడవని యనుకొనువాఁడు, నీకంటె నల్పజ్ఞుఁడు. వాఁడధికుఁడని యనుకొనువాఁడు వానికంటె నల్పజ్ఞుఁడు. ఈసంగతి బాగుగాఁ దెలిసికొనుము. తెలిసికొని యనుసంధింపుము. అనుసంధించి యనుభవమునకుఁ దెచ్చికొనుము. ఈప్రపంచమున గర్వమున్నవానికి గతిలేదు. ముమ్మాటికి గతిలేదు. జాగ్రత్త. జాగ్రత్త. "నే నల్పజ్ఞుఁడను—అజ్ఞుడను—నాకీ ప్రపంచవైచిత్రి యణుమాత్రమైనఁ దెలియకున్నదోయి బాబూ! భగవంతుఁడా!" యని గొంతెత్తి గట్టిగ నేడ్వుము. భారతీదేవి గానమును నీయేడ్పునుగూడ నాపరాత్పరుఁడు చెఱియొక కర్ణముతో నణుమాత్రమైన వ్యత్యాసము లేని యానందముతో వినును.

ఇంతలో వాఁకిటిలోఁ దిరుగు మంగళవాద్యముల ధ్వనియైనది. ఉదయమున బాగుగా నూరేగింపలేదని వాణీవాసుని దిరుగ నూరేగించుటకు జనులు వచ్చినారు. ఎంత కోలాహలముగ నున్నది. కారాగృహబంధమునుండి విడుదలనొందిన యొక్క సామాన్యునిగూర్చియే యిన్ని మంగళవాద్యములు వాయించుచున్నారే. భవబంధము నుండి విడుదలనొందిన ప్రజ్ఞాస్వరూపునిగూర్చి యింక నేమి వాయింపవలసినదో ఇంక నెన్ని వాయింపవలసినదో. (వాని కేమియును నక్కఱలేదని కాలాచార్యులు కునికిపాటులలోనే పలికెను.)

ఆంధ్రపత్రికాధిపతీ ! వాణీదాసుని దీసికొని మే మూరేగింపులోని కిప్పుడే పోవుచున్నాము. ఈతొందరచేత మా కీశనివార ముపన్యాసము లేదు. క్షమింపవలయును. దేశబాంధవులగు మీకు భగవంతుఁడు సర్వశ్రేయము లొనఁగూర్చుఁగాక.

---

# 20. కర్నూలులోని కాటకము

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను—

నాయనలారా! సాక్షి కొకలేఖ వచ్చినది. దీనిని జదివెదను.

సాక్షిగారికి—అయ్యా! నమస్కారములు మృగశీర్షానక్షత్రమున సర్యుఁడు ప్రవేశించి యిదివఱకు నెలపైఁ బదునైదుదినములు దాటవచ్చినది. వర్షములు మిగులఁ దక్కువగా నున్నవి. ఆకుమళ్లొకసారి యెండిపోఁగా రెండవసారి మేఘములను నమ్ముకొని యాకులు పోసినారు. అవికూడ నెండిపోవుచున్నవి. నదీజలప్రవాహము సస్యాధారమైన కొన్నికొన్ని పట్టులందుమాత్రమే భూమి రవంత పచ్చబచ్చగ నున్నదికాని మిగిలినస్థలములందెల్ల నిర్జ్ఝాసమై శుష్కమైయున్నది. ఆంధ్రదేశమందెల్లను దత్తమండలములలోని ప్రజలు మఱింత హెచ్చుగఁ దహతహపడుచున్నారు. నేనెఱిఁగినంతవఱకుఁ గర్నూలునకు పదిపంద్రెండు మైళ్లదూరములోనున్న కొన్నిపల్లెలలోని జనులదురవస్థ వ్రాయుచున్నాను. అచ్చట నీసరికిఁ గొన్నివర్షము లుండినయెడల వారింత దురవస్థలో నుండియుండరు. వర్షమో వర్షమో యని యేడ్చుచున్నారు. ఏదైన నొకసేద్యమున కవకాశము మేఘుఁడు కలిగించియుండినయెడల జను లంత యాందోళనపడుట తటస్థించియుండదు. కాని సర్కారువారు కాయకష్టముచేసి పనిచేయఁగలవారికొఱకు కొంతపనిని గల్పించియున్నారు. వారిట్లు ప్రజలయెడలఁ గనఁబఱచుచున్న దయ కాంధ్రదేశస్థులందఱు వారికిఁ గృతజ్ఞులు.

ఒకగ్రామమునకు రెండుమూఁడు మైళ్ళదూరమున నొకకొండయున్నది. ఆకొండమీఁది ఱాలు తట్టలలో నెత్తుకొని యీ రెండు మూఁడు మైళ్ళదూరము మోసి యొక్కచోట గుట్టగావేసి యాఱాలు చిన్నచిన్నముక్కలుగాఁ గొట్టుటకు మగవానికి దొమ్మిదిబొట్లు నాఁడు దాని కేఁడుబొట్లుకాబోలు కూలిని సర్కారువా రేర్పాటుచేసి యిట్లు

చేయించుచున్నారు. కాని యుదయమం దాఱుగంటలనుండి సాయంకాలమం దాఱుగంటలవఱకుఁ బనిచేయుటచే మిగులఁ గ్లేశ మొందుచున్నారు. తత్రాపి 10 గంటలు మొదలుకొని సాయంకాల మయిదు గంటలవఱకుఁ గాయుచున్న భయంకరమైన యెండలలో, జెట్టుపుట్టయైన లేని బయళ్ళలో, మహానదీప్రవాహమువలె మరీచికాప్రవాహములు పరదలుగట్టుచున్న బంగనబయళ్ళలో కాలిపోయిన బోడికొండలనుండి వెడలుచున్న భయంకరమైన యుష్ణముచే సామజమునైన శవమును జేయఁజాలిన వడగాడుపులో, మోకాళ్ళవఱకైన దిగని ముదుకలాగులతో, సహస్రాక్షమైన ముదుకదుప్పటి తట్టపాగతోఁ గడుపుకొఱకుఁ బశువులంబోఁ బ్రబలముగ భయంకరముగఁ బాటుపడుచున్న మనసోదరులను జూచి మన మేమియు వారికి జేయలేకున్నను గన్నీరైన విడువఁ జాలమా?

ఆమాత్రపు త్యాగమైన మనకుండ నక్కఱలేదా ?

అయ్యయ్యో! సర్కారువా రింతవఱకైన నీలాగైన వారికి జీవనాధారమును గల్పించుచున్నారు. కావున భీమగజములవంటి మనయీ సోదరు లింక సప్రాణులై యున్నారే! పూటకు శేరున్నర జొన్నపిండి రొట్టెలను, దాకెడు కందిబేడలపులుసుతో గన్నుమూసి తెఱచునంతలో గ్రసించు మహాబలిష్టులకుఁ దొమ్మిదిడబ్బుల కూలితో నేమగును. కూలి యింకను హెచ్చుచేయుఁడని సర్కారువారిని బ్రార్థించుట న్యాయమగునా ? సర్కారువా రెట్లో పోషించుచునేయున్నారు. మన కేమని మనలోని భాగ్యవంతు లుపేక్షించియుండుట సోదరధర్మమగునా ? మనుష్యధర్మమగునా ? దనియాలపొడి మిరియాలచారుతో నఱిగిదెడు సన్నబియ్యపు టన్నము తిని యజీర్తిచే హాహాకార మొనర్చుచు "అర్బన్" బ్యాంకిలో నలువదివేలో యాఱులక్షలో సమాధిచేసిన నిర్భాగ్యులైన భాగ్యవంతులు మనలో నెందఱులేరు ? అయ్యయ్యో ! తాము తినరే-తినలేరే-తినినయెడలఁ జచ్చిపోవుదురే—ఒకరికిఁ బెట్టరే-పెట్టలేరే—పెట్టినయెడలఁ జచ్చిపోవుదురే. తమకు నక్కఱకు రాక పై వారికి నక్కఱకురాక లోకసంగ్రహార్థ మూఁపిరిమాత్రము విడుచుచున్న యీగాలితిత్తులవలనఁ బ్రయోజనమేమి ? "బకోపికిన్నకురుతే

చంచ్వాసోదర పూరణమ్” అనిన ట్లదియైన మనవారిలోఁ గొందఱేలుఁ గదే! ఇంతకన్న నధమమైనస్థితి యున్నదా? సర్కారువారు చేయుచున్న ఘనకార్యమునకు మనవారేల యిప్పుడైనఁ దోడుపడఁగూడదు?

ఇదికాక కాయకష్ట మొనర్చి జీవింపలేని వృద్ధులకు రోగులకు బాలురకు నవధ్యులకు సర్కారువారు ధర్మముగ నన్నము పెట్టుచున్నారు. ఇట్లు మూఁడునాల్గువందల ప్రాణులు పోషింపఁబడుచున్నవి. జొన్న సంకటియేదో కొలతప్రకారమిచ్చి వారిని బోషించుచున్నారు. ఇంక నెందఱో యిట్లు పోషింపబడవలసినవా రున్నారు. గుంటలుబడిన కనులతో దించుకొనిపోయిన చెక్కులతో హీనస్వరముతో “నన్నమో రామచంద్రా” యని వారేడ్చుచున్న యేడ్పులతోపాటు పైకి వచ్చుచున్న వారి హృదయస్థసంతాప స్వరూపాగ్నిజ్వాలాజాల మాంధ్ర దేశాదృష్టమునంతయు మాడ్చివేయుటకుఁ జాలియున్నదను నంశము జ్ఞప్తియం దుంపవలయును.

ఇంక స్త్రీలదుర్గతి చెప్పుట కలవిగాకయున్నది. మీజంఘాల శాస్త్రియే యిచ్చటి స్థితిగతులన్నియుఁ జూచియుండినయెడల నవి యన్నియు మీకన్నులఁ గట్టినట్లు చెప్పఁగలిగియుండును. నాజిహ్వ కట్టి శక్తిలేదు కాని మనసున నెంతయాందోళమైన నున్నది. స్త్రీలుకూడఁ బురుషులతోఁబాటు తాలపనిచేయుచునేయున్నారు. సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయమువఱకుఁ బాటుపడుచున్నారు. సాయంకాల మగుసరికి లేచి యింటికిఁ బోవుటకైన శక్తిలేకుంటచేఁ గంటిలో నేడుపుబొట్లు—చేతిలో నేడుబొట్లు. ఈయేఁడుబొట్లను దినుట కేడుగురుబొట్టెలు. ఈమాత్రమైనను గరుణాళువులగు సర్కారువారు చేయుచున్నారు. మన మేమిచేయుచున్నాము? అబ్రాహ్మణుఁడని వానిని జెడమడ దిట్టుచున్నాము. బ్రాహ్మణుఁ డని వీనిగొంతున కురిబెట్టుచున్నాము. తినలేక కడుపు గట్టుచున్నాము. కూడఁ దీసికొనిపోవుటకు మూటఁగట్టుచున్నాము. ముష్టిదానిని జీకొట్టుచున్నాము పాలియక సోదరుని వెడలఁగొట్టుచున్నాము. తండ్రిని బస్తుపెట్టుచున్నాము! భార్య మొట్టినమొట్లకు రహస్యముగఁ గంట నీరుబెట్టుచున్నాము. దేశక్షేమమని కేకలుపెట్టుచున్నాము. వచ్చినచందాలను స్వక్షేమమునకై

కర్చుపెట్టుచున్నాము. స్వార్థ పరిత్యాగమని మొత్తు పెట్టుచున్నాము. వకాలత్నామాకొఱకుఁ దండ్రికిఁ గొడుకునకు ముళ్లుపెట్టుచున్నాము. అదిగో స్వరాజ్యమని గంతులు పెట్టుచున్నాము. అయ్యో! పిల్లవాఁడు చెప్పినమాట వినినాఁడుఁ కాఁడని కూనురాగములఁ బెట్టుచున్నాము. "నాయనలారా! మీకీచర్య తగదు. మీపూర్వులైన యార్యులు ప్రవర్తించినట్లు ప్రవర్తింపుఁడు. భద్ర భద్ర" మని యేజంఘాల శాస్త్రియో గొంతెత్తి యఱవగ నతని నడ్డమైన తిట్లు తిట్టుచున్నాము. అంతేకాదా? మనప్రయోజకత్వ మెవరెఱుఁగరు? ఇట్టిమీరు—కన్న కొడుకులతోఁ గాటులాడి కోర్టుల కెక్కిన మీరు దత్తమండలములోఁ గడుపుకాలి యేడ్చుచున్న నోపరిమణులకు సాయమొనర్తురా? ఆఁడుది తాలు ముక్కలుచేసికొని బ్రతికినతరువాత దానియెముకలు ముక్కలైన వనుట కేమైన సందేహమా! వారికి సాహాయ్యము చేయలేనివారి మర్యాద మన్నైనదనుట కేమైన సందేహమా! చంటిపిల్లలను వీపునకుఁ గట్టుకొని తాలుగొట్టుచున్నారు. ఎడపిల్లలను గుంట్రాతిక్రిందినీడను బండఁబెట్టుచున్నారు. 21 పైసలకుఁ బండ్రెండుగంటలు పనిచేయు చున్నారు. ఆకష్టముపడి యామాత్రమైన సంపాదనచేసికొనలేని స్త్రీ లెందరున్నారో యెఱుఁగుదురా! ఎందఱున్నారో తెలిసినమాత్ర మేమి వినియోగము? ఆనడుమ నింటింటి కొక రాట్నము నిరాకరణవాదు లెవ్వరో యిచ్చినారఁట. ఆరాట్నములకుఁ బనియేది? పనిచేయుటకు సిద్ధములైనహస్తములున్నవి గాని ఏకులేవి? ఏకులో యేకులో యని యచ్చటిస్త్రీలందఱు గోలబెట్టుచున్నారు. ఇచ్చినవారేరి? ఇయ్యనక్కఱ లేదు. యేడ్చినయేడ్పులు విననైన నక్కఱలేదా? బ్రహ్మపురమునుండి బళ్లారి చివఱవఱకుఁదిరిగిన నిరాకరణవాదులు తరుగుచునేయున్నారు. ఇచ్చిన యుపన్యాసముల నిచ్చుచునేయున్నారు. బోధించినబోధలను బోధించుచునేయున్నారు. ఖండించిన ఖండనలుఖండించుచునేయున్నారు. పెట్టినయాసలు పెట్టుచునే యున్నారు. చూపిన మొండిచేతులు చూపుచునేయున్నారు. ఎందుల కీఱంకులరాట్నపు సంచారము? ఎందుల కీ యసాధారణశుష్కవ్యయము? ఎందుల కీనీరసోపన్యాసములు? ఖద్దరులోని సాంకర్యము నాపఁగలిగితిరా? ఇదివఱకుఁ జేతగానివార

మనిపించుకొంటిమి. కాని యిప్పుడు దొంగ లనిపించుకొనుచున్నామే హరిహరీ! పనిలేని ప్రయాణములకొఱకు వీరు ఎమ్. ఎస్. ఎమ్. ఆర్. వారికి బోసినధనములో నాల్గవవంతు ధనములో షూద త్తమండలముల లోని పడఁతుల పనిలేని హస్తములనున్న మూగరాట్నములకుఁ గావలసి నన్ని యేకులువచ్చునే? అయ్యయ్యో! ఇప్పు డెట్లిచ్చెదరో యేకులిండు. ఈయకపోయినయెడల మీరు దేశక్షేమాభిలాషులని యెట్లనిపించు కొనఁగలరు. బిరుదములు వహించుట విశేష మనుకొనుచున్నారు కాఁబోలు. కార్యభారమును నిర్వహింపవలయును.

ఇదిగాక ఇంటను గూరుచుండినస్త్రీలకుఁ గట్టుకొనుట కేమున్నదో తెలియునా? ఏమున్నదో ఏమిలేదో యెట్లు తెలియును. ఈవలికి వచ్చుటకు సిగ్గుచేత రాలేకుండనున్నారు. శాంతమ్ పాపమ్ శాంతమ్ పాపమ్. కాని కొంతమంది స్త్రీలు వెలుపలికివచ్చి ఊాలు గొట్టుచున్నారు కదా! వారిదు స్తెట్లున్నదో చెప్పనా? మూఁడుజేనెలు వెడల్పుగల మూఁడుమూరల పొడవుగలగుడ్డ నడుమునకుఁ జుట్టఁబెట్టుకొనియు న్నారు. అక్కడికావస్త్రముసరి, మూరెడువెడల్పుగల మూరన్నరపొడవు గల యొకపేలిక నడుముకట్టుముడికి ముడివేయఁబడి యెడమభుజముపై నుండి వెనుకకుఁ బోవుచున్నది. ఇది పైఁటకూలి యాఁడువాండ్ర కిది పూర్ణమైన దుస్తు వంగుట తటస్థించునెడలఁబైఁట పొట్టిదగుటచేఁ గ్రిందఁ బడిపోవునేమోయని పైఁటచెఱ గప్పుడు మెడకుఁ జుట్టఁబెట్టుచున్నారు. రామరామరామా! ఈదుస్తుతో గుప్తమానధనలై వారు పైకి వచ్చి నిర్భయముగఁ బాహాటముగఁ బనిచేయుచున్నారు. వీరి వస్త్ర వైఖరియే యిటులుండ వెలుపలికి వచ్చుటకు సిగ్గుపడి లోనఁ గుండల చాటునఁ గూరుచుండువారి వైఖరి యెట్లున్నదో భగవంతుఁడా?

సాక్షీ! నేను వదలుకొన్నను నన్ను వదలదని ప్లీడరుతో విడాకులు పెట్టుకొనుటకు మదరాసునకుఁ బోయితిని. అక్కడ నొక్కసర్కసు వారిచ్చిన ప్రదర్శనమును గాంచితిని. ఆప్రదర్శనములోని విశేషము లన్నియు వివరముగా విస్తరముగా మీకు విసుగుదల కలుగునట్లు వ్రాయుదునేమో యని యనుకొనకుఁడు. అట్లు చేయువాఁడను గాను. ప్రదర్శనారంభమున జరిగిన యొకయంశముమాత్రమే సంకుచితముగ

వ్రాసెదను. వర్తులాకారమునన్న పటకుటీరములో వారివారి నియమితములైన స్థానములలో స్త్రీపురుషులు గూరుచుండియున్నారు. నాల్గు గంటలు కొట్టినారు. ఇంకను వెలుతురు బాగుగనే యున్నది. ప్రదర్శన మారంభమయ్యెనుగదా యేమివచ్చునో యని జనులందఱు ససంభ్రములై చూచుచున్నారు. ఆరంభమున నొక్క కాంతవచ్చెను. ఆమె శ్వేతముఖి జర్మనీదేశపుదో, ఫ్రాన్సుదేశపుదో, అమెరికాదేశపుదో తెలియదు. పాశ్చాత్యదేశ స్త్రీలలో నొకతె. ఆమె యారడుగులకుఁ దక్కువలేదు: మన దేశస్త్రీలలో మిక్కిలి లావుగానున్న వారిని మువ్వురను గట్టిగట్టినయెడల నీ త్రిమూర్త్యాత్మక స్వరూప మెంత లావుగనుండునో యామె యంతలావునకుఁ దక్కువయుండదు. కాని శరీరమునందు లవలవ తవతవ కాని యేమియు లేదు. శ్వేత పాషాణ పాంచాలికవలె నున్నది. ఇంతవఱకుఁ బ్రకృతిలోఁబుట్టిన గంగవెఱ్ఱి కావున నిందుల కామె నేమియు ననఁదగదు. ఆమె ధరించినదుస్తు లెట్లున్నవో చెప్పనా? ఆమె కీబుజమున రెండువ్రేళ్ళ వెడల్పు పట్టాయును నాబుజమున రెండువ్రేళ్ళపట్టాయును నున్నవి. ఈపట్టాలకు ముందువైపున బ్రొద్దుదిరుగుడుపూవుల రంగుతో నదేయాకృతిగల రెండుచక్రములు చనుగప్పులై యున్నవి. ఈరెండుచక్రము లాయవయవములమీఁద వైరాగ్యభావులు సంసారములోవలె నంటియంటనట్లున్నవి. ఈయంగున కంటిపెట్టుకొని కటిప్రదేశముచుట్టుతిరిగిన రెండుజేనెలమాత్రమే వెడల్పుగల యొక జూలున్నది! ఆమెదుస్తునకు దీనితో నాశ్వాసాంతము. ఆమె రెండుబాహువులు పైకెత్తుకొని తాండవించినది. శాంతమ్ పాపమ్ శాంతమ్ పాపమ్. పటకుటీరములో గూరుచుండిన పాశ్చాత్యస్త్రీలు కిలకిలలాడిరి. ఇదియొక వింతగా వారికిఁ దోఁచలేదుకాబోలు. ఇంతలో నామె గిరగిర దిరిగినది. చలపాదులలో మిగులఁ జలపాదియైన వాయుదేవుఁ డామె లోకసంగ్రహార్థమై మొలచుట్టు ధరించిన జూలు రవంతయుఁ బైకెగురఁగొట్టనా? నారాయణా! ఆపదుద్ధారకా! అచ్చటఁ జేరిన మనదేశపు మగవారందఱు డిల్లపడి కొయ్యలై కత్తివ్రేటు వైచిన నెత్తురుచుక్కయైన రాకుండినట్లుండిరి. నేనుగూడ స్తంభీభూతుఁడనై రవంతసేపుండి స్మృతినొంది యచ్చటఁజేరిన యార్యావర్తసుందరుల

వంకఁ జూడఁగ వారందఱు మోములు వెనుక ప్రక్కకు మఱలుచుకొని యుండిరి. అంతటితోనైన సంతుష్టినొందక జేబురుమాళ్లను గన్నులపై నడ్డుపెట్టుకొని యుండిరి. కాంతాధర్మమునకు గౌరవభంగమైనదని వారట్లు కన్నుల బాష్పముల విడుచుచున్నారో, రక్తపుచుక్కల విడుచుచున్నారో యెవరికెఱుక. ఆఁడుదానిమర్యాద యెట్టిదో పూర్తిగా దెలిసిన మగవాఁడొక్కఁడైన నున్నాఁడా? ప్రాణముకంటె మానమును సహస్రగుణాధికమగు ప్రయత్నముతోఁ గాపాడుకొనుచున్న మనదేశసుందరులవంటివారు మహీమండలిలో నెచ్చటనైన నున్నారా? అట్టి మన ఆంధ్రదేశసుందరీమణులను నేనొకందులకుఁ బ్రార్థించుచున్నాను. వారిలో దరిద్రులున్నారు. సాధారణ లున్నారు. భాగ్యవంతు లున్నారు. రాజకాంత లున్నారు. మహారాజకాంత లున్నారు. దరిద్రస్థితిలోనున్నవారిని నేను బ్రార్థింపను. గుడ్డలేక వెలుపలికి వచ్చుటకు సందేహపడి గుడిసెలలోనే కూరుచుండియున్న కూలి యాఁడువాండ్రని నేను మొదట వ్రాసితినే— వారికి సాధారణలగు స్త్రీ లొక్కకోకయిచ్చినఁ జాలును. భాగ్యవంతులు రెండుకోక లిచ్చినఁ జాలును. రాజకాంత లిఱువదికోక లిచ్చినఁ జాలును. మహారాజకాంత లేఁబదికోక లిచ్చినఁ జాలును. పదునాఱుమూరల ముదుక కోకకు నాల్గురూపాయలవెల. వారిమహోదారమైన కార్యమును దాదాపుగ దిగంబరలై యున్నవారి సోదరీమణుల కొనర్చి శాశ్వతమైన పుణ్యమును గట్టుకొనక తప్పదు. కడుపునిండిన యన్నములేక వారు గతించినను నొడలునిండిన గుడ్డతోనైన వారివలికిఁ దీసికొనిరాఁబడుట కవకాశము కలుగునట్లు చేయవలయును. సాక్షీ! ఈలేఖను మీరు జంఘాలశాస్త్రిచే సభలోఁ జదివింతురని పంపితిని. నేనీలేఖ యాంధ్రపత్రికకుఁ బంపినయెడల ననామకుఁడనని నాలేఖను వారు ప్రకటింపరేమో యనుభయముచే మీద్వారమునఁ బంపినయెడల బ్రకటింతురను నాసచే మీయొద్దకుఁ బంపితిని.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 21. పితృదేవతాగౌరవము



జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! సాక్షి కీ లేఖ వచ్చినది. దీనిని జదివెదను.

సాక్షికి—అయ్యా నమస్కారములు. మీజంఘాలశాస్త్రి యెన్నెన్నో విషయములపై నుపన్యాసము లిచ్చుచున్నాఁడు. చెప్పినది చెప్పకుండఁ జెప్పుచున్నాఁడు. చాల సంతోషమైనది. మానవజాతికున్న పితృదేవతాగౌరవమునుగూర్చి యిదివఱకుఁ జెప్పియుండలేదు. ఈవిషయముపై నేను గొన్నియంశముల నీలేఖలో వ్రాసి మీకుఁ బంపితిని. దీనిని మీసంఘమునఁ జదివింప వేఁడుచున్నాను.

ప్రపంచముననున్న మానవజాతి యందంతటఁగూడఁ బితృదేవతాగౌరవము వ్యాపించియున్నది. సర్వజాతులవారియందు సర్వమతములయందుఁ గూడ నిది ప్రధానవిషయమై యున్నది. ఇతరదేశస్థులలో నీమర్యాద యెటులున్నదో కనుగొందము. మనదేశమునం దెట్లున్నదో మనకందఱకుఁ దెలియనే తెలియును. పితృదేవతలు బ్రదికియున్న తమవారి క్షేమమునకు సంతసింతురనియుఁ, గష్టమునకు దుఃఖింతురనియు వారు సంపద్వంతులై యుండి తమనోటికిఁ జిరకాలము నీరిచ్చుచుండవలయునని సదా కోరుకొనుచుందురనియు సర్వజాతులవారి యభిప్రాయమై యున్నది.

పితృదేవతలు బ్రదికియున్న తమవంశస్థుల సంపదలకు సంతసింతురనియు నాపదల కార్తిఁ జెందెదరనియు నిశ్చయించుకొనకపోవుట మనుజధర్మము కాదని ఎరిస్టాటల్ అను నతఁడు తన ఎథిక్సు అను గ్రంథమునందు వ్రాసినాఁడు. ఇదికాక తమవంశజులు భూమిలో నున్నంత కాలమే తమ కుత్తమగతు లుండుననియు వారు నిర్వంశమగువెంటనే తమ కధోగతి సిద్ధించుననియు వారెంచి తమవంశాభివృద్ధి కెల్లప్పుడు కోరుకొనుచుందురను నభిప్రాయముకూడ దాదాపుగనున్న జాతులలోఁగూడ నున్నదనుట

కెంతమాత్రమును సందియములేదు. పూర్వకాలపు యూదులలో నిట్టి యభిప్రాయము లేదని కొందఱనుచున్నారు. కాని యది యంతసత్యమని వచింప వీలులేదు. వారిలోనైనను గతించిన పూర్వుల జ్ఞాపకార్థముగ ప్రాతఁబడిన చెట్లు కట్టఁబడిన స్తంభములు నున్నతప్రదేశములందు నిర్మింపఁబడిన సమాధిగృహము లున్నవికాని లేకపోలేదు. ఓల్డు టెస్టు మెంటునాఁటికే వారిలోఁ బితృదేవతాపూజ నశించినట్లు కనఁబడుచున్న దని కొందరందురు కాని, యది నశించినట్లు సిద్ధాంతీకరింపఁగల దృష్టాంత ములు విశేషముగఁ గానఁబడవని మఱికొందఱ యభిప్రాయము. అది గాక యట్టియూహము మనుజుని హృదయమునుండి వెడలిపోవుటకుఁ బ్రకృతియే యంగీకరింపదు. ప్రతిజీవములో (సెల్ఫు ప్రిజర్వేషను) నాత్మసంరక్షణాభిసంధికంటె ప్రప్రధానమైన కోరిక యేదియులేదు. ప్రకృతినిర్మాణములోనే యట్టి యేర్పాటున్నది. దానినిఁ దొలఁగించుట కిప్పు డీశ్వరునితరమైనఁ గాదు. అదిలేనిదే బ్రతుకేలేదు. సృష్టిస్థితి దాని మీఁదనే యాధారపడియున్నది. అది మనుజుని కున్నంతకాలము పితృ దేవతలందు భక్తిపోవుట కవకాశమే లేదు. తాను జచ్చినతరువాతనైనను దన్నుఁ దనవారు గౌరవించి పూజించుచుండవలయు ననువాంఛ తన కున్నప్పుడు తన పితృదేవతలందుఁ దన కట్టిమనోవైఖరి యేలయుండదు. అట్టు లుండకపోవుట సృష్టియుండకపోవుట కాని మఱియొకటి కాదు.

మనుజులు మరణించినతరువాత వారు బ్రతికియుండునప్పు డేయే సుఖము లనుభవించిరో యాసుఖములన్నియు ననుభవింపవలయునను మహావాంఛ గలిగియుందురను విశ్వాసము జనులలోఁ బూర్తిగా నున్నది. శ్రాద్ధాదులన్నియు నందుకొఱకే వస్త్రదాన స్వర్ణదాన పుస్తక దాన భూదానాదులన్నియు నందుకొఱకే—ఇదికాక కొన్నిజాతులలోఁ బూర్వముండిన సహగమనమునకుఁ గారణ మిదియే—కౌమారమందేమి యౌవనమందేమి వార్ధకమందేమి భార్యకంటెనధికసుఖసంధానచతురమైన వస్తువు వేఱొక్కటి పురుషునకులేదు. పరలోకగతులైనవాఁ డాకారణ మున భార్యాసాహచర్యవాంఛాప్రబలుఁడై యుండును. కావున సహ గమనాచారము పుట్టియుండవచ్చునని తోఁచుటలో దప్పు కనఁబడకుండ నున్నది. ఒక్క మనలోనే యిట్టియభిప్రాయమా? మఱియెవ్వరిలోనైన

నున్నదా? సిథియనులలో రాజు మరణించినప్పు డతనిని మట్టిలోఁ గలుపు సమయమందున నాతఁ డుంచుకొన్నదానిని నాతనికి దాహమిచ్చువారిని, వంటవానిని, నాతఁ డెక్కుగుఱ్ఱమును, నాతనికవులను, గాయకులను, ప్రధానుని గొంతుపిసికి చంపునాచార మున్నదని "హిరాడటన్" అను చరిత్రకారుఁడు చెప్పినట్లు మఱియొకరు చెప్పుచున్నారు. ఇట్టియాచారము పితృదేవపూజతో సంబంధించిన దనుట కేమైన సందేహమా ? అనేకదేశములలో నివి కాకపోయినను నిట్టివి పితృదేవపూజాసంబంధములైన వున్నవని యంద అంగీకరించిన మాటయేకాని వివాదాస్పదమైనమాట కాదు. అదికాక రాచపీనుగ తోడులేకుండఁ బోదన్నసామెత మనలో నూరకే కలిగియున్నదా? మనలో గూడ నాతఁడు కన్నెచెఱబాపినదానిని, కార్యదర్శిని గవిని కట్టఁగట్టి కాటిమీఁద పెట్టి కాల్చునట్టి యాచార మున్నది కాని లేకపోలేదు. ఇట్టికఠినాచారములు కారణాంతరబాహుళ్యముచేఁ గొంతవఱకు గర్కశతలోఁ దగ్గినను నిప్పటి కాయాచారములన్ని దేశములందు నున్నవి కాని లేకపోలేదు. పితృదేవతలు తమ్మునిశము కనిపెట్టియుందురనియుఁ దమనీడవలెఁగూడఁ దిరుగుచునేయుందురనియుఁ గష్టములనుండి తమ్ములఁ దొలగించుచుందురనియుఁ దమయిండ్లను దొంగలనుండి కాపాడుచుందురనియుఁ దమపంటలను జంతువులనుండి రక్షించుచుందురనియుఁ దమశత్రువులతోఁ దాము పోరాడునప్పుడు తమభుజములకు బాటవము తమఖడ్గములకు వాఁడియు నిచ్చుచుందురనియుఁ జీనాదేశములోవారి కిప్పటివఱకుఁ బరిపూర్ణవిశ్వాస మున్నది. ఘనకార్యములకు గౌరవ మెవ్వరికి గల్గునో తెలియునా ? ఆకార్యములొనర్చిన మనుజునికిఁ గాదు, ఆతని పితృదేవతలకు—చూచితిరా ? పితృదేవపూజ వీరిలో నెంతగాఢముగానున్నదో- (రస్సో జపానీసు) రుష్యా జపానుదేశములకు యుద్ధము సిద్ధించినప్పుడు పితృదేవతలు తమ్ముఁ గాపాడుచుండిరను పూర్ణవిశ్వాసమే కొండవంకాయయంత జపానును గుమ్మిడికాయయంత రషియాతోఁ బోరాడించినది. చచ్చిపోయినవారి పేళ్లను రాగిరేకులమీఁదనో కఱ్ఱపలకలమీఁదనో చెక్కించి వారియాత్మలను వానిలోని కాకర్షించి యారక్షకరేఖలను చీనావారు భద్రముగ దాచుకొని వారివారి మృతతిథులందు వానినిదీసి పూజించుకొందురు

కానుఫ్యూసి యను అంతటివా డట్లాచరించినప్పు డితరుల లెక్క యేమి? మనకు వ్యాసునికంటె చీనావారికి కానుఫ్యూసియను యెక్కువవాఁడు.

ఇఁక రోము గ్రీసుదేశములం దిందునుగూర్చి యభిప్రాయ మెట్లుండెనో చూతము. చిరకాలనాగరకతగల రాజ్యములందుఁ బరిశీలన మొనర్చిన నెందునుగూర్చియైన తత్త్వనిర్ణయమగును గాని నిన్నఁగాక మొన్నఁ గన్నుఁదెఱచినజాతులయందుఁ బరిక్షించిన వినియోగమేమి? ప్రాఁతనాణెములు పాడైనకోటలలో దొరకునుగాని క్రొత్తకోటలలో దొరకునవి కోడియీకెలేకావా? రోమురాజ్యములోఁ గూడఁ బైని చెప్పిన యాచార మొకవిధముగా నున్నది. మరణించిన వీరుల విగ్రహ ములను మైనముతోఁజేసి వానిని భవనములలో దాచికొందురు. ఆ రాజ్యమున నెవ్వఁడైన నధికుఁడు మరణించినయెడల సమాధిస్థలమున కాతని కళేబరముఁ దీసికొనిపోవునప్పు డీవిగ్రహముల నాకళేబరమునకు ముం దూరేగించు వాడుక కలదు. గతించిన మహావీరులయాత్మ లా విగ్రహములలో నున్నవని సామాన్యులు నమ్మెడివారు. ఇదిగాక ప్రతి గృహమందలి జనులుకూడ వారివారి పితృదేవతలవిగ్రహములు చిన్నవి మైనమున నిర్మించి వానికిఁ గుక్కతోలుతోఁ జేసినవస్తులఁ దొడిగి వాని నింటిలో భద్రముగ నుంచుకొందురు. ఉత్సవదినములు సిద్ధించి నపు డావిగ్రహములకుఁ బూలదండలు వైచి సింగారించి వానికిఁ దాము తినఁబోవు నాహారాదులను నివేదించి భుజియించుచుందురు. అట్లు చేయకున్నఁ బితృదేవత లధోలోక మొందుదురని వారి దృఢవిశ్వాసము. వారిలోఁగూడ మనలోవలెనే దత్తపుత్రునిఁ దెచ్చుకొనువాడుక గలదు. శ్రాద్ధ మాచరించుటకును, దానికిఁ బ్రతిఫలముగా మృతుని యాస్తి ననుభవించుటకును దత్తపుత్రస్వీకార మేర్పాటైనది ప్రధాన మైనది శ్రాద్ధకర్మము కాని ధనానుభవము కాదు. శ్రాద్ధకర్మ మొనర్పని వానికిఁ గాని విధ్యుక్తముగఁ జేయనివానికిఁగాని మృతునిసంపద ననుభవించుట కధికారములేదు.

ఇదికాక కొన్నిపిశాచములు ఉన్నవని మనవారునమ్మినట్లే రోము రాజ్యమునందలివారు నమ్మెడివారు. బాలెంతచావు చచ్చినస్త్రీలు, దుష్కర్మములొనర్చిన పురుషులు, విధ్యుక్తశ్రాద్ధములు లేనిమృతులు

మొదలగువారు యోగ్యులగు పితృదేవతలలోఁ జేరక పిశాచగణములో జేరుదురను విశ్వాసము వారిలోఁగూడ నున్నది. వారిలో నట్టిపిశాచముల దఱిమివేయుపద్ధతి వారికవి యొకఁడు చెప్పినాఁడు. గృహస్వామి రాత్రి రెండుయామములకు లేచి కాలుసేతులు గడుగుకొని పాదరక్షలు ధరియింపకుండ నుపదేశముద్రను వహించి పొమ్మని యర్థమిచ్చు సంజ్ఞలను జేతితోఁ జేయుచు నిల్లంతయు నటునిటు తిరుగుచుఁ దొమ్మిది చిక్కుడుగింజలను నోటిలో నుంచుకొని "వీనితో నేను నావారు నీనుండి విముక్తియగుచున్నా" మని కేకలువైచుచుఁ దొమ్మిది గింజలను గింజ నొక్కొక్కపర్యాయము తొమ్మిదిసారులు థూకరించును. అంతటితో నాపిశాచము లాచిక్కుడుగింజలలోఁ బ్రవేశించి యడఁగి పోవును. ప్రపంచమందంతను గూడఁ బిశాచోచ్చాటనపద్ధతి యున్నది కాని లేకుండఁబోలేదు. ఆపిశాచముల కేదో యిష్టమైన యాహార మిచ్చి తఱిమివేయుదురు కాని శుష్కోదరములతో నుండఁగా వానిని దఱిమివేయరు. అక్కడక్కడ చోటులను జరుగుచునే యున్నది. సెయింట్సు (మహనీయులను) బూజించుట క్రైస్తవులలోఁ గూడ నున్నది. క్రైస్తవుఁడు కాని యొక గొప్పజమీందారుఁ డొకప్పుడు క్రీస్తుమతబోధమును విని క్రైస్తవమతమును దీసికొన నిశ్చయించుకొనెను. క్రైస్తవమత స్వీకారారంభకర్మమగు పరిశుద్ధస్నాన మాతఁడు గ్రహించుటకుఁ బవిత్రమైన తొట్టియొద్దకుఁ బోయి యక్కడ నొకనిముస మాగి సందిగ్ధమనస్కుఁడై యచ్చటఁజేరిన గురువులతో "అయ్యా! నేను క్రీస్తుమతమును స్వీకరించుటకు సిద్ధముగా నున్నాను. మీమతము ననుసరించి నేను జేయఁదగిన విధులన్నియు యథాప్రకారముగాఁ జేసి నేను మరణించిన తరువాత నాకు రాఁబోవు స్వర్గమందున నేను నాతండ్రిని దాతను జూడఁగలనా?" యని యనెను. చూడలేవని వారు ప్రత్యుత్తర మిచ్చిన మీఁదట మీమోక్షము నాకక్కఱలేదని యాతఁ డావలికిఁ బోయెను. చూచితిరా! ఈవిచిత్రమైన యంశము మతముదాఁటి మఱియొక్క మతములోనికి బోవుచున్నను గతించిన తండ్రితాతలను గలిసికొనుటకే మనుజుని కోరికగాని మఱియొకటి కాదు. అన్యమతస్వీకరణమందు లెక్కయేమి? పితృదేవతలలో దండ్రులను జేర్చుకొనని పూర్వ

జాతులయందుఁ గూడ నొకవిధముగాఁ బితృదేవపూజ లున్నవి. వారు తల్లివలనఁ దాము పుట్టినట్లే నమ్ముదురు. కాని తండ్రివలనం బుట్టినట్లు నమ్మనే నమ్మరు. ఆస్ట్రేలియాదేశపుఁ బూర్వపువా రట్టిజాతులలో నొకరు. స్త్రీ యడవులలో వేటకైకాని నదులయొద్దఁ జేపలుపట్టుటకుఁ గాని పోవునప్పుడు చెట్లలోని యాత్మలుకాని నదుల నధివసించిన యాత్మలుకాని యాఁడువారి గర్భములందుఁ బ్రవేశించి వారినుండి పుట్టుదురని నమ్మకము. అట్లు ప్రవేశించినట్లు నిదర్శన మేదనగా స్త్రీలు చెట్లదగ్గఱనుండి పోవుచుండగాఁ జెట్టులోనున్న యాత్మ యామెగర్భమునఁ బ్రవేశించినయెడల నొక చిన్నకఱ్ఱముక్క చెట్టుపైనుండి పడును. అదియే నిదర్శనము ఆకఱ్ఱముక్కను దెచ్చి యది యొక్కచోట యాజాతిలోని పెద్దలు దాఁతురు. ఆకఱ్ఱలోనున్న యాత్మయే యామె బిడ్డకు పితృదేవత. ఆకఱ్ఱముక్కల నిట్లాజాతివారు భద్రపఱచి వానికెన్నెన్ని యుత్సవములైనఁ జేయుదురు. ఆకఱ్ఱముక్కలకుఁ జమురురాచి యభ్యంగనము చేయించి, బట్టలుకట్టించి, ముద్దాడి ప్రార్థనలు సల్పుదురు.

నాస్తికమతమును బోధించెనని కొందఱిచేఁ జెప్పఁబడిన బుద్ధాచార్యులవారు కూడ గతించినవారి జ్ఞాపకార్థ ముత్సవము లొనర్చుకొనుఁడని బోధించిరి.

సాక్షీ! నే నప్పుడప్పుడు గ్రంథమువలనఁ దెలిసికొనినదియుఁ బెద్దలవలన వినినదియు మీకు వ్రాసితిని. ఇందునుగూర్చి మీయభిప్రాయ మేమో జంఘాలశాస్త్రిచేఁ జెప్పింపవలయునని ప్రార్థించుచున్నాను.

చిత్తగింపవలయును.
విధేయుఁడు,
సా క్షి సం ఘా భి మా ని

నాయనలారా! ఈలేఖనువింటిరా? అవకాశము వెంబడిని దీనికిఁ బ్రత్యుత్తర మీయవచ్చును.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 22. అఖిలభారతీయాయుర్వేదపరిషత్తు



జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! రాజమహేంద్రవరమునుండి నేఁడీలేఖవచ్చినది. దీనిని జదివెదను.

సాక్షికి:—అయ్యా! నమస్కారములు. నేను సాక్షిసంఘాభిమానమును బూర్తిగాఁ గలవాఁడను. మాగ్రామమగు రాజోలులో మేము మీసంఘము ననుకరింపఁదలఁచి స్థాపించుకొనిన యుపసాక్షిసంఘమున నేను జంఘాలశాస్త్రిని. మీసంఘముననున్న జంఘాలశాస్త్రి మహారాజశ్రీలలోఁ జేరినవాఁడైనయెడల నేను జిరంజీవులలోనైనఁ జేరినవాఁడనగుదును. ఆనడుమ నేను మీసంఘమునకు మాతాలూకాబోర్డులోని యెన్నికలనుగూర్చియు మాకళాశాలలోని గత్తరులను గూర్చియుమాబొజ్జయ్యశెట్టిమనస్సులో వ్యాపించినతామరనుగూర్చియు మఱియింక వేనినోగూర్చియు లేఖలువ్రాసి వానిని మీసభలోనఁ జదివింపుఁడని కోరఁగ మీ రుపేక్షయొనర్చినారు. ఉపేక్షకుఁ గారణ మేమో తెలిసియుండు నెడలఁ దప్పేదోదిద్దుకొనినవారైన నుండుము. మాతప్పేదో చెప్పకుండ మీ రూరకుండుటచేత దప్పు మాలోనున్నదో మీలోనున్నదో తెలియకుండ నున్నాము. ఒకవేళఁ గ్రిందటిసారి మేము వ్రాసినయంశములు జనసామాన్యమున కభిరుచి నీయఁగలిగినవి కాకపోవుటచేత మీరు మాలేఖలను బ్రకటింపలేదేమో యని మాలో మే మొకకారణమును గల్పించుకొని సర్వజనాదరణపాత్రములైన యంశములనే యీసారి వ్రాయఁదలచితిమి.

ఈనెల 5, 6, 7 తేదులను గోదావరీతీరమందుఁ బుట్టిన కోహినూరగు రాజమహేంద్రవరమునందు నిఖిలభారతీయాయుర్వేదపరిషత్తు జరుపఁబడునని తలఁచి యటకుఁ బోయితిని. నేను సభకుఁబోవుసరికే సమ్మానసంఘాధ్యక్షుని యుపన్యాస మైనదని తెలిసినది. ఆయన తనయుప

న్యాస మాంగ్లేయమున వ్రాసినారు కాంబోలు. దాని నెవరో యాంధ్రీక రించిరికాంబోలు. వానిలో నేప్రతియు నాకు దొరకకపోవుటచేత నందలి విశేషము లేవో నేను జెప్పంజాలను. నేను సభలోనికిఁ బోవునప్ప టికే యాయుర్వేదసభాధ్యక్షులగు నాయుర్వేదపంచానన శివకృష్ణ శాస్త్రిగా రుపన్యసించుచున్నారు. అదివఱ కేమిచెప్పిరో యచ్చట నేను లేకపోటచేత నేను జెప్పంజాలను ఆయన మాటలాడినమాట లేవో నాకుఁ దెలియకపోవుటచేత నటుతరువాతగ్రంథమును జెప్పంజాలను. ఆయన సంస్కృతమున మాటలాడినట్లుమాత్రము నేను జెప్పంగలను. సంస్కృతమున మాటలాడునెడల సాధారణముగా మనప్రాంతములం దెవ్వరికో కాని తెలియదు. ఆభాషాప్రచార మార్యావర్తమందు వాగ్గ్రాహకముగాఁ దక్కువకావున నట్లు జనసామాన్యమునకుఁ దెలియక పోవుట యాశ్చర్యముకాదు. సభలోఁగూరుచుండిన వైద్యులలోఁ గొందఱు తెలిసినవారివలెఁ దలలూఁపమొదలుపెట్టిరి. అంతదూరమునుండి యిక్కడికి వ్యయప్రయాసములకు లోనై వచ్చినవా రామాత్రమైనఁ జేయకుండునెడలఁ బైవా రేమనుకొందురో యని యట్లుచేసియుందు రేమో ? నాకుఁగలిగిన సందేహమును బాపుకొనుటకు విశేషముగాఁదల నూఁపుచున్న యొక విశిష్టాద్వైత వైద్యునియొద్దకుఁ బోయి "అయ్యా మీరు తల యంతగాటముగా నూఁపుచున్నారు. మీ కేమి తెలిసినదో నాకు రవంత చెప్పరా" యని యడిగితిని. "నాకేమియుఁ దెలియకుండ నున్నదని తల యూఁపుచున్నానయ్యా ! నన్నుఁ జంపక యావలికిఁ బొ"మ్మని యాతఁడు నన్నుఁ జీవాట్లుపెట్టెను. ఒకరూపాయ దండుగ పెట్టి నేను సభలోనికి వచ్చితినయ్యా ! నాకేదో కాసంత చెప్పవయ్యా యని యాతనిని నేను దిరుగఁ బ్రార్థింప "నైదురూపాయలు దండుగ పెట్టుకొనిన నే నెవనితోఁ జెప్పుకొనవయ్యా నడువనడు" మని యాతఁడు నన్నుఁ గొట్ట సిద్ధపడెను. అంతలో మఱియొక మహారాష్ట్ర వైద్యశేఖ రుఁడు హిందీభాషలో నేమేమో చెప్పెను. నాకేమియుఁ దెలియక పోవుటచేత మీయిష్టమువచ్చినట్లు చెప్పుకొనుఁడని లేచి పాకయంతయు నిటునటులు తిరుగ నారంభించితిని. ధన్వంతరి. వసిష్ఠుఁడు. క్షీరపాణి- మొదలగు నామములుగల పటములు స్తంభములకు వ్రేలాడగట్టఁబడి

యుండెను. చ్యవనప్రాశనమని విటప్రియయని మఱియేమో యని కొన్ని మందులపేళ్లు స్తంభములఁ గాగిదములపై వ్రాయఁబడి యున్నవి. విటప్రియయనుమం దేరోగమునకని నే నచ్చటనున్న యొకయువకు నడిగితిని. "నాప్రాణము కాపాడిన దదియేనయ్యా—సుఖవ్యాధులన్నిఁటి కంతదురాకట్టు మఱియేదియు లేదయ్యా" యని నాచెవిలోఁ జెప్పెను. నా వెనుకవైపునఁ బిల్ల లేడ్చినట్లు వినఁబడగ నులికిపడి వెనుకకుఁ జూడఁగ నెత్తైన యరపమీఁద సభాదర్శనలాలసలగు సరోజాక్షులు పని యేదియు లేకపోవుటచేఁగాఁబోలు నెడపిల్లలను గొట్టుచుఁ గొందఱు చంటిపిల్లలకుఁ బాలిచ్చుచుఁ గొందఱుఁ గునికిపాటులుపడుచుఁ గొందఱు నొడళ్లు విఱుచుకొనుచుఁ గొందఱుఁ గూరుచుండిరి. సంస్కృతమున వైద్యశాస్త్రమును జదువుకొనిన వైద్యులకే యీయుపన్యాసములు తెలియకుండ నున్నప్పుడు తల్లులారా! యింతశ్రమచేసి మీ రేలవచ్చితిరి యని లోలోన ననుకొని సభవిడచి పోయితిని.

మఱునాడు సాయంకాలమునఁ దిరుగ సభకువచ్చి యుపన్యాసరంగమున నొకమూలఁ గూరుచుంటిని. ధన్వంతరిప్రార్థన మొకవైద్యుఁడు చదివెను. ఆనాఁటిసభ కొకదాక్షిణాత్యుఁడగు నయ్యంగారి నధ్యక్షునిగ నెన్నుకొనిరి. ఆయన తెనుఁగున బాగుగా మాటలాడలేదు. తెనుఁగుదేశమునఁబుట్టిన మనవారే మనభాషను బాగుగా మాటలాడలేనప్పు డయ్యంగారి యాంధ్రమున నపశబ్దములు చూపుట యసమంజసముకాదా? అంత నొకవైష్ణవుఁడు నిన్నటి యధ్యక్షునిసంస్కృతోపన్యాసమునకుఁ దాత్పర్యము తెనుఁగున సంక్షేపముగాఁ జదివెను. నామట్టునకు నా కందులోని విశేషము లేవియు నగపడలేదు. గోదావరీ స్నానమువలనఁ బుణ్యమున్నదనియు నాంధ్రదేశమందలి వైద్యగ్రంథము లితరదేశములందువలెఁ బరరాజులచే హరింపఁబడలేదనియు, సర్కారువారీయఁబోవు మూల్యము నాయుర్వేదాభివృద్ధికై గ్రహింపవలయునేకాని నిరాకరింపఁదగదనియు నాయుర్వేదమునకు జయమగుఁగాక యనియు మాత్రమే మిగుల సంక్షేపముగానావైష్ణవుఁడు చెప్పెను. శంకరాచార్యులవారు రామానుజాచార్యులవారు మధ్వాచార్యులవారు కూడ నాంధ్రదేశమందే పుట్టిరనికూడఁ జెప్పెను. ఈమాట దేశచరిత్ర

కేమైన నక్కఱ వచ్చునేమో చరిత్ర లేఖకులు చూచుకొనవలసినదే కాని యాయంశము నేను విచారింపఁదగదు. ఆయన తరువాత నధ్యక్షు లుపన్యాసముల వ్రాసి పంపిన వైద్యులలో నెవరి పేరో కాని పిలిచిరి. ఆపేరు గలవారు రాలేదని ప్రత్యుత్తరము రాగ మఱియొక పేరు పిలిచిరి. అంతట నొక్క రుపన్యాసరంగమున వచ్చి నిలువఁబడి తన యుపన్యాసమును జదువ నారంభించెను. పదినిమిషములకంటె మీకు వ్యవధి లేదు. కావున నుపన్యాసమంతయుఁ జదువ వీలులేదనియు దానిని సంగ్రహించి చెప్పుఁడనియు నధ్యక్షు లాతనిఁ గోరిరి. ఆయన పాపము పిఱికివాఁడు కాఁబోలును. ఈమాటలతో మఱింత బెదఱి గద్గదసహితమైన హీన స్వరముతోఁ జదువనారంభించెను. అంతట 'లవుడరు' అని నాటక పద్ధతిగా నొక్కఁడు సభలోనుండి కేకవైవఁగ నాతనికున్న యూపిరికూడ సన్నగిలెను. అది త్రిదోషములఁగూర్చిన యుపన్యాసమని జ్ఞప్తి యున్నది. చదువుట కవకాశములేదు. సంగ్రహముగఁ జెప్పుట యతనికిఁ జేతకాదు. చచ్చుటతప్ప మార్గాంతరమేమియుఁ గనఁబడని యీమహా సంధ్యవస్థలో నధ్యక్షుఁడు పత్రమునకు ముఖ్యములైనవి మూఁడు పంక్తులుమాత్రమే చదువుఁడు అని యాతనిని హెచ్చరించెను. అంతరవంత యాతఁడు కుదుటఁబడి యిట్లు చదువసాగెను. సత్వరజస్తమోగుణములను మూఁడుగుణములే నీప్రపంచమున నున్నవదులలో ముఖ్యములైనవి—కావుననే ధన్వంతరి యానతిచ్చినటువం—వరించినప్పుడు వెనుకవి ముందునకు ముందుకు వెనుకదిరా—ఇట్లతఁడు చదువనారంభించెను. ఏమియు నర్థము సందర్భము తెలియక సభాసదులు గ్రుడ్లు తేలవైచిరి. పత్రమునకు మూఁడేసిపంక్తులు చదువవలయునని యధ్యక్షుఁడు తనకిచ్చినయాజ్ఞననుసరించి యొకపత్రములోని మొదటిపంక్తియుఁ దొమ్మిదవ పంక్తియుఁ బదునేడవపంక్తియుఁ జదివెను. అది వెంకితనమునఁ జేసిన పనికాదు. కేవల మజ్ఞానముచేత. "అట్లు చదువరాదు. ఒక్కపత్రమైన సరే పూర్తిగాఁ జదువుఁ" డని యధ్యక్షుఁడు పలుక, నాతఁడు చదువుట కారంభించెను. చదువు జరుగనిదే మాట తోడుకనిదే—"ఇది మీరు వ్రాయలేదా" యని యెవ్వరో యడిగిరి. నేనే యని యాఁతడు ప్రత్యుత్తరమిచ్చెను. అటులైన నేమివ్రాసితిరో చెప్పలేరా" యని మఱియొక్కరడిగిరి.

"అప్పు డేమి వ్రాసితినో యిప్పు డెట్లు తెలియు" నని కాబోలు నాతఁడు తిరిగి చెప్పెను. "పోనీ, చూచి చదువుట కభ్యంతరమే" మని మఱియొక్క రడిగిరి. "అక్షరము తెలిసినయెడల నభ్యంతరమేమి" యని కాఁబోలు నాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. "అది మీరు వ్రాసినదికాదా" యని మఱి యెవ్వరో యడిగిరి. "నేనే వ్రాసియుందును గాఁబోలు" నని యాతఁడు పలికెను. ఇంతలో నధ్యక్షుఁడు గంట కొట్టెను. మఱియొకరిని పిలిచిరి.

ఈసారి వచ్చినయాతఁ డొకమహమ్మదీయుఁడు. ఈతఁడు వ్రణము లనుగూర్చి వ్రాసినాఁడు. ఉపన్యాసమును జదువుట కాతనియొద్ద జత్వారపుజోడు లేకుంటచే నధ్యక్షుఁడుగారే కాబోలు నెవరిదో యాచించి తెచ్చి యిచ్చిరి. ఈతని యుపన్యాసములోఁ బ్రథమవాక్య మేదియో చెప్పనా! "ఉత్తమ ఆసుదానితో సంబోగించినట్లయితే నెత్తిమీఁద రణము పుట్టును." ఈమాటతో సభ్యులకు మతులుపోయిన ట్లుండెను. తరువాత నాతఁ డేదో చదివెనుగాఁబోలు—ఏగ్రామములోని ప్రజలప్రాణము లిట్టి వైద్యుల యధీనములైయున్నవో—రామ రామ రామా!

సాక్షీ! మీజంఘాలశాస్త్రి యాయుర్వేదమహాత్మ్యమునుగూర్చి యనర్గళధాటితో నుపన్యసించియున్నాఁడు. నే నాయుర్వేదసభలఁగూర్చి పరిహాసముగా వ్రాయుచున్నానని తలఁపవలదు. అంత మూఢుఁడనుగాను. అంత దేశభక్తిలేనివాఁడను గాను. వైద్యులలోని ప్రత్యేకవ్యక్తులను గొందఱ నధిక్షేపించుచున్నాను. వారు వైద్యజ్ఞానసంపాదనమున మిగుల దురవస్థలో నున్నారు. పౌరోహితుఁడు మంగళసూత్రకాలమందు, మధ్యమ పిండముద్వాసయా యని కప్పగంతు వైచినప్పు డాతని నధిక్షేపించినచో వేదదూషణమగునా? ఆయుర్వేదమును శిరముపైఁ బెట్టుకొని పూజించుచున్నామని యజ్ఞులగు వైద్యయమదూతల నధిక్షేపింపక మానుదమా! మన ప్రాణములు దీయుటకు నడుముకట్టుకొని వచ్చిన వానిని బరిహసింపనైనఁ గూడదా!

మీజంఘాలశాస్త్రి యొక్కసారి నాడీవిషయకమగు నొక్క యంశమును మఱియేదో సందర్భమునఁ బలికినాఁడు. తరువాత నాయంశ మునుగూర్చి విపులముగఁ జెప్పునేమో యని వేచియుంటిమి. ఇంతవఱకుఁ

జెప్పియుండలేదు. పెద్దజంఘాలశాస్త్రి యుపేక్షించినయంశమును జిన్నజంఘాలశాస్త్రి యుపక్రమించినయెడలఁ దప్పులేదనికొందును.

మన యాయుర్వేదమున రోగనిదానమంతయు నాడీపరీక్షపై నాధారపడియున్నది. గోడకుఁ బుట్టయెట్టిదో మనవైద్యశాస్త్రమునకు నాడీ నిదాన మట్టిది. రోగనిర్ణయమునకు మూత్రపరీక్ష పురీషపరీక్ష రక్తపరీక్ష శ్లేష్మాదిపరీక్ష మొదలగునవి యున్నవికాని యవి నాడీపరీక్ష తరువాతవి కాని దానికంటెఁ బ్రధానమగునవి కావు. గృహస్థాశ్రమునకు కన్యకాపాణిగ్రహణ మెట్లు ప్రథమకర్తవ్యమో చికిత్సాకర్మమునకు రోగిపాణిగ్రహణ మట్లు మొదటిది. తెలిసినవాఁడు చేయిచూచుచున్నాఁడు. తెలియనివాఁడును జేయి చూచుచున్నాఁడు. తెలిసినవాని కేమి తెలియునో తెలియదు. తెలియనివాని కేమితెలియదో తెలియదు. అంగుష్ఠమూలము వెనుక నొక్కయంగుళము విడిచిపెట్టి వైద్యులు నాడి చూచుచున్నారు. తర్జనిమీఁదిది పైత్యనాడియనియు మధ్యమము మీఁదిది కఫనాడియనియు ననామికమీఁదిది వాతనాడియనియుఁ జెప్పుచున్నారు. ఇదికొందఱిమతము. మధ్యమముమీఁదిదే వాతనాడియనియు ననామికమీఁదిది శ్లేష్మనాడియనియు మఱికొందఱిమతము. రోగిచేయి చూచుట యట్లుకాదనియు నంగుష్ఠమూలమున ననామికయుంచి తలక్రిందుగాఁ జూడవలయునని కొందఱిమతము. అప్పు డనామికమీఁదిది పైత్యనాడి యగును. తర్జనిమీఁదిది వాతనాడి యగును. ప్రాణోత్క్రమణసమయమందుఁ దర్జనిపై వాతనాడి యుండునని మఱికొందఱిమతము. ఈయర్థములన్నియుఁ దప్పనియు దర్జనిమీఁది దుత్ప్లుతగతిగా నుండినఁ బైత్యనాడి యనియును దానిమీఁదిదే మందగమనముగా నున్నయెడల శ్లేష్మనాడియనియు, దానిమీఁదిదే వెనుక కూఁగు స్వభావము గలదిగనున్నయెడల వాతనాడియనియు, నాడి చూడవలసిన దొక్కవ్రేలిమీఁదమాత్రమేయనియు,నావ్రేలిమీఁది నాడిగతులనుబట్టియే పిత్తవాతశ్లేష్మములు నిర్ణయింపవచ్చుననియు మఱికొందఱిమతము. అట్లే నిజమగునెడల సన్నిపాతము నెట్లు నిర్ణయింపవచ్చునని యితరు లాక్షేపించుచున్నారు. అనఁగా శీతపైత్యజ్వరమును నిర్ణయించు టెట్లని వారి యధిక్షేపణము కాఁబోలు. పిత్తమున కుత్ప్లుతగతికదా!

వాతమునకు మందగతికదా! రెండును గలిసియుండుట తేజస్తిమిర న్యాయము కదా! ఈయసందర్భమును సమర్థించు టెట్లని వారి యధిక్షేపణము కాఁబోలు. ఒక్కపిడికిటిలో ముందువ్రేలిపై పైత్యమని, వెనుక వ్రేలిపై శ్లైత్యమని జెప్పఁదగదనియు దీనియభిప్రాయము మఱియేదో యుండుననియుఁ గొందఱయభిప్రాయము. వీరియభిప్రాయ మేదో తెలియదు. మఱియేదో యభిప్రాయ ముండుననిమాత్రమే వీరియభిప్రాయము. పిత్తమునకుఁ గార్జె మను కోశమున్నది. శ్లేష్మమున కూపిరితిత్తు లున్నవి. వాతమునకుఁ బ్రత్యేకముగా నొకకోశము దేహములోఁ గానబడదు. దానికిఁ బ్రధానకోశము కొంత శ్వాసకోశయుగమైనను వాతమనునది ప్రత్యేకముగ నొక్కకోశముతో సంబంధించినది కాదనియు దానికి స్వాతంత్ర్యవ్యక్తిత్వము తక్కువయనియు నది యెప్పుడుకూడ దేనితోడనో యొకదానితోఁ జేరియుండునదే యనియు నవసానసమయమందు విజృంభించి యొక్కటియే చెలరేగి ప్రాణములు తీయుననియుఁ గొందఱు చెప్పుచున్నారు. నాడిని బరికించు రక్తనాళములలోఁ బూర్వులు కొందఱు వాయువు ప్రవహించుచున్నదని యభిప్రాయపడినట్లు కనఁబడుచున్నదనియు నందువలననే వానికిఁ బాశ్చాత్యులు ఆర్టరీస్ అని పేరిడిరనియుఁ బ్రధానమైనది వాతమే యనియు నదియే యవస్థాభేదములఁబట్టి పిత్తశ్లేష్మములుగ దేహాంతఃకోశ సంఘర్షణమున మాఱుననియు మఱి కొందఱు చెప్పుదురు. ఇంక ననేకాభిప్రాయము లున్నవి. వీనిలో నేది సత్యమో నిర్ధారణపఱచుట కిట్టి మహాభిషక్శిఖామణులు కాక మఱి యెవ్వరు సమర్థులు. నాడీనిదానములోనే యధిక్షేపణము వచ్చినతరువాత నిఁక చికిత్సాతంత్రమునందు విశ్వాస మధికముగా నుండుట కెట్లవకాశ మున్నది? కొలతపాత్రలో వ్యత్యాస ముండఁగూడదుకాదా? కావున వైద్యులందఱు మెదడులు చింపుకొనియైనను నీయంశమును స్థిరపఱుపవలసి యున్నది. పూర్వు లేదో నిర్వచించినారని యదియె సిద్ధాంతముగాఁ బట్టుకొనఁదగదు—సంతతాభివృద్ధి నొందుచున్న శాస్త్రములలో వైద్యశాస్త్ర మొక్కటి. ఇట్టి మహావైద్యులందఱు దానిలోని సందేహములను నివృత్తిచేసి క్రొత్తక్రొత్త విమర్శనము లొనర్చి నూతన పద్ధతులఁ గల్పించి దాని నభివృద్ధిపఱుపవలయును. అది వారివిధియై

యున్నది. వారట్లు ప్రయత్నించుచున్నట్లు కానఁబడదు. ఈనడుమనుం డియే కొంతసంచలనము వైద్యప్రపంచమున బయలుదేఱినది. అప్పటి నుండియు వార్షికసభలని, ప్రదర్శనములని, పరీక్షించి బహుమానము లనియు నేదో కొంతపని జరుగుచున్నది. ఇది యింకను జాలదు. ఆయుర్వేదవైద్య మొకవైద్యము కావనియు శారీరజ్ఞానము ప్రపంచ జ్ఞానము తక్కువగాగల పూర్వపువారు దానిని దోఁచినట్లు కల్పించినా రనియు దాని ననుసరించి యిపుడు వైద్యము చేయవగదనియు నది మహాత్ముడుగారి గడ్డపువెంట్రుకలాగుననో బుద్ధుని దంతములాగుననో యెచ్చటనో దానినిబట్టి దాని ప్రాచీనతనుబట్టి మాత్రమే దానిని గౌరవింపదగుననియుఁ గోలదిసంవత్సరముల క్రిందట మన సర్కారు వారి యభిప్రాయమై యుండెడిది. ఆయుర్వేదముకూడ నొకజాతి వైద్యశాస్త్రము కావచ్చుననియు దానియందుఁగూడ నేదో కొంతగౌరవ ముంపదగుననియు నిప్పుడిప్పుడు వారు కొంత తెలిసికొనుట మహాసంతో షము. కాని వారాయుర్వేదప్రాశస్త్యనిర్ణయమున కేర్పాటుచేయు చున్న సంఘములవారి కాయుర్వేదజ్ఞానము తక్కువ యగుటచేత నింకను దీనిప్రాశస్త్యము వారికి బాగుగాఁ దెలియకున్నది. వారికి దీని ప్రాశస్త్యము తెలియనియెడల మన శాస్త్రగౌరవముపోవునని మనము భయపడవలసినపని లేదు. వారికిఁ దెలిసిన నొక్కటే తెలియకున్న నొక్కటే. వారు మనమం దెన్నఁడును బుచ్చుకొనరు. మనమందు లేవో మనము పుచ్చుకొన్నయెడలఁ బుచ్చుకొనుటకు స్థిరపఱచుకొన్నయెడల మనకుఁ జాలును. ఆయుర్వేదమునుగూర్చిన కొన్ని ప్రశ్నలకు మన వైద్యులుప్రత్యుత్తరములు చెప్పవలసియున్నదట. చెప్పవలసినదా మాన వలసినదా యని మనవారు త్రొక్కులాడుచున్నారు. చెప్పవలసినదియే యని యీసభలోనియధ్యక్షులు చెప్పినారట, చెప్పకపోయినయెడల మనశాస్త్ర మసందర్భముగా నున్నదని పైవా రనుకొందురేమో యనియేకదా భయము? అభివృద్ధిశాస్త్రములో నసందర్భములు లేని వెచ్చటనైన నున్న వేమో వారుమాత్రము చెప్పఁగలరా? ఉన్నవి— లేవు అవి మనము చూచుకొనవలసినవికాని యొకరితోఁ జెప్పుట యెందు లకు? చెప్పినయెడల వారు మనకుఁ జేయునదేది? చేసినందువలన

మనశాస్త్రమునకు వచ్చు గౌరవమేమి? ప్రశ్నోత్తరముల కిదియేమి తర్కమా మీమాంసయా? ప్రత్యక్షఫలప్రధానమైన శాస్త్రముకాని వాదప్రధానమైన శాస్త్రమేకాదే? అట్టిచో ప్రశ్నముల కుత్తరము లెందులకు? ఈయకపోయినయెడల మనమసమర్థులమని యనుకొందురే మోయని భయమా? మనము సమర్థులమని యిదివఱ కనుకొన్నవా రెవ్వరు? వీరికిఁ బ్రత్యుత్తరములు చెప్పినమాత్ర మనుకొందురా? ఏమియులేదు. ఈప్రశ్నముల కుత్తరములిచ్చినవెనుక నిన్నిటికి మూఁడు రెట్లుప్రశ్నములు ముందురావని యేమినమ్మకము? మనమిచ్చు ప్రశ్న లకు వారు ప్రత్యుత్తరము చెప్పుదురేమో? కనుగొనుఁడు—ప్రశ్న ములజాబితా పైవాకమున జదివెదను. ఒకరినొక రడుగవలసినది లేదు. ఒకరికొకరు ప్రత్యుత్తర మీయవలసిన దంతకంటెలేదు. సాహా య్యములపయి మొదలే యాశలేదు. మనవారీశాస్త్రమును బోషించు కొన్న నంతయే చాలును. ఈశాస్త్రమును మిక్కిలి పట్టుదలతో మనవా రింకను జదివి యాంగ్లేయశాస్త్రమును బాగుగా నభ్యసించి దానిలో నేవైన యంశములు మనదానిలోఁ జేర్చుకొనఁదగినవి యున్నయెడల వానిని జేర్చుకొని మనశాస్త్రము నభివృద్ధిపఱచుకొనవలసి యున్నది. ఇందులకు మనవారే మనకు సహాయులుకాని యొరులుకారు. తిరువాన్కూరు మైసూరు మొదలగురాజ్యములలో నాయుర్వేద వైద్య మభివృద్ధిలోనున్నట్లు వినుచున్నాము. ఎందఱు రాజులున్నారు. ఎందఱు జమీందారులు—ఎందఱు మహారాజులున్నారు. వీరందఱు తలఁచుకొన్నయెడల నేవిధమైనకొదవయు నుండదు. అదికాక యనేకులు భాగ్యవంతులున్నారు. వీరుకూడ సాహాయ్య మాచరింపఁగలరు. సామాన్యప్రజలున్నారు. వీరికి జబ్బుసిద్ధించునెడల మననుండి పుచ్చు కొన్నఁ జాలును. మనమందులవలన మరణించినవారు పయిమందుల వలన బ్రతికినవారు నున్నట్లు నేనెఱుఁగను అదిగాక ఆయుస్సు చల్లగా నున్నయెడల బ్రదుకుదుమను విశ్వాసమున్నవారముకాని అల్లోపతి వలననే బ్రతుకుదుమను నమ్మకమున్నవారము కాము. ఈసభకే హైదరాబాదునుండి యొక గొప్పవైద్యుఁడు వచ్చినాఁడు. ఆతనికొక చిత్ర మైన ప్రజ్ఞకలదు. ఒకని కేదోరోగము వచ్చిన దనుకొనుము. మఱి

యొకఁడు పోయి యారోగమేదో కనిపట్టి వచ్చినాఁ డనుకొనుము. ఆతఁడు మఱి యింకొకనితో తాను గనిపట్టి వచ్చినరోగమునుగూర్చి చెప్పి నాఁడనుకొనుము. ఈతఁడు పై హైదరాబాదు వైద్యునియొద్దకు వచ్చె ననుకొనుము. ఈతనిచేయి చూచి యారోగమేదో యామనుజునివయ స్సెంతో, యన్నియు నితఁడు చెప్పును. అయ్యా! అనేకవిద్యలున్నవి. విద్యలను బోషించుటమాత్ర మరుదుగా నున్నది పైవానిని బడవేసి లెంపకాయకొట్టి పాముగఱచినవానిని బ్రతికించినవారనేకు లున్నారు. మృతునికిఁ బ్రాణములీయఁగల యనేక దివ్యయోగములున్నవి. ఏమున్న నేమి? అదృష్టములేదు. ప్రజ్ఞావంతులమని చెప్పుకొనుటకుఁ గూడ భయము. ఒకరిని మనము నిందింపవలదు మనల నెవరు నిందించినను మనము తప్పుగా భావింపనక్కఱలేదు. తప్పులున్నయెడల దిద్దుకొందము. దేశభక్తిగలిగి, యాత్మవిశ్వాసముకలిగి, పెన్నెముకగలిగి, ప్రవర్తింతము. అంతకంటెఁ జేయవలసిన దేమియు లేదు. ఇప్పటి కిదిచాలును.

---

## 23. గ్రంథపరిష్కారము

---

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! ఈలేఖ వినుఁడు:—సాక్షికి—అయ్యా! నమస్కారములు.

మాయూర నొకకవి యున్నాఁడు. ఆతఁ డనేకనాటకములు నవలలు రచించినాఁడు. ఆయన బాగుగనే కవిత్వము చెప్పగలఁడని నావిశ్వాసము. ఆంగ్లేయభాషను జదివినవాఁడు. ఆయన మిగులఁ బిఱికివాఁడు. పదిమందిలోనికి వచ్చునెడల నెత్తుబట్టనుచూచిన సంతపశువువలె నెగిరి యెగిరి పడును. కేవలము కుగ్రామమున నుండువాఁడు కావున నాతఁ డెవరిని జూచియెఱుఁగడు ఆతని నెవరు చూచియెఱుఁగరు. అతఁడు గ్రంథరచనాసమర్థుఁడనియే యనేకు లెఱుఁగరు. ఆతనిగ్రంథము లచ్చుపడకపోవుటచేత నాతనిపేరు వ్యాప్తిలోనికి రాలేదు. అతఁడు దైవభక్తికలవాఁడు. ధర్మబుద్ధిగలవాఁడు. పాపభీతికలవాఁడు. ఏవిషయ

మందుఁగూడఁ బ్రవేశించుటకు భయముకలవాఁడు. మిత్రు లొకరిద్దఱు వచ్చునెడల వారియెదుటమాత్రము స్వేచ్ఛగా సంతోషముగాఁ జక్కగాఁ జమత్కారముగా మాటలాడును. క్రొత్తవాఁ డెవఁడైనవచ్చు సరికిఁ దలవంచుకొని మాటలాడక యూరకుండును. ఈతఁడు విద్వాంసుఁ డని, కవియని, ధీశాలియని యాతనిగ్రామమునకుఁ జుట్టుపట్టులనున్న గ్రామములవారిలోఁ గొందఱుమాత్రమే యెరుగుదురు. సమీప గ్రామమునుండి యొకఁడు వచ్చి యాతని నాశ్రయించుచుండెను. ఒకసంవత్సర మాశ్రయించినపిదప నాతఁ డీతనితోఁ గొంతచనువుతో మాటలాడసాగెను. ఇఁకను గొంతకాలము వారికి స్నేహ మభివృద్ధి యైనపిమ్మట నొక్కనాఁ డాసమీపగ్రామవాస్తవ్యుఁ డాతనితో నిట్లు మాటలాడసాగెను. "అయ్యా! మిమ్ములను గొంతకాలమునుండి యాశ్రయించుచున్నాను. మీవలన నేదియో మేలుకోరి యాశ్రయించు చున్నాను గాని నిష్ఫలాభిసంధిచేఁ గాదు కాని మీరు నాకేమియు మేలుచేయనక్కఱలేదు. మీవలన భాషకు మేలుజరుగవలసియున్నది. అందులకై మిమ్మింతకాల మాశ్రయించితిని" ఇట్లాతఁడు పలుకుట తోడనే మెత్తగనుండినవాఁడు రవంత గట్టిపడెను. తలయెత్తికొనియుండు వాఁడు తల వంచుకొనెను. ఇదివఱకుఁ బ్రసన్నుఁడుగనుండినవాఁ డేమో సంకుచితవదనుఁడయ్యెను.

అట్లయ్యును 'మిత్రమా! నీవాంఛయేదో తెలుపు' మని యాతఁ డాతని నడిగెను. ఇదిగో చెప్పెదను. మాతాతగారు కొన్నిగ్రంథ ముల రచియించిరి అవి తాళపత్రములమీఁద వ్రాయఁబడిన గ్రంథములు కావు. పీచుకాగితములమీఁద నవి వ్రాయఁబడియున్నవి. కొన్ని దండకములున్నవి. రెండుమూఁడునాటకము లున్నవి. నాల్గు శ్రవ్య ప్రబంధము లున్నవి. పదిశతకములవఱ కున్నవి. ఒక వేదాంతగ్రంథము కాఁబోలు నున్నది. ఈగ్రంథములన్నియు చాలవఱకు మంచిస్థితిలో యున్నవికాని కొన్నిస్థలములం దక్షరములు పోయినవి కొన్నిచో టుల నస్పష్టములుగ నున్నవి. కొన్నికొన్నిశబ్దములు సుశబ్దములు కావని కొందఱనుచున్నారు. నాకు భాషాపాండిత్యము లేదు. వానిలోని మంచిచెడ్డల నేనెఱిఁగినవాఁడనైనయెడల మీకింతశ్రమ మిచ్చియుండను.

అవి మీరు పరిష్కరించి నన్ను గృతార్థునిజేయునెడల వాని నచ్చు వేయింతును. ఆ గ్రంథములు భాషాప్రచారములో నున్నయెడల మా తాతగారియాత్మ సంతసించును. చదువుకొనువారనేకులు బాగు పడుదురు. స్వల్పముగ ధనము నాకు రాఁగలదు. కావున మీరు నామాటను ద్రోసిపుచ్చరని నమ్మియున్నాను" అని యాతఁడు వినయముతోఁ బలికెను. అప్పు డాతఁ డిట్లు పలికెను. "నాయనా! నీయభిప్రాయ మేమో నాకుఁ దెలిసినది నీతాతగారిని నేనెఱుఁగునంతటి యదృష్టము నాకుఁ బట్టకపోయినను నాయననుగూర్చి విననివాఁడనుగాను. ఆయన గొప్పకవియనియు నాటకాలంకారసాహిత్యము బాగుగాఁ గలవారనియు యోగాభ్యాసపరుఁడనియు, భగవద్భక్తుఁడనియు వినియుంటిని. ఆయన రచియించిన గ్రంథములలో నసందర్భములను సవరింపుమని నీవు నన్నుఁ బ్రోత్సహించుచున్నావు. వానిలోఁ దప్పులున్నవని నీకు స్వయముగాఁ దెలిసికొనుట కవకాశము లేదనుచున్నావు. ఎవరో వానిలోఁ దప్పు లున్నవని నీతోఁ జెప్పియుందురు. అవి తప్పులో యదార్థమగు నొప్పులో వారుమాత్ర మెట్లెఱుఁగుదురు? నాయనా! శబ్దార్థము లాకరిసొమ్మా? ప్రమాదములకు లోనుగానివారెవ్వరు? మీ తాతగారు బ్రహ్మజ్ఞాన సంపన్నులు. ఆయన యోగదృష్టిచే నాగ్రంథములు వ్రాసియుందురని తోఁచుచున్నది. నీ కసందర్భములని తోఁచినవానిని సందర్భములనియే వారు ప్రయోగించియుందురు. ఒకకవి గ్రంథము వ్రాయుట కెంతయో శ్రమ మొందియుండును. ఎంతబుద్ధియో యందున వినియోగపఱచి యుండును. ఎన్నిసారులో దానిని గ్రిందినుండి మీఁదికి మీఁదనుండి క్రిందికిఁ బరిశీలించియుండును. తన శక్తియంతయు దానిపై ధారపోసి యుండును. అట్టి గ్రంథమును దెఱచి యాదృచ్ఛికముగ నీవేదో పత్రమునుజూచి "హాహా! ఇందునఁ దప్పులున్న"వని నీవనుట బుద్ధిహీనతకాదా? ఇంకొకపత్రముఁ దెఱచి 'అబ్బే యిందునఁ బాత్రౌచిత్యము భ్రష్టమైన"దని తేలికగ నీవు మాటలాడుట పిచ్చికంటె భిన్నమా? ఉన్మత్తుఁడా యుత్తమకవి గ్రంథములను విమర్శించుట! కవి తన గ్రంథరచనయందుఁ బడినకష్టములలో సహస్రాంశమైన నీవు పడకుండనే గ్రంథములో దప్పులున్నవని పలుకుటకు నీవెవఁడవు? ఆమూలాగ్ర

ముగనైన గ్రంథమును జదువకుండ యధిక్షేపించుటకు నీకేమి యధికారమున్నది? నీమాత్రపు బ్రయోజకుడు గ్రంథకర్త కాడనియే నీయభిప్రాయమా? తప్పులని నీవనుకొన్నావే. తప్పులని నీకా తెగనీలుగెందులకు? తప్పులేవో యొప్పులేవో నీవు నిర్ధారణపట్టికలను జాగ్రత్త పఱచియుంటివా? నీకుఁ దెలిసిన వ్యాకరణము క్రిందికి రానివి తప్పులని నిశ్చయింపవలసినదేనా? నీకుఁ దెలియనిశబ్దమపశబ్దమనియే నీనిశ్చితమా? శబ్దజాలమంతయు నీ వెఱుఁగుదువు కాఁబోలు నేమి? నిఘంటువులో లేనంతమాత్రమున నపశబ్దమని నిరాకరింపవచ్చునా? శబ్దస్వరూపముల లెక్కయేమి? భావస్వరూపమునే బరిహసించుచున్నావే? ఇక్కడ నౌచిత్యము లేదనుచున్నావే! ఇక్కడ స్వభావము చట్టుబండలైనదని పలుకుచున్నావే? ప్రపంచములోని బాహ్యాంతర ప్రకృతులు నీకుఁ గరతలామలకములు కాఁబోలు నేమి? నీప్రకృతినిబట్టి యస్వభావమైనదానిపై నడ్డుగీఁత గీయవలసినదనియే నీయాశయమా? నీప్రకృతిని బరిశీలించుకొని తెలిసికొనలేనివాఁడవు మూఢా! నీ వారలప్రకృతిని బరిశీలించి యది స్వభావమని యిది స్వభావమని పలుకుట నీతరమా? పప్పులో గరిటెలాగున నిత్యము నీసంసారమునందు నీవు తిరుగుచున్నావు కదా! నీయింటిలో నొక్క ప్రకృతినైన తెలిసికొనఁగలిగితివా? నీయెదుట మొద్దులలాగున నీవలెనే తిరుగుచు మాటలాడుచుఁ జేష్టలాచరించుచునున్నవారి ప్రకృతులనే నీకుఁ బరిశీలించుటకుఁ జేతగాదే అట్టిచో పుస్తకమందలి పాత్రముల స్వభావములను గనిపెట్టఁగలవేమి? ఆ పాత్రము లేకాలమందు నివసించిరో యేదేశమందు నివసించిరో, యేపరిస్థితులనడుమ నివసించిరో వారి విద్యాబుద్ధు లెట్టివో వారాడిన మాటల కేయే మనస్థితులు కారణములో యట్టి మనస్థితులు వారికిగల్గుట కిదివఱకు వారనుభవించిన కష్టసుఖము లెంతమట్టునకు హేతువులో వారు మనస్సువిప్పియే మాటలాడుచున్నారో ప్రచ్ఛన్నముగనే మాటలాడుచున్నారో యిట్టిచింతలు— యింతకంటె సహస్రగుణాధికములగు చింతలు—ఒక పాత్రమాడిన యొక్క చిన్నమాటనుగూర్చి తలఁగొట్టుకొని పరిశీలింపవలసియుండఁగా—నోహో? ఊసరవల్లిరంగులకంటె, నింద్రధనుస్సురంగులకంటె, వాయువులోనిపోకలకంటె, గంగ వెఱ్ఱిరాకల

కంటె ననేకకోట్లరెట్లు సంచలనముతో చంచలత్వముతో నున్న మన సత్త్వములోనిమాయ సందుగొందుల పద్మవ్యూహ సహస్రమండలి తలవెంట్రుకల చిక్కుకంటె చిక్కులగుచిక్కుల మూడదీయగలవేమి ? సెబాస్ కాళిదాసునికంటె మురారి యెక్కువ స్వభావజ్ఞానము కల వాఁడని యన్నవారిప్పటికిగూడ నెందరో యుండుటలేదా? షేక్సుపియరు కంటె బెన్‌జాన్సను యెక్కువవాడన్నవాద మిప్పటికిఁగూడ ఇంగ్లాం. డులో నచ్చటచ్చట నేడ్చుచున్నదే కాని శాంతించినదా ? విమర్శకాగ్ర గణ్యుఁడైన డాక్టరు జాన్సనుగారు షేక్సుపియరునుగూర్చి యేమిచెప్పి నారో యెఱుఁగుదురా ? షేక్సుపియరునకు రసపోషణజ్ఞానము తక్కువ యనియును నెట్టి గంభీరమైనరసమును పోషింపవలసిన సమయమందైనను రవంత హాస్యరసప్రకటనమున కవకాశ మున్నదని తోఁచినయెడల వెనుకఁ బోషించుచున్న రసమంతయు ధ్వస్తపఱచి హాస్యరసము వెంట కుఱ్ఱవాఁడు శీతాకోకచిలుకవెంటఁ బరుగెత్తినట్లు బరుగెత్తుననియు నింత కంటె నసందర్భముగ మఱియేమేమో పలుకలేదా ? ఆతనిమాట యెంతసత్యమైనదో ప్రపంచమంతయు నిప్పు డెఱుఁగునే! కాళిదాసు శాకుంతలములో దుర్వాసుఁడను మహర్షి యిచ్చిన శాపము నుంగరము మొదలగు గొడవయంతయు నదికినది కాదని యధిక్షేపించినవారెం దఱు ? ఇప్పుడు వానియావశ్యకమేదో యందఱకు విశదమైనదికాదా ? మాక్బెతులో విచెనును ప్రవేశపెట్టి నాటకమంతయు వల్లకాడుచేసి నాఁడని షేక్సుపియరును ఎందఱు మహావిమర్శకులు దూషింపలేదు ? ఆ విచెనునుబట్టియే యది ప్రపంచములోని యత్యుత్తమనాటకములలో నొక్కటియైనదని యిప్పుడు తేలినదికాదా ? ఇటు లెన్ని చెప్పవచ్చును. కళాకర్మమైన గ్రంథము ననుభవింప నిచ్చ నీకుఁ గలదేని కవియెడల గౌరవముకలిగి దానిని జదువుము. తెలియనివేవో తప్పులని యనవలదు. ఒక్కసారి చదివినయెడలఁ దెలియకున్న మూడుసారులైనఁ జదు వుము. అప్పటికిని సందేహములు విడనియెడలఁ బెద్దల నడుగుము. తెలిసి కొనుము. అంతేకాని కవినిగూర్చి బుద్ధిహీనమైన మాట యెన్నఁడును పలుకకుము. కవి గ్రంథమును విమర్శించుటకుఁ గాల మున్నది. దానికి వదలిపెట్టుము. నాయనా ! ఒకఁడు వ్రాసినదానిలోఁదప్పుపట్టుట కిన్ని బాధ

లున్నవి. ఇన్నిచిక్కు లున్నవి. సత్యశోధ, సతిశోధ, స్వభావశోధ, సత్కవిశోధ, సర్వేశ్వరశోధయు నొకరితరమా? తప్పులను భ్రమముచే, నొప్పులను తప్పులఁజేసినవా రెందఱు ఇట్లొనర్చుట నిజముగాఁ బాపమని నాభయము. నాయనా! ఒకచిన్నకథను జెప్పెద. మునుపు మనవారు చెప్పినకథయే నేను క్రొత్తగఁ గల్పించినది కాదు.

ఒకయూరి కొకసన్యాసి వచ్చెను. ఆసంగతినెఱిఁగి గ్రామవాస్తవ్యులలో నొకగృహస్థుఁ డాసన్యాసికి భిక్షావందన మొనర్చి తనయింటి కాహ్వానించెను. ఆగృహస్థుఁడు బీదవాఁడు. అందుచే భటుల సాహాయ్యములేనివాఁడు. సన్యాసివద్దనలోనికి గొల్లయింటినుండి పెరుగుదీసికొని వచ్చుట కెవ్వరును లేక తానే తీసికొని వచ్చుచుండెను. ఇంతలో నొకసర్పము నోడిసిపట్టి యొకగరుడపక్షి యంతరిక్షమునఁ బోవుచుండెను. ఆసమయమున యాపాము నోటినుండి గరళబిందువులు కొన్ని యాబ్రాహ్మణుని దధిపాత్రములోఁ బడెను. పాపము! బ్రాహ్మణుఁడేమియెఱుఁగును? ఆదధి నింటికిఁదెచ్చి సన్యాసికిఁ బెట్టెను. సన్యాసి చచ్చెను. కొంతకాలమైనపిమ్మట నాగరుడపక్షియు నాపాము నాబ్రాహ్మణుఁడు యమలోకమున యమునియెదుట నిలువఁబెట్టబడిరి. బ్రాహ్మణునిపై సన్యాసినిజంపిన బ్రహ్మహత్యాపాతకము మొదట మోఁపబడినది. అప్పుడు బ్రాహ్మణుఁడు దండధరునితో నిట్లనియెను. "అయ్యా! నాకు బ్రహ్మహత్యాపాతక మేమున్నది? సన్యాసికి భిక్షచేసిన పుణ్యమేకాని బ్రహ్మహత్యాపాతకము నాకెట్లు సిద్ధించును? పెరుగులో విసమున్నదని నేనెఱుఁగుదునా? నేను పెరుగు దెచ్చుచున్న కాలమందు గరుడుఁడు పైనుండి సర్పమును బట్టుకొనిపోవునని నేనేమైనఁ గలఁగంటినా? నేను జేయనిపనికై నాపై నేరము మోపుట తగునా? బ్రహ్మహత్య నాకుఁ గట్టఁదగదు" ఇంతసందర్భముగా నాతఁడు పలుక దండధరుఁడు "గరుడపక్షి! బ్రహ్మహత్య నీకుఁ గట్టవలసియున్నది. నీ వేమందువు" అని పలికెను. "అయ్యా! దండధరా! ఇదియేటిన్యాయము. నాకాహారముగ భగవంతుఁడు నియమించిన పామును బట్టుకొని నేను దారిని గాలిలోఁ బోవుటయేమి? భూలోకమున నెవఁడో చచ్చినాఁడని యాతనిఁ జంపినపాపము నానెత్తినిఁ గట్టుటయేమి? ఎంత విరుద్ధముగానున్నది?

బ్రాహ్మణుని జంపవలసిన యావశ్యకత నాకేమిగల్గినదో రవంత యోజింప రాదా? నే నాతనికిఁ గావలసినవాఁడనని జంపితినా? ఆతని యాస్తిని వైచుకొనుటకుఁ జంపితినా? ఆతనిని స్పృశింపకుండనే యాతనిని జూడకుండగనే యాతని నెఱుఁగకుండగనే యాతని దలఁపకుండగనే యాతని జంపితి ననుట న్యాయమా?" యని గరుడుఁడు పలికెను. అంతట దండధరుఁడేమియుఁ దోఁపక "సర్పమా! నీజిహ్వాగ్రమునుండి పడినవిషబిందువులచే నన్యాసి చచ్చినాఁడు. కావున నీకు బ్రహ్మహత్య కట్టవలసియున్నది. నీవేమందు" వని పలికెను. "అయ్యా! దండధరా అన్నిటికంటె నిది బాగుగా నున్నది. గరుడుఁడు నన్నొడిసిపట్టుటతోడనే నాచైతన్యము పోయినది. చచ్చిన నాకళేబరమునుండి విషబిందువుతే జారినవో రక్తబిందువులే జారినవో నేను జచ్చినతరువాత జరిగినవానికిఁగూడ నేనే బాధ్యత వహింపవలసినదనుట ధర్మమా? ధర్మస్వరూపుఁడవే. నేను బ్రహ్మహత్య వహింపను-నాకేమి?" అని సర్పము నిర్దాక్షిణ్యముగాఁ బలికెను. అంత దండధరుఁడు దగ్గలేక, మ్రింగలేక, యూపిరి సలుపక మిడుతుమిడుతు రవంతసే పాద్విజత్రయము వంకఁజూచి తేపాలోచింతము రండని యప్పటికి వారిని వదల్చుకొనెను.

ఆమఱునాఁడు భూలోకమున నిద్దఱు బ్రాహ్మణులు పొలములో పంటలయంచనా చూచుటకై కలసి వరిమళ్ల సమీపమునఁ దిరుగుచుండిరి. వారిలో నొక్కఁ డింక నీయూర నుండఁదగదు పోవుద మని రెండవ వానితోఁ బలికెను. ఇంతలో రెండుపక్షులు సమీపవృక్షముమీఁద మాటలాడుకొనుచుండెను. పక్షిభాష వారియిద్దఱిలో రెండవవాఁడెఱుఁగును. మగపక్షి తాను యమలోకమునకు విలాసార్థముగాఁ బోయితి ననియు బ్రహ్మహత్యనుగూర్చి పెద్దతగ వచ్చుట జరిగినదనియుఁ దీర్పు జెప్పుటయే తరువాయిగా నున్నదనియు నది తేపు చెప్పుదురనియు తేపు గూడ యక్కడకువెళ్లి యాతీర్పువిని నీకుఁ జెప్పెదననియు వివరములతో గూడ నాఁడుపక్షితోఁ జెప్పెను. ఆమాట లీరెండవవాఁడు విని యాశ్చర్యరసమగ్నుఁడై తేపటితీర్పేదో వినఁగోరి మొదటివానితో "నీయూరనుండి యెల్లుండికాని బయలుదేరిరా" నని చెప్పెను. అంత మొదటివాఁ డందులకుఁ గారణమేమని గ్రుచ్చిగ్రుచ్చి యడుగఁగాఁ జివరకు రెండవవాఁడు

పక్షివలనఁ దాను వినినయంశములన్నియుఁ బూసగ్రుచ్చినట్లు చెప్పెను. "ఈమాత్రమునకు యముని కింతయోజనమెందులకు? తేపటివఱకుఁ దీర్పు నాఁపియుంచుట యెందులకు? గరుడునకు బ్రహ్మహత్యాదోషము లేదు. సర్పమునకంతకంటె లేదు. ఉన్నదోషమంతయు బ్రాహ్మణునిది; తాను సన్యాసి కాహారముగ దధిని దీసికొని పోవునప్పుడు దధి పాత్రపై మూఁతవేయకపోవుట యాతనితప్పు. అట్లు చేయవలసినవిధిని చేయక పోవుటచే బ్రహ్మహత్య బ్రాహ్మణునితలపై గట్టవలసినది. తీర్పింతసులభముగాఁ గనఁబడుచుండగా యముని కీనీళ్లు నములుట యెందులకో" అని మొదటివాఁడు రెండవవానితోఁ జెప్పెను. ఈమాటలు పక్షులుగూడ వినినవి. వానిలో మగపక్షి మరునాఁడు యమలోకమునకుఁ దిరుగఁబోయి సభలోఁ గూరుచుండి దండధరునితో నిట్లనియెను. "అయ్యా! దండధరా! బ్రహ్మహత్యాభియోగములో నీవినమునఁ దీర్పు మీరీయవలసియున్నది. నిన్నను మీకేమియుఁ దోఁపక కాఁబోలు దీర్పు నాఁపియుంచిరి. బ్రాహ్మణుఁడు దధిపాత్రపై మూతవేయకపోవుటవలన నీబ్రహ్మహత్య సిద్ధించియుండుటఁబట్టి యాబ్రాహ్మణునకే బ్రహ్మహత్య కట్టవలయు" ననెను. ఈమాటలు విని దండధరుఁడు కోపించి "ఈతీర్పు నీకుఁ దోఁచినదా మరి యెవ్వరైనఁ జెప్పిరా" యని ప్రశ్నింప మాయూరికివచ్చిన యంచనా బాపనయ్యలలో మొదటివాఁడు చెప్పెనని చెప్పెను. "ఈలోకమువారమైన మేము ధర్మనిర్ణయమొనర్చుటకు సందేహించుచుండగ నడుగకుండఁ దీర్పుఁజెప్పుటకు సాహసించిన యాబ్రాహ్మణునినెత్తిపై బ్రహ్మహత్య కట్టితినని యాతనితోఁ జెప్పు" మని యముఁడు పక్షితోఁ బలికెను.

వింటివా? నాయనా! నీవు నన్ను నీతాతగారి గ్రంథముల విమర్శించి గుణదోషనిర్ణయ మొనర్చుమని చెప్పితివి. నీతాత నన్నడుగలేదు. అందతేకారణముననో యట్లుచేయక సందేహించి యూరకుండఁ దగుదునమ్మయని నేను బనిలేనిదే ముందునకువచ్చి యాగ్రంథములను విమర్శించునెడల నాబ్రహ్మహత్యాదోషము నాతలపయిఁ బడు నని మిగుల సందేహముగానున్నది. అందుచే నావలనఁగాదు. నీవు దయచేయవచ్చును. నీకు భగవంతుఁడు మేలొనర్చునుగాక.

---

# 24. ఉపసంహారము

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! సాక్షిసంఘము తిరుగ స్థాపించి రెండుసంవత్సరములు నిన్న సెప్టెంబరు మొదటితేదికిఁ బూర్తియయినది. ఇది 1920 సెప్టెంబరు 1 వ తేదిని ఆంధ్రపత్రికాధిపతియగు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి ప్రోత్సాహమున రెండవసారి స్థాపింపఁబడినది. ఆయనపత్రికలోని సారస్వతానుబంధమునకు వారమున కొక్క సాక్ష్యుపన్యాసము నొక్కసంవత్సరమువఱకుఁ బంపించుట కేర్పాటుజరిగినది. ఆసంవత్సరము పూర్తియైనపిమ్మట మఱియొకసంవత్సర మటులే యుపన్యాసము లంపుటకుఁ దిరుగ నేర్పాటుజరిగినది. ఆసంవత్సరముకూడఁ బూర్తియైనది. ఎంతకాల ముపన్యాసము లిచ్చుచున్నను భాషాభిమానులగు మీరు వానిని దయతో నాదరింపకపోరు ఉపన్యాసవిషయములకుఁ బ్రపంచమున హద్దుపద్దున్నదా? ఇదివఱకు మే మెన్నివిషయములఁ గూర్చియో చెప్పియుంటి మని గర్వపడుచుండుటలేదు. అయ్యో! ముఖ్యముగాఁ జెప్పవలసిన వింక నెన్నియో మిగిలిపోయెనే యని విచారించుచున్నాము.

సాక్షి కుత్సాహమే యున్నది కాని దేహశక్తిలేదు. ఆతఁడు మొదటినుండియు దుర్బలశరీరుండు. వార్ధకమున నిప్పుడు మఱెంత దుర్బలశరీరుఁడై యున్నాఁడు. సాక్షిసంఘమును సాగించుట కింక నాయన యభిప్రాయము లేదు. శనివార మెప్పుడువచ్చునో—సాక్ష్యుపన్యాస మెప్పుడు చూతుమో—యని యత్యంతోత్సాహముతో నున్న సాక్షిపఠకుల కందఱ కిప్పు డాశాభంగము కలిగింపవలసివచ్చెఁగదా యని సాక్షి విచారించుచున్నాఁడు. కాని నాయనలారా! ఒక్కవారము మాత్రమే రవంత క్రొత్తగ నుండునేమో కాని పైవారమునుండి ప్రాతవడియే పోవును. ఎన్నెన్ని మహాసంఘములు స్థాపింపఁబడలేదు. ఎన్నియంతరింపలేదు. వానికెవ రిప్పుడు విచారించుచున్నారు. అట్టివానికే గతిలేనప్పుడు జలబుద్బుదసమమైన సాక్షిసంఘముమాట చెప్పవలయునా?

దేశోపకారము నావలన జరుగుచున్నదికదా, భాషాభివృద్ధి నావలన జరుగుచున్నదికదా, నేను లేకుండు నెడలఁ బ్రపంచమునకు లోపముకదా, యని యనుకొనువానికంటె వెఱ్ఱిముండకొడుకు ప్రపంచ మున లేఁడు. నావంటికవి ప్రపంచమున లేఁడు. ప్రపంచములో మంచి కవిత నాతో సరియనుకొనువాఁడు బుద్ధిహీనసార్వభౌముఁడగుట కేమైన సందేహమా? కవియగువాఁడు తానే ప్రజలలో నగ్రగణ్యుఁడనుకొనునే! ప్రపంచమున నాతనికున్న గర్వము—తెగనీలుగు—మఱియొకని కున్నవా ? వారిలో సాధువు లనేకులున్నారు. కొంద ఱసాధులుగూడ నున్నారు. అట్టివాని తత్త్వమునుగూర్చియే చెప్పెదను. అతనికున్న శాపాలాపములు—నాకాశగమనములు — నధఃపతనములు — మఱి యొకనికి లేవు. సన్నిపాతరోగికంటె విస్మృతియే! కల్లుద్రావినవానికంటెఁ గైపే! ఉన్మత్తునికంటె నుద్రేకమే! చేతిలోఁ జెంబులేదు, కావలసినంత దాహము ఆకులోని కాదరవులేదు, కావలసినంత యాఁకలి సంసారమును జరుపుకొనఁదగిన శక్తిలేదు. ప్రపంచపరిపాలనతంత్రమును బోధించును. బ్రతికియున్నప్పు డెప్పటికప్పటికే చావంతబాధ పడు చుండును. చచ్చి బ్రతికియుందుసని సంపూర్ణవిశ్వాసముతో నుండును. పైసచేతఁబెట్టినవాఁడు ప్రభుఁడు, పెట్టనివాఁడు పిశాచము. తనకవిత్వ మునకు బలి యనినవాఁడు పండితుఁడు, అననివాఁడు పామరుఁడు. తన్నుఁ జేరఁదీసినవాఁడు చక్రవర్తి, చేరఁదీయనివాఁడు చండాలుఁడు. అంతే—అంతే అతని మంచిచెడ్డలవిభాగము కడుపులోని మంటచేఁ గనఁబడినవారినెల్ల బానిసమొదలు ప్రభువువఱకు భవతి భిక్షాందేహి- ఈయనివారినిగూర్చి నోటికివచ్చినట్లెల్ల కూఁతలు. చేతికివచ్చినట్లెల్ల వ్రాఁ తలు. సామాన్యులయెడల బడితెబాజాకుఁ గూడఁ బ్రయత్నము పర్యవ సానమునఁ జెప్పునదేమనగా:—తానే పండితుఁడనియుఁ గవియనియుఁ దనవలననే భాష యుద్ధరింపఁబడుచున్నదనియుఁ దాను లేకున్నయెడల భాషకు నష్టమనియు ననుకొనువాఁడు"శుంఠలందఱిలోపల శుద్ధశుంఠ."

గోపురముప్రక్కను జిత్రింపఁబడిన కోఁతి గోపురమును దాను మోయుచున్నాననియుఁ దాను లేనియెడల గోపురముకూలిపోవుననియు ననుకొనుట యెట్టిదో—మోటారుబండి చక్రపుటాకుపై నున్నయీఁగ

నామూలమున బండి యెంతవేగముగాఁ బోవుచున్నదో యని యనుకొనుట యెట్టిదో—ప్రపంచశాసనముల కన్నిఁటికి బానిసయై పుట్టిన మనుజుఁడు ప్రపంచమునకు నావలన మేలుజరుగుచున్నదని యనుకొనుట యట్టిది. పుణ్యపాపముల పరిపాకమునవలనఁ గొన్ని దేశములు భూకంపములచేఁ బాతాళమునకుఁ గ్రుంకిపోవుచున్నవి. కొన్ని ద్వీపములు సముద్రమునుండి లేచుచున్నవి. కొన్ని జాతులు వృద్ధియగుచున్నవి. కొన్ని నశించుచున్నవి. కొన్ని గ్రహము లాఱిపోవుచున్నవి. కొన్ని క్రొత్తనక్షత్రములు బయలుదేఱుచున్నవి. ఈసృష్టి యెగిరిపోవుచున్నది. మఱియొకసృష్టి సిద్ధమగుచున్నది. కాలచక్రమే యంతయుఁ ద్రిప్పుచున్నది. ఎప్పటి కేదేశమున కెట్టిపరిస్థితులనడుమ నెట్టివాఁ డర్హుఁడో యట్టివానిని గాలమే ప్రకృతిగర్భమునుండి పైకిఁదీసి యటుఁబెట్టుచున్నది. అప్పటికనుకూలమైన రాగముతోఁ—దాళముతో—నాతని నాడించుచున్నది. పాడించుచున్నది. పాటయైనవెంటనే చెవిపట్టుకొని యీడ్చి పాఱవైచుచున్నది. స్వప్రయోజకత్వమున నాతఁ డట్లాడలేదు. అట్లు పాడలేదు. మఱియొకరీతిగా నాడుటకుఁగాని పాడుటకుఁగాని యాతని కవకాశములేక యట్లాడినాఁడు. అట్లుపాడినాఁడు—ఇకఁ బ్రయోజకత యేమున్నది. స్వాతంత్ర్యమేమున్నది ? ఏమియులేదు. "లేకేమి లేకేమి? Freedom of the will మనకులేదా ? యని వెఱ్ఱివెఱ్ఱిమాటల నాధారపఱచుకొని నాపై నీసభలోని పడుచువాండ్రు గుఱ్ఱుమందురుగాక ! నాయనలారా ! ప్రత్యక్షానుభవమునఁగాని తెలియని యీనీతి మీకు బోధవలనఁ దెలియదు. ఇఁక బదియేం డ్లోపికచేయుఁడు. తలవెండ్రుక లూడనిండు. పండ్లు రాలనిండు. దృష్టి తగ్గనిండు. ప్రపంచలంపటత వలనఁ గలుగునన్ని మొట్లు నన్నితన్నులు నన్ని చెప్పుదెబ్బలు తగులనిండు. అప్పు డీయుపన్యాసమును దిరుగఁజూడుఁడు. చెప్పఁదగినంతదృఢము నేను జెప్పలేదని మీ రప్పుడు నన్నధిక్షేపించకపోరు.

ఏమైననేమి. ఏవియో కొన్ని వెఱ్ఱిమొఱ్ఱివ్యాసములు మాసభనుండి వెడలినవి. వానిని మీరంద ఱాదరించి వినినారు. మీయెడల మిగులఁ గృతజ్ఞులము. మాకింక సెలవిండు. సోదరీమణులారా ! మా యుపన్యాసములలోని యంశము లేవియైన మీమనస్సుల కెప్పుడైన

నొప్పి గలిగించినయెడల దయాపూర్వకముగ మమ్ము క్షమింపవేడు చున్నాము. దైవభక్తిగలిగి మీరు తరింపుడు. మీభర్తలను దరింపఁ జేయుఁడు. ఆంధ్రపత్రికాధిపతీ!అనేకనమస్కారములు. మే మెందునుగూర్చి యుపన్యాసములిచ్చినను—నెట్లిచ్చినను—మాయందలి దయచే మీరు వానినిఁ బ్రకటించినందులకు మేము కృతజ్ఞులము. మిమ్ము మాసంఘముతో సమావేశపఱచిన పరమేశ్వరునికటాక్షమున మేము చేయఁదగిన పనియేదో శక్తివంచనలేకుండ నిర్వహించుకొంటిమని నమ్ముచున్నాము. దేశక్షేమకరములైనట్టియు భాషోపకారములైనట్టియు ననేకకార్యములు మీచే సర్వేశ్వరుఁ డొనర్పజేయుచు మిమ్ము దీర్ఘాయురారోగ్యైసిసంపన్నునిగఁ జేసి రక్షించుగాఁక.

వృద్ధుఁడైన సాక్షి శేషించిన కొలఁదికాలము యథాపూర్వకముగా సూర్యోపాసనఁ జేసికొనుచు భగవంతునియాజ్ఞకై యెదురు చూచుచుండును. కాలాచార్యులు సర్పవరములోని భావనారాయణస్వామి యాలయములోని తిరువంటపల్లిలో పాచకోద్యోగియై పోనున్నాఁడు. కారాగృహ విముక్తుఁడైనప్పటినుండియుఁ గాకినాడ జాతీయ పాఠశాలలో నాంధ్రోపాధ్యాయపదవిని వాణీదాసుఁ డపేక్షించుచున్నాఁడు. ఆతఁ డక్కడకుఁ బోవునేమో—'జయసీతారామ్'అని నేను బదరీనారాయణమునకుఁ బోవుదును.

ఇదిగాక ఆంధ్రదేశీయులారా! బ్రహ్మపురము మొదలు బళ్లారి వఱకు వినఁబడఁదగినయొక్క కేకను గడపటిసారి వేయుచున్నాను. వినుఁడు. 'సాక్ష్యుపన్యాసములన్నియు నాల్గుసంపుటములుగా నచ్చుపడుచున్నవి. ఈనెలచివరకు రెండు సంపుటములు పూర్తి యగును. పై మాసాంతమునకే మూఁడవదియు నాల్గవదియు వెలువడును. మా గ్రంథములను విక్రయించుటకు మేము మహారాజ శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులువారికి శాశ్వతమైన యధికార మిచ్చితిమి. మీరు వారికి వ్రాసి వానినిదెప్పించుకొని శ్రద్ధతో విమర్శనబుద్ధితోఁ జదువుఁడు. చదువుఁడు. మీకు భగవంతుఁడు మే లొనర్చుఁగాక!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

చెన్నపురి: 'వావిళ్ల'ప్రెస్సున ముద్రితము—25-5-1955